# దానిని మీకొరకే వినియోగింపుడు

ఉదారసనాతనమహిళలకు

మీరు నిలువచేయగలిగిన స్త్రీధనము—
మీ తండ్రి—సోదరుడు—భర్త—పుత్రుడు—
వీరిలో నెవరివద్ద మీ రుంచినను సరే, దానిని మీకొరకే వినియోగింపుడు.




ఆధనముతో నగలుకొని వానిని మీరు ధరింపుడు.

పురుషు లెల్లప్పుడును......... ఈసంగతి మీకు బాగుగా తెలిసియే యున్నది. కావున మీకు హక్కుగల స్త్రీధనము బాంకిలోను నమ్మకములేని వాటాలక్రిందను నిలుపబడి యుండగూడదు.

ఆధనము యెల్లప్పుడును మీకంటి యెదుటనే మీ వంటిమీదనే యుండ వీలగునట్లు, దానితో మీ కొరకు సొగసైన నగలను కొనుడు.

మేముతయారుచేయించిన నగల విలువ యెన్నటికిని తగ్గిపోదు. నగలను అందముగా చేయించుటయే ప్రత్యేకాభిమతము. ఈవిషయమున మేమే అగ్రగణ్యులమనిగూడ సవినయముగ తెలుపుచున్నాము.

మీరు మొదట మావద్ద కొనునట్టి అలంకారము మీకు మిక్కిలి సంతృప్తికరముగా నుండుటకే మేము ప్రయత్నించెదము. అటు పిమ్మట మీ రెల్లప్పుడును మావద్దనే కొనుచుందురు. మీ మిత్రులకు గూడ సిఫార్సు చేయుచుందురు.

## ఉమ్మిడి రామయ్యశెట్టి గురుస్వామిశెట్టి కంపెని,

బంగారు వెండి నగలను తయారుచేయువారు,

25, చైనాబజారు రోడ్డు — చెన్నపురి. — 62, గోవిందప్పనాయకవీధి

లోకప్రసిద్ధిబొందిన

పి. వి. రాజన్ అండు కంపెనివారి

## మదరాసు ముక్కుపొడి

ఘాటు, కమ్మదనం, సువాసన అన్నిటిలో శ్రేష్టమైనది.

ధర నెం. 1 ముక్కుపొడి వీశె 1-కి రూ. 4-0-0

నెం. 2 (120 తులములవీశె) వీశె 1-కి 3-4-0

కలకత్తా, పూనా, మైసూరు మొదలయిన వస్తుప్రదర్శనశాలలలో బంగారుపతకములు బహుమానము పొంది డాక్టర్లవల్ల పరిశోధింపబడిన

## R. S. సుగంధ ముక్కుపొడి

దీనిని వుపయోగించుటవల్ల శీతలము, పీనసము, తలనొప్పి మొదలయిన శిరోరోగములను నివారించును.

ధర బాటిలు 1-కి 0-4-0 డజన్ 2-4-0.

24 తులముల టిన్ను 1-12-0.

పోస్టేజి వి. పి. వగయిరా రెయిలుచార్జి ప్రత్యేకము.

మిగిలిన వివరములకు

**పి. వి. రాజన్ అండు కంపెని,**
**నెం.44, గోవిందప్పనాయకన్ వీధి, మదరాసు. బి.**

---

*NEW YEAR ATTRACTION.*

## LEVER POCKET WATCH.
## for Rs. 1-15-0 only.

**Solid Guarantee for 5 years on Dial.**

| | | | |
|---|---|---|---|
| 1. | Rs. 1-15-0 | 6. | Rs. 10-8-0 |
| 3. | Rs. 5- 8-0 | 12. | Rs. 20-0-0 |

This is the only most perfect lowpriced Lever Pocket Watch which will give you long continuous and accurate service. Strong, bright Nickel silver case and beautiful shape. Reduced price for one month only. Thoroughly tested and examined before despatch. Price Rs. 1/15 Postage & Packing extra. Orders for half dozen and one dozen must accompany one-fourth advance. *Apply to:—*



THE GREAT INDIAN STORES
Burra Bazar, CALCUTTA.

---

# వేడిమివల్ల మీ సౌఖ్యమును చెడగొట్టుకొనకుడు

వేసవికాలము సమీపించగనే వేనకువేలమంది స్త్రీ పురుషులు నరముల పటుత్వము తొలగి, ఆయాసమనుభవించెదరు. పెక్కు సందర్భములలో, నిది క్రమముగా వృద్ధిపొంది, పుంసత్వమును నశింపజేసి, హాయిగా ఆనందము ననుభవించెడు స్త్రీ పురుషలోకమును, దుఃఖముల పాల్జేయును. పురుషుడు తన పురుషత్వమును, స్త్రీ తన సహజసౌందర్యమును, గోల్పోవుటకంటె విషాద మింకొకటి లేదు. అయినను ప్రతి వేసంగియందును, నిది గాంచుచునే యున్నాము.

దురదృష్టవశమున ఇట్టి స్థితులలో పలువురు మందు లుపయోగించుచుదురు. ఇది మిగుల హానికరమగుటయే గాక, ఒకవేళ కొద్దైనను నొకింత ఫలమునుపొందిన అది తాత్కాలికమయి, వ్యాధిని పునః ప్రవేశపెట్టి, రెట్టింపుబాధను కలిగించును. పోయిన పటుత్వమును తిరిగి నరములకు చేర్చుట, పూర్ణారోగ్యమును, బలమును చేకూర్చుట, బలహీనుడగు పురుషునికి, అతని సహజశక్తిన్ని, సంపూర్ణ పురుషత్వమును కలుగజేయుట, సౌందర్య హీనురాలగు స్త్రీకి, ఆమెసహజ అందమును, బలమును, గలుగజేయుట, యిత్యాది గుణముల నొసగెడి టానిక్ ఆహారమే, యింతకు, ముఖ్యావశ్యకము.

శానటోజెన్ వీటికి వరప్రసాదిని. ప్రపంచమందంతటను 24,000 కు పైగా వైద్యులు దీనిని వ్రాతమూలకముగా నామోదించుటయే గాక, అద్భుతమైన యీ టానిక్ ఆహారమును, దుర్బలులకును, మలేరియా, అతిసారము మున్నగువ్యాధులనుండి స్వస్థత గాంచుచున్న వారికిని దీనిని సేవించుటకు సిఫార్సుచేయుచున్నారు. శానటోజెన్ అలసి సొమ్మసిలిన నరములకు, కండరములకు, దివ్యమైన బలమునిచ్చి రక్తవృద్ధిని కలుగజేయుటయే యిందులకు కారణము. తయారుచేయుటలోగాని, సీసాలలో నింపునప్పుడుగాని, చేతితో తాకబడనందున, యేవర్ణమువారైనను సేవింపవచ్చును.

# భారతీ చందాదారుల కొక ముఖ్యమైన విజ్ఞప్తి

7.

ఈ దిగువ నమోదుపఱచినసంఖ్యలుగల చందాదారులచందాలు ఈ ప్రమోదూత సం. ఫాల్గునమాస సంచికతో ముగియుచున్నవి. ఆయాసంఖ్యల చందాదారులు దయచేసి తిరుగ తమ తమ చందా సొమ్మును మణిఆర్డరుద్వారా పంపుటగాని, వి. పి. పంప ననుజ్ఞ ఇచ్చుట గాని కావింప ప్రార్థించుచున్నాము. అట్లు ఏప్రిల్ నెల ౧-వ తేదీ లోగా మాకు మణిఆర్డరు గాని వి. పి. అనుమతి గాని రాకున్నచో రాబోవు సంచిక వి. పి. ద్వారా పంపగలము. చందాదారులు ఆ వి. పి. ని త్రిప్పివేయక దయతో స్వీకరింప ప్రార్థితులు.

చిరునామా మార్పులు 1-వ తేదిలోపల తెలుప ప్రార్థితులు.

**1667** 1725 2023 2067 2082 **2198** 2365 2439 2449 2451 2692 2731 3157

**3171** 3269 3641 3795 3826 3984 4000 4002 4006 4013 4021 4353 **4690**

**4703** 4722 4728 4732 4755 4871 5036 5037 5519 5527 5528 5529 **5530**

**5531** 5532 5434 5537 5549 5560 5566 5570 5585 5633 5866 5870 **5871**

**5901** 5910 6153 6156 6167 6171 6173 6174 6175 6176 6179 6180 **6182**

**6184** 6185 6188 6190 6191 6193 6194 6195 6197 6198 6199 6201 **6202**

6205 6206 6209 6210 6212 6213 6216 6217 6221 6222 6224 6227 **6230**

6233 6238 6239 6241 6250 6253 6254 6255 6259 6262 6298 6311 **6332**

6381 6386 6392 6393 6397 6401 6411 6416 6435 6493 6519.

—మేనేజరు, భారతి.

గ్రంథాలయములకును, గ్రంథాలయాభిమానులకును ఇది మంచి తరుణము

# ఆంధ్రపత్రికా కార్యాలయమునందు దొరకు గ్రంథములు

## 30 ఏప్రిలు 1931 వ తేది వరకు అర్ధఖరీదుకు విక్రయింపబడును

| పుస్తకములు | గ్రంథకర్తలు మొ. | సైజు | పుటలు | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| హిందీ పాకెటు డిక్షనరి | పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు | క్రౌను(32) | 212 | 1 | 0 | 0 |
| *ఆంధ్రోద్యమము | (మొదటిదాంధ్రమహాసభల అధ్యక్షోపన్యాసములు) | క్రౌను | 448 | 1 | 8 | 0 |
| మహావాక్యరత్నప్రభా (శ్రీ సదాశివయతీంద్ర స్వాములు) | పండిత పురాణం సూర్యనారాయణతీర్థులుగారు (పరిష్కర్త) | క్రౌను | 198 | 0 | 12 | 0 |
| హిందీ తెలుగు మొదటి వాచకము | పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు | క్రౌను | 48 | 0 | 6 | 0 |
| హిందీ తెలుగు బాలశిక్ష | పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు | క్రౌను | 52 | 0 | 6 | 0 |
| శ్రీరామచరిత్రము (సవ్యాఖ్యానము) | గా. హరిసర్వోత్తమరావుగారు | క్రౌను | 94 | 0 | 8 | 0 |
| ఏకభాషాలిపిప్రశంస | వెన్నెలకంటి అప్పారావుగారు | క్రౌను | 45 | 0 | 4 | 0 |
| ఆరోగ్యసాధనము | మహాత్మాగాంధీ | క్రౌను | 114 | 0 | 8 | 0 |
| *భారతీయ చిత్రకళ | తలిసెట్టి రామారావుగారు, బి.ఏ., బి.యల్. | క్రౌను | 208 | 1 | 0 | 0 |
| బెల్గాము కాంగ్రెసు అధ్యక్షోపన్యాసము | మహాత్మాగాంధి | క్రౌను | 64 | 0 | 4 | 0 |
| *ధమ్మపదము | కిళాంబి రంగాచార్యులుగారు, యం.ఏ. | క్రౌను | 112 | 0 | 10 | 0 |
| గాయకజనసభ అధ్యక్షోపన్యాసము | రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు | క్రౌను | 63 | 0 | 4 | 0 |
| ఆంధ్రశబ్దచింతామణి | పారనంది రామశాస్త్రిగారు | క్రౌను | 120 | 0 | 12 | 0 |
| *జీవనప్రభాతము (నవల) | వెంకటరమణిగారి "Murugan the Tiller" అను ఇంగ్లీషునవల కనువాదము | క్రౌను | 476 | 1 | 8 | 0 |
| *ఆంధ్రవాఙ్మయసూచిక | కా. నాగేశ్వరరావుగారు (ప్రకాశకులు) | డ. క్రౌ. | 108-554 | 3 | 0 | 0 |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| *జీర్ణ విజయనగర చరిత్రము | కుందూరి ఈశ్వరదత్తుగారు | క్రౌను | 287 | 1 | 8 | 0 |
| *త్యాగరాజస్వామి చరిత్రము | పసుమర్తి కృష్ణమూర్తిశాస్త్రిగారు | క్రౌను | 187 | 0 | 10 | 0 |
| భీష్ముడు (పాశ్చాత్యసాంఘిక నాటకము) | ఫ్రెంచికవి ఇబ్సనుగారి 'బ్రాండు' నాటకమున కనువాదము | క్రౌను | 302 | 1 | 0 | 0 |
| *నైహూని వేదిక | కాంగ్రెసు ప్రచురణము | క్రౌను | 376 | 1 | 0 | 0 |
| శ్రీరామవిజయము (నాటకము) | కోపల్లి వెంకటరమణ రావుగారు | క్రౌను | 111 | 0 | 8 | 0 |
| రాష్ట్రభాషా హిందీకా ప్రథమ పుస్త | రామానందశర్మగారు | క్రౌను | 58 | 0 | 3 | 0 |
| అవిమారకము (భాసకృతికి తెలుగు) | మానవల్లి రామకృష్ణకవిగారు, యమ్. ఏ. | క్రౌను | 92 | 0 | 10 | 0 |
| గురుబోధామృతము | కట్టమంచి తిరుమలమ్మగారు | ఫూల్స్కేపు | 30 | 0 | 4 | 0 |
| ఆంధ్రకళాశాలః విద్యాప్రవృత్తి | సి. రామలింగారెడ్డిగారు | డెమ్మీ(12) | 52 | 0 | 4 | 0 |
| సముద్రయానము | అచ్యుతుని సీతారామయ్యగారు | డెమ్మీ | 63 | 0 | 4 | 0 |
| ఇందిరాసుందరము (సంపచ్ఛ్రీకవారవతికథ) | సుందరమ్మగారు | డెమ్మీ | 36 | 0 | 4 | 0 |
| శారదాంబ (నాటకము) | టి. శ్రీనివాస రాఘవాచార్యులుగారు | డెమ్మీ | 67 | 0 | 8 | 0 |
| నవచోళచరిత్రము (ద్విపద కావ్యము) | పోశెట్టి లింగన | డెమ్మీ | 132 | 0 | 12 | 0 |
| సకలనీతిసమ్మతము | మా. రామకృష్ణకవిగారు పరిశోధించినది | డెమ్మీ | 111 | 1 | 8 | 0 |
| శ్యామాసుందరము (నవల) | ఒంతలి సత్యనాథముగారు | డెమ్మీ | 178 | 1 | 0 | 0 |
| సంగీతశమంతక నాటకము | వారణాసి రామమూర్తిగారు | డెమ్మీ | 91 | 0 | 8 | 0 |
| సత్యవత్యుపాఖ్యానము | మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రిగారు | డెమ్మీ | 196 | 1 | 0 | 0 |
| చంపూభాగవతము | క. విశ్వనాథశాస్త్రిగారు, బి. ఏ., బి. యల్. (శోధకులు) | డెమ్మీ | 97 | 0 | 10 | 0 |
| *శతకమంజరి: భక్తిసంపుటము | కా. నాగేశ్వరరావుగారు (ప్రకాశకులు) | డెమ్మీ | 228 | 1 | 8 | 0 |
| మనశ్శరీరములపై పరిసరముల ప్రభావము | పారనంది జగన్నాథస్వామిగారు | డెమ్మీ | 111 | 0 | 12 | 0 |
| *బసవపురాణము (ద్విపద కావ్యము) | పాల్కురికి సోమనాథుడు (వే. ప్రభాకరశాస్త్రిగారి పీఠికతో) | రాయలు | 478 | 2 | 8 | 0 |
| *శతకకవుల చరిత్రము | పండిత వంగూరు సుబ్బారావుగారు | రాయలు | 492 | 2 | 8 | 0 |

ఈ పై గ్రంథములన్నియు ఒక్కజతగా కొనువారికి ఇతర ఖర్చులేవియు లేకుండ సగము ధరకే పంపబడును. ఒకేసారి 20 రూపాయలకు తక్కువపడని గ్రంథముల కొనువారికి సగము ధరకు పంపబడును. కాని రైలుఖర్చులు మొదలుగువానిని కొనువారే భరింపవలయును. రు. 10 మొత్తమునకు కొనునపుడు రూ 1-కి 5 అణాల చొప్పున కమీషను ఈయబడును: ఖర్చులు వేఱు. పువ్వుగుర్తుగల గ్రంథములు ఒకసారి ఒక ప్రతికంటెను అధికముగ పంపబడవు గ్రంథములు కావలసినవారు ముందుగా రు. 5 అడ్వాన్సు పంపవలయును.

☞ ఈ జాబితాలోని పుస్తకములందు కొన్ని కొద్దిప్రతులు మాత్రమే గలవు. అవి అమ్మకమైనపుడు శేషించినవి మాత్రమే పంపబడును.

## ఆంధ్రపత్రికా కార్యాలయము, 7, తంబుశెట్టి వీధి, మద్రాసు.








# భారతి

సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు
కా. నాగేశ్వరరావు

సంపుటము ౮. సంచిక 3.

ఆంధ్రపత్రికా ముద్రాలయము _ మద్రాసు.

౧౯౩౧

# చిత్రములు

త్రివర్ణచిత్రములు: — పూరబీ; నాగరాజు.

సాధారణ చిత్రములు: — కవి; తులసిపూజ; కావేరివఱదలు (౧౯౩౦); తిరువళ్లయూరు దేవాలయము-పెద్ద తటాకము; అక్బరు పుత్రసందర్శనము; రాణా ప్రతాపసింహుడు-శక్తసింహుడు; విలియం బెంటింకు ప్రభువు-రణజితసింహుడు; షాజహాను మరణము; మాద్రి-పాండురాజు; లండను నగరమున థేమ్సునదిపయి సూర్యసందర్శనము; క్రుమ్ములాటను దప్పించుకొనుటకు; ఇతర చిత్రములును.

# పూ ర బీ





ఠాడీ సఖీ టేక చౌర దురావే పరిబహు తౌ బిరహా దుఖసానీ,
అంగ ఐ రాతిజ భాతి సదా చిత్రమే అతిహీ పియ చిత హిఆనీ,
రాజతి మహా కుఖిలా ఐ ఘురీ అతపమారు ప్రసూవసీజానీ,
శ్రీరాగకీ రాగనీ పూరబీ ఐహీ అపూరబ బరూప బఖానీ.

[జయపురచిత్రము : దివాన్ బహాదూరు గోవిందదాసు చతుర్భుజదాసు గారి యనుమతిని

చెన్నపట్టణము, మార్చి ౧౯

సంపుటము ౮ ప్రమోదూత సంవత్సరము ఫాల్గునమాసము సంఖ్య ౩




## శ్రీసూక్తిసుధానిధి

శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు

(శ్రు తి వీ థి)

ప్రార్థనాతరంగము

౧

రేపైన మాపైన తెప్ప వాల్పదు సుమీ నిడుదకన్నుల నీరు నించుఁ గాని;
తగులైన నెగులైనఁ దలఁపుఁ ద్రిప్పదుసుమీ దరసుదర్శనలీల లరయుఁ గాని;
మరులైన గుఱులైన మఱపుఁ జెందదుసుమీ జలజాయతాక్షులఁ గొలుచుఁ గాని
జాగైన వేగైన శయ్య వీడదుసుమీ విరహాగ్నికీలల వేఁగుఁ గాని;
తళుకుబేడిసకన్నుల చెలువుగులుకు - చలువతరఁగల కావేటి కెలన నున్న
రంగపురి నేలుకొన్న శ్రీ రంగశాయి, - ఈయబల నేమి సేయఁగా నెంచితోయి ?

౨

తామరసాక్ష, నీ దయఁ జూపు మని కోరి కన్నీటిమున్నీటఁ గళవళించు;
వటపత్రశాయి, యీ నటన లేమని కుంది నిట్టూర్పుగాడ్పులఁ గొట్టుకాడు;
శ్రీపతీ, నాపాపమా పల్కవని పిల్చి వలకాఁకసోఁకుల జలదరించు
నీరదశ్యామ, నా నేర మేమని వేఁడి తగులంపునెగులునఁ దల్లడిల్లు;
నీ త్రివిక్రమలీలలనే స్మరించి - నీజగత్కారణాకృతినే భజించు
నీయబల నేమిసేయఁగా నెంచితోయి, - రంగపురి నేలుకొన్న శ్రీరంగశాయి!

౩

వ్రీడ యొకింత లేక పలవించును నీకయి, మింటివెంట నీ
జాడలె చూచు, నోయసురసంహార, కేవల, యంచు వేఁడి, క
న్మోడుచు, ని న్నగోచరుని మూర్తిగఁ గాంచఁదలంచు, నింక నీ
చేడియఁ దేర్చుటెట్లొ దయచేసి వచింపుము రంగనాయకా!

౪

సకియ మెందొడలపైఁ జాఁచినచరణముల్ చాఁచినట్లే యుండె జలజనేత్ర!
ఎఱుక లేకయె మోడ్చి యెత్తినకేల్దోయి యెత్తినట్లే యుండె నీశ్వరేశ!
ఆశ చెడ్డదిగదా యనుచు నాఁచినపల్కు లాఁచినట్లే యుండె నమరవంద్య!
ఎద నిల్పి నినుఁ గొల్వ నెంచిమూసినకన్ను మూసినట్లే యుండె మోహనాంగ!
నిర్దయుఁడవని యెఱిఁగియు నిన్నుఁ గోరి - పరవశాలసయై మూర్ఛ పడినయట్టు
లోడ లెఱుంగకయే పడి యున్నదోయి,-రంగశాయి, మా చెలిఁ బ్రోవ రావఁటోయి!

౫

ఎడఁదఁ బగల్చి సంజ నసురేశ్వరుఁ గూల్చిన నిన్ను మెచ్చి, పా
ల్కడలిని వెన్నుఁ గొన్న నినుఁ గాంక్షయొనర్చి పరిభ్రమించి, ప్రే
ముడి వలపించు నీకుఁ గయి మోడిచి వేఁడుచు మూర్ఛఁ గన్న యీ
పడఁతుక నెట్లు బ్రోచెదొ కృపారససాగర, రంగనాయకా!

౬

చేసితి వెన్నొ చిత్రములు, చెల్వమనోధనముల్ హరించి వేం
చేసితి, వాత్మవైభవముచే వలపించి, తపించి కుందఁగాఁ

జేసితి, వింత చేసి దయ సేయకయుంటి విదేమొ కాని నీ
చేసినలోపమో యబల చేసిన పాపమొ రంగనాయకా!

౭

పాలమున్నీట నీపజ్జఁ బండినయట్లు ఘనఘనశ్యాము నిన్నెనసినట్లు
సుఖదుఃఖదాయి నీ సొమ్ము తానైనట్లు కాలస్వరూపు నిన్ గాంచినట్లు
అర్చావతారు నిన్నర్థిఁ గొల్చినయట్లు దరచక్రధరు నిన్ను దరిసినట్లు
వ్రజసార్వభౌము నిన్ వలచి కైకొన్నట్లు శ్రీరంగధాము నిన్ జేరినట్లు
తన్నుఁ దలపోసి, కాకున్నఁ దనువు రోసి-కాంతు లెడఁజేసి, వలపోసి కన్నుమూసి
యొడలెఱుంగకయే పడియున్నదోయి, -రంగశాయి, మాచెలిఁ బ్రోవ రావటోయి!

౮

కొండను మోచి గోవులను గోపులఁ గాచినయట్లు, దాసులన్
రండని ప్రోచునీకు దయ రాదని మిన్నులు సూచి ప్రొక్కుచున్
గుండెలు గొట్ట నిట్టుసురుఁ గుట్టుసురై పడియున్న జాళువా
కొండను మాకుమారిఁ గయికో భరమయ్యెనె? రంగనాయకా!

౯

సిరి నివసించు పేరురముచేత నిలాసతి కొల్వు సేయు సుం
దరరదనంబుచేత నిరతం బెడఁబాయని నీళ కౌఁగిటన్
దిరమగు మేనిచేత గడిదేఱిన నిన్ను వరించి యన్యమే
మెఱుఁగకయున్న మాయబల కేగతి సూపెదో రంగనాయకా!

౧౦

భువనత్రయంబైనఁ బూనఁజాలని నిన్నుఁ జెలువంపుఁగౌఁగిట నిలుపఁ గోరి
చతురాననుండైన శ్రుతులఁ జూడని నిన్ను జిలిబిలిపలుకులఁ దెలుపఁ గోరి
అసమాంబకుండైన నరయఁజాలని నిన్నుఁ గడకంటిచూపులఁ గాంచఁ గోరి
సిద్ధసంయములైనఁ జేరఁజాలని నిన్నుఁ బ్రాణనాయకునిగాఁ బడయఁగోరి
అభిమతార్థంబు సిద్ధించు నాస లేక-దొరలుమా చెలి కింక శ్రీచరణసేవ
దొరక దనుకొంటిఁ గాని నీ బిరుదు నిలిపి-రమణిఁ గైకొంటివోయి! శ్రీరంగశాయి!

---

# రుద్రభట్టు

సాహిత్యవిద్యాప్రవీణ, బులుసు వేంకటరమణయ్యగారు

Research Student of the Andhra University, Benares Hindu University

సంస్కృత వాఙ్మయమునందలి ప్రాచీనాలంకారికులలో రుద్రభట్టుకూడ నొకఁడుగఁ బరిగణింపఁ బడుచున్నాఁడు. నవమ శతాబ్దియుఁడగు రుద్రటుఁడును (కావ్యాలంకారకర్త), రుద్రభట్టు నొక్కరే యని వాదప్రవాదములు చాల కాలము క్రిందటనే వెలువడి యున్నవి. వీబర్ (Weber) పండితుఁడును, పిస్చెల్ (Pischel)విద్వాంసుఁడును వీరిరువురు నొక్కరే యని[1] వాదించియున్నారు. కావ్యమాలాసంపాదకుఁడగు [2]దుర్గాప్రసాదపండితుఁడు, [3]జాకోబీ (Jacobi) పండితుఁడును వీరిరువురును వేరువేరుగాని యేకవ్యక్తియే కాదని వాదించిరి. రుద్రటుని కావ్యాలంకారమును, రుద్రభట్టుని శృంగారతిలకమును బాగుగఁ బరిశీలించి చూచినచో వీరిరువురు వేర్వేరు వ్యక్తులని బోధపడకమానదని కాణేమహాశయులు (P. V. Kane) తమ "అలంకార వాఙ్మయచరిత్ర" మందును, డే మహోదయులు (Dr. S. K. De) తమ "సంస్కృతాలంకార చరిత్ర"మునందును నిరూపించియున్నారు. ఇయ్యదియే సిద్ధాంతితమై సర్వజనామోదితమై యలరారుచున్నది.

ఇరువురి గ్రంథములనుబట్టి చూచినను వారిరువురును విభిన్నులనియే తోఁచక తప్పదు. వృత్తభేదముకంటె మఱియొక భేదము సమానములగు విషయములందుఁ గావ్యాలంకార శృంగారతిలకములయం దగపడదనుట సర్వవిజ్ఞవేద్యము.

ఇట్లిరువురును వేఱువ్యక్తులైనను, వారియం దెవ్వరు ప్రాచీనులో, ఎవ్వ రర్వాచీనులో యొకింత విచారింపవలసియున్నది. రుద్రభట్టు రసములు తొమ్మిదియని యుద్భటునిమతమునే యవలంబించెను.[4] మఱియు భరతముని రసములను నాట్యముకొఱకే చెప్పుటచేఁ దానాలోచించి వానిని కావ్యమునందుఁ బ్రతిపాదించుచున్నట్లు చెప్పుకొనెను. రుద్రటుఁడు[5] పది

---

1 Introduction to Srngaratilaka, P. 5, ff. Z. D. M. G. 42, 1888, P. 296.

2 See foot-notes on Srngaraprakasa, Kavyamala Edn.

3 Voj, 1888, Vol. 2, P. 151-56, and Z. D.M. G. 42, PP. 425-35.

4 ప్రాయో నాట్యం ప్రతి ప్రోక్తా భరతాద్యై రసస్థితిః, యథామతి మయాప్యేషా కావ్యం ప్రతి నిగద్యతే.
శృంగారహాస్యకరుణా రౌద్రవీరభయానకాః, బీభత్సాద్భుతశాన్తాశ్చ నవ కావ్యే రసాః స్మృతాః.
—శృంగారతిలకమ్, 1 - 5,6.

5 శృంగారవీరకరుణాబీభత్సభయానకాద్భుతాహాస్యః, రౌద్రః శాన్తః ప్రేయా నితి మన్తవ్యా రసాః సర్వే.
—కావ్యాలంకారః, III—3.

రసముల నంగీకరించినాఁడు. [6]రుద్రభట్టు నాల్గు వృత్తులనే యంగీకరింపఁగా, రుద్రటుఁడు ఐదు వృత్తుల నంగీకరించినాఁడు. ఈ విషయములం బట్టి రుద్రభట్టు రుద్రటునికంటెఁ గొంచెము ప్రాచీనుఁ డేమో యని సందియము కలుగ వచ్చును. కాని రసవృత్తుల సంఖ్యాపరిమాణ ముఁబట్టి కేవలము రుద్రభట్టు ప్రాచీనుఁ డన వలనుపడదు. పరిశీలించి చూచినచో రుద్రటుని గ్రంథమును జూచియే శృంగారతిలకము రచియింపఁబడినట్లు తెలిసికొన వీలగును. రుద్రభట్టు సమర్థుఁడగు నాలంకారికుఁడు కాఁడనియుఁ, గవి యనియు,రుద్రటునినుండి విషయములను దొంగిలించి యొక గ్రంథము రచియించితి నని యనిపించుకొనె ననియు నిప్పటికొందఱ విమర్శకాగ్రగణ్యులయాశయము. కాని రుద్రభట్టంతటి యసమర్థుఁడు కాకున్నను దర్వాతియాలంకారికులలో మొదటివారు .[[7]అనఁగా ధనికుని కాలమువఱకును] ఆతనిం బేర్కొని యుండక పోవుటను, [8]రుద్రటునిమాత్ర ముగ్గడించుట చేతను, రుద్రభట్టు రుద్రటునికంటెఁ గొంత యర్వాచీనుఁడనియే చెప్పవలసియున్నది. దానింబట్టి రుద్రభట్టు క్రీ. శ. 1100కంటెఁ బ్రాచీనుఁ డనిమాత్రము నిశ్చయింపఁబడినది.

కాని రుద్రభట్టు కేవలము కొంద ఱనుకొను చున్నట్లు చేతఁగానివాఁడు కాఁడు. అనంతమగు నీ కాలగర్భకుహరమున నతనిగ్రంథము లెన్ని పడి యజ్ఞాతవాస మొనర్చుచున్నవో తెలియకున్నది. ఎట్లు విమర్శించి చూచినను శృంగారతిలకముకంటెఁ బ్రాచీనమగు గ్రంథమున నింతటి విపులముగ రసము విచారింపఁబడియుండలేదు. రసవిషయకమగు విచారము రుద్రటుని కంటెఁ బ్రాచీనకాలమునఁ బ్రత్యేకస్వరూపమును దాల్చి యుండలేదు. కేవల రసవిషయకమగు గ్రంథము శృంగారతిలకముకంటె ప్రాక్తనము లేదనవచ్చును. రసమునకును, అందు శృంగారమునకును రుద్రభట్టొసఁగిన ప్రాముఖ్యము శ్లాఘ్యమైనది.

---

6 కైశిక్యారభటీ చైవ సాత్వతీ భారతీ తథా, చతస్రో వృత్తయో జ్ఞేయా రసావస్థానసూచకాః.

—శృంగారతిలకమ్, I-19.

మధురా ప్రౌఢా పరుషా లలితా భద్రేతి వృత్తయః పంచ. —కావ్యాలంకారః 11—19.

7 ధనికుఁడు తన దశరూపక వ్యాఖ్యానమున (IV-60) "ఉత్స్వప్నాయితో యథారుద్రస్య—'నిర్మగ్నేన భయాంభసి' అను శ్లోకము నుదాహరించి యున్నాఁడు. కాని యయ్యది శృంగారతిలకమునఁ గానరాదు. హేమచంద్రుఁడు రుద్రభట్టుని "యత్పాణిర్న నివారితః" మొ. ఉదాహరించెను (కావ్యానుశాసనమ్ 304,305). దర్పణకారుఁడుకూడ రుద్రునిశ్లోకములఁ జాల నుదాహరించెను.

8. ప్రతీహారేందురాజు "రసనా ద్రసత్వ మేషామ్" అను దానినుట్టంకించెను (చూ. కావ్యాలంకార సంగ్రహసార లఘువృత్తి, పే. 49). అది రుద్రటుని కావ్యాలంకారమునఁ (III-4) గలదు. రాజశేఖరుని కావ్యమీమాంసలో "కాకుర్వక్రోక్తిర్నామ శబ్దాలంకారోఽయ మితి రుద్రటః" అని యున్నది

(చూ. కా.మీ. పే. 31) (కావ్యాలం. II-16.)

శృంగార తిలకమునందలి [9]చివర పద్యమునుబట్టియు, శృంగారతిలకమునం దతం డొసంగిన యుదాహరణములం బట్టియు రుద్రభట్టు కవియని కూడఁ జెప్పవచ్చును.

ఇపుడు ముద్రింపఁబడియున్న శృంగార తిలకము సమగ్రమైనట్లే తోఁచుచున్నది. ఆది మధ్యాంతములం దెచ్చటను త్రుటనము గల యట్లు గ్రంథప్రకాశకులు సూచింపనైన లేదు. కాన నయ్యది సంపూర్ణమగు గ్రంథమే యని మనకు భ్రమ కలుగుచున్నది. పరిశీలించినచో నయ్యది యసమగ్ర మనియే చెప్పవలెను. అందలి కారణము లిట సూచింపఁబడును.

i) ధనికుఁ డుదాహరించిన (దశరూపకము IV-60) రుద్రునియుత్స్వప్నాయితోదాహరణము శృంగారమునకే మిగుల సంబంధించి యున్నది. అది శృంగారతిలకమునఁ జొప్పించినచో గ్రంథాసంగతి యొంతమాత్రమును గలుగఁజాలదు. దర్పణకారుఁడును, అంతకంటెఁ బ్రాచీనుఁడగు హేమచంద్రుఁడును రుద్రుని వని యుదాహరించిన పద్యములు శృంగారతిలకమునఁ గానవచ్చుచున్నవి.

ii) ప్రతాపరుద్రయశోభూషణకర్త యగు విద్యానాథపండితుఁడు తన కుపకరించు ననేక

భాగములను శృంగారతిలకమున నుండి దీసికొనెను. అందు రసవిరోధమునుంగూర్చియు, రసమునుండి రసాంతరముయొక్క యుత్పత్తింగూర్చియుఁ, దత్తద్రసములయందుఁ గల్గు [10]వ్యభిచారిభావముల నిర్ణయముంగూర్చియుఁ జెప్పఁబడిన శ్లోకము లతఁడు చెప్పినట్లే శృంగార తిలకమునందుఁ గానవచ్చుచున్నవి. కాని యతఁడు రసస్వరూప సామగ్రీప్రతిపాదనమున శృంగారతిలకములోని వని యుదాహరించిన

"ఆలమ్బనగుణాశ్చైవ
తచ్చేష్టా తదలంకృతిః,
తటస్థాశ్చేతి విజ్ఞేయ
శ్చతుర్థోద్దీపనక్రమః.
ఆలమ్బనగుణో రూప
యౌవనాది రుదాహృతః,
తచ్చేష్టా యౌవనోద్భూత
హావభావాదికః స్మృతః.
నూపురాంగదహారాది
తదలంకరణం మతమ్,
మలయానిలచంద్రాద్యా
స్తటస్థాః పరికీర్తితాః."

—ప్రతాపరుద్రీయము, రసప్రకరణము–పే 159.

ఈమీఁది శ్లోకములు శృంగారతిలకమున నెచటను గానరాకున్నవి. అందు విభావాను

9. త్రిపురవధా దేవ గతా ముల్లాస మమూం సమస్త జీవనతామ్,
శృంగారతిలక నామ్నా పునరపి రుద్రః ప్రసాదయతి.

దీనింబట్టి యీ తఁడు త్రిపురవధమను కావ్యమును రచించినట్లూహించుట యుక్తిదూరము కాఁజాలదు.

10. ప్రతాపరుద్రీయము, మద్రాసు నాగరీప్రతి, పే. 207-208. శృంగారతిలకము— [3-21-34]. కాని చివరశ్లోకమునందలి "రసః సర్వో౽పి సంపూర్ణస్తిరోధత్తేరసాంతర" మ్మను పాదద్వయ మయ్యెడను, శృంగారతిలకమునఁ గానరాదు.

భావములవిషయ మేమియును గానరాకున్నది. తొలుత శృంగారాది నవరసముల పేరులుం జెప్పఁబడి యా వెనువెంటనే రత్యాదులయొక్క [[11]స్థాయిభావములయొక్క]యుఁ, బిదప వ్యభిచారి సాత్త్వికభావములయొక్కయుఁ బ్రతిపాదనము కానవచ్చుచున్నది.

భరతసూత్రముం బట్టి చూచినచో రసనిష్పత్తికి విభావానుభావ వ్యభిచారిభావములే కారణము. అందు ముఖ్యములగు విభావానుభావములు లేనిచో రసనిష్పత్తి కలుగఁజాలదు. రుద్రభట్టు విశేషముగ నాయికా నాయకు (ఆలంబనవిభావము)ల స్వరూపమును వివరించి యుండుటచే విభావమునకు కారణత్వమాతఁ డంగీకరించె ననియే చెప్పక తప్పదు. కాన విభావానుభావ నిరూపణమును, విద్యానాథుఁ డుట్టంకించిన యుద్దీపన విభావ నిరూపణమును [ఈ గ్రంథభాగములు] శృంగారతిలకమున లోపించె ననుట నిక్కువము.

విద్యానాథుఁడు శృంగార తిలకమును పేర్కొనుటయే గాక రెండు పర్యాయములు [12]రుద్రభట్టును పేర్కొనెను. ఆ విషయములు శృంగారతిలకమునం గానరావు. విషయవిచారముంబట్టి పరిశీలించినను శృంగారతిలకముతో వాని కెట్టి సంబంధమును లేనట్లు బోధపడక మానదు. ఆవిషయముల నిట వివరింతును:

i) "ప్రబంధమునందు నాయకుని వర్ణించినచో దానికిఁ బ్రతిష్ఠ కలుగునని యందురు. రుద్రభట్టుఁడుకూడ నీవిషయమున నేకీభవించుచున్నాఁడు." అని విద్యానాథుఁ డన్నాఁడు. శృంగారతిలకము కేవలము రసవిషయమునను, అందు శృంగారరసమునను సంబంధము కలిగియుండుట నీపైవిషయమం దెంతమాత్రమును సరిపడియుండ లేదు. మఱియు విద్యానాథుఁడుదాహరించిన వచనము గద్యరూపము. శృంగారతిలకమున నెచటను గద్యభాగము కాన్పించదు.

ii) గుణాలంకారములకుఁ గల భేదమును నిరూపించునెడఁ గావ్యశోభం గలుఁగ జేయుటలో రెంటికిని సమానమగు కారణతయే గల దని, యందులకు విద్యానాథుఁడు రుద్రభట్టుని వచనమును ప్రమాణముగ నిచ్చెను. గుణాలంకార వివేచన మిందు (శృంగారతిలకమున) ఎచటను గన్పింపకున్నది. కావున నీ వచనముకూడ నిందు దేనికిని సరిపడ లేదు.

---

11. రతిర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా; జుగుప్సావిస్మయశమాః స్థాయిభావాః ప్రకీర్తితాః.
నిర్వేదోఽథ తథా గ్లానిః శంకాసూయా మదః శ్రమః * * * * * * * * *
త్రయస్త్రింశదమీ భావాః ప్రయాన్తి రసస్థితిమ్; స్తంభః స్వేదోఽథరోమాంచః స్వరభంగోఽథ వేపథుః
వైవర్ణ్య మశ్రుప్రళయ ఇత్యష్టౌ సాత్త్వికాః స్మృతాః. —శృంగారతిలకమ్,1-10-15.

12 (1) రుద్రభట్టేనాపి కథితమ్: "ఉదాత్తచరిత నిబంధనా ప్రబంధ ప్రతిష్ఠా" ఇతి.
—ప్రతాపరుద్రీయము, మద్రాసుప్రతి, పే.8.

(2) తదుక్తం రుద్రభట్టేన: "యో హేతుః కావ్యశోభాయాః సోఽలంకారః ప్రకీర్తితః, గుణోఽపి తాదృశో జ్ఞేయో దోషః స్యాత్తద్విపర్యయః." —గుణప్రకరణము, పే. 243.

దీనింబట్టి రుద్రభట్టు సమగ్రమగు కావ్య లక్షణాదికమును నిరూపించు గ్రంథాంతరము నేదైన రచించియుండవచ్చునని తోఁచుచున్నది.

శృంగారతిలకము మనకు సమగ్రముగ లభియింపలేదని కొలఁది ప్రమాణములు చెప్పుచున్నను, ఈ మీఁది విషయములకు మాత్రము దానితో సంబంధము లేనట్లు తోఁచుచున్నది. ఇయ్యదికూడ సందేహింపవలసియున్నచో విద్యానాథుఁ డొకయెడ "శృంగారతిలకము" అనియు, వేఱొకయెడ "రుద్రభట్టు" అనియుఁ జెప్పవలసిన యవసరమే లేదు. పైరీతి విద్యానాథవచనముకూడ రుద్రభట్టుని గ్రంథాంతరమును సూచించుచున్నది. కాని యది యెంతవఱకు సరియో నిశ్చయింప వలను పడకున్నది. అలంకార శాస్త్రవిషయమున నీవఱకుఁ బరిశోధనలు సల్పిన పండితప్రకాండు లీవిషయమును శ్రద్ధతోఁ బరిశీలించిన ట్లగపడదు. శృంగారతిలక మసమగ్రమైనదనియు నిరూపింపఁబడినట్లు తెలియదు. ఇట్టి యసమగ్ర గ్రంథములంబట్టి రుద్రభట్టు చేతనైన యాలంకారికుఁడు కాఁడని నిశ్చయించుటయు ననుచితము. పరిశీలించి చూచినచో రుద్రభట్టు గ్రంథాంతరముల రచించినట్లు తోఁచుననియు, తదన్వేషణమునఁ బ్రయత్నింపవలెననియు విన్నవించుచున్నాను.

---

## కృప*

సెట్టి లక్ష్మీనరసింహముగారు (కవితాసమితి)

బలిమిమైఁ గలుగనిది కృపాగుణంబు:
  మృదులవర్షమ ట్లది మింటిమీఁదినుండి
దిగువఁబడు; సుఖదంబది ద్వివిధములను:
దాతను, బ్రతిగ్రహీతను, దనుపును; మఱి,
ఘనతమము ఘనతమములకు; గద్దెనెక్కు-
రాజులకుఁ గిరీటముకంటె రమ్యతరము;
రాజదండంబు ధరను వారలకుఁ గలుగు
ప్రభుతఁ దెలుపుచు, భయమును భక్తిఁ గొలుపు:
దానచే భయంకరులుగదా నృపతులు?
కృప నృపతిదండమునకంటె హెచ్చు: దాని
కవనిపతులస్వాంతములు సింహాసనములు;
దైవమునకే లక్షణమది: దేవునియధి
కారమునుబోలి రాజాధికార మొంట,
న్యాయము కృపాసమన్వితమైనయపుడె.

---

# చింతామణి పాఠభేదములు

వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి రు

## 3

విచక్షణులారా!

బాల సరస్వతీయ చింతామణికిని నప్పకవీయ చింతామణికిని గల పాఠభేదములలో నొకదాని నిట విమర్శించుచున్నాను.

A. "అద్యః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః" (బాలసరస్వతీయ చింతామణి).

B. "అద్యః క్రియాసు భూతాద్యర్థసముద్ద్యోతినం వినాసర్వః" (అప్పకవీయ చింతామణి).

A. 'పోయెన్, చనియెన్' మున్నగు భూతార్థక క్రియలును, 'యెవరు' మున్నగు పదాదిస్థలములును దప్పం దక్కిన యన్నిచోటులందలి యకారమును "అకార" వంతమయి యుండునని బాలసరస్వతీయ పాఠమున కర్థము.

"క్రియాసు=క్రియలయందు, భూతార్థద్యోతితమ్ (నమ్?)=భూతార్థములఁ గనుపించునదియు, ఆద్యగమ్=నామాది నుండునదియు, వినా=కాక తక్కిన, సర్వః=సమస్తమైన, యః=యకారము, అత్=అకారము (అనఁగా) తలకట్టనుట. 'చనియె వినియె' నివి మొదలగు క్రియాభూతార్థస్థిత యకారములు 'యెలమి, యేమి, యేలాగు, యెవటికి, యెంతు' యివి మొదలగు నామాది యకారములును దప్ప మిగిలిన యకారములన్నియుఁ దలకట్టుగాఁ దెలియునది." (బాలసరస్వతీయ టీక, వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండు సన్సువారి మాతృక).

B. "పోయెన్, చనియెన్" మొదలగు భూతార్థకాదిక్రియలు తప్ప నంతటను నున్న యకారము 'అకారవంతమై' యుండునని యప్పకవీయ పాఠమున కర్థము. 'పోయెదన్, పోయెడి' మున్నగునవి సూత్రములోని యాదిశబ్దముచే గ్రహింపఁదగినవై యున్నవి.

సీ. "ఆంధ్రోక్తి మొదల నాద్యంతస్థ యుండదు,
ప్రాణమై యది గనుపట్టుఁ గాని
నడుగుల నడుమను గడను యా కొందును
దలకట్టు దక్క నెత్వంబు లేదు
యాకు భూతాదిక్రియాద్యోతితములఁ జూ
పట్టు నెత్వము దలకట్టు గాదు......"

(అప్పకవీయము, ౨ ఆ. ౧౯౭ ప.)

౨. 'పదాదినీయక్షరము లుండును. ఈయక్షరములుండవు' అనురీతిని దమిళవ్యాకరణములలో వలెఁ దన వ్యాకరణమున నన్నయభట్టు చెప్పఁదలఁచి యుండ లేదు. సంస్కృత శబ్దములను దెనుఁగులోనికిఁ దెచ్చికొనెడి పద్ధతులను జూపుటమాత్రమె ప్రధానముగఁ జేసికొని చింతామణిని రచించుచు నందచ్చాంధ్ర విషయమున నాతఁ డేవో కొన్ని బహుస్థలోపయోగి సామాన్య విషయములను, సందేహ నిర్ణాయక విషయములను మాత్రమె సూత్రించుచు వచ్చెను. అందుఁ బ్రకృత సూత్ర[?]మొకసందేహమును దీర్చు విషయమున నుపదేశింపఁబడినది. యకారముపై నుండు 'ఎత్వము' వ్యవహారమున 'అత్వముగా' మాఱుచుండును. కావుననే "మాని పోయను, అయలే, యాభై" మున్నగునవి వ్యవహారములోఁ బ్రచురములై వెలయుచున్నవి. ఇట్టి మార్పును బట్టి యకారముపై "అత్వైత్వములలో" నేది నిల్చి యున్నను నది "అత్వమా?" లేక "ఎత్వమా?" అను సందేహము పొడముచునే యుండును. కావుననే నన్నయభట్టారకుఁ డట్టిసందేహమును దీర్చుటకయి పైసూత్రమును రచించి యున్నాఁడు. అట్లు సూత్రించు సందర్భములోఁ బ్రాసంగికముగాఁ బదాదియకారస్థిత్యంగీకారము సూచితమయ్యెనే గాని పదాదిని యకారమున్నదని గాని లేదని గాని చెప్పుటయును, నది యెచ్చటెచ్చట నున్నవు డేయేస్వరములతోఁ గూడుకొని యుండునో యావిషయమును జెప్పుటయు గ్రంథకృదుద్దేశములు గావు. అట్టి యుద్దేశములతోనే గ్రంథకర్త యున్నాఁడని యంగీకరించు నెడల "చెయిది, చెయు

వులు, చేయు, చేయుట" మున్నగు చోటులందలి యకార ముపై నిత్యోత్వాదులు నిల్చియుండుట దప్ప మనవలసి వచ్చును గదా!

౩. అప్పకవీయపాఠములో బాలసరస్వతీయ పాఠమునఁగల పదాది యకారస్థితి సూచనము తప్పిపోయినది. ఇంతియ గాక యప్పకవీయమునఁ బదాదిని యకారాదులుండవని ప్రత్యేకముగఁ జెప్పఁబడిన సూత్రముల పాఠ విశేషములును గలవు.

"వికృతిపదాదౌ ప్రథమాంతస్థస్తృతీయానునాసికా న స్తః,...క్వచిదపి న స్త ఉదోతౌ దంతోష్ఠభవస్య వికృతిశబ్దాదౌ."

(అప్పకవీయ చింతామణి, ౨ ఆ. ౨౨౧).

ఈయప్పకవీయ పాఠ పక్షమున "అద్యః క్రియాస్వి" త్యాదిసూత్రములోఁ బ్రతిషిద్ధముల కియత్తానిర్ణయము తోఁచకుండునట్లుగ నాది శబ్దమును నిల్పి సూత్రశేషమున సర్వశబ్దమును బ్రయోగించుట యర్థవ్యక్తి విదూరమై యున్నది. న్యాయ్యముగా నిచటఁ గ్రియలలోని భూతార్థకములును, దద్ధర్మార్థకములును దప్పఁ దక్కినచోట్లనెల్ల యకార మకారవంతమై యుండునని వాక్యరచనము చేయవలసి యుండును. కాఁగా గ్రంథకర్తకిట్టి యభిప్రాయమును జెప్పుతలంపు లేదనియు, నతఁడు "అద్యః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినాసర్వః" అనెడి యర్థవ్యక్తి భూషిత బాలసరస్వతీయ పాఠ వాక్యమునే రచించి యుండఁగాఁ బ్రక్షిప్త పాఠకర్తలందుఁ దద్ధర్మార్థకముల ప్రతిషేధమును జొనుపుటకును, బదాదియకారాంగీకారమును ద్రోసి పుచ్చుటకును యత్నించి ఛందః ప్రతిబంధమున 'ఆది' శబ్దమును దోఁపి 'ఆద్యగ' శబ్దమును ద్రోసి పయిరీతిని సరిపుచ్చికొనిరా యని యాలోచింపవలసి యున్నది.

౪. మఱియుఁ బదాది యకారాంగీకారముగల బాలసర్వతీయ పాఠము నంగీకరించునపుడే చింతామణి సంధి ప్రకరణములోని "సర్వత్రాజ్య తాద్రూప్యం జ్ఞేయం యుస్యద్రుత ప్రకృతికేభ్యః" అను సూత్రము సుసంగతముకాఁ గలదు. పదాదిని యకారమే లేనపుడు సంధి వేళలో నది లోపించి సర్వశేషమగునను నర్థముగల పైని వ్రాసిన "స్వర త్రాజ్య"దిత్యాది సూత్రమునకుఁ బ్రసక్తియే యుండదు గదా! అహోబలపండితుఁ డిట్టి విరోధమును గని పెట్టియే యప్పకవీయమాతృకలో "సర్వత్రాజ్య"దిత్యాది సూత్రము లేనే లేదని వ్రాసియున్నాఁడు." ఇంతియ కాక "'వూరు, వోడ' మొదలగు వానిలోని వకారము వలెనే 'యెప్పుడు, యేఁబది' మున్నగువానిలో సైతము యకార ముచ్చారణ సౌకర్యార్థక మగుచు వ్యవహారమునఁ బ్రవేశించినంతమాత్రమున దానిని సత్యమనియు, సహజమనియు నంగీకరింప నేల? మరల సంధివేళలలో దానికి లోపమును విధించుకొన నేల? అస్ఫుటస్వరమే యున్నదనియుఁ, దక్కిన స్వరాది పదములకు వలెనే (తండ్రి + అతఁడు = తండ్రియతఁడు) దీనికి సంధ్యభావస్థలమున సంహితయందు యకారము నిల్చుననియుఁ బ్రక్రియా లాఘవముగ సూత్రించుట యుక్తము కాదా?. అని యిట్లు స్థూలదృష్టిని విమర్శించి యహోబలపండితుఁ డీ క్రిందిరీతిని వ్రాసియున్నాఁడు.

"అప్పకవి పుస్తకేతు 'అద్యః క్రియాసు భూతాద్యర్థసముద్యోతినం వినా సర్వః' ఇతి పాఠ స్స్థితః. ఆది శబ్దేన 'పోయెదన్, చనియెదన్' ఇత్యాదా వేత్వంసిద్ధమ్. పూర్వపాఠే త్వేతన్న గృహ్యతే. కల్పనాగౌరవ మతీవాపాద్యతే. న చోచ్చారణలాఘవ మేవ తస్య ప్రయోజనమ్, తదర్థం కల్పనాగౌరవ మంగీకార్యమితి వాచ్యమ్. తదభావేఽపి బాధకాభావేన, తదపేక్షయాతికల్పనాగౌరవ స్యానుచితత్వాత్. 'ఆద్యవర్ణాస్తు హ్రస్వేన న గృహ్యంతే కదాపి చే త్యథర్వణాచార్యస్య స్వసిద్ధాంత వచనాచ్చ. తస్మాదప్పకవిపుస్తకపాఠ ఏవ సాధు రితి ప్రతిభాతి. సర్వత్రాజ్వతాద్రూప్య మితిసూత్రంతు తత్పుస్తకేన దృశ్యత ఏవ. తేన 'ఎవ్వఁడు' ఇత్యాదౌ యత్వమాదౌ న పంక్తిహృదయంగమమ్ కించ 'వికృతిపదాదౌ ప్రథమాంతస్థస్తృతీయానునాసికౌ న స్తః, క్వచిదపి న స్త ఉదోతౌ దంతోష్ఠభవస్య వికృతిశబ్దాదౌ' ఇతి చ తత్పుస్తకే స్థితమ్." (అహో. ౧౫౫,౧౫౬ పుటలు).




## చిరకాలమునుండీ బాధించుచున్న మూత్రవ్యాధులకును గనేరియా (గనేరియా) వ్యాధికిని క్రొత్తగాకనిపెట్టబడిన దివ్యౌషధము.

# గనోకిల్లర్ (రిజిష్టర్డు)

ఈయౌషధము శ్రేష్ఠతమము. ఇంగ్లీషుమందులను దేశీయములగు నౌషధములను పుచ్చుకొనినను గుణము కలుగనియెడలను, యింజక్షనులవలనను వాక్సినులవలననుగూడ లాభము లేకపోయినయెడలను కడపటి ప్రయత్నముగా మా గనోకిల్లరునుగూడ పుచ్చుకొనిచూడుడు. పెక్కుయేండ్లనుండియున్నను లేక క్రొత్తగా కలిగినను ఏరకము శెగసంకటమైనను మరెట్టి మూత్రవ్యాధులనైనను స్త్రీలకైనను పురుషులకైనను గనోకిల్లరు తప్పక కుదుర్చును. మూత్రము ఝూరీగా వెడలును. మూత్రముపోవుచున్నపుడును కలుగుమంట తగ్గిపోవును. మూత్రనాళము నందలి వాపు తీసిపోవును. శెగవ్యాధి (గనోకోకసు) వలన మూత్రము బొట్లుగా పడుట, మేహరోగమువలన మూత్ర ద్వారమునుండిపోవు తెలుపు, యూరెత్రిటిసు, ప్రోస్టాటిటిసు, సిస్టిటిసు, లుకోరియా, మున్నగువ్యాధులన్నియును స్త్రీలకును పురుషులకునుగూడ గనోకిల్లరువలన కుదురును. వీర్యము (సెమను) పోవుట, స్త్రీలు గర్భవతులుగా నున్నపుడు కలుగు మూత్రవ్యాధులు మున్నగునవిగూడ దీనివలన కుదురును. 50 మాత్రలుగల సీసా ఖరీదు రు. 3-0-0 వీ. పీ. చార్జీ ప్రత్యేకము. ఒక్కసారి 3 సీసాలు తెప్పించుకొనిన వీ. పీ. చార్జి మేమే భరించెదము.

అడ్రసు:—**డాక్టర్ డి. యన్. జసాని,** 137 కికావీధి, గులాల్‌వాడి, బొంబాయి 4.

Tel. Add. "GONOKILLER" Dr. D. N. JASAN1, 137 Kika Street, Gulalvadi, Bomday, 4

మద్రాసు సిటి ఏజెంట్లు దాదా అండు కంపెనీ, 52, నైనియప్పనాయకవీధి, మదరాసు.

---

స్వల్పధర ! ఫల మధికము !! పూర్తి తృప్తి!!!

100 కి 100 గురు సంతృప్తిచెందియున్నారు




# లోకామయహార కస్తూరి మాత్రలు

పిల్లలుమొదలు ముసలివారివరకు అందరి మందము, మలబద్ధము, పడిసెము, దగ్గు, గూరలు, శీతలముచే కాళ్లులాగుట, కడుపుబ్బరము, కడుపునొప్పి, పక్కలయందునొప్పి, ఆహారజీర్ణకాలమందుగు తలనొప్పి, చలిజ్వరము, జ్వరము, ప్లేగు, ఇన్‌ఫ్లూయంజా ఇంకను అనేకవ్యాధులను గుణపరచును. స్త్రీలు ప్రసవించిననాడు, స్నానమునాడు (కస్తూరికి బదులుగా) ఈ మాత్రలు 4-5 ను, 2-3 తములపాకులలో నమలి మ్రింగవలెను. సాంక్రామికరోగులతో నుండవలసినవారు, దినము 1-2 మాత్రలను సేవించిన ఆరోగ్యదృఢాంగులగుదురు. ఈమాత్రలసీసాతోగల అనుపానపత్రమును చూడుడు. 300 మాత్రలు గల సీసా 1 కి 4 అణాలవంతున ప్రతిషాపులోపలను దొరకును. పోస్టుమూలకముగా 6 సీసాలు రు. 1-8-0, 12 సీసాలు రు. 2-12-0, 25 సీసాలు రు. 5-3-0.

సారస్వతాసవం:—మెదడుకు బలమును కలిగించి, జ్ఞాపకశక్తిని వృద్ధిచేయును గావున, మెదడు దుర్బలమువలన గలిగియుండు సమస్తవ్యాధులను పరిహరించి నరములకు మంచిత్రాణను, రక్తవృద్ధిని కలుగజేయును. సంగీతపాఠకుల కంఠస్వరమునకు మృదుమధురత్వము నిచ్చును. పాడను పాడను ఉత్సాహము నింపును. బలహీనలైన స్త్రీలకు నెత్తినడుమ (నెత్తినోరు చాల మెత్తగా వుండుటవలన) మాట్లాడను నడువనుకాని పిల్లలకు సంజీవివంటిది.

6 ఔన్సుల సీసా 1-కి రు. 1-0-0. పోస్టుఖర్చులు ప్రత్యేకము.

## శ్రీ సీతారాఘవ వైద్యశాల, మైసూరు.

౫. ఈ సందర్భములోని యహోబలపతి వ్యాఖ్య మిక్కిలి ప్రామాదికమై యున్నది. సర్వత్రాజ్వ దిత్యాది సూత్ర మిప్పటి యప్పకవీయ మాతృక లన్నిటిలోను "ఆరయ వైకృతోక్తులఁ బదాదులయందు యకార ముండ దా,తీరున..."(అప్పకవీయము, ౫ ఆశ్వా. ౪౧ ప.)అను మొదలగు వివరణ పద్యములతోఁగూడ నగపడుచున్నది. అహోబలపతి వీనిని సరిగాఁ జూచుకొనకయె పైరీతిని వ్రాసెనో లేక యహోబలపండితునకు దొంకిన యప్పకవీయ మాతృకలో నావలకే యహోబలపండితునివలెనె విరోధమును బరిశీలించినవా రెవ్వరేని యాసర్వత్రాజ్వది త్యాది సూత్రమును "ఆరయ వైకృతోక్తుల..." మున్నగువివరణపద్యములనుదీసి వేసియుండిరో తెలియరాకున్నది. కాని సర్వత్రాజ్వదిత్యాదికారిక యథర్వణుని నాఁటికే చింతామణిలోఁ జేరియున్న దనక తీరదు. చింతామణిలో నట్లు సర్వత్రాజ్వదిత్యాదికారికయే యథర్వణుని నాఁటికి లేనియెడల నద్దానిని సవరించుచున్న "వికృత్యాదిగతో యోత్రే" త్యాదికారిక వికృతి వివేకములో నుండియుండదు. గదా! ఆసవరణ మిచటఁ జూపుచున్నాను. చింతామణిలోని "సర్వత్రాజ్వ"దిత్యాది శ్లోకములో "సర్వత్రాజ్వ త్వాచార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః" అను భాగము నొకసూత్రముగ విభాగించి ద్రుతప్రకృతికములకుఁ బరమైన పదాది యకారము లోపించి స్వరము మిగులుననియు, నాస్వరము పూర్వస్థిత ద్రుతముపై నిల్చుననియు దాని కర్థము చేసికొని యాపక్షమున ద్రుతప్రకృతికేతరముల కనఁగాఁ (ముఖ్యముగా నుదంత) గళలకుఁ బరమగునప్పు డజ్వద్భావము చెప్పఁబడకుండుటచేత "అతఁ డెపుడు" మున్నగు సాధుసంధిరూపములు సిద్ధింపక "అతఁడు యెపుడు" మున్నగు నసాధుసంధిరూపములు నిల్చిపోవలసివచ్చునని శంకించుకొని యథర్వణాచార్యుఁ డద్దానికి సవరణముగా "వికృత్యాదిగతో యోత్రేతి" కారికను రచించియున్నాఁడు. కాఁగా నచ్చాంధ్రపదాదినున్న యకారము ద్రుత ప్రకృతికములతోనే గాక యేశబ్దముతో (శబ్దాంతరయోగతః) సంధించినను యకారము లోపించి దానిపై నున్న స్వరము శేషించుననని చెప్పుటచేత "అతఁ డెపుడు" మున్నగు సాధుసంధిరూపములు సిద్ధించుచున్నవి. అట్లె "అతఁడు యెపుడు" మున్నగు నసాధు సంధి రూపములు నివారితము లగుచున్నవి.

పయి సందర్భమునుబట్టి "వికృత్యాది గతో యోత్రే" త్యాదికమగు నథర్వణ సూత్రముచే సవరింపఁబడుచున్న "సర్వత్రాజ్వత్వాచార్య" మిత్యాది చింతామణి సూత్ర మథర్వణాచార్యుని నాఁటికే యాంధ్రశబ్ద చింతామణిలో నుండి యుండెడిదనియు ("వికృత్యాదిగతో యోత్రే" త్యథర్వణకారికార్థ మొకప్పు డహోబలపతి యనుకొన్నట్లు శ్రీకవిమతమే యైనను దాని నంగీకరించి యథర్వణుఁడు వికృతివివేకమున నుదాహరించుటచేత నాతని కాలమునకే 'సర్వత్రాజ్వాది త్యాది సూత్రము చింతామణిలో నుండి యుండెడి దనుటకు సందియము లేదు) నట్లు పదాది యకారాంగీకారమును బోధించెడి యా"సర్వత్రాజ్వ"దిత్యాదిసూత్రము చింతామణిలోనిదని నిశ్చితమగుటంబట్టి యందలి సంజ్ఞాపరిచ్ఛేదములోని "ఆద్యగంవినా సర్వః" అనెడి పదాది యకారాంగీకారబోధక బాలసరస్వతీయ చింతామణిపాఠమె నన్నయభట్ట ప్రోక్తమని నిర్ణీతమగుచున్నదనియు, నక్కారణమున నప్పకవీయ చింతామణి పాఠములు (పదాదియకారనిషేధకములు) ప్రక్షిప్తము లనుటకు సందేహము లేదనియు సిద్ధాంతితమగుచున్నది.

౬. మఱియు నహోబలపండితుఁడు "ఆద్యవర్ణాస్తు హాత్వేన న గృహ్యంతే కదాపిచ" అను నథర్వణ కారికకుఁ బదాదిని యకార ముండ నేరదని చేసినయర్థము సరికాదని చెప్పక తీరకున్నది. ఈ యథర్వణకారిక కిట్టి యర్థమును జేసియు నహోబలపతి "వికృతిపదాదా" విత్యాదికమగు నప్పకవీయ పాఠములకు సాధుత్వము నెట్లంగీకరించెనో తెలియకున్నది. చింతామణిలోనే యట్లు పదాది యకార ణకార నిషేధము వెలయుచున్న యెడల దానికిఁ బరిశిష్ట గ్రంథమగు వికృతి వివేకమున "వికృత్యాదౌ భవేన్న ణః" అనియు "ఆద్యవర్ణాస్తు హాత్వేన న గృహ్యంతే కదాపిచ" అనియుఁ బునరుక్తముగ మరల సూత్రింపఁబడి యుండవుగదా!

"ఆద్యవర్ణాస్త్వి" త్యాదిసూత్రమున కహోబలపతి చేసికొన్న యర్థము పైరీతి నప్పకవీయపాఠమునకు విరు

ద్ధమై యుండుటయే గాక బాలసరస్వతీయ చింతామణి పాఠమునకును విరుద్ధమే యగుచున్నది. బాలసరస్వతీయ చింతామణి పాఠము చెప్పునఁ బదాదియకారము నంగీకరించుచు నాపాఠమును సవరించుచున్న యథర్వణుఁడు తద్విరుద్ధముగను, వికృత్యాదిగతోయో త్రేత్యాది స్వవచనమునకు వ్యాఘాతముగను బదాదిని యకారమే యుండదను నర్థము గల "ఆద్యవర్ణా స్త్వి" త్యాదిసూత్రమును రచించియుండఁడుగదా !

౭. అహోబలపతి యిట్టి విరోధమును గ్రహించియే కావలయును, చింతామణిలోని పదాదియకారాంగీకార సూత్రమును సవరించెడి "వికృత్యాదిగతో యో త్రే" త్యాదికారిక నథర్వణుఁడు శ్రీకవి యను వేఱొక పండితుని మతముగా నుపదేశించెననియు, "ఆద్యవర్ణా స్త్వి" త్యాది సూత్రమును స్వసిద్ధాంతముగా నుపదేశించెననియు సాంగత్యమును గల్పింప యత్నించెనని వెనుక నుదాహరించిన యహోబల పండితీయ గ్రంథములోని "స్వసిద్ధాంతవచనాచ్చ" అను (౮ పేరా) వాక్యమువల్ల విశదమగుచున్నది. కాని "వికృత్యాదిగతో యో త్రే" త్యాదికారికయొక్కయు, "ఆద్యవర్ణా" స్త్వి త్యాదికారికయొక్కయుఁ బ్రణాళినిబట్టి మాత్ర మవి మతద్వయోపన్యాసప్రతిపాదకములుగ నున్నట్లగపడలేదు.

ఇంక నవి కేవలము విభిన్నవిషయకములనియే యెవ్వరికేని తోఁచక మానదు. "వికృత్యాదిగతో యో త్రే" త్యాద్యథర్వణకారిక "సర్వత్రాజ్వది" త్యాది చింతామణి సంధిసూత్రమునకు సవరణ మగుచు నద్దానిని సంబంధించుచున్నది. శ్రీకవి యను నాతఁ డాంధ్రపండితుఁడుగఁ బ్రసిద్ధి యగపడదు. మఱియు నట్టివాఁ డథర్వణునివలెనే చింతామణిని సవరించు గ్రంథమును రచించెననుట భ్రాంతిగ నిరాధారమై యున్నది. కాఁగా నందలి శ్రీకవిశబ్దము మహాకవి పర్యాయముగఁ గాని నన్నయభట్టు పర్యాయముగఁ గాని యథర్వణునిచేఁ బ్రయోగింపఁబడెనని గ్రహించుట యుక్తమై యున్నది. మఱియు వికృత్యాదీత్యాదిసూత్రము పదాదినున్న యకారము సంధిలో నిల్చునా? లోపించునా? యను రెండుపక్షములలో నొకపక్షమును నదఁగా లోపించు ననుపక్షమును బోధించుచున్నది. ఆద్యవర్ణాస్త్వి త్యాది కారిక యన్ననో పదాది స్వరము యకార విశిష్ట మగునా కాదా? యను రెండుపక్షములలో నొకపక్షము నదఁగా కాదన్న పక్షమును బోధించుచున్నదని గదా యహోబల పండితుని యర్థముయొక్క సారాంశము. ఇట్టి స్థితిలో నీరెండును బక్షద్వయ బోధకములని యహోబలపతివంటివాఁ డెట్లు దలంచెనో తెలియరాకున్నది. ఈ రెండును బై రీతిని విభిన్నవిషయకము లగుటచేతనే వికృత్యాదీత్యాది కారిక చింతామణి సంధి ప్రకరణములోని "సర్వత్రాజ్వది" త్యాది సూత్రమునకు సవరణమై యుండఁగా "ఆద్యవర్ణా స్త్వి" త్యాది సూత్రము చింతామణిసంజ్ఞా ప్రకరణములోని "అద్యః క్రియా" స్వి త్యాదిసూత్రమునకు సవరణమై యున్నది.

యకారము పై నిల్చునపుడు 'అత్వము'ను 'ఎత్వము'ను సందిగ్ధప్రాయములై పరస్పరము మాఱిపోవుచుండుటచే నట్టి సందేహమును దీర్చుటకై "అద్యః క్రియా స్వి త్యాదిసూత్రము చింతామణి కర్తచే నుపదేశింపఁబడినది. కావున నద్దానిని సవరించు నథర్వణకారికలుగూడ నట్టి స్థితిలోనే యుండి తీరవలయునుగదా! "అద్యః క్రియా స్వి" త్యాది చింతామణి సూత్రమునకీ క్రింది సూత్రములు సవరణములుగా నథర్వణునిచే నుపదేశింపఁ బడియున్నవి:

శ్లో. "భావిక్రియాసు యస్య స్యా దేత్వ మేవ ప్రయోగతః,
డుడ్వాదివర్ణే భూతార్థే చాపి తద్వ ద్భవే త్సదా.
డోలాభూషోత్తరీయాణి విశ్వైత్వం నాస్తి మధ్యమే,
ఆద్యవర్ణాస్తు హ త్వేన న గృహ్యంతే కదాచిచ".

(అథర్వణకారికావళి, ౨౩, ౨౮ శ్లో.)

" అద్యః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః " అను చింతామణి సూత్రమునఁ బదాది యకారమును, భూతార్థక క్రియల యకారమును దప్పఁ దక్కిన యెల్ల యకారములును "అకార" విశిష్టములై యుండునని చెప్పఁబడియున్నది. చింతామణిలో "ఎద, ఎడి, ఎడు" అనునవి చెప్పఁబడి యుండనందునఁ గావలయును, బ్రతిషిద్ధములలోఁ జింతామణికర్త వానిని చేర్చకున్నలేదు. వానిని జెప్పవలసివచ్చినపుడు "యెద, యెడి,

"యెడు" అనియే చెప్పవచ్చును గాన వానిని ప్రతిషిద్ధము లలోఁ జేర్ప నేల యని యాతఁడు తలఁచియుండునని యూహింపనగును. అథర్వణాచార్యుఁడు చింతామణిని ననరించు సందర్భమున వానిని స్వరాదులుగనే యుపదేశించి యుండుటచేతఁ బ్రతిషిద్ధములలో భూతార్థకముల తోపాటు వానిని సైతము చేర్చుట యావశ్యక మగుటచేత "భావిక్రియాసు......సదా" అనుకారిక నుపదేశించి యున్నాఁడు. ఇఁకఁ గ్రియాపదములం దప్పఁ దక్కిన శబ్దములలోఁ బదమధ్యమందును, బదాదిని మాత్రమె యత్వైత్వవిశిష్ట యకారములు కనఁబడుచుండుటచేత వాని విషయమునఁ గూడ సందేహమును దీర్చుట యావశ్యక మని తలఁచి యథర్వణుఁడు తక్కిన "డోలాభూషే" త్యాదిసూత్రమును, "ఆద్యవర్ణాస్త్వి" త్యాదిసూత్రమును నుపదేశించి యుండెను. అందుఁ బదమధ్యమున "కుయ్యాల, పయ్యెద, తాయెత్తు" అను చోటులు దప్ప నెల్ల యెడలను యకారముపై నెచ్చటను "ఎత్వము నిలువనేర"దని డోలాభూషే త్యాది సూత్రము సందేహనివృత్తిని జేయుచున్నది. ఇఁకఁ బదాదాయందలి యకార మెన్నఁడును "అత్వ" విశిష్టము కానేరదని మూలభూత చింతామణి సూత్రములోని "ఆద్యగం వినే" త్యాదివాక్యముచేత నే విశద మగుచున్నది. అట్లయినను "తండ్రి యతఁడు" మున్నగుచోట్లఁ బదాది నత్వవిశిష్ట యకార మగపడుచుండుటచేత నట్టియెడల వినంబడు యకారము సంహితలో నుచ్చారణ సౌకర్యార్థము వచ్చి పదచ్ఛేదకాలమున నంతరించునదే గావున దానిని బ్రత్యేకముగా వాడునపుడు ప్రాణిగా ననఁగా హల్లుగాఁ బరిగణింపరాదనియు, "అకార" స్వరముగనే దానిని బరిగణింపవలెననియు "ఆద్యవర్ణాస్త్వి" త్యాది సూత్రముచే నథర్వణుఁ డుపదేశించి యున్నాఁడు. కాఁగా "ఆద్యవర్ణాస్తు = (ఆది + అవర్ణాస్తు) పదాదిని వినఁబడు 'అతఁడు' మున్నగువానిలోని 'అ' వర్ణములన్ననో, హల్త్వేన = హల్విశిష్టములుగా, కదాపిచ = ఎన్నఁడును, న గృహ్యంతే = గ్రహింపఁబడవు" అని యా సూత్రమున కర్థమును గ్రహింపవలయును. అట్లు వాక్యాదిని మున్నగు చోట్లఁ బ్రత్యేకముగా వాడఁబడనపుడనఁగా సంహితలో నిల్చునపు డట్టి పదాదినున్న 'అ' కారము సైతము హల్త్వముతోనే యనఁగా యకార విశిష్టముగనే పరిగణింపఁ బడుట "ఆయతి వసుశోభనాకృతి" (ఆయతి + వసుశోభనాకృతి; ఆ + అతివ + సుశోభనాకృతి) మున్నగుచోట్ల నగపడుచుంటచేతఁ బైరీతిని జెప్పవలసిన ప్రసక్తి గలిగెనని గ్రహింపవలెను. ఇట్టి యభిప్రాయమునె "ప్రాణా త్త్వాణో లఘుర్యస్యాత్స్వహల్త్వాచ్చ క్వచిద్భవేత్, చేద్యత్వం తస్య కల్ప్యం స్యాత్" అనెడి యనంతర కారికచే నథర్వణాచార్యుఁడు విశదీకరించియున్నాఁడు. పైరీతి నున్న యాసందర్భములోని కారికాద్వయమునకును గల సాంగత్యమును బరిశీలించునపు డహోబలపండితుని యర్థ మసంగతమని విమర్శకులకుఁ దోఁచక మానదుగదా! మఱియు నీరీతి నర్థము చేయునపుడే యాకారిక బాలసరస్వతీయ చింతామణి పాఠమునకైన సంగత మగుచుఁ జింతామణితో నదుకుకొనఁగలదని గ్రహింపవలెను.

పైసందర్భమునుబట్టి పదాది యకారాంగీకారమును ద్రోసి పుచ్చెడి "అన్యాః క్రియాసు భూతాద్యర్థసముద్ద్యోతినం వినా సర్వాః" అనునట్టియు, "వికృతిపదాదౌ ప్రథమాంతస్థస్తృతీయానునాసికా న స్తః" అనునట్టియు నప్పకవీయ చింతామణి పాఠములు ప్రక్షిప్తములనియు, నవి యథర్వణాచార్యునినాఁటికిఁ జింతామణి నెక్కియుండ లేదనియు, నిటీవల నవి ప్రక్షిప్తములై యుండెననియు విశద మగుచున్నది.

౮. వెనుక నుదాహరించిన రీతిని "సర్వత్రాజ్వత్కార్య" మిత్యాదికారిక చింతామణిలో నుండుట నారసియు నప్పకవి యద్దానిని ద్రోసివేయక పదాదిని యకారము లేదని చెప్పుచున్న "వికృతిపదాదా"విత్యాది కారికకు విరోధము కలుగకుండునట్లు పదాదిని యకారము లేదనుట గ్రాంథిక భాషా విషయమనియు, "సర్వత్రాజ్వది" త్యాదిసూత్రము వ్యవహారమునఁ బదాది నగపడుచున్న యకారము సంధికాలమున గ్రాంథికభాషలో లోపించుననని చెప్పుచున్నదనియు నిట్లు వేఱొకరీతిని వ్యాఖ్యానముచేసియున్న ట్లగపడుచున్నది. ఇంతియగాక 'యెవరు' మున్నగుచోట్ల వ్యవహారమున యకా

రము వినఁబడుచున్నట్లె వ్రూరు మొదలగుచోట్ల వకారము సైతము పదాదిని వ్యవహారమున వినఁబడుచున్నను నట్టి యకార వకారములు గ్రాంథికభాషలో నంగీకరింపఁబడకుండుటచేతనే "వికృతిపదాదౌ ప్రథమాంతస్య తృతీయానునాసికౌ నస్తః, క్వచిదపి నస్త ఉదోతా దంతోస్థభవస్యవికృతి శబ్దాదౌ" అను సూత్రములు చింతామణిలో వెలయుచున్నవని యిట్లు "సర్వత్రాజ్య"దిత్యాది సూత్రమునకును, "వికృతిపదాదా" విత్యాదిసూత్రములకును సాంగత్యమును జూపినట్లుగ నాతని యీ క్రింది యాంధ్రీకరణ ధోరణివలన నగపడుచున్నది:

ఉ. "ఆరయ వైకృతోక్తులఁ బ
దాదులయందు యకార ముండ దా
తీరునఁ బల్కు వ్రాఁత గణు
తింపఁగ నవ్వుగుదాని డాపలన్
నీరజనాభి నాంతములు
నిల్చిన నచ్చటఁ బ్రాణసంధిఁ జే
స్నారు నిరంతు చైద్య వసు
ధాధిపు నేపడఁగించె నేఁ డనన్".

(అప్ప. ౨ ఆ. ౮౦ ప).

క. "శ్యంగాంత్య వక్రయుగముల
సాంగత్యము వాకు నాంధ్ర సంస్కృతముల నా
డింగలుగ దట్టి వ్రాఁత ధ
రం గలయుద్రుతాంతములను బ్రాణము లట్లన్".

క. ముంగాములుగులు నాలుగు
సుంగరములు మూఁడు నేడు నోడ్డాణంబుల్.

(అప్ప. ౫ ఆ. ౮౨,౮౩ ప.)

పయిరీతి నున్న యప్పకవీయ వివరణ మెంతమాత్రమును సరియై యుండలేదు. నన్నయభట్టారకుని కాలమునఁగూడ నిప్పటివలెనే వ్యవహారమునఁ బదాదిని యకారవకారములు పై రీతిస్థలములం దుండెడివని యంగీకరించినను నవి యపభ్రష్టములనియు, నట్టిపదము లజాదులేయనియు "వికృతిపదాదా" విత్యాదిసూత్రముతోను (అప్ప. ౨ ఆ. ౮౬ ప), "క్వచిదపి నస్త" ఇత్యాది సూత్రముతోను (అప్ప ౨ ఆ. ౮౭ ప) చింతామణి కర్త చెప్పెననిన నవచ్చును గాని యట్టి యపభ్రష్టోచ్చారణములను మూలముగా గ్రహించి వానినుండి గ్రాంథికరూపములను సాధించుచు సంధి ప్రక్రియను "సర్వత్రాజ్య" దిత్యాది సూత్రములతోఁ జెప్పెననుట యుక్తముకాదు గదా! "రాముఁడుచేత" మున్నగు వ్యావహారికరూపములను మూలముగాఁ జేసికొని "రామునిచేత" మున్నగు గ్రాంథిక రూపములను సాధించురీతి ప్రక్రియ చింతామణిలోనే గాక యేవ్యాకరణమునందును లేదుగదా! ఇంతియ కాక యట్టి యప్పకవీయ వివరణ పద్ధతియే చింతామణికర్తృభిప్రేత మైనయెడల నప్పకవివలెనే యాతఁడును "సర్వత్రాజ్య" దిత్యాదిసూత్రముచే "యెవరు" మున్నగు శబ్దములలోని పదాదియకారమునకు సంధికాలమున లోపమును సూత్రించినట్లె "వ్రూరు" మొదలగు శబ్దములలోని పదాదివకారమునకు సైతము సంధికాలమున లోపమును సూత్రించియుండఁడా? అదృష్టవశమునఁ బ్రక్షిప్తపాఠకర్త యీ విషయమున నంతగా జాగరూకతను దీసికొనకుండుట కాంధ్రలోకము వారియెడల కృతజ్ఞము కావలసియున్నది.

పైసందర్భమునుబట్టి పైయప్పకవీయ వివరణము సరియై యుండలేదనియు, "వికృతి పదాదా" విత్యాది కారికయు, "క్వచిదపి నస్త" ఇత్యాది కారికయు, "భూతాద్యర్థసముద్ద్యోతిన" మ్మను పాఠాంతరమును బ్రక్షిప్తములని సిద్ధాంతీకరించుటకు సందేహ ముండఁబోదుగదా!

౯. మఱియు 'వ్రూరు' మొదలగు స్థలములం దెట్లు పదాదిని వకారము వినఁబడుచున్నను నది పదావయవముగా నంగీకరింపఁ బడ లేదో యట్లె "యెవరు" మున్నగుచోటులందు సైతము పదాదిని వినఁబడుచున్న యకారము పదావయవముగా నంగీకరింపఁ బడ రాదని ప్రక్షిప్తపాఠకర్త లోకయుక్తిని జూపుచున్నట్లగపడుచున్నది. కాని "ఒకయూరు" మున్నగుచోటులందు వకారము లేకుండుటయే గాక దాని స్థానమున లఘు యకారము వచ్చుచుండుటచేత 'వ్రూరు' మొదలగు చోటులందలి

పదాది వకారము కేవల మపభాషితమని నిర్ణయించుట సుకరమైయున్నది. పదాది యకార మన్ననో యట్లుగాక సంహితలోనది నిల్చిన నిల్చుటయు, లేనియెడల లోపించుటయు మాత్రమె గలదు గాని దానిచోట వేఱొకయక్షరము నిల్చుట లేదు. ఆకారణముచే నది యపభాషితమనుట కవకాశము లేదు. మఱియు ద్రావిడభాషాభేదము లగుటచే సహోదర భాషలనదగు తమిళాదులలో "యెవరు" మొదలగు చోట్ల "యారు" మున్నగు రూపములు ప్రసిద్ధములై యుండుటచేత నట్టి యకారము ప్రకృతి సిద్ధమని గ్రహించుట యుక్త మగుచున్నది. "వూరు" మొదలగుచోట్ల నన్ననో తమిళాది భాషలలో "ఊర్" మున్నగు స్వరాదిరూపములె వెలయుచుండుటచేత నచటి వకారము సహజమనుట కవకాశము లేదు. పయి సందర్భమును బట్టి పదాది యకార వకారములు సమాన కోటికములని వాదించుటయు యుక్తియుక్తము కానేరదు గదా!

---

# పలితకేశము

శ్రీ శివశంకరశాస్త్రిగారు

సుబాహు[రాజు]

పాటలీపుత్త్రమ్మువారలు
పంపినారు విశేషసుందర
వివిధపరిమాణాకృతుల్ గల
విమలదర్పణముల్.

వచ్చియున్నవి వింధ్యపర్వత
వనమదస్తంబేరమంబుల
దివ్యదంత వినిర్మితము లౌ
తెల్లదువ్వెనలున్.
రమ్యకోసలదేశ వివిధా
రామసీమలలో నపూర్వ
ప్రసవసారమునుండి తీసిన
ప్రథిత తైలంబుల్---

పెట్టియున్నవి చూడు చందన
పేటికాంతర్గత మనోహర
కాచపాత్రికలందు నెంతేయు
ఘ్రాణపర్వముగన్.

త్వరితముగ బోవలయు రాజ్ఞీ
దర్శనార్థం బో యుపాలీ!
చతురిమమ్మున కేశసంస్కృతి
సలుపు మీవేళన్.

పట్టుకొమ్మా కాంచనాకృతి
బద్ధనూతన వలయముకురము
సమ్ముఖంబుగ యవనబాలా,
జాగరూకతతోన్.

స్తంభనికటమునుండి తెమ్మా
సత్వరంబుగ నో సుభద్రా,
పసపుపచ్చని పట్టు దిండుల
పాదపీఠంబున్.

కేశజాలము చెదరకుండగ
కేకిపింఛముతోడ వీసరుము
మద్రచామరవాహినీ, యిటు
మంద మందముగన్.

పదవిలాస సమంచితంబై
భవ్యభావతరంగితం బగు
పాట పాడంగదె విశాఖా,
పంచమశ్రుతిలో.

వి శా ఖ

అఖిలభువనములం దకుంతిత
మా ప్రతాపముతో వెలింగెడు
పంచసాయకు డొక్కడే నా
పరమదైవతము!
సకలయోగీశ్వరుల కగ్రే
సరుడు ఫాలవిలోచనుండే
స్మరుడు దూరమునందు నిల్వగ
నంచలన మొందెన్.
ప్రసవబాణము తనువు మీగను
పడక మున్నె శివుడు గిరిజా
వదనబింబముపైన ప్రేమను
వాల్చె లోచనముల్.
బాణపాతం బైనచో నా
భర్గు డేమయి యుండువాడో!
పర్వతాత్మజ కష్ట డెంతటి
ప్రమద మబ్బెడిదో!
నిజగళంబున హరుడు విషమును
నిలిపి మృత్యుంజయుం డయ్యెను
అగ్నిదగ్ధుం డయ్యు బ్రదికిన
యాత డెవ్వ రగున్?
సామతంబున, సాటి యెరుగని
నాయకుం డొక మనసిజుండే:
అతను డయ్యును నడపు లోకము
లాత్మ పాలనలో.

అట్టియుజ్జ్వల చండశాసను
నర్చనమ్ము నిరంతరంబుగ
నిష్ఠ సలుపం దగినకాలము
నిండు జవ్వనమే.
అహరహంబును వేచియుండును
యౌవనంబును మ్రింగివేయగ
జరయు వ్యాధియు వ్యాఘ్రమట్టులు
చండ విస్ఫూర్తిన్.
పదినంబున వలీపలితము
లేర్పడుం దనుమస్తకంబుల
నాదినంబున దొలగ మొదలిడు
నతను కృప కూడన్.
జవ్వనంబు హరించిపోవగ
సాగుకాలదిని వృద్ధి గాంచును
కామినులపై నక్కజంబుగ
కాంక్ష పురుషులకున్.
పలితమూర్ధ విలోకనంబున
ప్రాభవంబును ధనము విద్యను
పరిగణింపదు యువతి విముఖీ
భావసంగతమై.
విజయ మొందెడు గాక యౌవన
విభ్రమోత్కర్షమ్ము మన్మథు
నిబిడ కరుణాకటాక్షమ్మున
నిఖిల లోకములన్!
నిరత మానందాతిశయమే
నెగడు గావుత రూపసంపద
బంచబాణసమాను డగుమా
ప్రభువతంసునకున్!

రా జు

ఎంత దివ్యం బహహా దేహం
బెంత దివ్యం బహహా యౌవన
మెంత దివ్యం బహహా తరుణీ
హాస విభ్రమము !

ఎంత చక్కనిపాట పాడితి,
విది రచించిన కవివరేణ్యుడు
మనపురంబున నున్నచో బహు
మాన మంపుదునే.

వి శా ఖ

చరణసేవకురాలి సద్య
స్సాహసంబు క్షమింపవలయును !
పరకవిప్రోక్తంబు కాదీ
పాట ప్రభువర్యా !

కామసన్నిభు లైన దేవర-
గాత్రసంపద్విలోకనమున
పాదసేవకురాలిముఖమున
బయలుపడె దేవా !

రా జు

ఆశుగతి నీలలితముఖమున
నవతరించిన గీతమా యిది !
హార మిదిగో వైతు రమ్మా
అంతికమ్మునకున్.

వి శా ఖ

దీప్తి గాంచు నమూల్యహారము
దేవ, యుష్మత్కంఠసీమనె.
అంత మన్నన కీతపస్విని
యర్హురా లగునే ?

రా జు

ప్రాకృతమ్మున నేటివరకును
పడతి కవనము చెప్ప నెరుగము:
కలిగె నర్హత నీకు ప్రభువా
క్యమ్ముచే బాలా !

ఊ పా లి

దేవ, కంఠమునుండి హారము
తీయుచో నిదె చిక్కు వడినది
మూర్ధజావళి, సంస్కరించెద
మొదటిచందమునన్.

కలిగె గమనవిలంబనం బీ
ఘటనలో నొకయింత దేవా !

రా జు

పోనిలే, కానిమ్ము వేగమె
పూర్ణమండనమున్.

... ... ...

నిలువు మోసి విశాఖ, నీదృఢ
నీలకుచబంధంబు మీదను
కానవచ్చెను ధవళరేఖా
కారమున నేదో.

వి శా ఖ

వాయువశమున ధవళతంతువు
వాలియుండగ నోపు దేవా !

రా జు

తీసి యిమ్మిటు, పలితకేశము
తెరగునం దోచున్ !

కంఠదేశమునుండి హారము
గ్రక్కునం దొలగించువేళను
దాన లగ్నం బయ్యె నెట్లో
ధవళకేశంబు !

నలువదేడులు నిండె మొన్ననె;
నడువయస్సున నున్నవానికి

ఉత్తమాంగమునందు పలితం
బుదయ మొందిన దే!
గోచరించెను జరాసూచన;
కొన్నినాళ్ల కసంశయమ్ముగ
శిరము ధవళం బగు హిమాలయ
శిఖరిచందమునన్.

ఉ పా లి

వేటకై చని మొన్న మొన్న నె
విపినభూమిని శూలముఖమున
వ్యాఘ్రహననము చేసియుంటిరి;
వార్ధకంబ ప్రభూ!

రా జు

భోగలాలసు లైన వారికి
పోవు నోజము సత్వరంబుగ
విషయసుఖములనుండి పురుషుడు
విరతి చెందదగున్.
జగము సర్వం బనిత్యం బే!
జనన మరణప్రవాహములో
కర్మబద్ధుం డగుచు పురుషుడు
క్రమముగా దిరుగున్.
సకల సంసారమ్ములో నే
జాడ గాంచిన మనఃక్షోభము
గాఢవాంఛలు భూరిదుఃఖము
కానబడుచుండున్.
శాశ్వతం బగువస్తు వీ సం
సారమధ్యమునందు కలదా?
చిత్త విక్షోభోపశమన
స్థితియె చేకురదా?
స్వాంతమందు నిరంతరము జా
జ్వల్యమానము లైన కోర్కులు
శమము బొంది ప్రశాంతి కల్గెడి
సరణియే లేదా!
సకలకారుణికాగ్రగణ్యుడు
శాక్యమునిసింహుండు జనులకు
ఈయనిత్యతయందు శాశ్వత
మేదొ తెల్పె గదా!
పరమపూజ్యుం డైన బుద్ధ
ప్రభువు కన్గొని దుఃఖతత్త్వము
దివ్యమగు నిర్వాణమార్గము
తెలిపి యుండె గదా!
దుఃఖసంవృత మఖిలలోకము,
దుఃఖమూలము తృష్ణ, దానిని
ద్రుంచివేసిన దుఃఖజాలము
తొలగి పోవు గదా!
అనుసరించినయెడల ఆర్యా
ష్టాంగమార్గ, ముపాసకాళికి
భూరి నిర్వాణాప్తిః ఇదియే
బుద్ధశాసనము.
మందబుద్ధుల మగుటచేతను
మరచుచుండుదు మా తథాగతు
నమలబోధసుధాస్వరూపా
ష్టాంగమార్గంబున్.

... ... ...

ప్రకృతవేషం బింక మార్చెద,
పచ్చబట్టలు తె మ్ముపాలీ!
సత్వరంబుగ బిల్వ నంపుము
స్థవిర ముద్గల్యున్.
శరణు చొచ్చెద బుద్ధదేవుని
శరణు చొచ్చెద బౌద్ధధర్మము
శరణు చొచ్చెద బౌద్ధసంఘము
శాంతి నా కింకన్!

నమోతస్స భగవతో అరహతో సమ్మా సంబుద్ధస్స.

# కామినియా నూనె

వేనకువేల కుటుంబములయందు ఉపయోగించబడుచున్నది

## ఎందుకు?




కామినియా నూనె

వెంట్రుకలు ఊడిపోకుండా నాటంకపరచును

కామినియా నూనె

చుండును పోగొట్టును.

కామినియా నూనె

తలకు చల్లదనమును గలిగించును.

కామినియా నూనె

తలకు సంబంధించిన వ్యాధులన్నిటిని కుదుర్చును. ఉష్ణముగా నున్న పుర్రెకు చల్లదనమును గలిగించును.

కామినియా నూనె

యందు వెంట్రుకలు పెరుగుటకవసరమైన వస్తువులు, పెం డుకు కావలసిన అమూల్యవస్తువులు గలవు.

కామినియా నూనె మనోహరమైనట్టియు ఆహ్లాదకరమైన సువాసనగలది.

కామినియా నూనె శిరోజములకు ప్రాణము. ఇట్టి సుగుణము లుండుటవలననే వేలకొలది కుటుంబములందు కామినియా నూనె ఎక్కువగా వాడబడుచున్నది.

కామినియా నూనెను ఉపయోగించునట్టివారు గనుకనే దీనిని "శిరోజములకు ప్రాణ మని" దీనియందు గల లాభకారియైన సుగుణములను బట్టి తెలుపుచున్నారు.

బుడ్డి 1 కి ధర రు. 1. వి. పి. ఖర్చులు అ. 6. ప్రత్యేకము.

బుడ్లు 3 కి ధర రు. 2-10-0. వి. పి. ఖర్చులు 0-12-0. ప్రత్యేకము.

అత్తరులకు రాజైన

## ఓటో దిల్ బహార్ (రిజిస్టర్డు)



హిందూదేశమందంతటను యిది విరివిగా అమ్మబడుటనుబట్టియే దీనికి గల అసాధారణమైన శ్రేష్ఠత్వమును రుజువుచేయుచున్నది. కొన్ని బొట్లు చేతిరుమాలపైన చల్లిన సీమపుష్పములు, మల్లెపుష్పముల వాసనవలె మనోహరమైన దీర్ఘసువాసనను గలిగించుచున్నది.

½ ఔ. బుడ్డి 1 కి రు. 2. ¼ ఔ. రు. 1-4-0. 1 డ్రా. 0-12-0.

వి. పి. ఖర్చులు అణాలు 6 ప్రత్యేకము.

2 అణాలు తపాలబిళ్ళలు పంపిన శాంపిల్ బుడ్డి పంపబడును.

కామినియానూనె ఓటోదిల్ బహారు సుప్రసిద్ధమైన స్టోరులన్నిటియందును దొరకును.

## ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెనీ.

తపాలపెట్టె నెం. 2082. బొంబాయి నెం. 2.



౧. కావేరివఱదలు (౧౯౩౦)
ఛాయాచిత్రకారుడు: శ్రీ యం. యస్. కుప్పుస్వామి అయ్యరుగారు.



౨. తిరుతలయూరు దేవాలయము-పెద్దతటాకము, తిరుచినాపల్లి జిల్లా.

ఛాయాచిత్రకారుడు: యం. యస్. కుప్పుస్వామి అయ్యరుగారు.

# కాళిదాసుడు: ఋతుసంహారము

సేలము సుబ్బరావు గారు, M. A.

ఋతుసంహారము కాళిదాసు రచించినదని కొందఱీదేశమువారును, దేశాంతరములవారును మిగుల శ్రమపడి నిరూపించి యున్నారు. ఇట్టి కావ్యమునకు మఱియొకడు కర్త కాజాలడను తలంపుగొనియే విమర్శకు లిట్టి విమర్శములకు బూనిరని తోచుచున్నది. అందలి గుణదోషముల విచార మిటనప్రస్తుతము. కాని వారి యీ యూహ సంభావితమగుగాక, అసంభావితమగుగాక విమర్శమంతయు గాళిదాసుని కవితాగుణములను గుఱించియే వ్రాయబడియుండుట సంతసింపదగియున్నది. అయినను వినోదమునకుగా నేదో కొంత వ్రాయ బూనితిని. అందలి విచ్ఛిత్తిని పాఠకు లనుభవింతురుగాక!

శ్రీ వాల్మీకి రచిత రామాయణము, వ్యాసరచితమహాభారతము రెండును గొప్ప యితిహాసములగుట యందఱెఱిగిన విషయమే. వీనిలో పరస్పరభేదకధర్మములవలెనే సదృశధర్మములుగూడ ననంతములు. కేవలము సదృశాంశములగొని యీ రెంటికి నేకకర్తృకత్వము నెవడేని నిరూపింపజాలునా? హాప్కిన్సు అనునతడు మహాభారతముపై తాన్వ్రాసిన విమర్శయందు ఐతిహాసికగ్రంథములందు సంప్రదాయముగ నుపయోగించెడి వాగ్విశేషములు చాల కలవనియు, అవి యీ రెంటియందును సమానముగ నున్నవనియు నిరూపించుచు నీ యితిహాసములు రెంటికిని గల సామ్యమును స్పష్టపరచుచున్నాడు. అంత మాత్రమున మహాభారతమును రచించిన యతడే కాలాంతరమున పరిణతదశయందు రామాయణమునుగూడ రుచిరముగ రచించెనని చెప్పనగునా? ఈ రెంటి విషయమే కాదు. పెక్కు సంస్కృతప్రబంధములను విమర్శించుట పొసగినపుడును వానిని రచించినవారెవరో తెలియక ప్రసిద్ధుడగు నెవనియొక్కయో ఛాయ యందున్నదని యవి వారివని చెప్పుట సమంజసము కానేరదు. ఋతుసంహారము కాళిదాసకృతమని యేదో యొక ప్రసిద్ధి నంగీకరించి యందుల కుపపత్తులజూప యత్నించుచున్నారు. ఇంతకంటె కాళిదాసీయవచనాదుల నాధారముగగొని యెవడో యొక కుశలమతి కాళిదాసీయచ్ఛాయ ననుకరింప బూనియు తదీయప్రౌఢత ననుకరింపనేరక మార్దవమాత్ర మెట్లో అనుకరించి యీ గ్రంథమును రచించెననియు, రచించి దానిని కాళిదాసకృతమని ప్రకటించెననియు నేల యొప్పుకొనరాదు? ఏదో పామరప్రసిద్ధి ననుసరించి యందలి దోషముల కుపపత్తుల వెదకి కాళిదాసే దీనిని బాల్యావస్థయందు బుద్ధి యింకను పరిణతము కానప్పుడు రచించెనని శ్రమపడి చెప్పుటకు ఫలమేమి? వత్సభట్టియో, మఱియెవ డట్టివాడో ఋతుసంహారచ్ఛాయను

హరించెననియు, కావున నంతకుపూర్వమే కాళిదాసు ఋతుసంహారమును రచించెననియు గల్పించుట దుర్గ్రహము. ఇందువలన గాళిదాసకాల మూయా విమర్శకులు నిరూపించిన కాలముకంటె భిన్నమై సంశయాస్పదమగుచున్నది. ఈ కాళిదాసు 'నవవిక్రమస్య' అన్నగణమున జేరినవాడా? లేక భోజసభలో నుండెనని ప్రసిద్ధి గన్నవాడా? లేక ఆంధ్రదేశము మొదలగు దేశములందు తెనాలి రామలింగడు మొదలగు పేర్లతో వాసిగాంచిన కాళిదాసులలో నొకడా? అనునీశంకలకు సమాధానము దొరకినను భోజాదికృతములగు సరస్వతీకంఠాభరణాదులయందు ఏతద్గ్రంథ నిర్దేశముగాని, ఇందలి వాక్యములనం దుదాహరించి యుండుటగాని కలదని ప్రమాణము లభించువఱకు నీప్రయత్నమంతయు 'వ్యాసోచ్ఛిష్టం జగత్సర్వం' 'బాణోచ్ఛిష్టం జగత్సర్వం' అనువారి ప్రయత్నమువలె కాళిదాసమహిమోత్కర్షను తెలుపునది మాత్రమేయగును.

అట్టి ప్రమాణవిశేషమునుగూడ సంపాదింప బండితులు ప్రయత్నింతురనియే యీ కొంచెముకూడ వ్రాయవలసి వచ్చినదికాని వేరుకాదు.

---

# ఇష్టదైవము

తర్కాలంకార వాగీశభట్టాచార్య, కీ. శే. వట్టిపల్లి నరకంఠీరవ శాస్త్రిగారు

[తర్కాలంకార వాగీశభట్టాచార్య బిరుదాంచితులగు శ్రీ వట్టిపల్లి నరకంఠీరవశాస్త్రిగారు తిరుపతి సంస్కృత కళాశాలలో పెక్కేండ్ల క్రిందట న్యాయశాస్త్రాధ్యాపకులుగా నుండిరి. వీరు నిరుపమ సంస్కృత కవితాధురంధరులు. అభినవవాసవదత్తయను సంస్కృతకావ్యము వీరి యుత్తమ రచనములలో నొకటి. ఈ గ్రంథమున కాంధ్రానువాదమును బ్రకటితమయ్యెను. ఏతదనువాద విమర్శనావసరమున—శుక్ల సం. కార్తికమాస భారతి సంచిక 845, 846, 847 పత్రములలో—అభినవవాసవదత్త కవితాప్రాశస్త్యాదులను, శ్రీ పం. ఆదినారాయణ శాస్త్రిగారు చక్కగా నభివర్ణించినారు. ఇంకను శ్రీ నరకంఠీరవశాస్త్రిగారి సంస్కృతాంధ్రరచనములు అముద్రితములు పెక్కులు గలవు. వానిలో గొన్నిటిని శ్రీశాస్త్రిగారి కుమారులు, శ్రీ కాశీనాథశాస్త్రిగారు (తిరుపతినివాసులు) మా వేడికోలు నంగీకరించి భారతియందు ప్రచురణార్థ మొసగిరి. వీరికి కృతజ్ఞతాపూర్వక పరశ్శతాభివాదములు. తద్రచనము లిదిమొదలొకటి వెంట నొకటిగ భారతియందు ప్రకటితము లు కాగలవు.—సం. భారతి]

యత్పాదాంబుజచింతనం తనుమతాం సంతానశాఖాయతే,
యన్నామ స్మరణం నృణాం భవతరుచ్ఛేదే కుఠారాయతే,
యత్తత్త్వం జగదేకమూల మఖిలశ్రుత్యంతభూషాయతే,
సోఽయం శ్రీ రఘువంశమౌక్తికమణి ర్నిశ్శ్రేయసాయాఽస్తు నః.

---

క వి



చిత్రకారుడు: పి. వి. రామరావుగారు



తులసీ పూజ

పెన్సిలువ్రాత చిత్రమునుండి. చిత్రకారుడు: శ్రీ వేంకటశర్మ గారు



# బలహీనపుమనిషి యారోగ్యమును, బలమును పొందుటెట్లు?

ఈ ప్రశ్నకు జబాబు చాల ముఖ్యమై, బలహీనులకు ప్రతివారును యోచించవలసియున్నది. భోపాల్ సంస్థానములోని మిస్టర్ మహమ్మద్ ఆలీఖాన్, శానటోజిన్ తయారుచేయువారలకు స్వయముగ యీ క్రింది యుత్తరమును వ్రాసియున్నారు.

"నేను యజీర్ణమువలనను, నిద్ర లేకపోవుటవలనను చాల బాధ నొందుచుంటిని. కాని శానటోజిన్ నుపయోగించినతరువాత నిద్ర సుఖముగపట్టుచు, చాల కులాసాగా యున్నది. శానటోజిన్ వేలకొలది యౌషధములు కలసి చేయగలపనిని చేయుచున్నది" అని ఉత్తరములో చివరభాగమందు వ్రాసియున్నారు.

శానటోజిన్ యేవిధముగా మిస్టర్ మహమ్మద్ ఆలీఖాన్ కుబలమునిచ్చెనో యటులనే మీకుగూడ యారోగ్యమును నెలకొల్పి, బలహీనతను తొలగించగలదు.

# SANATOGEN

నేడే ఒకసీసా శానటోజిన్ను మీ సమీపమందుండు మందులషాపులోగాని లేక బజారులోగాని గొనుడు. (2)

# రాజమోహన హేరాయిలు



శ్రేష్ఠమయిన సువాసనగల తలనూనె. మెదడుకు చల్లదనమును గలిగించి వెంట్రుకలను అభివృద్ధి చేయుటలో అత్యుత్తమ మయినది.

తలపోటు, మాడుపోటు, శిరోవేదిమి, చుండు మొదలగువాటిని పోగొట్టి కన్నులకు చలవ నొసంగి వెంట్రుకలను మృదువుపరచి, నల్లగా పెంచుటలో అత్యుత్తమ మయినది.

స్త్రీలకు ఆనందమును కలుగజేయును.

సీసా 1-కి రు. 1-0-0 3 సీసాలు రు. 2-10-0

పోస్టేజి ప్రత్యేకము.

## పి. శి. ఎ. అండు కంపెని,

ఆయుర్వేదసమాజం,

పెరిదేపి, నెల్లూరుజిల్లా.

---

ఆయుర్వేదశాస్త్రి, అష్టావధాని,
కందుకూరి వేంకటసుబ్బారావు,
ఎం. డి. ఎ. గారి

## కామామృతము

ఈ యౌషధము ఇండియాయందంతటనేగాక సౌత్ ఆఫ్రికా, స్ట్రేయిట్స్ సెటిల్మెంట్సు, ఫెడరేటెడ్ మలయాస్టేట్సు, ఫిజి అయిలెండ్సు, లండన్ మొదలగు విదేశములలోఁగూడ ప్రఖ్యాతిఁ బొందుచున్నది. రాత్రిపూట ఒక్కమాత్ర పుచ్చుకొనిన ఎంత నిస్సారమైన శుక్లమైనను వెంటనే సంసారసౌఖ్యము నీయఁగలదు. 5 దినములలో మూత్రములోఁ గలిసిగాని, ముందువెనుకలఁగాని, నిద్రలోఁగాని, పోయెడివీర్యమును దృఢముగా నిలిపివేయును. మధ్యనపుంసకులు, నరములబలము తగ్గినవారు ఈమందునే పైకి పూతగాగూడ నుపయోగించిన మిక్కిలి శక్తివంతులుకాఁగలరు. యోగ్యతాపత్రము లనంతముగాఁ గలవు. మీయుత్తరములు రహస్యముగా నుంచబడును. 20 మాత్రలు సీసా 1-కి 2-0-0.

అమృతాశ్రమము, నెం. 2, ఏలూరు, పశ్చిమ గోదావరి.

## మీ జీవితపర్యంతము మీ శిరోజములను కాపాడుకొనుడు

శిరోజములు మిక్కిలి సున్నితమైనవి. వాటిని మీరు సరిగా పోషించిన అది చక్కగా పెరిగి, అందముగా నుండును. లేనిచో వాటిని అలక్ష్యముచేసినట్టి చిహ్నములు ప్రారంభమగును. మీ శిరోజములు యే విషయమునందైనను ఆశాభంగమును గలిగించిన వాటిని భయపరచునట్టి అపాయము లన్నిటినుండి రక్షింపుడు.



## సుసామ

ప్రాగ్దేశమునందు శిరోజముల నభివృద్ధిపరచునది

కొన్నియేండ్లనుండి వాటిని లక్ష్యముచేసియుండినను, లేక సరిగా వాటిని పోషించకయుండినను మీ శిరోజముల కిది తప్పక ఆరోగ్యము నొసగును. గడచిన 50 సంవత్సరములనుండి దేశమందంతటను వాడుకలో నున్నది.

ప్రతిచోటను అమ్మబడుచున్నది.

**P. SETT & Co.,**
**Perfumers, Calcutta.**

## లివరు వ్యాధికి అమోఘమైన చికిత్స

మాదిరి ఔషధములు బయలుదేరినవి. మోసపోకుడు.

వీరి ఔషధరాజము అనేకమంది ప్రజలచేతను, గొప్పగొప్ప డాక్టర్లచేతను, ఆమోదింపబడి వేలకువేలుయోగ్యతాపత్రములు పొందియున్నది. గొప్ప గొప్ప డాక్టర్లుకూడ వదలివేసిన

లివరు వ్యాధులను వీరు అతి జయప్రదముగా గ్యారంటీగా నివారణచేయుచున్నారు.

ఎచ్చటను యీ లివరువ్యాధికి తగిన ఔషధము లేకపోవుటచే వీరి ఔషధమునే అనేకమంది డాక్టర్లు ప్రతిదినము పోష్టుద్వారా తెప్పించుకొనుచు, వారి వారి రోగులకు వాడి వారి సంతృప్తుల దెలిపియున్నారు.

పరా:—మా ఔషధమును చూచి అనేక మాదిరిఔషధములు బయలుదేరినవి, గాన మోసపోకుండగలందులకై ప్రజలను హెచ్చరించుచున్నాము.

☞ అన్నిచోట్లను వీరి ఔషధరాజములనమ్ముటకు పలుకుబడిగల ఏజంట్లు గావలయును. వివరములకు;

విజయనగరవాస్తవ్యులగు;

### డాక్టర్ జమ్మి వెంకట రమణయ్యగారు,

లివరు అండ్ స్ప్లీనువ్యాధులకు ప్రత్యేకవైద్యులు.

8, సాలెవీధి, మైలాపూరు, మదరాసు.

# "గీర్వాణవాక్ప్రపంచచరిత" విమర్శము

[A Review on the 'Notes on the History of Sanskrit Literature']

ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు

[ఆంధ్రగీర్వాణసాహిత్యపరిషత్తు]

ఈగ్రంథము సాహిత్యశిరోమణి శ్రీయుత పిన్నంరాజు వేంకట సుబ్రహ్మణ్యశర్మగారిచేఁ 'బ్రకటింపఁ బడినది.' వాయునందన ముద్రణాలయము, కావలి; జూన్ 1928. వెల. రూ. 1-4-0. శర్మగారు నెల్లూరుజిల్లాలోని ఆత్మకూరునందు, బోర్డు మధ్యమపాఠశాలలో నాంధ్రపండితులు. [2+135+129+xi పుటలు]. ఈగ్రంథము 'వైదిక కాలికము', 'లౌకిక కాలికము' అని రెండుభాగములుగా విభజింపఁబడినది.

సంస్కృతభాష సార్వలౌకికభాషా సామ్రాజ్యమున కధీశ్వరత్వము వహించుచున్నదని చెప్పఁదగును. గ్రీక్, ల్యాటిన్ మొదలగు నుత్కృష్టపాశ్చాత్యభాషలకంటె గీర్వాణభాష విశిష్టమని పాశ్చాత్య విద్వాంసులును నుడువుచున్నారు.

"The Sanskrit language, whatever be its antiquity, is of a wonderful structure, more perfect than Greek, more copious than Latin, and more exquisitely refined than either". [Sir William Jones].

అని పాశ్చాత్య సంస్కృత పండితుఁడు, సర్ విలియమ్ జోన్సు నుడివియున్నాఁడు. సార్వలౌకిక సారస్వతములలోఁగూడ గీర్వాణ సారస్వతము సర్వోత్కృష్టమని పాశ్చాత్యపండితులు నంగీకరించియున్నారు. అట్టి సారస్వతముయొక్క చరిత్రమును వ్రాయఁబూనుట సముద్రమున కేలమెత్తుటవంటిది. గీర్వాణసారస్వతము యొక్క వైపుల్యమును గాని, గాంభీర్యమును గాని యరయఁబూనుట సాహసకార్యమే యనఁదగును. గీర్వాణసారస్వత సాగరమునుండి యమృతముం బడయుటకు సుమారు రెండుశతాబ్దములనుండి నాగరకదేశీయులు తద్వాఙ్మయవారిధిని మథించుచుండిరి. ఈవాఙ్మయ విషయకములగు గ్రంథములు శతశ్శతముగఁ బ్రాచ్యపాశ్చాత్య సంస్కృత పండితు లాయాభాషలలో రచించియుండిరి. పాశ్చాత్యపండితు లీవాఙ్మయమునకుఁ జేసిన యఖండసేవ వర్ణనాతీతము. గీర్వాణసారస్వతకల్పకమున నేశాఖను గుఱించియైనను గవేషణాత్మములగు గ్రంథములు పాశ్చాత్యభాషలలో రచింపఁబడియున్నవి. గీర్వాణవాఙ్మయచరిత్రము రచింపవలెనన్నచో నట్టిపనికి సాహిత్యపరిషత్తులే పూనుకొనవలెను; లేక కఠోరపరిశ్రమచేసి గీర్వాణసారస్వతసాగరమును మథించినవైన విద్వత్సార్వభౌములైనఁ బూనుకొనవలెను.

కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమువారు ప్రచురించుచున్న భారత వర్ష చరిత్రము ('Cambridge History of India') వలె, గీర్వాణసారస్వత చరిత్రము నాయాభాగములఁ గూలంకష వ్యవసాయము నొనర్చి 'అద్వితీయోఽస్మి' అనుటకు సమర్థులగు ప్రాచ్యవిద్యాప్రౌఢసరస్వతులచే రచింపించనగు. ఆంగ్లసారస్వతమువంటి నవీన పాశ్చాత్య సారస్వతచరిత్ర రచనమునకు విశేష సాధకములు గలవు. గీర్వాణసారస్వతమున కన్ననో యడుగడుగునకు బాధక బాహుళ్యమే. సార్వలౌకికకవులలో నగ్రగణ్యులలో నొకఁడగు కాళిదాసుని కాలము గాని, చరిత్రము గాని, నేఁటికిని నిర్వివాదముగఁ బరిష్కృతి నందలేదనఁ దక్కు విషయములమాట చెప్ప నేల! పాశ్చాత్య గీర్వాణపండితులలో నొక్కొక్క రొక్కొక్కశాఖలోఁ గూలంకషవ్యాసంగము చేసియుండుటచే నాయాశాఖలలో వారువారు ప్రామాణ్యము నందియున్నారు. జర్మన్,

ఫ్రెంచ్, ఇంగ్లీషు, హిందీ మొదలగు భాషలలో గీర్వాణసారస్వత చరిత్రాత్మకములగు గ్రంథరాజములు బహుళములుగా నిర్మింపఁబడియున్నవి. అందు నాంగ్లమున 18 ను, జర్మన్ భాషలో 5 ను, ఫ్రెంచ్ భాషలో 2 ను, సంస్కృతములో 6 ను, హిందీలో 2 ను, గ్రంథములు గలవు. తెనుఁగులో 1911 వ సంవత్సరమున శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు 'సంస్కృత కవిజీవితము'ను వ్రాసియున్నారు; కాని మొన్నటివఱకు గీర్వాణ వాఙ్మయ చరిత్రము తెలుఁగున రచింపఁబడియుండలేదు.

అందుచేఁ బాశ్చాత్యభాషలు గాని, హిందీ భాష గాని తెలియని పండితులకు గీర్వాణ సారస్వత చరిత్రము నెఱుఁగుట దుస్తరముగా నుండెడిది. 'ఆర్య విద్యా సుధాకరము' (యజ్ఞేశ్వరచిమనభట్టకృతము) వైదిక సారస్వత విషయకమైనను వైదిక సారస్వత చరిత్ర మనుటకుఁ దగదేమో! ఈనడుమ, పి. పి. సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, M. A., కే. యల్. వ్యాసరాయ శాస్త్రిగారును గలసి, 'వైదిక సాహిత్య చరిత'మను పేరితోఁ గీర్తిశేషులగు నాచార్య 'మెక్డానెల్' పండితుని గీర్వాణ సారస్వత చరిత్రమునందలి మొదటి తొమ్మిది ప్రకరణములను సంస్కృతీకరించి పాశ్చాత్య భాషా వాసన గాని, హిందీభాషా పరిచయము గాని లేని గీర్వాణసారస్వత చరిత్ర జిజ్ఞాసువులకు మహోపకృతి నొనరించియున్నారు. కాని 'మెక్డానెల్' పండితుని కృతిలోని తక్కిన యధ్యాయములలో వివరింపఁబడిన సంస్కృత సారస్వత చరిత్రమును సంస్కృతములోని కెవ్వరు ననువదించి యుండలేదు.

గీర్వాణ సారస్వతము వైదికము, సంస్కృతము నని రెండుశాఖలుగ విభజింపఁబడియున్నది. కాని కొందఱు గీర్వాణసారస్వతమును సంస్కృత సారస్వతమని, దానిని వైదికము (Vedic Sanskrit Literature), లౌకికము (Classical Sanskrit Literature) అను రెండుభాగములుగ విభజించియున్నారు. వైదికసారస్వతము సంస్కృత సారస్వతముకంటెఁ బ్రాచీనము, విలక్షణము నగుటం జేసి యిట్టివర్గీకరణము, నామకరణము నసమంజసములుగానే తోఁచుచున్నది. శర్మగారి గ్రంథనామ ముచితముగానే యున్నది. కాని 'లిటరేచర్' (Literature) అను పదమునకు సమానార్థకములుగా ననుసృతముగాఁ బ్రయోగింపఁబడుచున్న 'సారస్వత, సాహిత్య, వాఙ్మయ' శబ్దములను విడిచి, వీరు వాక్ప్రపంచపదమును బ్రయోగించినారు.

ఈగ్రంథమున సారస్వత చరిత్ర లక్షణములు మృగ్యములు. వీరనుకొనినట్లీగ్రంథము 'గీర్వాణ భాషా చరితము' ('వైదిక లౌకిక గ్రంథ విచారము'?) గాదు. దీనిని గీర్వాణ కవి చరిత మనుటయు పొసగదు. ఇందు 'వైదిక లౌకిక భాగములు సాధ్యమైనంతవఱకుఁ బూర్ణముగానే యున్న'వని వీరనుకొనిరి. ఇది యు సత్యము కాదు.

ఈ గ్రంథము పూర్వభాగమునకు కీ. శే. 'మెక్డానెల్' పండిత నిర్మితమగు 'సంస్కృతవాఙ్మయ చరితము' (Dr. Macdonell's 'History of Sanskrit Literature') లోని మొదటి 9 ప్రకరణముల మీఁద, నుత్తరభాగమునకు, యమ్. కృష్ణమాచార్యుల వారి 'సంస్కృత సారస్వతేతిహాసము' (Classical Sanskrit Literature' by M. Krishnamacharya, M. A., B. L.) మీఁద నాధారపడి యున్నదని చెప్పనగు. శర్మగారీవిషయమును దెలుపలేదు. ఆచార్యులుగారి పుస్తకము 1906 లోఁ బ్రకటింపఁబడినది. దీనిని వారు మఱల విపులీకరించి, దోషముల సవరించి యిపుడు ముద్రింపించుచున్నారు.

ప్రకృతము ద్వితీయభాగమును లౌకిక సారస్వత చరిత్రమునే విమర్శించెదను. ప్రథమాధ్యాయమున 35 మహాకావ్యములు విచారింపఁబడినవి; కాని బుద్ధఘోషుని 'పద్యచూడామణి', యగస్త్యుని (విద్యానాథుని?) 'బాలభారతము,' సన్ధ్యాకరనన్ది 'రామపాల చరితము,' ధనంజయుని 'ద్విసంధానము,' గంగాదేవి 'మధురావిజయము' మొదలగు ననేకములు నామమాత్రముచేనైన సూచింపఁబడవయ్యె. [1-30 పుటలు].

ద్వితీయాధ్యాయమున 52 ఖండ కావ్యములం గూర్చి వ్రాయఁబడెను. కృష్ణమాచార్యులవారి పుస్తక

మున వివరింపఁబడిన కావ్యములు కొన్ని యిందు విడువఁబడినవి; అందు లేనివానిం గొన్ని శర్మగారు చేర్చి యున్నారు [31-50 పు.].

తృతీయాధ్యాయమున 6 గద్య కావ్యములం గూర్చి వ్రాయఁబడెను. [51-58 పు.].

తురీయాధ్యాయమున 12 చంపువులం గూర్చి వ్రాయఁబడియెను. [59-62 పు.].

పంచమాధ్యాయము కలగూరగంప. ఇందు దృశ్య కావ్యములం గూర్చియుఁ [63-105 పు.], కథలం గూర్చియు [105-111 పు.], నలంకారశాస్త్రముం గూర్చియు [111-122 పు.] వ్రాయఁబడెను.

ఈయధ్యాయమున మొదటిభాగమున 37 నాటక నిర్మాతలంగూర్చి వ్రాయఁబడెను. ‘రూపకషట్కము’ ‘చతుర్భాణి’, ‘కుందమాల’, ‘ఆశ్చర్యచూడామణి’ ‘శారీపుత్రప్రకరణము’ మొదలగు ననేకములు స్మరింపఁబడలేదు.

పిమ్మటఁ గథా గ్రంథసప్తకముంగూర్చి వ్రాయఁబడెను. తరువాత 24 గు రాలంకారికులం గూర్చి వ్రాయఁబడెను. శారదాతనయుని ‘భావప్రకాశము’ స్మరింపఁబడలేదు.

షష్ఠాధ్యాయమున వ్యాకరణమును [123—’27 పు.] గుఱించియు, నిఘంటువుల గుఱించియు నించుక వ్రాయఁబడినది [127—’29 పు.].

తరువాత ‘మదరాసు విశ్వవిద్యాలయ విద్వాన్, శిరోమణి పరీక్షలకుం దోసంగిన భాషాచరిత (?) ప్రశ్నములు’ ముద్రింపఁబడినవి [i—xii పు.]. ఈ ప్రశ్నములు సంవత్సరక్రమమున సంకలనము చేసి యుండినను, లేక విషయానుగుణ్యముగ సంకలనము చేసినను విద్యార్థులకు విశేషోపకారకముగా నుండెడివి.

వీరు చరిత్రాత్మక కావ్యములంగూర్చి వ్రాయలేదు. కల్హణుని రాజ‘తరంగిణి’, హేమచన్ద్రుని ‘కుమారపాలచరితము’, సోమేశ్వరదేవుని ‘కీర్తికౌముది’ మొదలగు వానింగూర్చి ప్రత్యేకముగ నొకయధ్యాయమున వ్రాయవలసియున్నది.

సుభాషితగ్రంథములఁ బ్రత్యేకాధ్యాయమున వివరింపవలెను. సారస్వతవిషయములందలి క్లిష్టగ్రంథముల విడఁగొట్టుట కిట్టి గ్రంథము లత్యంతము నవసరము.

వ్యాకరణము, నిఘంటువులంగూర్చి విపులముగా వ్రాయవలసినది.

ఈగ్రంథమునందలి యసంగతములలోఁ గొన్నిటి నీక్రిందఁ బేర్కొనియెద.

౧. ‘ప్రసన్నరాఘవ’ రచయితయగు జయదేవుఁడు ‘షోడశశతాబ్దిలోని అప్పయదీక్షిత సమకాలికుఁ’ డఁట [౧౦౮ పు]. ఏమీ సాహసము! కృష్ణమాచార్యులుగారి వాక్యములే వీరికి పరమోపాదేయములు గావలయు. వా రిట్లు వ్రాసియున్నారు:

“From an allegorical reference in the introduction to his drama, he (Jayadeva of ‘Prasannaraghava’ fame) is known to be a contemporary of Appayadikshita of the 16th century”. (Page108.)

పై యిరువుర వాక్యములు సత్యేతరములు [I అ. 37 శ్లో.]. ‘ప్రసన్నరాఘవము’ నందలి

“కదలీ కదలీ కరభః కరభః” అను శ్లోకము విశ్వనాథకవి ‘సాహిత్యదర్పణము’లో [IV పరి. 3 శ్లో. నకు లక్ష్యము] నుదాహరించుకొని యున్నాఁడు. అందుచే నీజయదేవుఁడు విశ్వనాథకవి కంటెఁ బ్రాచీనుఁడే కాని యర్వాచీనుఁడు గాఁజాలఁడు. మనము వ్రాయు విషయమునకు సంబంధించిన గ్రంథములు మనము స్వయముగాఁ బరిశీలించవలెఁ గాని యితరులు వానిం గూర్చి వ్రాసిన వ్రాఁతలనే పరమోపాదేయములుగా శిరసావహింపఁ జనదు.

౨ ‘రఘువంశ’ాంతమున నగ్నిమిత్రుఁడను రాజు వర్ణింపఁబడినట్టులు వీరు వ్రాసియున్నారు [7 వ పుట లో 2 సారులు; 11 పు.]. ఇందు వర్ణింపఁబడినవాఁడు అగ్నివర్ణుఁడుగాని యగ్నిమిత్రుఁడు గాఁడు.

బెరిడేల్ కీత్ పండితుఁడు "అగ్నివర్మ" యని వ్రాసియున్నాఁడు (History of Sanskrit Literature, P. 97). ఇదియుఁ జింత్యము.

3. కిరాతార్జునీయము 'పదునేఁడు సర్గములు గలదఁట' తప్పు. [18 పు.]. ఇది పదునెనిమిది సర్గములు. లని యుండవలె.

4. కుమారదాసుని 'జానకీహరణము పదునైదు సర్గములుగలదఁట. ఇదివఱకు నిందు 14 సర్గములు పూర్తిగను, 15వ సర్గములోఁ గొంతయు ముద్రింపఁబడినవి. కాని కొన్ని సంవత్సరముల క్రిందట నీకావ్యమునందలి 20 సర్గములు పూర్తిగా మద్రాసు ప్రాచ్యలిఖితగ్రంథాలయమువారిచే సంపాదింపఁబడినవి.

5. గోవిందముఖి 'హరివంశసార చరితమున 23 సర్గములు గలవు. ఇట్టులే కృష్ణమాచార్యులుగారు వ్రాసిరి. కాని వీరు 'ఈకావ్యము పంచవింశతిసర్గాత్మక' మనిరి. [25 పు.]

6. 'భారవిని గుఱించి వ్రాయుచు 'శబ్దగాంభీర్యమునందు శిశుపాలవధకు సమముగా నున్న'దని సెలవిచ్చియున్నారు ['4 పు]. ఇందుఁ గర్త లోపించినది. పైవాక్యముయొక్క యర్థగాంభీర్యము నిట్టి పండితులు గుర్తింపఁజాలక దిగ్భ్రమ నొందిరి. 'భారవే రర్థగౌరవ'మ్మని సూక్తి!

7. 'కవిరాజని రాఘవపాండవీయ ప్రణేతకు బిరుదమఁట [18 పు.]. ఇది కవినామమే కాని బిరుదము కాదు. తాను 'కవిం జ సూరి'నని కవియే కృతిలో వ్రాసికొని యున్నాఁడు. 'సూరి' యని బిరుదములకుఁ గాక నామములకే చేర్పఁబడును.

8. వేదాంత దేశికుల 'యాదవాభ్యుదయము' నకు 'రఘువంశము' మాతృకయఁట [24 పు]. ఆదర్శమని కాఁబోలు వీరి యభిప్రాయము.

9. భట్ట శివస్వామి: 'కప్ఫణాభ్యుదయము.' [16 పు.].

"సుభాషితావళియందు వల్లభదేవ కృతములని, యుద్ధృతములగు శ్లోకము లీకవికృతములే. అందున వల్లభదేవుఁడను నామ మితనికిఁ గలదని తెలియుచున్నది" అని వ్రాసిరి. ఇది తప్పు.

వల్లభదేవుని 'సుభాషితావళి' లో భట్టశివస్వామి కృతములని కొన్ని శ్లోకము లుల్లేఖింపఁబడియున్నవి. ఆ శివస్వామి 'కప్ఫణాభ్యుదయ' కారుఁడే యనఁదగు. కృష్ణమాచార్యులవారి వాక్యము నుదాహరించెద:

"The author calls himself Bhatta Sivaswamin and is identical with the poet quoted in the *Subhashitavali* of Vallabha deva."

'ఈమహాకావ్యము శిశుపాలవధకు నించుమించుగ నున్న"దఁట. ఏవిషయమునఁ? పరిమాణమునఁనా? ప్రాశస్త్యమునఁనా? కృష్ణమాచార్యులుగారి వాక్యము: "It is a mahakavya and closely resembles Magha's work in diction and style".

10. రత్నాకరుని 'హరవిజయము' [16 పు.]:—

"రత్నాకరుఁడే రాజతరంగిణీ గ్రంథకర్తయగు కల్హణుని కాశ్మీరరాజుగా నున్న యవన్తివర్మగాఁ జెప్పుచున్నాఁడు. కవిమాత్రము తాను జయాపీడుఁడని చెప్పుకొనుచున్నాఁడు. అవన్తివర్మగానే యున్న యెడల, క్రీ. శ. 855-884 నడుమకే యుండియుండవలెను. జయాపీడుఁడైనచో 779-813 నడుమ నుండవలెను." అని గ్రంథకర్త.

కృష్ణమాచార్యులుగారు "The author was a Kashmirian poet and according to Kalhana [Raj. V-34] became famous under Avantivarman [855—884 A. D.] but his own statement that he was a servant of Brhaspati, i. e., Jayapida [779—813], would place him earlier". అని వ్రాసిరి.

'కాశ్మీరదేశీయుఁడగు నీకవి యవన్తివర్మ [855-884] యాస్థానమునుండి కీర్తివడసెనని కల్హణుఁడు 'రాజతరంగిణి' లో వ్రాసియున్నాఁడు; కాని కవియే తాను జయాపీడుని [బాలబృహస్పతియొక్క—779-813] యనుజీవినని చెప్పుకొనియున్నాఁడు. అందుచే, క్రీ. శ.

855 కంటె నీకవి పూర్వుఁడనియే చెప్పనగును. అని కదా యుండవలెను.

౧౧. క్షేమేంద్రుని ‘కలావిలాసము’: [28 పు.] 19వ పుటలో నీతని ‘దశావతార చరితమును’ గూర్చి వ్రాయునప్పుడే యీవిషయములు వ్రాయవలసినది; స్థలాంతరమున వ్రాయుట యసందర్భము కాదా? ఇట ‘సువృత్త తిలకము’ను జూచినట్టులు వీరు వ్రాసియున్నారు. అట్టులయ్యు 118వ పుటలో క్షేమేంద్రుని వృత్త లక్షణ గ్రంథమని దీనిం బేర్కొనక ‘కవికంఠాభరణమును’ బేర్కొనిరి. వీ రా యాకృతులం జూడక యెవ్వరి మాటలనో గ్రంథస్థము చేసినట్టులే తోఁచెడిని.

పిమ్మట క్షేమేన్ద్రుని యుపలబ్ధ గ్రంథము లనుచుఁ దన్నిర్మిత కృతులం జాలవఱకుఁ బేర్కొనిరి: అవి, ‘అమృత తరంగము; కనకజానకి; చిత్రభారత నాటకము; నీతకల్పతరువు; పద్యకాదంబరి; పవనపంచాశికా; ముక్తావళి; రాజావళి; లావణ్యవతి; వాత్స్యాయన సూత్రసారము; వ్యాసాష్టకము; శశివంశ మహాకావ్యము’— క్షేమేంద్రుని కృతులలోని విలుప్తములని విద్వల్లోక నిర్ణయము. ఇవి యెక్కడ నున్నవో తెలి వీరు తెలుపుదురుగాక!

‘లోకప్రకాశము’, ‘హస్తిజనప్రకాశము’ల, రచించిన క్షేమేంద్రుఁడు యదుశర్మసూనుఁడని, ప్రకాశేంద్రసూనుఁడగు మన క్షేమేంద్రునికంటె భిన్నుఁడని ఈ విషయమును వీరు తెలిపినారు కారు.

౧౨. క్షేమేన్ద్రుని ‘చారుచర్యా’(?) (2 అ. 37 పు.). దీనింగూర్చి యిట నొక వాక్యము వ్రాయఁబడినది. ఈ యధ్యాయముననే యీ కవియొక్క ‘సేవ్యసేవకోపదేశమును’ గూర్చియు వ్రాయఁబడెను [46 పు.]. ఇట్టు లొక కవికృతములగు లఘుకావ్యములంగూర్చియే యథేష్టముగా నక్కడక్కడ వ్రాయుటలో సారస్యము గ్రహింపఁ జాలకుంటిమి. [39 పు.]

౧౩. హంస సందేశము: వేంకటనాథకృత మనుట దక్క సుప్రసిద్ధమగు నీ సందేశకావ్యముంగూర్చి రెండు వాక్యములైన వ్రాయకపోవుట శోచనీయము. అంతగాఁ ప్రసిద్ధములుగాని మాధవకవి ‘ఉద్ధవదూతము’, విక్రమకవి ‘నేమిదూతము’, వ్రజనాథుని ‘మనోదూతికావ్యము’ మొదలగు వానింగూర్చి కొంతవఱకైన వ్రాయఁబడెను.

౧౪. విశ్వనాథకవిరాజు ‘రాఘవవిలాసము’ [39 పు.]: ఇది లుప్తము. దీనినుండి యొక్క శ్లోకమే ‘సాహిత్య దర్పణము’న నుద్ధృతము. ఈశీర్షిక క్రింద నేవో కొన్ని సంగతుల వాక్యమట్కమున వీరు సెలవిచ్చియున్నారు. అప్రసిద్ధము, లుప్తము నగు కావ్యముంగూర్చి యధికముగ నేల?

౧౫. భామినీ విలాసము [41 పు.]: పండితరాజకృతికావ్యములలోఁ బ్రచుర ప్రచారమును బడసిన దీనింగూర్చి యేమియుఁ వ్రాయలేదు. తక్కిన పండితరాజకృతుల నిక్కడఁ బేర్కొనక యీ యధ్యాయాంతమునఁ [48–49 పు.] బేర్కొనిరి.

భామినీ విలాసమునఁ “గామరూపాధిపతి (Assam—?—) యగు ప్రాణ నారాయణునిదైశ్వర్యాదులు వర్ణింపఁబడియున్న” వనిరి. ప్రాణ నారాయణుని వర్ణనము ‘ప్రాణాభరణము’నఁగదా యున్నది.

౧౬. మనోదూతికావ్యము [42 పు.]: ‘కవి స్వకపోల కల్పితములగు ననేకవిషయములను వర్ణించి యున్నాఁడు’? స్వకపోలకల్పితమున నర్థ మేమో తెలుప నంతర్వాణు లభ్యర్థితులు.

౧౭. సూర్యశతకము [49 పు.]: మయూరకవికి “దృష్టి లేక యుండి సూర్యాభిముఖుఁడై యీశతకమును రచించిన వెనుక దృష్టి వచ్చినదని వాడుక” యఁట. ఇది యశ్రుత దృష్టపూర్వము. మయూరుఁడంధుఁడు గాఁడు. ఆతనికి మహారోగము సంప్రాప్తము కాఁగా నాతఁడు సూర్యభగవానుని ‘సూర్యశతకము’చేఁ బ్రసన్నుం జేసికొని నీరోగుఁ డయ్యెనని యనవృత జనశ్రుతి గలదు.

(అ) “ఆదిత్యాదేర్మయూరాదీనామివానర్థనివారణమ్”.—మమ్మటుని ‘కావ్యప్రకాశము,’ I.

(ఆ) “ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్.”

(ఇ) మయూరుని బాహ్యరోగము సూర్యుని కరుణావలనను, నాంతర రోగము హరుని దయచేతను బోయినవఁట.

"భానుని చేఁబోని లోఁగికుష్ఠ ముడంచి
పూని మయూరుని మే నిచ్చెఁ గాదె".
—'బసవపురాణము', 55 పు. ప్రాఁతప్రతి.

(ఈ) "శతకంబుఁ జెప్పి భాస్కరుని మెచ్చఁగఁ
జేసి యారుదేహుఁడై నమయూరుఁ గొలుతు."
—పెదపాటి ఎఱ్ఱాప్రగడ: 'కుమార నైషధము'.

౧౮. "ఔచిత్య విచారచర్చ" లో బాణుని 'పద్యకాదంబరి'లోని శ్లోకము లుదాహరింపఁబడినవఁట [50 పు.]. బాణుని 'పద్యకాదంబరి' లోని యొక్క శ్లోకము మాత్రమే 'ఔచిత్యవిచారచర్చ'లో నుదాహరింపఁబడెను [చూ. 'భారతి' VII సం. 8 వ సంచిక, ఆగష్టు 1930: 'విస్మృత సంస్కృత కావ్యావళి: భట్ట బాణుని పద్యకాదంబరి' యీ. వేం. వీరరాఘవాచార్యుఁడు].

౧౯. కన్నడకవియగు నమోఘవర్షుని గ్రంథము 'కవిరాజమార్గము' గాని 'కవిరాజ విజయము' గాదు: [శర్మగారి పుస్తకము, 50 పు.]. [చూ. "నృపతుంగుఁడు. 'కవిరాజమార్గ' కర్తృత్వము" అను వ్యాసము, కె. బి. పాఠకరచితము. 'J. B. B. R. A. S.' Vol. XXII.]

౨౦. 'ప్రతిమానాటకమందు అయోధ్యాదికాండ పంచకకథ గలదు' [70 పు.].

ఇది సరి కాదు. ఇందయోధ్యారణ్య కాండముల కథమాత్రము స్వీకరింపఁబడెను.

౨౧. 'శ్రీహర్షాదేర్ధావుకాదీనా మివ ధనమ్?
[82 పు.]

శర్మగారు 'ధావుకుఁ' డని నాలుగుసారులు ప్రయోగించిరి. 'ధావకుఁడు' గాని 'ధావుకుఁడు' గాదు.

౨౨. 'వాక్పతిరాజకృతమగు ప్రాకృతగ్రంథ మొకటి గలదు? [84 పు.].

అది సుప్రసిద్ధ ప్రాకృతకావ్యములలో నొకటి యగు వాక్పతిరాజకృత 'గౌడవధము' ఈగ్రంథమును శర్మగారెఱిఁగినట్లు లేదు.

౨౩. రాజశేఖరుని 'కర్పూర మంజరి' [90 పు.].

ఇది ప్రాకృతములో వ్రాయఁబడినది. ఇట్టి రూపకములు సట్టకము లనఁబడును. ఈవిషయములు వీరికిఁ దెలియకపోవుట విచార్యము. రాజశేఖరుని భార్య అవన్తిసున్దరి. ఈమె విదుషీమణి; సాహిత్యాలంకారములందు దీమెకు రాజశేఖరుని ప్రజ్ఞతోఁ దుల్యమగు ప్రజ్ఞ కలదు. ఈమె కవయిత్రి. ప్రాకృతమన్న నీమెకుఁ బ్రాణము. ఈమె ప్రాకృతమున రచించిన శ్లోకముల హేమచంద్రుఁడు తన 'దేశీ నామమాల'లో నుట్టంకించుకొని యున్నాఁడు. రాజశేఖరునకుఁ బ్రాకృత కవనమునందు విశేషాదరము గలదు. ఈతఁడు తన సతీతోషణమునకే యీసట్టకమును నిర్మించెను. అలంకార శాస్త్రమున నీమె యభిప్రాయములను రాజశేఖరుఁడు పలుమాఱులు 'కావ్య మీమాంస' యం దుల్లేఖించుకొని యున్నాఁడు.

౨౪. మురారి: 'అనర్ఘ రాఘవము' [91 పు.].

'ఇతని శ్లోకముల రత్నాకరుఁ డుదహరించి యున్నాఁడఁట. రత్నాకరుఁడు 'హరవిజయము', 'వక్రోక్తిపంచాశిక' యను గ్రంథముల రచించెను. ఇందాతఁ డేగ్రంథమున మురారి శ్లోకముల నుదాహరించుకొనెనో? ఒకవేళ 'హరవిజయము' అలంకార గ్రంథమనుకొనిరా?

"శ్లో. అఙ్కేఽకునాటక ఇవోత్తమనాయకస్య
నాశం కవి ర్వ్యధిత యస్స మురారిరిత్థం,
ఆక్రాన్తకృత్స్నభువనః క్వ గత స్స దైత్య
నాథో హిరణ్యకశిపు స్సహ జన్మభి ర్వః"
—'హరవిజయము', xxxviii సం. 67 శ్లో.

పైశ్లోకమునందలి అధోరేఖాంకిత పదముల ప్రకృతార్థపరముగా మురారికవిం దెల్పుటంజేసి రత్నాకరునికంటె మురారి ప్రాక్తనుఁడని కొందఱు, అట్టులు

గాదని కొందఱు విద్వాంసులు వివదించుకొని యున్నారు. ఈవిషయమే కాఁబోలును వీరు వ్రాయఁదలఁచినది.

౨౫. క్షేమేశ్వరుఁడు. [93 పు.]:

క్షేమీశ్వరుఁడు గాని క్షేమేశ్వరుఁడుగాఁడు. కృష్ణమాచార్యులవారు 'Kshemisvara' [99P.] అని సరిగానే వ్రాసియున్నారు.

౨౬. కృష్ణ మిశ్రుని 'ప్రబోధ చంద్రోదయము.' [94 పు.]:

ఈనాటక మంతరర్థ కథాన్వితము. ఇట్టి కావ్యముల నాంగ్లమున 'Allegorical pœms or dramas' అందురు.

ఇట్టి కావ్యములు రూపకాతిశయోక్తిమూలక ములని యాలంకారికు లందురు. అందుఁ బ్రథమము

i. కీర్తి, ధృతి, బుద్ధి మొదలగునవి పాత్రములు గాఁగల యశ్వఘోషుని నాటకము.

ii. జైనసిద్ధర్షి కృతము, గద్యపద్యాత్మకము నగు 'ఉపమితిభవప్రపంచకథ'. ఇది జైనమతప్రతిపాదకము. [క్రీ. శ. 906].

iii. కృష్ణమిశ్రుని 'ప్రబోధచంద్రోదయము' అద్వైతవేదాన్తప్రతిపాదకము. [క్రీ. శ. 11 వ శతాబ్ది].

iv. యశఃపాలుని 'మోహరాజ పరాజయము' జైనమత ప్రతిపాదకము. [12 వ శతాబ్ది].

v. వేదాన్తదేశికుఁ: 'సంకల్ప సూర్యోదయము' విశిష్టాద్వైతమత ప్రతిపాదకము. [13, 14 శతాబ్దులు].

vi. కవికర్ణపూరుఁడు: 'చైతన్య చంద్రోదయము' చైతన్య మతబోధకము. [16 వ శతాబ్ది].

vii ఆనన్దరాయమఖి: 'జీవానన్దనము'.

viii. ,, 'విద్యాపరిణయము'.

పై రెండును శైవమతబోధకములు [17, 18 శ.]

ix. గోకులనాథుఁడు: 'అమృతోదయము'.

x. నృసింహకవి: 'అనుమితిపరిణయము'.

xi. జాతవేదుఁడు: 'పురుషార్థ చంద్రోదయము'.

xii. రామానుజకవి: 'వివేక విజయము'.

xiii కాశీప్రసాదుఁడు: 'భక్తిదూతి' (లఘుకావ్యము).

xiv వరదాచార్యకవి: 'వేదాన్త విలాసము' ('యతిరాజవిజయము').

పైవానిలో సిద్ధర్షి, కాశీప్రసాదుల కృతులు దక్క, మిగిలినవన్నియు నాటకములే. ఇందు iii, v, vi, vii, viii ఈ సంఖ్యలు గల వానిని మాత్రమే శర్మగారు పేర్కొని యుండిరి

౨౭. 'ఇది గాక తన కాదంబరీకథను పద్యరూపముగా బాణుఁడు వ్రాసినాఁడని ఔచిత్యవిచార చర్చాది గ్రంథములవలనఁ దెలియుచున్నది'. [98 పు.].

ఇప్పటి కొక యౌచిత్యవిచార చర్చవలననే బాణుని పద్యకాదంబరిం గూర్చి తెలియుచున్నది. వీరు ఆదిగ్రంథము లన నేవియో ?

౨౮. విశ్వేశ్వరుఁడు [105 పు.].

"శుద్ధ ప్రాకృతములో శృంగారమంజరి యను నాటకమును వ్రాసెను. రాజశేఖరుని కర్పూరమంజరి చ్ఛాయ నియ్యది యనుసరించినట్లు తెలియుచున్న"దఁట. శుద్ధప్రాకృతరూపకములు సట్టకము లనఁబడునని తెలుపవలదా ?

౨౯. 'అవధానకథలు' [106 పు.]:

'అవదానకథలు' గాని అవధానకథలు గావు. 'శతావధానము, అష్టావధానము' అన్నట్టులు వీరు 'అవధానకథ'లనుకొనిరి కాఁబోలు. ఇది యచ్చుతప్పు కాఁజాలదు. 28 వ పుటలోఁ గూడ 'బోధిసత్త్వావధాన కల్పలతా' అని కలదు.

30. 'భేతాళ పంచవింశతి' [108 పు.]

'బేతాళ' గాని 'భేతాళ' కాదు. వీరు 3 సారులు 'భేతాళ' అనియే ప్రయోగించియున్నారు. ఈ గ్రంథమునకు 'వేతాళ పంచవింశతి' యను నామాంతరమును గలదు గదా!

౩౧. రాజానకరుయ్యకుఁడు [118 పు.]:

రుయ్యకుని కృతి 'అలంకారసూత్రములా'? అలంకార సర్వస్వమంతయునా ? యను విషయము వివాదాస్పదముగా నున్నది. ఈ గ్రంథమునకు వ్యాఖ్యాత 'జయరథుఁడు' గాని వీరు వ్రాసినట్లులు 'జయద్రథుఁడు' కాఁడు. రుయ్యకుఁడు 11 గ్రంథములను రచించెను. (i) అలంకారసూత్రములు (సర్వస్వము?); (ii) అలంకార మఞ్జరి; (iii) సాహిత్య మీమాంస; (iv) అలంకార వార్తికము; (v) అలంకారానుసారిణి; (vi) కావ్య ప్రకాశ సంకేతము; (vii) నాటక మీమాంస; (viii) వ్యక్తి వివేక విచారము; (ix) శ్రీకంఠ స్తవము; (x) సహృదయ లీల; (xi) హర్ష చరిత వార్తికము. ఇందు i, x తప్ప మిగిలినవి లుప్తప్రాయములు. శర్మగారు ముద్రితము, నలంకార గ్రంథమునగు 'సహృదయ లీల'ను జేర్కొనక లుప్త ప్రాయములగు iii, viii, xi, ఈ సంఖ్యలు గల వానిని జేర్కొనిరి.

౩౨. గంగానాథుఁడు [120 పు.]:

'గంగానందుఁడు' కాని 'గంగానాథుఁడు' కాదు.

౩౩. అప్పయదీక్షితులు "వేదాంతదేశికుల గ్రంథములలోఁ గొన్నిటికి నుత్తమవ్యాఖ్యానముల వ్రాసె' నఁట [121 పు.]. వేదాంతదేశికుల 'యాదవాభ్యుదయ' మునకు మాత్రమే అప్పయదీక్షితులు వ్యాఖ్య వ్రాసినట్లులు విద్వల్లోక మెఱుఁగును. శర్మగారు తక్కిన వ్యాఖ్యలం దెలుపఁగలరేమొ?

౩౪. విశ్వేశ్వరుఁడు [122 పు.]: ఈ గ్రంథమునఁ జేర్కొనఁబడని యితని యితరకృతులు: 'అలంకారకుల ప్రదీపము', 'రసచంద్రిక', కవిచంద్ర బిరుదాలంకృతుఁడును, 'చమత్కారచంద్రికా' నిర్మాతయునగు విశ్వేశ్వరుఁడు ప్రకృతగ్రంథనిర్మాతకంటె భిన్నుఁడని యిచట తెలుపుట యుక్తము.

౩౫. పాణినింగూర్చి 3 పుటలు వ్రాసియు, వీరు 'పాతాళవిజయము' 'జాంబవతీవిజయము' అను కావ్యముల రచించిన పాణినిని స్మరింపనైనలేదు. వైయాకరణ పాణినియే పైకావ్యముల రచించెనని కొందఱును, వైయాకరణపాణిని కవిపాణినికంటె భిన్నుఁడని కొందఱును విద్వాంసులు వివదించుకొనుచున్నారు. ఈ సంగతియే వీ రెత్తుకొనలేదు.

౩౬. 'నిరుక్తి' [128, 127 పు.]:

యాస్కునిగ్రంథము 'నిరుక్తము' కాని, "నిరుక్తి" కాదు.

౩౭. "భర్తృహరివాక్యపదీయము అను పేర పతంజలి మహాభాష్యమును కారికలుగా వ్రాసెను." [127 పు.].

ఇది సరి కాదు. మహాభాష్యమునకు భర్తృహరి వ్రాసిన వివరణము లుప్తప్రాయ మనఁదగు. 'వాక్యపదీయము' వ్యాకరణతత్త్వ ప్రతిపాదకము ("Philosophy of grammar or speech").

౩౮. హలాయుధుని 'అభిధానరత్నమాలా' [129. పు.]

ఇది, క్రీ. శ 950 ప్రాంతమున వ్రాయఁబడెను గాని 9 వ శతాబ్ది ప్రారంభమునఁగాదు.

౩౯. మేదినీ కోశము [129 పు.]:

దీనిని రచించినవాఁడు మేదినీకరుఁడు, కాని మేదినీకారుఁడు కాఁడు.

౪౦. విశ్వకోశము [129 పు.]:

ఇది మహేశ్వర కృతము గాని, వీరు వ్రాసినట్టులు విశ్వకృతము గాదు.

ఇతఁడు 12 వ శతాబ్దిలోనివాఁడు గాని, 13 వ శతాబ్దిలోని వాఁడు కాఁడు.

౪౧. సమయమునకు స్మరణమునకు రాని యొండు రెండు విషయములను వ్రాసెద. పశ్చిమబద్ధులుగదా విప్రులు!

'చౌరపంచాశిక' కవిత్వ మంత శ్లాఘ్యము కాదఁట, బిల్హణుని 'కర్ణ సుందరి' లోని కవిత. "అయినను అచ్చటచ్చట మంచివర్ణనలు గల శ్లోకములు గానవచ్చుచున్న" వఁట [92 పు.].

'కర్ణసుందరి'ని వీరవలోకింపక దాని మీఁది విమర్శమునైనఁ జూడక వీరు దానిని గూర్చి యిట్లు వ్రాసినారు.

"Though with no originality in plot, the style displays a true poetic art. The language is highly imaginative and the descriptions extremely fanciful"

ఇవి కృష్ణమాచార్యులుగారి వాక్యములు. ఈవాక్యముల కును శర్మగారివాక్యములకును గలభేదము పాఠకులు గుర్తింతురు గాక.

౪౨. హర్షవర్ధనుని (నాలుగంకముల) 'నాగానంద' నాటిక [80 పు.] ఇది అయిదంకముల నాటకము. ఆచార్యులవారి గ్రంథమునఁగూడ నీ విషయమున దోషము కానవచ్చుచున్నది:

"The Nagananda, in *four* acts."

[81 పు.].

ఇది ప్రమాదము గావచ్చును.

౪౩. క్షేమేంద్రుని 'కవికంఠాభరణము' వృత్తలక్షణ గ్రంథమఁట. కవి కంఠాభరణము కవి శిక్షాగ్రంథము. 'సువృత్తతిలకము' వృత్తలక్షణగ్రంథము.

౪౪. చక్రకవి 'ద్రౌపదీ పరిణయము' ౭ అంకముల నాటకమఁట [II భా. 104 పు.].

ఇది నాటకము గాదు; చంపువు. ఇం దాఱాశ్వాసములు గలవు.

గ్రంథవిస్తరభీతి నింతటనాఁగుచుంటిని. మఱియు ననేకాంగ్లపదములకు వర్ణక్రమము, అర్థము, సంస్కృతపదముల స్వరూపము సరిగా లేవు. చరిత్రోద్ధారజ్ఞానము గ్రంథకర్తకుఁ జాలమిని విస్పష్ట విషయము లిట్టి ప్రమాదములకు లోనయినవి. గ్రంథము తాఱుమాఱుగ నున్నది.

విద్యార్థిలోకమున కుపయోగపడవలయు నన్న నీ గ్రంథమునకు నామూలాగ్రము సంస్కార మావశ్యకము.

ఈ గ్రంథములోని వైదికసారస్వతచరిత మను పూర్వభాగమును మున్ముందు విమర్శించెదను.

---

# మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు' సంఖ్య వ్రాయువలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము.

మేనేజరు, 'భారతి.'

# అమరుకములోని కొన్ని సన్నివేశములు

కపిస్థలము కృష్ణమాచార్యులుగారు, B.A., L.T.
Principal, S. V. S. College, Tirupati.

కుమారసంభవములోని యెనిమిదవ సర్గము కాళిదాసుఁడు రచించినది కాదని యిటీవల కొందఱు విమర్శకులు నుడువ సాహసించిరి. అందుఁ బ్రాకృతదంపతుల రతమువోలె నప్రాకృతదంపతు లగు పార్వతీపరమేశ్వరుల రతోత్సవవర్ణన పైవిమర్శకుల మనమున కసభ్యమని తోఁచునట్లున్నది. వారు రచయిత దృష్టిపథమును వ్యత్యస్తము గావించుటచే నీయాశయభేదము కలుగుచున్నది కాని మఱియేమియు లేదు. వస్తుతత్త్వమునఁ బ్రాపంచికానురాగమునకు నిదర్శనముఁ జూపఁ బూనియే కాళిదాసుఁడు కుమారసంభవము నందలి యష్టమసర్గరచనకుఁ గడంగెను.

ఆ కాళిదాసుఁడే తన శాకుంతలమున నెట్టి మార్గము ననుసరించెనో చూడుఁడు. నాయికానాయకులకుఁ బ్రథమము భౌమమగు కణ్వాశ్రమమున ననురాగోదయముఁ గల్పించెను. ఆయనురాగముకూడఁ గేవలము ప్రాపంచికము. కవి నాయికానాయకులకుఁ దఱచు వియోగమును సమకూర్చి, వారిని ఘోర దుఃఖములకు లోనుగాఁ జేసి, తుదకు హేమకూటమున నాయనురాగమును దివ్యముగ మార్చెను. కాళిదాసుని మతమున నుత్తమానురాగమన నెట్టిదో, ఈ క్రింది మాళవికాగ్నిమిత్రమునందలి శ్లోకము ను బరిశీలించినఁ దెలియనగును:—

> అనాతురోత్కంఠితయోః ప్రసిద్ధ్యతా
> సమాగమేనాఽపి రతిర్న మాం ప్రతి;
> పరస్పరప్రాప్తినిరాశయోర్వరం
> శరీరనాశోఽపి సమానురాగయోః.

నాయికానాయకులలో నొకరనాతురులు (నిరనురాగులు); మఱియొక రుత్కంఠితులు (సానురాగులు). అట్టివారికి సమాగమము కలిగినను అది శృంగార మనిపించుకొనునా? అది కేవలము శృంగారాభాసము. ఆనాయికానాయకులలోనే యిరువురును సమానురాగులనుకొనుఁడు. అట్టివారికిఁ బరస్పరము సమాగమము కలుగకపోవుటచే దేహవియోగము కూడఁ గలుగుఁగాక! అయ్యదియే శృంగార మని కవియొక్క మతము.

అతఁడు రచించిన ప్రేమగీతము లన్నియు నిట్టి శృంగారరసభరితములై యున్నవి.

ఇట్టి యుత్తమములగు ప్రేమగీతము లాధునికవిమర్శకుల 'సంస్కృతమ్మన్య'మగు మనస్సును రంజింపఁ జేయక పోవచ్చును. కాని యంతమాత్రమున వానియందలి యౌచిత్యములను బాటింపక, వాని నపర్యాలోచిత

కీ. శే. తర్కాలంకార వాగీశభట్టాచార్య-వట్టిపల్లి నరకంఠీరవశాస్త్రిగా రాంధ్రీకరించిన యమరుకము నందలి పద్యములు గొన్ని యుపలబ్ధములయినవి. వానియం దీ వ్యాసమున నున్న మూలశ్లోకములకుఁ గొన్నిటికిఁ గల పద్యములు నిందుఁ జేర్చితిమి. —సం. భారతి.

ముగఁ ద్రోసిపుచ్చక కవిహృదయ మెట్టిదో చక్కఁగ నెఱుఁగ నగును.

ఒక కాళిదాసుఁడు రచించిన శృంగార కావ్యములనే కాక గొప్పగొప్పకవులచే రచింపఁబడి భారతదేశమున వాసిగన్న శృంగార కావ్యములను బరికించుటలోను ఇట్టి సహృదయతయే యుండఁదగును. అటులయిన నేండ్లతరబడిగ నెందఱో విమర్శకుల హస్తముల దాఁటి ప్రకృతము మన కందియున్న యీ కావ్యములందలి సౌందర్యము సంస్కృతమగు మనస్సునకు స్ఫురింపక మానదు.

ప్రాచీనాలంకారికులు నిట్టి కావ్యముల నుండి యుదాహరణములఁ గైకొనియే తమ రచనలకు మెఱుఁగువెట్టిరి. సౌందర్యపిపాసువగువాఁ డెట్టిమార్గము ననుసరింపఁదగునో యట్టిమార్గమును వారు మనకుఁజూపిరి. సహృదయుల హృదయముల రంజింపఁ జేయునవి కదా ప్రేమగీతములు!

సంభోగశృంగారభావములను విపులముగ వర్ణించుపద్యము లనేకములు ప్రత్యేకముగనో, మహాకావ్యముల నంతర్భూతములుగనో యున్నవి కాని యవి ప్రకృతము చర్చకురానట్టివి. ఎచ్చటనో యట్టి పద్యము లున్నవని, యుత్తమశృంగారకావ్యములలోని పద్యములు నట్టివే యని భ్రమతో వానినిఁ జర్చింపకుండుట న్యాయముకాదు.

అట్టి ప్రేమగీతములలో నుత్తమమైనది యమరుకశతకము. అది 'అమరుకకవేరేకః శ్లోకః ప్రబంధశతాయతే' యని పేరుగాంచినది. తద్వ్యాఖ్యాతలలోఁగూడ నొక్కఁ డీఖ్యాతి ననుమోదించియున్నవాఁడు. ఈశతకమును రచించినవాఁ డమరుకుఁడు కాదనుటకు మనకుఁ దగిన యాధారములు కానుపింపవు. అందొక్కొక్కశ్లోకము నొకదానితోనొకటి సంబంధింపక ప్రత్యేకముగ నొక్కొక్క యనుభావమును వర్ణించుటచే నర్వాచీనులు కొందఱమరుకుఁ డీ శతకమును బెక్కుగ్రంథముల నుండి సంగ్రహించెనే కాని స్వయముగ రచించలేదని పలుకఁ బూనిరి. తొమ్మిదవశతాబ్దికిఁ దరువాతి వారగు నాలంకారికులు, కవులు, వ్యాఖ్యాతలు నెందఱో దీనిని రచించినవాఁ డమరుకుఁడే యని చెప్పుచుండ మన మటు కాదని చెప్పసాహసించుట పొసఁగదు. ఇఁక నాభ్యంతరపరిశీలనఁ గావించినను, ఇందలి శ్లోకములకు భిన్నకర్తృకత్వము చెప్ప వలను పడదు. శైలియంతయు నేకరూపమున నున్నది. శ్లోకములకుఁ బరస్పరసంబంధరాహిత్య మిచ్చోటనే కాక, ఏకకర్తృకములగు భక్తి, నీతి కావ్యములలోఁ గూడఁ గాననగును.

ఇఁక దీని ప్రాశస్త్యమునకు నిదర్శనము, అద్వైతవేదాంతాచార్యుఁడగు శంకరున కేతత్కర్తృత్వము నంటఁగట్టు నైతిహ్యమే. ప్రేమతత్త్వము నెఱుఁగ ననువగు గార్హస్థ్యము నవలంబింపకయే కేవలము బ్రహ్మచర్యమున నుండియే సన్న్యాసము నవలంబించినను శంకరుఁడు మనోహరమగు నిట్టి కావ్యమును రచించెఁ జూడుఁడని లోకమున కెఱిఁగించుచుఁ దము

యాచార్యునకు సర్వజ్ఞత్వము నాపాదింపఁ దదనుయాయులు కొందఱిట్టి యైతిహ్యమును గల్పించియుందురు. ఈ యైతిహ్యమును సమర్థింపఁ బరకాయప్రవేశరూపమున మఱియొకటి కల్పింపవలసివచ్చినది.

మఱియు నూరుపేరులేని కొందఱు కవులేవో కొన్ని శ్లోకములు తాము రచించి యమరుకునివిగా లోకమున కెఱిఁగింప వాని నమరుకశతకమునఁ జేర్చియున్నారు. తత్ప్రాశస్త్యమునకు నిదర్శనమే వలయుచో నిది మఱియు నొకటి.

చాలమట్టున కాలంకారికు లందఱును బలువిధములఁ బరఁగు నీశృంగారమును దరచితరచి కామిజనమనస్తత్త్వమును జక్కఁగ వెలువఱిచిరి. ఆలంకారికులు తమకుఁ బురాతనులు, విఖ్యాతులు నగు కవుల పద్యములయందలి యర్థవైచిత్ర్యములఁ దమరచనలలో నుదాహరించియే వాని కందముఁ గూర్చిరి. ఆ యాలంకారికుల రచనలే తరువాతికవులకు మార్గదర్శకము లయ్యెను. ఆలంకారికులకు, కవులకుఁ గల యీపరస్పరసహకారమే యనేకశతాబ్దుల వర్ధిల్లి రసవంతములగు కావ్యములయందలి రసముల తరతమభావనిర్ణయమున కుపకరించినది. ఈవిధముగ విప్రలంభశృంగారమునకుఁ దక్కినశృంగారములకంటెను ప్రాధాన్యమబ్బినది.

శృంగారరసమును జిందుచుండునట్టి శ్లోకములను గొన్నిటి నమరుకమునుండి యేఱి పాఠకులముందిడ సాహసించుచున్నాను. అందలి సారస్యమును పాఠకులే గ్రహింతురుగాత! ఈశ్లోకములన్నియు నమరుకమునందలి వేర్వేఱు భాగములనుండి గ్రహించినవి, ఇచ్చట గ్రథనమొక్క నిబంధనకు లోఁబడియున్నది. ఒకానొకనాయిక తనకాంతుఁ డన్యకాంతాసక్తుఁడగుట తానుగానో, ఒండె, మఱి యేవిధముగానో యెఱిఁగి ముగ్ధమధ్యప్రౌఢాదియవస్థలకనుగుణముగ నెట్లెట్లు ప్రవర్తించునో యట్టి క్రమమే యిచ్చోట నియమము.

1. ఇదిగో, ఒక ముగ్ధనాయిక; ప్రణయమన నేమియో యెఱుఁగదు. కాని తనయిచ్చ చొప్పునఁ గాంతుని దండించుచున్నది. వాఁడో, కడుఁజతురుఁడు. మఱియొకమాఱిట్టి తెలివిమాలినపనినిఁ జేసితివా తగినఫలము ననుభవింతువని వానిని హెచ్చరించుచున్నది:—

కోపాత్కోమలలోలబాహులతికా
పాశేన బద్ధ్వా దృఢం
నీత్వా మోహనమందిరం దయితయా
స్వైరం సఖీనాం పురః;
భూయోఽప్యేవ మితి స్ఖలన్మృదుగిరా
సంసూచ్య దుశ్చేష్టితం
ధన్యో హన్యత ఏవ నిహ్నుతిపరః
ప్రేయాన్ రుదత్యా హసన్.[1]

1. అలుకన్ గాఢముగా విలోలమృదుబాహావల్లి బంధించి నె
చ్చెలు లీక్షింపఁగఁ గేళివేశ్మముఁ గదియం జేసి యింక నేలాగ యం
చెలిమిం గద్గదికోక్తులం దెలిపి దుశ్చేష్టం గరం బేడ్చు న
గ్మలిచే ధన్యుఁడు నిహ్నవప్రియుఁడునా కాంతుండు కొట్టంబడున్.

కోపావేశమున నామె కాంతుని బాహులతల బంధించి కేళీనికేతనమునకుఁ గొంపోయినది. చెలులసమక్షమున మాటలు తొట్రుపడఁగనుల నీరుగార్చుచు నతనిని దూఱుచున్నది. అతఁడో నవ్వుచుఁ దన యపరాధమునంతయుఁ గప్పిపుచ్చుచున్నాఁడు.

2. నాయకునకుఁ దన తప్పిదము తెలియును. కాని యందులకు రానున్న ఫలితము నెఱుఁగఁడు. ఆమె మౌనముఁ దాల్చినది. ఇతనికి యథాపూర్వము సంభాషింప వీలుకలిగినదికాదు. ఇట్లు కొన్ని క్షణములు గడచినవి. ఒకరినొకరు రోఁగచూపులఁ జూచుచున్నారు. ఏదో నెపమున నతఁడు నవ్వెను; ఆమె కనుల నీరుగార్చెను:—

పశ్యామో మయి కిం ప్రపద్యత ఇతి
స్థైర్యం మయాఽఽలంబితం
కిం మాం నాఽఽలపతీత్యయం ఖలు శఠః
కోపస్తయాప్యాఽఽశ్రితః;
ఇత్యన్యోన్యవిలక్షదృష్టిచతురే
తస్మిన్నవస్థాంతరే
సవ్యాజం హసితం మయా ధృతిహరో
బాష్పస్తు ముక్తస్తయా.[2]

3. సందర్భము కొంత ముందుకు సాఁగినది. నాయికానాయకు లిరువురు నేకశయ్యనధిష్ఠించిరి. కాని పెడమొగము పెట్టియున్నారు. అనునయింపనేమో యిరువురికినిఁ గోరిక యే. కాని యభిమాన మడ్డుతగులుచున్నది. గంటలు గడచినవి. సమాధానకాంక్ష యుదయించెను. మొగములు తిరిగెను. దృష్టులు కలిసెను ఒక్కగాఢాలింగనముతోఁ గోపమంతయుఁ బఱువిడెను:—

ఏకస్మిన్ శయనే పరాఙ్ముఖతయా
వీతోత్తరం తామ్యతో
రన్యోన్యస్య హృదిస్థితేఽప్యనునయే
సంరక్షతోర్గౌరవమ్;
దంపత్యోశ్శనకై రపాంగవలనా
న్మిశ్రీభవచ్చక్షుషో
ర్భగ్నో మానకలిః సహాసరభస
వ్యావృత్తకంఠగ్రహమ్.[3]

4. కాంతుఁడు సాపరాధుఁడై యుండుటచేఁ గలిగిన హృదయతాపము నింతకంటెఁ జక్కఁగ వర్ణింపఁదరమా?—

దూరాదుత్సుక మాగతే వివలితం
సంభాషిణి స్ఫారితం

---

2. చూతి మిదేమి సేయుము ననుచుం గయికొంటి డిటంబు నేన్ శఠుం
డీతఁడు పల్కరింపఁడని యెంతయు నాపె వహించె నక్క నీ
రీతి మిథోవిలక్షతర దృక్చతురంబగు నట్టివేళ నేఁ
గైతవవృత్తి నవ్వితిని కాంత యిడెన్ ధృతిమూల బాష్పమున్.

3. విముఖత నొక్కపాన్పుపయి వీతవచస్స్థితిఁ గందుచున్ మదిం
దమ కనునీతి కల్గియును దద్దయు గౌరవవృత్తినంశునా
లుమగ లపాంగవల్గనల లోచనముల్గలయంగ నవ్వి సం
భ్రమ పరివృత్తకంఠపరి రంభములన్ గతరోషులైరొగిన్.

సంశ్లిష్య త్వరుణం గృహీతవసనే
కోపాంచితభ్రూలతమ్;
మానిన్యా శ్చరణానతివ్యతికరే
బాష్పాంబుపూర్ణం క్షణా
చ్చక్షు ర్జాత మహో ప్రపంచచతురం
జాతాగసి ప్రేయసి.

ఆ మెకనులు దయితుఁడు దూరముగ నున్నప్పుడు వానినెప్పుడు చూతునా యని తహతహపడును; దగ్గఱకు వచ్చినపుడు ప్రక్కకు మరలును; మాటలాడ నారంభించెనా విస్ఫారును; కౌఁగిలింపఁబోవ నెఱ్ఱవారును; అంశుకగ్రహణమునకుఁ బూనెనా బొమలు ముడివైచును; తుదియత్నముగా కాళ్లపైఁ బడెనా-ఇఁక నేమున్నది-క్షణములో అశ్రువులతో నిండిపోవును.

5. తనవిషయమున దయితుఁడు సాపరాధుఁడగుటఁగాంచి నాయిక ఇఁక నతనితోఁ బరిచయమే చేయరాదని నిశ్చయించుకొనును. దానినే మాటలలోఁగూడఁ దెలియఁజేయును. కాని పాపము, అంతలోనే యామెదృష్టులు కాంతుని యాగమనమార్గమునకయిఁ బాఱినవి:—

స్ఫుటతు హృదయం కామః
కామంకరోతు తనుం తనుం
న సఖి చపల ప్రేమ్ణా
కార్యం పున ర్దయితేన మే,
ఇతి సరభసం మానావేశా
దుదీర్యచ తత్ క్షణాద్
రమణపదవీ సారంగాక్ష్యా
ముహుర్ముహు రీక్షితా.

నాహృదయము చీలిపోవుఁగాక! శరీరము కృశించిపోవుఁగాక! చెలీ! ఇఁక నాకీ చపలచిత్తునితోఁ బనిలేదు. అని యీవిధముగఁ గోపావేశమునఁబలికి మఱుక్షణముననే యాసారంగాక్షి రమణపదవికై చూడ్కులు నిగిడ్చెను.

6. ఇదిగో, ఇటుచూడుఁడు. మరలఁ దన మనోహరుఁడు తనకడకు వచ్చినప్పుడు కోపమును నటింపఁ బ్రయత్నించుచున్నది. కాని మాటిమాటికిని ఆమెప్రయత్నములన్నియు నేదోయొకవిధముగ భగ్నము లగుచున్నవి. తనశక్తికి మించినపు డామెమాత్ర మేమి చేయఁగలదు? పాపము! ముగ్ధ యెంత చేసినది? నిరాశచేఁ జెలితో నిటులు పలుకుచున్నది:—

భ్రూభంగే రచితేఽపి దృష్టి రధికం
సోత్కంఠ ముద్వీక్షతే
రుద్ధాయామపి వాచి సస్మితమిదం
దగ్ధాననం జాయతే;
కార్కశ్యంగమితేఽపి చేతసి తనూ
రోమాంచ మాలంబతే
దృష్టే నిర్వహణం భవిష్యతి కథం
మానస్య తస్మిన్ జనే.[4]

4. బొమముడి వెట్టినం గనులు పొల్పుగఁగాంచు సముత్సుకంబులై యమరఁగఁ బల్కుమాని నవహాస్యముగం జెలువవ్వు కల్గుఁ జిత్తము కఠినంబుఁ జేసినను దద్దయు నెమ్మెయి పుల్కరించు నేక్రమమున మానరక్షణము కౌఁగల దాతని మోముఁ గన్గొనన్.

బొమలు ముడివెట్టితిని. కాని యేమిలాభ
ము? కనులేమో ప్రేమదృష్టుల నీనుచున్నవి.
మాటల నరికట్టితిని. కాని యీ పాడు మొగమున
నవ్వుదయించుచున్నది. హృదయమునఁ గాఠి
న్యము వహించితిని. కాని శరీర మూరకుండు
నా? గగుర్పడుచున్నది. ఇఁక నేమిగతి? వాని
సమక్షమున నా కోపము సఫలతఁ గాంచు టెట్లు?

పాప మెట్టి దీనదశలోఁ బడినది!

7. ముందువలెఁ గాక నాయిక కోపమును
నటింపఁ బరిచయము చేసి యిపుడు జయము
గాంచినది. జయముతోపాటు గర్వము నంకు
రించినది. కాని ఫలవిషయమునమాత్రము
దైవముపయి భారము వయిచినది.

భ్రూభేదో గుణిత శ్చిరం నయనయో
రభ్యస్త మామీలనం
రోద్ధుం శిక్షిత మాదరేణ హసితం
మౌనేఽభియోగః కృతః;
ధైర్యం కర్తు మపి స్థిరీకృత మిదం
చేతః కథంచి న్మయా
బద్ధో మానపరిగ్రహే పరికరః
సిద్ధిస్తు దైవే స్థితా.

అతిప్రయాసచేతఁ బొమలు ముడివడఁ
జేసితిని, కనులు మూఁతవడఁ జూచితిని. నవ్వు
నాఁపుకొంటిని. నోటి నరికట్టితిని. హృదయ
మునుగూడ ధైర్యముగొనఁ జేసితిని. కావల
సిన సామగ్రినంతయు సమకూర్చితిని. కాని
ఫలితము దైవాధీనము.

'దైవంచైవాఽత్ర పంచమమ్' అని భగవ
ద్గీతయందు నిరూపింపఁబడిన వేదాంత తత్త్వము
నప్రయత్నముగనే యీమె నిరూపించినది.

8. సాధనలు ముగిసినవి. కార్యక్రమ
మారంభమాయెను. చాలభాగము జయము
గాంచినది. కాని హృదయక్షోభము మితి
మించినది. కోపనటన మంతరించెను. అంతతోఁ
దన యధీరత నొప్పుకొన్నది. ఏమి చెప్పుచున్న
దో గమనింపుఁడు——

తద్వక్త్రాభిముఖం ముఖం వినమితం
దృష్టిః కృతా పాదయోః
తస్యాఽఽలాపకుతూహలాకులతరే
శ్రోత్రే నిరుద్ధే మయా;
పాణిభ్యాంచ తిరస్కృత స్సపులకః
స్వేదోద్గమో గండయోః
సఖ్యః, కింకరవాణి యాంతి శతధా
మత్కంచులీసంధయః. [5]

అతనికెదురుగ నాముఖము వాల్చితిని.
చూపులు పాదములపైఁబడెను. అతని సంభా
షణకై తహతహపడుచున్న చెవులను మూసి
కొంటిని. గండములందుదయించిన స్వేదమును
జేతులఁ గప్పిపుచ్చితిని. కాని నాహృదయ

5. మొగమువ్రాంచితి వానిమోమెదుటఁ జూ పుంగాళ్ల యందుంచితిన్
దగ నాకీసులమూసితిం గడగి తత్సల్లాపలోలంబులన్
మిగులం జెక్కులఁ జెమ్మటం బులకలన్ గేలన్ వెసన్ గప్పితిన్
బిగియం గంచుక మంతఁ గుట్లువదలెన్ నే నేమిసేతుం జెలీ!

ముష్వాంగి పగిలిపోవునటులున్నది. ఏమి చేయవచ్చును ?

ఆమెపయిఁ గనికరించని కఠినహృదయుఁ డెవఁడేని యుండునా ?

**9.** జయ మబ్బినది. అనుకొన్నటులు కోపనటన సాగినది. డగ్గఱిన కాంతునిఁ ద్రోసిపుచ్చెను. నిరాశచే నతఁడు పనుదిరిగెను. ప్రేమ యేమైనది ? ఆమె సంతోషమున నున్నదా? లేదు, ముమ్మాటికిని లేదు. పశ్చాత్తాపపడినది. ఇట్టిదశకుఁ గొనివచ్చిన సఖులను దూఱినది:—

నిశ్శ్వాసా వదనం దహంతి హృదయం
నిర్మూల మున్మథ్యతే
నిద్రా నైతి నదృశ్యతే ప్రియముఖం
నక్తందివం రుద్యతే ;
అంగం శోషముపైతి పాదపతితః
ప్రేయాం స్తథోపేక్షితః
సఖ్యః, కం గుణ మాకలయ్య దయితే
మానం వయం కారితాః.

వేఁడినిట్టూర్పులు ముఖమును మాఁడ్చివయిచుచున్నవి. హృదయము చీలిపోవుచున్నది. నిద్ర రాదు. ప్రియముఖము కానరాకున్నది. రేయుంబవలు దుఃఖము తప్పకున్నది. అంగములు శోషిల్లినవి. దగ్గఱకు వచ్చిన కాంతు నుపేక్షించితిని. చెలులారా! ఏమి లాభము నాశించి నన్ను నాదయితునిపయిఁ గోపింపఁజేసితిరి ?

ఈయాపదల పిదప నామె జాగ్రత్తతో మెలఁగుచువచ్చినది. ఇఁకముం దిట్టివి సంభవించినను నామె యెటులయిన నోర్చుకొనఁగలదు.

**10.** ఇదియొక ప్రౌఢ. శఠుఁడగు నాయకుఁ డిఁకముందు తనచెంతకు రాఁదటస్థించినచోఁ దానెట్లు మెలఁగవలయునో, ఎందులకట్లు మెలఁగవలయునో ఆమె చక్కఁగా నెఱుఁగును. ఒకరి యుపదేశవాక్యము లామెకనావశ్యకములు. తన మానభంగమునకుఁ దగినప్రతిక్రియఁ జేయ నామె యెఱుఁగును. నాయకుఁడు వెనుకనుండి మెల్లమెల్లఁగ వచ్చి యామె నాలింగనము చేసికొనఁబోవును. ఆమె యతనిచేతులను వదలించుకొని కటువచనముల నిటులు పలుకును:—

అజ్ఞానేన పరాఙ్ముఖీం పరిభవా
దాశ్లిష్య మాం దుఃఖితాం
కిం లబ్ధం శఠ,దుర్నయేన నయతా
సౌభాగ్య మేతాం దశామ్;
పశ్యైతద్దయితాకుచవ్యతికరో
న్మృష్టాంగరాగారుణం
వక్షస్తే మమ తైలపంక మలినై
ర్వేణీపదై రంకితమ్.[6]

6. అవమతిఁ గుందుచున్ విముఖి నైన ననున్ గితవా యెఱుంగమిన్
కవుఁగిలియంద వీఁగతి నొ నర్చితికాక మఱేమి కల్గె నీ
కవినయ, చూడుమా యిదిగో యాచెలి నెమ్మెయిపూఁత నెఱ్ఱఁగా
నవు త్వదురంబు తైలకల నాసితవేణిపదంబులం జెడెన్.

నాకుఁగలిగిన పరాభవమువలన నేను దుఃఖించుచుండ నిటులు వెనుకనుండివచ్చి నన్ను నీబాహువుల బంధించితివే, దీన నీకుఁ గలిగిన లాభమేమి? గాఢాలింగనముచే నీద యిత యురముననుండి నీయురమున సంక్రమించిన యంగరాగము—పాపము!—తైలమలినములగు నాజడల యల్లికల యొత్తిడిచేఁ జెదరిపోయిన దే!

నాయకునకుఁ దగిన ప్రతిఫల మబ్బినది. అప్పటికిని, అతఁడు రసికుఁడయ్యె నేని తన్ను ధన్యాత్మునిఁగనే భావించుకొనును.

11. ఆమె హృదయమును గోప మింకను వీడలేదు; కాని దానివిషయమున నామెకు చింతయే లేదు. కోపమును బ్రకటముగఁ దెలుపు వయసుకాదు; గుప్తముగ నుంచుకొనునంత యనుభవము కలదు. కావున నే

నాఽంతఃప్రవేశమరుణ ద్విముఖీ నచాఽఽసీ
దాచష్ట రోషపరుషాణి నచాఽక్షరాణి;
సా కేవలం సరళపక్ష్మభి రక్షిపాతైః
కాంతం విలోకితవతీ జననిర్విశేషమ్.

అతనిని లోనికి రాకుండ నడ్డగించలేదు. పెడమొగముకూడఁ బెట్టలేదు. కటువచనములఁ బలుకలేదు. కాని తన చుట్టుప్రక్కలనున్న తక్కినవారినిఁ జూచినటులే యతనినిఁ గూడఁ జూచినది.

అపరాధిమనసు నొప్పింప నింతకంటె వే ఱాయుధము కావలయునా?

12. నాయికకుఁ గలిగిన యీయనుభవము లన్నియు నొక్కశక్తిని నేర్పక ఊరకపోవునా? అపరాధిని లొంగఁదీయుటకు వట్టి యౌదాసీన్యము పనికిరాదు. అతఁడు వచ్చినప్పుడెల్లఁ బ్రతికూలముగ వర్తించుటయే తగిన సాధనము. ఆమెనుగూర్చి నాయకుఁడే యేమిచెప్పుచున్నాఁడో చూడుఁడు—

ఆశంక్య ప్రణతిం పటాంతపిహితౌ
పాదౌ కరో త్యాదరాత్
వ్యాజేనాఽఽగత మావృణోతి హసితం
నస్పష్ట ముద్వీక్షతే;
మయ్యాలాపవతి ప్రతీపవచనం
సఖ్యాసహాఽఽభాషతే
తస్యాస్తిష్ఠతు నిర్భరప్రణయితా
మానోఽపిరమ్యోదయః.

నేను నమస్కరింతునేమో యని తలఁచి యామె తనపాదములను జేలాంచలముచేఁ గప్పుచున్నది. ఉబికి వచ్చుచున్ననవ్వు నెటులో యొకటులు కప్పిపెట్టుచున్నది. నావయిపే చూచుటలేదు. నేను పలుకరింప సఖితో బదులు చెప్పును. ఆమె నిర్భరప్రణయ మిటు లుండుఁగాక! ఈకోపముకూడ మనోహరముగనే యున్నది.

అవును, నిజమే. నాయకునకు స్వాగతోపచారసుఖమునకు మాఱుగ మఱియొక లాభ మబ్బెను.

13. వట్టి యౌదాసీన్యముకూడ నొకప్పుడు ఫలింపవచ్చును; ఒకప్పుడు ఫలింపకపోవచ్చును. కాని యీ యౌదాసీన్యమే నాయకునకు జమత్కారముగాఁ గలుగఁజేసి యపార్థము చేయఁగూడని బాహ్యవ్యాపారమునుగలుగఁజేసి

నచో నిజముగఁ జక్కని ఫలితము నిచ్చును. అటులనే యామెకు గౌరవముకూడ నాపాదించును. కావుననే

ఏకత్రాఽఽసనసంగతిః పరిహృతా
  ప్రత్యుద్గమా ద్దూరతః
తాంబూలాహరణచ్ఛలేన రభసా
  శ్లేషోఽపి సంవిఘ్నితః;
ఆలాపోఽపి న మిశ్రితః ప్రియజనం
  వ్యాపారయంత్యాఽంతికే
కాంతంప్ర త్యుపచారత శ్చతురయా
  కోపః కృతార్థీకృతః.[7]

అతనిని గౌరవించునట్టుగా లేచి యేకాసనమును బరిహరించెను. తాంబూలాహరణము నెపముగఁగొని గాఢాలింగనమున కెడ మియ్యలేదు. పరిజనము నాయాపనుల నియోగించుచు సంభాషణమునఁగూడ పాల్గొనలేదు. చమత్కారముగనిట్టిస్వాగతము నిచ్చి యామె తనకోపమును సఫలము జేసికొనెను.

ఈ కొన్ని యుదాహరణములవలననే యీకవి ప్రణయకోపము నెట్లు పోషించెనో, వీని యీరచనయందు జీవకళ లెట్లుప్పతిల్లుచున్నవో పాఠకులకుఁ దెలియకమానదు. విమర్శకులుకూడ శృంగారమనినమాత్రమున లజ్జాచకితులుకాక సహృదయతతోఁ గవిహృదయము నెఱుఁగునెడల నాతని రచనయందలి సౌందర్యము వారికిని స్ఫురించక మానదు.

---

## 'శుశ్రూషస్వ'

పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులు గారు

శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీ
  వృత్తిం సపత్నీజనే
భర్తు ర్విప్రకృతాపి రోషణతయా
  మాస్మ ప్రతీపం గమః,
భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే
  భాగ్యే ష్వనుత్సేకినీ
యాన్త్యేవం గృహిణీపదం యువతయో
  వామాః కులస్యాధయః.

వినయవతి వయి గురుల సేవింపు మమ్మ!
సవతులసమక్షమున నిష్టసఖివి గమ్మ!
భర్త నినుఁ గోపగించినప్పటికి నీవు
కనలి ప్రతికూలురాలవు గాకుమమ్మ!
పరిజనులయెడ దాక్షిణ్యవతివి గమ్మ!
భాగ్యములఁ జూచుకొని గర్వపడకుమమ్మ!
ఇటులు మెలఁగెడి యువతులే గృహిణు లమ్మ!
వామవృత్తులు కులమనోవ్యాధులమ్మ!

---

7. ఒకచోఁ గూర్చొనియుంటఁ బోనడఁచెఁ బ్రత్యుత్థానముం జేసి పీ
టికఁ దేఁబోవు నెపంబుచేఁ దవు నెట్టెన్ సంభ్రమాశ్లేషమం
తికముం దాంబూలకముం బనుల్ గరపురీతిన్ బల్కుటల్ మానె జా
ణ కృతార్థం బొనరించె నప్డు డలుక న్నాథోపచారమ్ములన్

పండిత వి. కృష్ణమాచార్యులుగారు, శిరోమణి,


వేదాంతులలో రెండు తెగలు: ఏకత్వులు ద్వైతులు నని. ఏకత్వులే అద్వైతులు. ఎవరు పరమార్థమున నొక్కటేవస్తువును సర్వపరికల్పనాతీతముగను, భేదసంసర్గములు లేనిదానిని గను, ఆద్యంతరహితముగను, తక్కినదానిని సర్వమును ప్రాతిభాసికముగను, ఉపాధిశక్తిభేద పరికల్పితముగను, పరమార్థమున నవిద్యమానముగను అంగీకరింతురో వారు ఏకత్వులు. ఎవరు తక్కినదానిని గూడ అవిచాల్యప్రమాణ సిద్ధమై పరమార్థమున విద్యమానముగ నంగీకరింతురో వారు ద్వైతులు. ఇరుతెగలవారికిని స్వస్వప్రతిభోన్నీతమగు నామ్నాయమే ప్రమాణము. ఈవిషయమునే అద్వైతవాదమూర్ధాభిషిక్తుడగు భర్తృహరి యీక్రింది శ్లోకమున నిరూపించెను:

తస్యార్థవాదరూపాణి నిశ్చిత్య స్వవికల్పజాః,
ఏకత్వినాంద్వైతినాంచ ప్రవాదాబహుధాగతాః

ఏకత్వులలో కొందరు శబ్దాద్వైతమును మరికొందరు బ్రహ్మాద్వైతమును అంగీకరించి తమతమ మతములను సమర్థించుచున్నారు. భర్తృహరి మొదలగు నెవరు శబ్దతత్త్వము నొక్కటినే వస్తుస్థితిని విద్యమానముగను, తదితరము సర్వమును పరమార్థమున అవిద్యమానముగను చెప్పుచున్నారో వారు శబ్దాద్వైతులు. వారి మతసర్వస్వ మిది:—

అనాదినిధనం బ్రహ్మ శబ్దతత్త్వం యదక్షరమ్.
వివర్తతేఽర్థభావేన ప్రక్రియా జగతో యతః.
ఏకమేవ యదామ్నాతం భిన్నశక్తివ్యపాశ్రయమ్,
అపృథక్త్వేఽపి శక్తిభ్యః పృథక్త్వేనైవ వర్తతే.

ఎవరు బ్రహ్మతత్త్వము నొక్కదానినే సజాతీయవిజాతీయభేదగంధాసహిష్ణువుగను, అసత్యాజ్ఞానా నానందవ్యావృత్తముగను శుద్ధబుద్ధముక్తనిత్యస్వరూపముగను చెప్పుచున్నారో వారు బ్రహ్మద్వైతులు. భగవత్పాదాదు లట్టివారు. బ్రహ్మద్వైతవాదియగు మండనుడు కూడ కొంతవరకు శబ్దాద్వైతమును సమ్మతించియుండుట అతని గ్రంథములను పరిశీలించిన విశదమగును:

'తస్మాత్ శబ్దతత్త్వ మేకమేవ తథా తథాఽవభాసత ఇతి సాంప్రతం'. 'సర్వం జ్ఞేయం వాగ్రూపాన్వితం గమ్యత ఇతి తద్వికార స్తద్వివర్తోవా' అని చెప్పుచు 'నసోఽస్తిప్రత్యయో లోకే యః శబ్దానుగమాదృతే, అనువిద్ధమివ జ్ఞానం సర్వం శబ్దేన భాసతే' అని శబ్దాద్వైతము ననుగ్రహించినాడు.

వారిలో శబ్దాద్వైతవాదియగు భర్తృహరి తనదగు వాక్యపదీయమున శబ్దాద్వైతమును చక్కగ వివరించుచు తనకు శబ్దతంత్రము వచ్చినరీతి నిట్లు చూపియున్నాడు:—

"పురా పాణినీయే వ్యాకరణే వ్యాడ్యుప రచితం లక్షగ్రంథపరిమితం సంగ్రహాభిధానం నిబంధన మాసీత్, తచ్చ కాలవశాత్ సుకు మారమతీన్ వైయాకరణాన్ ప్రాప్య అస్త ముపయత్ ఉత్సన్నప్రాయ మభవత్. అథ వ్యాకరణతంత్రస్యాఽవిచ్ఛేద మభివాంఛన్ భగవాన్ పతంజలిః మహాభాష్యం నిబబంధ. ఏతచ్చ మహాభాష్యం వరరుచికృతవార్త్తికా నాం వ్యాఖ్యానరూపం సంగ్రహసంక్షేపభూత మేవ. ఏతచ్చభాష్యం బౌజిసౌభవహర్యక్షా దిభిః శుష్కతర్కానుసారిభి ర్విప్లావిత మభూ త్. దిష్ట్యా కుతశ్చిత్ సంప్రదాయ మధిగమ్య బ్రహ్మరక్షసా కేనచిత్ చంద్రాచార్యవసు రాతాదీనాం దత్తమ్, వసురాతేన భర్తృ హరయేఽయం వ్యాకరణాగమః సముపదిష్టః, తేనచ వాక్యపదీయం నామ కాండత్రయపరిమి తం నిబంధనరత్న ముపరచితమ్." ఇతి.

గ్రంథకర్త లనేకులు మహాభాష్యకారుడు పతంజలిని చూర్ణికారుడని చెప్పుచున్నారు. అందులో సీభర్తృహరి యొకడు. అతడు తాను రచించిన మహాభాష్యత్రిపాదీవ్యాఖ్య దీపిక యందు ఇట్లు వ్రాసినాడు:—

"చూర్ణికారస్తు భాగప్రతిభాగ మన్వాశ్రిత్య కృత్స్నఏవ వర్గేఽథయస్థాన, యథాభ్రాష్ట్రి పక్వాః కిలోశీపక్వాశ్చ (తిలపక్వాశ్చ) తత్ర ముఖ వచనోఽప్యసౌ నాసికావచనోఽపి. యథాభ్రా ష్ట్రిపక్వాః కిలోశీపక్వోఽపి (?) (తిలపక్వో) (పి)" అని ముఖనాసికాసూత్రమునందు. ఈదూదే త్సూత్రములో గూడ "తపరస్తత్కాలస్యేతిత త్కాలానాం గ్రహణం యథా స్యాత్, కథం పున శ్ఛేదకత్వ ముదాత్తాదీనామ్? యావతా నజాదీనా ముదాత్తవచనభేదకత్వే జ్ఞాపక ము క్తం చూర్ణికారేణ" అని కలదు. ఘిసంజ్ఞాసూ త్రమునగూడ "చూర్ణికారస్తు వికారాణామ్" అని యున్నది. ఈవాక్యములం దంతటను చూర్ణికారుడు మహాభాష్యకారుడే యని విష యసంవాదమునుబట్టి మనకు తెలియుచున్నది. ప్రతీహారేందురాజు రచించిన కావ్యాలంకార సంగ్రహవ్యాఖ్యానమున గూడ నొకవాక్యము కలదు: "చూర్ణికారస్య త్వేవమాదా తద్భా వాధ్యవసానసమాశ్రయేణ నాతిశయోక్తి భేద కత్వమే వేష్టమ్. యదాహ—న తిజంతే నోప మాన మస్తీతి". "న తిజంతే నోపమానమస్తి" అనువాక్యము భాష్యమున సన్విధాయక సూత్రమున గలదు. ఇందువలనను ఇట ప్రతి చోట చూర్ణికారుడన మహాభాష్యకారుడే యని చెప్పవచ్చును. చూర్ణియని మహాభాష్య మునకే నామాంతరముగ నుండవచ్చునని కూడ చెప్పనగును.

వాక్యపదీయవ్యాఖ్యాత వృషభదేవుడు 'సూత్రాణాం సానుతంత్రాణాం భాష్యాణాంచ ప్రణేతృభిః' అనుకారికయందలి వృత్తి కిట్లు వ్యాఖ్యానము చేసినాడు:— "అనేకత్వాత్ భాష్యస్యాఽఽహ సంగ్రహ ఇతి. చూర్ణికారే పఠితం 'సంగ్రహఏతత్' ఇత్యాది. తేన జ్ఞాయతే సంగ్రహప్రణేత్రా నిత్యత్వ మభ్యుపగతమితి' అనుతంత్రభాష్యఇతి పాతంజలభాష్యే" అని. "అనుతంత్రం వార్త్తికం, భాష్యాణా మితి చూ ర్ణ్యాదీనామ్" అని మరియొకచోటగూడ గలదు.

భాష్యమునందు పస్పశాహ్నికమున 'సంగ్రహ ఏతత్ ప్రాధాన్యేన విచారితం నిత్యోవా నిత్యోవేతి' అనువాక్యము కనబడుచున్నది. కావున చూర్ణికారుడన మహాభాష్యకారుడనియే వృషభదేవుని యాశయము.

నిజమారసిన భర్తృహరి త్రిపాదీవ్యాఖ్యాయందు కొన్ని స్థలముల భాష్యమనియు, మరి కొన్ని చోట్ల చూర్ణియనియు వెవ్వేరుగ నిర్దేశించియుండుటవలన పాతంజలభాష్యము వేరు, చూర్ణిగ్రంథము వేరు అని చెప్పవచ్చును. అదిగాక, భర్తృహరి మహాభాష్యమునకు వ్యాఖ్యానము వ్రాయుచు 'చూర్ణికారస్తు' అని తుశబ్దసహచరితమగు చూర్ణికారశబ్దముచే భగవంతుడగు పతంజలినే మతాంతరస్థితుని వలె చెప్పినాడనుట హృదయంగమము కాదు. కనుక చూర్ణి భాష్యము లనునవి రెండు వెవ్వేరు గ్రంథములు. ఇప్పుడు దొరకుచున్న మహాభాష్యగ్రంథము అచ్చటచ్చట చూర్ణివాక్యసంవలితముగనే కానుపించుచున్నది. అదికాక పాతంజలభాష్యము అనుతంత్రవ్యాఖ్యానరూపమని వృషభదేవుడు చెప్పుచున్నాడు. దొరకిన యీమహాభాష్యమందో సూత్రవ్యాఖ్యానము కూడ కాననగుచున్నది. కావున నీసమగ్రగ్రంథము పాతంజల మెట్లగునో విమర్శకులు విమర్శింతురుగాక! చూర్ణిగ్రంథమును వ్రాసినవాడు ఆచార్యకుణియనియు నొక ప్రవాదముకలదు.

ఈసందర్భమున విమర్శకులకు చెప్పదగిన దొకటి కలదు.—భర్తృహరిరచితమని ప్రసిద్ధిగాంచిన వాక్యపదీయగ్రంథమున కారికలు వృత్తులు రెండును కలవు. భర్తృహరి తన కారికలకు తానే వృత్తులను రచించి వ్యాఖ్యానము వ్రాసెను. తమకారికలకు తామే వృత్తులనువ్రాయుట ప్రాచీనుల కలవాటు. బ్రహ్మసిద్ధి మొదలగు గ్రంథము లీకోటికి జెందినవే. పెక్కురు గ్రంథకర్తలు కారికలుకాని వాక్యములనుకూడ వాక్యపదీయమందలివని యుదాహరించుచున్నారు. కాశీయందు ముద్రితమగు వాక్యపదీయగ్రంథమున బ్రహ్మకాండమందలి కారికలకు ఏదో యొకవృత్తి ప్రకటింపబడియున్నది. ఆవృత్తిని పుణ్యరాజకృతమగు 'ప్రకాశ'మని పరిశోధకుడు చెప్పినాడు. బ్రహ్మకాండము తుదను 'ఇతి శ్రీమహావైయాకరణ హరివృషభవిరచితవాక్యపదీయప్రకాశే ఆగమసముచ్చయో నామ బ్రహ్మకాండం సమాప్తం' అని ముద్రింపబడినది. నిజము విచారింప భర్తృహరి రచించినదే ఒకవృత్తికలదు. విస్తృతమగు నావృత్తినే సంగ్రహించి యిందు ముద్రించిరని తెలియుచున్నది. మద్రపురియందలి రాజకీయప్రాచ్యలిఖితపుస్తకాలయమున నీకారికలు భర్తృహరిచేతనే రచింపబడినవృత్తితోపాటు లభించుచున్నవి దానియొక్క సంగ్రహమే ముద్రితము.

వ్యాఖ్యానమును వ్రాసిన వృషభదేవుడు విస్తృతమగు వృత్తికే వ్యాఖ్యానము వ్రాసెనని అందలిప్రతీకములను గ్రహించుటచే స్పష్టముగ తెలియుచున్నది. క్రొత్తగ దొరకిన పుస్తకమందు బ్రహ్మకాండతుదను 'ఇతి హరివృషభమహావైయాకరణోపరచితే వాక్యపదీయే ఆగమసముచ్చయో నామ బ్రహ్మకాండస్సమాప్తః' అని యొకవాక్యము కాననగుచున్నది. భర్తృహరికే హావృషభుడనికూడ నొకపేరుండవచ్చునని చెప్పవీలున్నది. కావున అతనివృత్తిని పరిశీలించినచో భర్తృహరిబౌద్ధుడను కొందరి ప్రవాదముకూడ తొలగును.

పింగళి లక్ష్మీకాంతం గారు, M. A

ఆంధ్రభాష, ద్రావిడమా, ప్రాకృతమా యను ధర్మసందేహ మొకటి జిజ్ఞాసువులైన మనపండితుల ప్రస్తుతము పట్టి బాధించుచున్న విషయము. పూర్వము, మనవైయాకరణులు, ఆంధ్రము తత్సమ తద్భవ దేశ్యాత్మకమనియు నందు, సంస్కృతసమ ప్రాకృతసమములు తత్సమములనియు, సంస్కృతభవ ప్రాకృతభవములు తద్భవములనియు, దేశవ్యవహారసిద్ధమైనది దేశ్యమనియు నిర్వచించిరే కాని, యది ద్రావిడమగునో కాదో వారు విచారణ చేయరైరి. వారికాశంకయుఁ బొడమియుండదు.

అట్లుండగా, బిషప్పు కాల్డువెలు, తెలుఁగుభాష, ద్రావిడభాషావర్గమున జేరినదనియు, ఆవర్గము, సంస్కృతముకంటెను ప్రాకృతముకంటెను స్వతంత్రమైన సంప్రదాయము కలదనియు, చిల్లరబాసలటుండ, అఱవము, తెలుఁగు, కన్నడము, మళయాళము, అను నాల్గు పెద్దభాషలు, తత్సంప్రదాయమునుబట్టి సజాతీయములనియు నొక సిద్ధాంత మేర్పఱిచెను.

లోకమున, భాషాతత్త్వము లారసి, తజ్జన్యజనకభావములను, సోదరభావములను నిర్ణయించు పండితులెల్లరు సాధారణముగ రెండు ప్రమాణముల నాధారముగఁ గైకొందురు. అందు మొదటిది శబ్దసామగ్రి, రెండవది పదవాక్యకల్పనాసరణి. కాల్డువెలు గూడ ఆ రెండు ప్రమాణములు పురస్కరించుకొనియే పైన పేర్కొన్న సిద్ధాంతము నేర్పఱిచెను. ఆంధ్రాదులైన నాల్గుభాషలలోని దేశ్యశబ్దజాలము, కొంతసరూపమైయుండుటయు, ఆభాషల పదకల్పనాపద్ధతియు, వాక్యఘటనాసరణియు సమానమై, సంస్కృత ప్రాకృత సరణికంటె భిన్నముగా నుండుటనుబట్టి, యాపండితుడు ద్రావిడభాషలు స్వతంత్ర సంప్రదాయబద్ధములనియు, సాజాత్యములనియు నిర్ణయించెను.

ఈ సిద్ధాంతము ఊతినేల వేరు పాఱిన వృక్షమువలె భాషాప్రపంచమున స్థిరముగా నెలకొనెను.

ఇటీవల డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు కొంత శ్రమచేసి, కాల్డువెలు సిద్ధాంతము పూర్వపక్షము చేయు ప్రాకృతవాదమును వెలయించిరి. ఆ ద్రావిడమనునదకూడ నొక ప్రాకృత విశేషమేయని వారిమతము. ఈమతము, నూతన భావమగుటచే నింకను సర్వజనసమ్మతము కాలేదు. సత్యదర్శనమే జిజ్ఞాసకు లక్ష్యముగాన, ఆనారాయణరావుగారి మాటలను ద్రోసిపుచ్చక, పండితులు విచారింపదగుదురు.

ఆంధ్రమున దేశ్యముగా గ్రహింపబడిన శబ్దజాలము, ప్రాకృతభవమే యని నారాయణరావుగారు కొంతవఱకు సమర్థించి చూపిరి. ఆవిషయమై యింకను బరిశోధనలు సాగు

నేని దేశ్యశబ్దప్రపంచమంతయును ప్రాకృతభవమే యని తేలునేమో? అట్లే యగుచో, మన పదవాక్యకల్పనాదివిశేషములకును, ప్రాకృతపదవాక్యకల్పనాదివిశేషములకును సామరస్యము పొసగునా, పొసగదా యను దానిని గూర్చి పిమ్మట విచారింతము.

మొదలు, మన దేశ్యపదములు పోల్చి చూచుట యేప్రాకృతముతో? షడ్విధప్రాకృతములలో నేని, ఆంధ్రమునకుగాని, సాధారణ ద్రావిడమునకుగాని, ప్రభవకారణమై యుండును? గాథాసప్తశతి, సేతుబంధము లోనగు కొన్నిగ్రంథములు దక్క ప్రాకృత సాహితీగ్రంథములు పెక్కులభింపవు. కాగా మన మేప్రాకృతసాహిత్యమును ఆధారముగా గొని యీపరిశోధన చేయవలెను?

ప్రథమమున, పాళీభాష మనకు శరణ్యమగునని నాయభిప్రాయము. ఆభాష ప్రాచీనతరమైన ప్రాకృతము. అందు గ్రంథజాలమును విస్తారము గలదు. అదియు బౌద్ధధర్మాశ్రయమగుటచే దొల్లిటినుండియు సహజశుద్ధస్వరూపమును గోల్పోక నిల్చియున్నది.

మఱియు నాగరాజులు, ఆంధ్రరాజ్యము పాలించినకాలమున బౌద్ధమతమున కాశ్రయమిచ్చిరి. అది క్రీ. పూ. ఐదాఱుశతాబ్దుల ముచ్చట. పిమ్మట క్రీ. పూ. రెండవశతాబ్దిని ఆంధ్రభృత్యుడను రాజొకడు మగధరాజ్యమును జయించి యేలెను. ఇవి చరిత్రప్రసిద్ధములైన విషయములు. కనుక మనమును, మాగధులమును బూర్వకాలమున సన్నిహితబంధువులము. మాగధులభాషయే మాగధి. అదియే పాళీభాషకు మొదలింటిపేరు. కాగా, పాళీభాషకును, ఆంధ్రభాషకును ఏమేని సంబంధముండునేమో విచారించుట లెస్స. ఓపికమై పనిచేయుచో ప్రయత్నము రిత్తపోవదు. వింతగొల్పు విషయములెన్నో బయల్వెడలుచుండును. సిద్ధాంతములు చేయుటనుగూర్చి పదపడి సమయమగునెడ విచారింతము. నిదర్శనార్థము కొన్ని పదములు చూపెదను. చిత్తగింపుడు.

1. బొంది=శరీరము. ఇది శబ్దరత్నాకరమున దేశ్యముగా నుదాహృతమై యున్నది. కాని యిది పాళీభాషలో నున్నది.

ఉదా—మహతీ వత తే బోంది
నచ పఞ్ఞా తదూపికా—

(శుంశుమారజాతక గాథ)

అర్థము—నీశరీరము పెద్దదేకాని, ప్రజ్ఞ తదనురూపము కాదు.

2. పస్తాయించు—శబ్దరత్నాకరమున, నిది దేశ్యక్రియగా నీయబడినది. దీనికి ఆనిఘంటువునలేని యింకొకరూపముగూడ నున్నది. "పచ్చాయించు"అని ఆరూపము వాడుకలో నున్నది.

ఈ క్రియయు పాళీభాషలో నున్నది.

ఉదా—సుంసుమారో పజ్ఝాయంతో
అత్తనో నివేసనట్ఠానంగతో.

(శుంశుమార జాతకము)

=(మొసలి పస్తాయించుచు దన నివేశన స్థానమునకు బోయెను.)

3. ఓర—ఇది యుగళపదమనియు (కొన్నియర్థములయందు దేశ్యమును, మఱికొన్ని

యర్థములయందు వైకృతమును నైనపదము.) దేశ్యమయినపుడు "అంచు," "ప్రక్క" అని యర్థమనియు శబ్దరత్నాకరమున నున్నది.

"దిగువ" "అంచు" "ప్రక్క" అను నర్థమున, పాళీభాషలోగూడ ఈపదమున్నది.

ఉదా—దీపకస్స ఓరతో నదీమజ్ఝే ఏకో పిట్ఠి పాసాణో అత్థి. (వానరేంద్ర జాతకము)

(లంకయోర, ఏటినడుమ, నీటిమట్టము నకుపైగా నొకతాటిబండ కలదు.)

(4) కూల్చు=పడజేయు; చంపు.

(5) ఒడ్డు=పఱచు; ఒగ్గు; సాచు.

ఈక్రియలును, దేశ్యమనియే శబ్దరత్నాకరము. ఇవియు పాళీభాషలో కానవచ్చుచున్నవి.

ఉదా—పోట్ఠపాదో ముమ్మురే ఉపకూలితో (పోష్ఠపాదుడు, దాలిగుంటనిప్పులో గూల్పబడెను).

ఉదా—మిగలుద్దకో, పాసం ఓడ్డేత్వా అగమాసి (మృగలుబ్ధకుడు పాశమొడ్డి వెళ్లెను).

ఇవి దిక్ప్రదర్శనముగా జూపితిని. ఇట్టివి మఱియెన్నేని కలవు. మఱియెన్నేని లభింపవచ్చును.

ఇప్పుడు, మనలో, పెద్దలు కొందఱు పాళీగ్రంథములు, తెలిగించుచున్నారు. అది యెంతేని ప్రశంసార్హమైన కార్యము. వారు, ఆంధ్రశబ్దములతో సారూప్యముగల యిట్టి పదములను సేకరించి ప్రచురించెదరేని భాషా చరిత్రకెంతేని యుపయోగించును.

---

## దిద్దుపాటు

ప్రమోదూత మాఘమాసపు భారతిసంచికలో 'కాళిదాసుఁడు - ౨ ఋతుసంహారము' అను వ్యాసమున ౨౨౮ పుటయందు ౨ వ కాలమున ౨౫ వ పంక్తిలో 'మేఘసందేశమునందలి' 'రతివిలాపమునకును' అనుపదములకు నడుమ 'విప్రలంభమునకును, కుమార సంభవములోని' అనుపదముల జేర్చి చదువుకొనవలెను.

—సం. భారతి.

---



౮. రాణా ప్రతాపసింహుఁడు - శక్తసింహుఁడు

["టైమ్సు ఆఫ్ ఇండియా" ఉగాదిసంచిక (1931) యందలి త్రివర్ణచిత్రమునుండి.]

# కన్నెప్రేమలు

జనమంచి కామేశ్వరరావుగారు

౧

నిరుటికన్న ఈ సంవత్సరం తనశిరము పెరిగి పెద్ద దయిందో లేక చీకాకుచేత దిమ్మెక్కి పెద్ద దైనట్టు తోచిందో కాని, హెన్రీ తె౹సుకొన లేక పోతున్నాడు. అతనిని తలమీది గడ్డిటోపీమాత్రం చెడ్డ చికాకు పెడుతోంది. అది అతని ఫాలభాగాన్ని బిగిసి కొని వుండడంచేత, కుట్టడం మొదలుపెట్టి, కణతలలో చిన్న నొప్పిని లేవనెత్తింది.

అలపుచేత హెన్రీ Third Class పెట్టెలో కెక్కి, టోపీతీసి సామాను కానులోనికి విసిరేసి, చేతికి ఉన్న Gloves, చేతిపెట్టె, పక్కను పెట్టుకొని కూర్చు న్నాడు. రైలుపెట్టె అసహ్యంగా ఉంది. దుర్వాసనలు కొడుతున్నవి. బండి కదలడాని కింకా పదినిమిషాలు వ్యవధి. ఎదురుగా Book-stall ఉన్నది. క్రొత్త పుస్తకములు చూడవలె ననే కౌతుకంతో అచ్చటికి వెళ్లాడు.

సూర్యకిరణాలు స్టేషను గ్లాసు తలుపులమీద నాట్యమాడుతూ పంచరంగుల రేకల్ని చిమ్ముతున్నాయి. చిన్న కుర్రాడు సజ్జలో పెట్టుకొని గులాబీల నమ్ము చున్నాడు. ప్లాటుఫారం ఇటూ అటూ పచారు చేయు చున్న స్త్రీపురుషులతో కలకల్లాడుతోంది.

అది వసంతదినం. ఆశుభదినంలో అందరి వదనాలు చల్లని నవ్వువెన్నెలలనే చిమ్ముతున్నవి. వారిదేహములు పసిమివన్నె దాల్చినవి. కంఠస్వరాల్లో మాధురు లొలుకు చున్నవి. లండను పట్టణపు జనులు నవజీవ కళలతో తారాడుచున్నారు. వారి శరీరాల్లో క్రొన్నెత్తురు ప్రవ హిస్తున్నది. ఆశా తాండవంచేస్తున్నవి వారి హృదయాలు.

హెన్రీకి పుస్తకములన్న ఆసక్తి. ఐనను అతను చదివిన గ్రంథములే కొద్దిపాటి. పైగా అతని గ్రంథాలయ సర్వ స్వమంతయు అరడజను పుస్తకముల కన్న ఎక్కువుం డవు. కాని గ్రంథ పఠనాభిలాష కలవాడు కావడంచే ఏపనిమీద ఎక్కడికి వెళ్లినా, పొరుగునున్న పుస్తకాల యమునకు పోయి పుస్తకములు తిరుగ వేయడం అతని కలవాటు. అంచేత చదివినా చదవకపోయినా చాల పుస్తకముల పేర్లు అతనికి కంఠస్థము. హెన్రీ విమర్శన దృష్టి కలవాడు. రసజ్ఞుడు. ఏపుస్తకములో ఎంత సత్వ మున్నదో అధికారుల ఎదుటనే ఉగ్గడిస్తూ ఉండేవాడు. ఏ క్రొత్తపుస్తకం లభించినా రసవంతమైన ఘట్టాలను ఏర్చికోవడంలో ఉపజ్ఞ కలవాడు.

అచ్చట కూర్చొని ఒక పుస్తకం తీశాడు. అది పద్య కావ్య సంపుటము.

నీమృదుకోమలామలరూప
దర్శనాభిరతిని, పుల్గునయి
రెక్కల దాటిచి, సొక్కి సోలుచు
నీమ్రోల వ్రాలుదు * * *

ఎందుకో! ఈవ్యర్థ ప్రసంగము
లెందుకో! ఈయూహాపోహాలు
వేడియూర్పులె వెచ్చనూర్పుచు
వేచుకొని యుండన్–

నీరవయామినీహృదయాన
నియమశూన్యం బయిన నిద్దుర
సద్దులో మృదులోక్తు లాడుచు
నవ్వుకొనుచుందున్ * * *

మసక వేకువ కొసరుచూపుల
దెసలుకొసలను దివురజూచుచు
ఇచటనే! ఇచటనే! నీకొఱకై
పేదవడి యుందున్.

సుప్త సౌఖ్యము చూరగొనుచూ
స్వప్నమాధురి ననుభవించుచు

అనిలవీచుల కనుల మూయుచు
కలల వెలుంగుదున్.

పై పద్యము చదువుకున్నాడు. మామూలు పద్యాల్లా దాన్ని చదివి వదిలివేయలేకపోయాడు. పదముల కూర్పులో ప్రౌఢిమ లేకపోయినా దాని భావపరిమళము అతన్ని ఆనందింప చేసింది. ఆలోచనలో పడ్డాడు. ఈపద్యముకవి తల్పముమీద పండుకొని, మందపవన కుమారులు మసల్తూ ఉన్నపుడు, సూర్యభగవానుడు లేతకరాలతో అతన్ని లేపుతూంటే స్వప్నావస్థ తొలగిపోతూ, జాగ్రదవస్థ పొందుతూన్నపుడు వ్రాసినట్టుంది. "ఔను. ఇది అంతే అయివుండాలి. ఈపద్యము స్వప్నరూపం పొంది చిరునవ్వు చిలుకుతూ ఉన్నట్టుంది" అనుకున్నాడు హెన్రీ. ఆపద్యముకేసి చూస్తూ, ఏకసంథాగ్రహణము చేయ ప్రయత్నిస్తూ, జ్ఞాపకమునుండి దొర్లిపోయిన మాటలు మళ్లీ వల్లె వేస్తూంటే ఇంతలో రైలు కూసింది. బుస్సలు కొడుతూన్న పాములా పారిపోతూంటే చూసి 'ఓరిదేవుడా!' అనుకొని పుస్తకం అక్కడ పారేసి పరుగువారాడు. చేతిలో జెండా, ఈలపట్టుకొని పెట్టెముంగదల నిల్చున్నగార్డు ఎగరోజుకొనుచూ వస్తూన్న హెన్రీని దొరకపుచ్చుకున్నాడు.

* * *

హెన్రీ క్రొత్తపెట్టెలో కూర్చున్నాడు. అందులో తనచేతి పెట్టె గాని, టోపీ గాని, Gloves గాని ఏమీ లేవు. కాని తన కెదురుగా ఒకమూల, పెట్టెగోడకు జేర్లబడి కూర్చున్నది. ఒకదివ్యసుందరి, ఆమె అతనికేసి చూస్తున్నదని తెలిసుండీ అతనికిమాత్రం ఆమెకేసి చూడ్డానికి ధైర్యం చాలిందికాదు.

"నే నేదో పిచ్చివాడినని భావిస్తోంది కాబోలు!— రైలులోనికి తోసుకువచ్చిపడ్డందుకు, టోపీయైనా లేకుండా,—అందులోను సాయంసమయాన" అనుకున్నాడు హెన్రీ. తన్ను చూసి తనే నవ్వుకున్నాడు. సరిగాకూర్చుండలేక పోయినాడు. మనస్సులో ఆందోళన రేగింది. దాన్ని ఎల్లాగైనా అణచుకుందామనే ప్రయత్నంలో నిర్లక్ష్యభావాన్ని నటిస్తూ, జేబుల్లో చేతులుపెట్టుకొని, గోడకు ఏదో బొమ్మంటే దానికేసి చూస్తూ పెదవివిరిచేసి 'బాగాలే' దన్నట్టుగా విసుగుతో చికాకు పడ్డాడు. ఇంతసేపూ ఆమె తనకేసి చూస్తూండడం కనిపెట్టి హెన్రీ ఒకచిన్నవాలుచూపు ఆమెమీద ప్రసరింపచేశాడు. చటుక్కున ఆమె మొగము కిటికీవైపు త్రిప్పివేసికొన్నది. ఆమె తళుకారుగళంలో మెరిసింది. ఆగళాన్ని హెన్రీ అదే తేరి పార చూడ్డం మొదలుపెట్టాడు. ఆమె శరీరాంచలములు ముడుచుకొని కిటికీని అంటిపెట్టుకొని కూర్చున్నది. పసిమిరంగు నురగ తరగల్లా అల్లాడుచున్న కేశములు చెక్కిళ్లపైనుండి భుజములమీదకు పడుతూంటే అల్లాగే కిటికీలోనుండి పైకి చూస్తోంది. సిల్కు Glove వున్న ఒకచేతిలో చిన్న బొట్టుపెట్టె లాంటిది వుంది తోలుది. దానిమీద ఎడ్నా అని పేరు ఉంది. రెండవ చేతితో కిటికీని పట్టుకున్నది. ఆచేతికి Swiss గడియారముంది. ఆకుపచ్చని కోటు వేసుకున్నది. పువ్వులు ముడిచిన టోపీ ధరించింది. ఆమె ఆకృతి నఖశిఖ పర్యంతము పరిశీలిస్తున్నా అతను ఆపద్య చరణాలని మాత్రము లోలోన పాడుకుంటూనే ఉన్నాడు. "లండనులో ఏదైనా స్కూల్లో చదువుకుంటున్నది గాబోలు! లేకపోతే ఏదైనా ఆఫీసులోపనో" అని ఆమెగురించి తలపోస్తున్నాడు.

ఇంతసేపూ అతన్నెక్కువ ఆకర్షించినవి తరగల్లా జిగ్ జిగ్ మంటూ మెరసే ఆమె కేశములు. ఊరికే అదే తేరిపార వాటికేసి చూడ్డంచేత అతని నేత్రాలు మధువుగ్రోలి మత్తెక్కిన తుమ్మెదల్లా ఉన్నాయి. వాటికి రెప్పవాల్పు లేదు.

హెన్రీ ఆమెనుగురించి తలపోసుకొంటూ ఉంటూంటే ఆమె ముఖ మటువైపు త్రిప్పింది. ఇద్దరి పరస్పరావలోకనాలు మధ్యే మార్గములోనే, చుంబించుకొన్నవి. అంత ఆమెలో ఆనందం ఉబికింది. అది ముఖం మీద ప్రస్ఫుటమైంది. దాన్ని దాచేద్దామని తల వాల్చికొన్నది. ముఖము త్రపాముగ్ధమైనది. చెక్కిళ్లు కెంపెక్కినవి. ఇదంతా చూసి హెన్రీ, సిగ్గుతో, నవ్వుకున్నాడు.

"మీతో మాటాడాలి, ఆడాలి, ఆడాలి" అంటూ పొరబాటున ప్రక్కనున్నదనుకొని, టోపీమీదకు చెయ్యి

పోనిస్తూ 'అయ్యో' అని తన మందమతికి నవ్వుకున్నాడు. ఆనవ్వు కొంత అతనికి ధైర్యము కూర్చింది.

"క్షంతవ్యుడను. నాకు చాల విచారంగా ఉంది నేను చేసిన అపరాధానికి. మీతోపాటు ఒక్క పెట్టెలోనే కూర్చుని ఇంతవరకూ ప్రయాణం సాగిస్తూ మీకు నేనెందు కంత తొందరగా బండి ఎక్కానో—టోపీయైనా లేకుండా—ఆ సంగతి చెప్పలేక పోయాను. అంత దుడుకుతనంగా నేలోనికి రావడం కొంత మిమ్మల్ని కలచి వుంటుంది. నేను మీకేసి చూస్తున్నాను, క్షమించాలి. నాకు మనుష్యులకేసి తేరి పార చూస్తూ ఉండడ మోదు రలవాటు. నేను అల్లా మీకేసి చూడ్డం గురించి కాక, నేనంత తొందరగా పెట్టెందు కెక్కానో ఆవిషయం" అంటూ నవ్వుతూ మాట్లాడుచున్నంత సేపూ ఆమె టోపీకేసి చూస్తూ, "తప్పక చెప్తాను" అన్నాడు.

ఒకనిమిషం సేపు ఆమె మరేమి మాట్లాడలేదు. తరువాత సిగ్గుతో సన్నంగా "మరేమి ఫర్వా లేదండి" అన్నది. రైలు లండను పట్టాపు ఇళ్లూ, ఫ్యాక్టరీ గొట్టాలూ దాటి రయ్‌మని వెళ్లిపోతున్నది. చల్లనిగాలి వీస్తూఉంది. పొలముగట్లూ,పల్లె ప్రదేశాలు దాటి నడుస్తూ ఉన్నది రైలు. సూర్యాస్తమయము. హెన్రీ రొదలోని రొదలు రైలు టక్ టక్ శబ్దానికి శ్రుతులు వేస్తున్నాయి. హెన్రీకి ఆనిశ్శబ్దం దుర్భరంగా ఉన్నది. ఆమె మూగనోము పట్టిన ముగ్ధకన్యలా కూర్చున్నది. ఆమె ఊరికే కూర్చుని తన గురించి చెడ్డ అపోహలు పెంచుకుంటున్నదేమో! అని భయపడుతూ హెన్రీ తాను అనింద్యుడని ఆమె క్రమముతో తెలియజేయ పూనుకొని ముందుకు వంగి, చేతులు మోకాళ్లకు పెనవేసి మాట్లాడ్డం మొదలు పెట్టాడు: "ఇల్లా చూడండి నేను, నాచేతిపెట్టె అన్నీ Third Class పెట్టెలో పెట్టుకొని ఎదురుగా ఉన్న book stall ఒకసారి చూద్దామని పోయాను" అంటూ తన సొదంతా ఆమెకు చెప్పాడు. హెన్రీ చెప్తూ ఉన్నంత సేపూ ఆమె తలెత్తుకొని వింటున్నది. హెన్రీ ఆమె నీలాల్లాంటి కళ్లు చూస్తూనే చెపుతున్నాడు తన సొదంతా. ఆమె పెదిమల్లోంచి చిరునవ్వు తొంగిచూస్తూ ఉన్నది. "ఓహో! మోహశీలా! ఎంత ఆనంద దాయినివే నీవు" అంటూ హెన్రీ హృదయం ఆమెను చూస్తూ ఉన్నంతసేపూ పాడుతూనే ఉంది. పాడిపాడి హృదయ ముద్రిక్తమయింది. ఆ ఉద్రేకంలో ఉఛ్ఛ్వాస నిశ్వాసాలు విడిస్తే ప్రాణాలెగసిపోతాయేమో అనే భయంచేత కొంతసేపు ప్రాణాయామం పట్టాడు హెన్రీ.

"ఆచేతిపెట్టెలో మరేమీ విలువైన వస్తువులు లేవుగదా!" అందామె సన్నగా, గంభీరంగా.

పెదవి విరిచి, "ఏమీ లేవు. ఏవో నేను రాసినవి కొన్ని పిచ్చిపిచ్చి బొమ్మలున్నాయి. ఆఫీసునుంచి ఇంటికి పట్టుకు పోదామని అందులో పెట్టాను. పోతే పోయినవి......నాటోపీ పోయినందుకు మాత్రం నే తలతీసి మూసుకుంటూన్నాను. ఇప్పుడు సుఖంగా ఉంది బాబు. అది పెట్టుకున్నంత సేపూ నొక్కి, కుట్టి చేడ బాధపెట్టేది" అన్నాడు హెన్రీ. "అవును. అదిగో పాపం! అక్కడ మచ్చకూడా పడింది" అని అతని ఫాలభాగం కేసి వ్రేలుతో చూపిస్తూ నవ్విందామె. ఓహో! ఆమె అన్నమాట లతన్ని పులకితుణ్ణి చేశాయి. వేరువేరు భావగతులకు లోనయ్యాడు. ఆనందోన్మత్తుని వలె నున్నాడు. కొంతసేపు నిమ్మకు నీరెత్తినట్లు కూర్చున్నారు. నిశ్శబ్దం. ఐతే నేమి! నునువెచ్చని గాలుల్ని ఇస్తూ జీవాలు పోసే నిశ్శబ్దమది. హెన్రీ ఆనిశ్శబ్దంలో ఎంత ఆనందం అనుభవించాడో! 'అదుగో! పాపం! అక్కడ మచ్చకూడా పడింది' అన్న ఆమెమాటలు వారిద్దరకూ ఒక అపూర్వమైన సంబంధం ఏర్పరిచాయి. ఇప్పుడు వారు నూత్న పరిచితప్రియులులా ఉన్నారు. ఆమె ఊరికే ముసిముసి నవ్వులు కురిపిస్తోంది. ఆమె నవ్వు మొదట కళ్లల్లో కనిపించి, ఎవ్వరికీ తెలియకుండా చెక్కిళ్లపైకి బారి, పెదవులపై అట్టె నిలిచి పోతూ ఉంటుంది. హెన్రీ వెనక్కి జేర్లబడ్డాడు.

'ఓహో! జీవితం అమృతం, చిత్రం.' అన్నమాటలు అతని రుద్ధ కంఠాన్ని వీడి, రైలు ఘోష వీడి బైట పడ్డాయి. అంతలో రైలు తొలిచిన కొండల్లోంచి పోతూ ఉన్నది. ఆమె ముందుకు వంగి అతనితో మాట్లాడుతూ ఉంది.

"నే అల్లా అనుకోను. జీవితము నాకమృతం, చిత్రం అనిపించడం లేదు. నాకు జీవితంలో నిరాశ, నిస్పృహ తప్ప మరేమీ లేదు. అందులో కొన్ని నెలలనుంచి నాకు జీవితం వెగటుగా తోస్తోంది" అందామె.

తాత్కాలికంగా పెట్టెనిండా చీకట్లు క్రమ్మాయి. హెన్రీ "ఏమిటి! అల్లా అంటావు" అన్నాడు.

"ఓహో!........" అంటూ ఆమె ముడుచుకొని, నవ్వుతూ తల త్రిప్పేసింది. తా నీరైలు రొదలో మాట్లాడలేక పోతున్నానని.

"సరే" అంటూ తలూపి అతను వెనక్కి జేర్లబడ్డాడు. కొంతసేపటికి రైలు కొండల్లోంచి బైటపడింది. అక్కడక్కడ దూరాన్ని దీపాలూ, ఇళ్లు కనబడుతున్నాయి. హెన్రీ ఆమె మాట్లాడుతుందేమో అని చూస్తున్నాడు. కాని ఇంతలోను ఆమె లేచి కోటుబొత్తాయిలు పెట్టుకొని, టోపీ చేతులతో సద్దుకుంటూ ఇటూ అటూ కొద్దిసేపు వూగి, "నే నిక్కడ దిగిపోతాను" అంది. ఆమెవెళ్లిపోవడమంటే హెన్రీకి చాలకష్టమనిపించింది. రైలు నింపాదిగా స్టేషను చేరుతూ ఉన్నది. పరిసరములోని దీపాలుదగ్గర పడడంచేత కలకల్లాడుతున్నాయి. ఆమె పెట్టె పొడుగునా నడచి తలుపు చేరింది.

"ఇల్లా చూడండి. మళ్లీ మిమ్మల్ని చూడలేనా" అని దగ్గుత్తికతో నంటూ హెన్రీ తానుకూడ లేచి ఒక చేతితో సామాను కాచుపట్టుకొని,

"అబ్బా! మళ్లీ మిమ్మల్ని చూడాలండీ" అన్నాడు. బండి ఆగుతున్నది. ఆమె గుక్క తిప్పుకోకుండా, "నేను రోజూ సాయంకాలమప్పుడు లండనునుండి వెళ్లిపో వస్తూంటాను" అంది.

"మీరే! మీరే! మీరే నిజంగా!"

అతని తొందర ఆమెను భయపెట్టింది. దాన్ని ఎంతో అణచివేయాలని ప్రయత్నించాడు. ఇంతలో, ఆమె వెళ్లిపోతున్నది గదా! కరస్పర్శ చేద్దామా? వద్దా? అని అదో సందేహం కలిగింది. రైలు ఆగిపోయింది. ఒకచేతిలో చిన్నపెట్టె ఉంది. రెండవచేత్తో తలుపు గొళ్లెము పట్టుకొని దిగిందామె. మరి మాటా చూపూ ఏమీ లేకుండానే ఆమె తొందరలో చల్లగా నడచిపోయింది.

౨

శనివారాదివారాలు, ఆఫీసుకు సెలవురోజులు. సోమవారం సాయంకాలము పగలంతా పనిచేయడంచేత అలపుతో హెన్రీ స్టేషనుకు వచ్చాడు. హెన్రీ ఆఫీసునుండి స్టేషనుకు దారిపట్టుతూ ఉన్నంతసేపూ కొన్ని వెర్రి భావాలతని హృదయాన్ని కలుస్తూ, వెన్నంటి వస్తూనే ఉన్నాయి.

"ఈ బండిమీదే వస్తానని చెప్పలేదే!"

"తీర్రా నేను బండెక్కడం, ఆమె మరో బండి మీద నాకెదురవడం తటస్థించదుగదా!"

"మరెవరూ ఆమెప్రక్క నుండరు గదా!"

"నిన్ను గురించే ఈ రెండు రోజులూ తలపోసిందనుకుంటా వెందుకు? పిచ్చిగా!"

"ఆమె కనుపిస్తే ఏమి మాట్లాడుదా మనుకుంటున్నావు?"

చివరకు హెన్రీ ధ్యానగీతి పాడ్డం మొదలుపెట్టి,—

దేవా! దేవా!
నన్నామె కనుసన్న వెలుగులో
మెరసిపోనీవోయి దేవా! దేవా!

అని దీనంగా పరిశుద్ధాత్మను వేడుకున్నాడు.

స్టేషనులో ఇటూ అటూ జనం నడాడుతున్నారు. బొగ్గు వేసుకున్న ఇంజనులు తెల్లని పొగలను తెరలు తెరల్లా చిమ్ముతున్నాయి. అవి చితికి తెల్లమేఘాల్లా ప్రాకి ఆకాశాని కందాన్ని చేకూరుస్తున్నాయి.

హెన్రీ చాల చికాకుపడ్డాడు. ఆమెజాడేనా కనబడదు. పాపం! మతిభ్రంశం కలిగింది. ఉపశాంతికోసం కాసేపు కళ్లు మూసుకొని కూర్చుందా మనుకుంటున్నాడు. ఇంతలో ఆమె ఒకచేతితో తోలుపెట్టె పట్టుకొని, మందగమనంతో హెన్రీ ప్రక్కనుంచే రైలు వైపు వెళ్లుతున్నది. 'హెన్రీ ఆమె గాలి సోకడంతోనే

దిగ్గున మేల్కొని లేచి ఆమెకోసం చూస్తున్నాడు. దగ్గరకు వచ్చి తన్ని పలకరిస్తుందో! లేదో! చూద్దామని.

ఆమె అతన్ని చేరి సిగ్గుతో నింపాదిగా "అవి మళ్లీ దొరికాయా ?" అంది.

"ఆ, నీదయవల్ల — మీదయవల్ల అన్నీ దొరికాయి" అంటూ హెన్రీ నవ్వుతూ, పోయి దొరికిన తన చేతి పెట్టె, gloves ఆమెకు చూపించాడు.

ఇద్దరూ ఒకరిప్రక్కనే ఒకరు నడుస్తూ ఒక ఖాళీపెట్టెలోని కెక్కారు. ఒకరి కెదురుగా ఒకరు కూర్చున్నారు. మాటలు సరిసరి. ముసిముసి నవ్వులు. రైలు కదిలింది. నింపాదిగా స్పీడు హెచ్చింది. రంయ్ మని పోతోంది. హెన్రీ ముందు మాట్లాడ్డం మొదలు పెట్టాడు.

"చాల అన్యాయం సుమీ! నేనింతవరకూ నీపేరు తెలుసుకోకుండా ఉండడం" అన్నాడు. భుజంమీద పడిన కేశములు వెనక్కి సద్దుకుంటూంటే ఎందుచేతనో ఆమెచెయ్యి వణకుతున్నది. అది కనిపెట్టాడు హెన్రీ. బొటనమోపుగా మోకాళ్లు ముడుచుకొని కూర్చున్నది. హెన్రీకూడ అల్లాగే కూర్చున్నాడు. ఇద్దరూకూడ శరీరకంపనాలను అణచిపెట్టుకుందామనే ప్రయత్నంలో నే ఉన్నారు.

అప్పుడామె "నాపేరు ఎడ్నా" అంది. అంత హెన్రీ "నాపేరు హెన్రీ" అన్నాడు.

కొంతసేపు నిశ్శబ్దం వారిసంభాషణను దొంగిలించింది. ఆకాస్తసేపులో వారిద్దరూ ఒకరిపేరు ఒకరు వల్లించుకొని హృదయపేటికల్లో పదిలపరచుకున్నారు.

తల ఒకప్రక్కకు వాల్చి హెన్రీ "మరోసంగతి నిన్నడగాలని వుంది. నీవయ స్సెంత?" అన్నాడు.

"పదహారు దాటాయి. మీకో!" అందామె.

"దగ్గరగా నాకు పద్ధెనిమి దుంటాయి" అన్నాడు.

"అబ్బా, చాల వేడిగా ఉందే" అంటూ ఆమె చేతుల కున్న gloves తీసేసి చేతుల్లో చెంప లెట్టుకుంది.

ఇప్పుడు వారినేత్రములు వెరపును చూపడం మానివేశాయి. ఒకరి నొకరు నిర్భయంగా చూసుకుంటూ కూర్చున్నారు. కాని వారిశరీరాలు మాత్రం కంపితమౌతూనే ఉన్నాయి. ముందుకు జారి బంగారపు సరిగంచులా తళతళలాడే ఆమెకేశములు ముఖాన్ని సగం కప్పుతున్నాయి.

"నీ విం కెవరు మం దెవరినైనా ప్రేమించావా" అంది ఎడ్నా.

"ఎప్పుడూ లేదు. నువ్వు ?" అన్నాడు హెన్రీ.

"నా జీవితంలో ఎప్పుడూ లేదు." అంటూ తల త్రిప్పివేస్తూ, "అదెప్పటికీ వీలుకూడ కాదనుకునేదాన్ని" అందికూడాను. హెన్రీ మాట్లాడ్డం మొదలుపెట్టాడు. మాటలు ఝురీవేగంతో పొరలుతున్నాయి.

"అయితే నువ్వు మొన్న శుక్రవారంనుంచీ ఏమి చేస్తున్నావు. శనివారాదివారాలు, ఇవ్వేళ ఇంతవరకూ ఏమి చేస్తున్నావు చెప్పవూ?" అన్నాడు హెన్రీ.

ఆ ప్రశ్నలకు సమాధానమే లేదు. తలమాత్రం ఆడించి నవ్వుతూ, "ఉహుం, నువ్వు ముందు చెప్పు" అంది.

"నేనా ?" అంటూ హెన్రీ తానుకూడా చెప్పలేననుకున్నాడు. దుర్భరక్లేశంతో ఈదుకొనివచ్చిన ఆవిరహవారిధి మళ్లీ దాటడం ఎల్లాగ? అనిపించింది.

"అబ్బా! నే నేమీ చెప్పలేను" అంటూ తల త్రిప్పేశాడు. కాని నవ్వుతో వెలుగుతూ ఉన్న ముఖంతో "కాని అదంతా బాధ, దుర్భర సంతాపం" అని మాత్రం అనగలిగినాడు.

అంత ఎడ్నా చెంపలనుంచి చేతులు తీసేసి గలగలా నవ్వడం మొదలుపెట్టింది. హెన్రీ కూడ నవ్వ మొదలుపెట్టాడు. ఇద్దరూ ఆయాసం వచ్చినదాకా నవ్వారు.

"ఓహూ! నే నేం జెప్పను. అంత ఒక్కక్షణంలో నాలో ఒక అపూర్వ భావ ముదయించింది. నీవు నాకిప్పుడు చిరపరిచితుడులా అనిపిస్తున్నావు హెన్రీ!" అంది ఎడ్నా.

"నిజం. నాకూ అల్లాగే అనిపిస్తోంది. ఇప్పుడు నాకు వసంతోదయ మైనట్టుంది. పట్టురెక్కలపురుగేదో లోపలికి దూరి తనరెక్కలతో వీవనలు వేస్తూఉన్నట్టుగా, చూడు నాహృదయం ఎల్లా కొట్టుకుంటూ ఉందో" అంటూ హెన్రీ తనహృదయంమీద చెయ్యి వేసుకున్నాడు.

"అందులోను ఎక్కువ ఆశ్చర్యమైన విషయ మేమి టంటే, నే నెప్పుడూ మొగవారిని లెక్కచేయ కూడదని నిశ్చయించుకున్నాను. తక్కిన కాలేజీపిల్లల్లా ఉండకూడదని. అటువంటిది..." అంది ఎడ్నా.

"అయితే నువ్వు కాలేజీలో చదువుతున్నావా"?

ఆమె విసువుతో తలూపుతూ, "ఏదో ట్రేనింగు కాలేజిలో సెక్రటరీ పని నేర్చుకుంటున్నాను" అన్నది.

"నే నొక శిల్పకారుని ఆఫీసులో పనిచేస్తున్నాను. నూటముప్పైఖమె ట్లెక్కాలి మా ఆఫీసుకు. ఆకాశమంత ఎత్తు పెరిగిన చెట్లమీద కట్టుకునే పక్షులగూడులా గుంటుంది" అన్నాడు హెన్రీ.

"నీ కాపని ఇష్టమేనా ?" అంది ఎడ్నా.

"నా కిష్టము లేనిపనే! నా కసలే, పనేమి చేయాలని ఉండదు. నీకో!" అన్నాడు హెన్రీ.

"నాకు మరింత అసహ్యం. మా అమ్మ ఏమని పోతుందో అని చేరాను కాని, ఆ కాలేజిలో నా కా చదువంటే సుతలాము ఇష్టము లేదు" అంది ఎడ్నా.

ఆమె సహజ ధోరణిని హెన్రీతో మన సిచ్చి తన కష్టసుఖాలు చెప్తూంటే, "నిజమే! అల్లాగే!" అంటూ అతను సంపూర్ణ సానుభూతిని చూపిస్తూవచ్చాడు.

"నేను, మా అమ్మా చాలా విషయాల్లో భావైక్యత కలిగి ఉంటాము. కాని మానాన్నకూ నాకూ ఒక్క విషయంలోనూ పోలిక లేదు. పాపం! ఆయన అదో మోస్తరు మనిషి. ఒకరి జోలీ సొంటీ అక్కర్లేదు. కాని మా అమ్మలో మాత్రం వీర రక్తం పారుతూ ఉంటుంది. ఆ వీర రక్తమే నాలోకూడ అప్పుడప్పుడు ఉబుకుతూ ఉంటుంది. ఈ బ్రతుకు నే నెంత అసహ్యించుకుంటానో మా అమ్మకూడ అంతే" అంటూ కొంతసేపు ఆగి, ఒకమోస్తరుకోపంతో "ఏమైతే నేమి? నా కింట్లో ఎవళ్లతోటీ పడదు. ఇది నీ కేమి వింతగా లేదు కదా! ఎంతసందడిగా మాయిల్లు ఉంటూన్నా నేను ఏకాకి నయే ఉంటూంటాను."

హెన్రీ ఏదో ఊకొడుతున్నాడు, ఆమె చెప్తూ ఉన్నది గదా అని. కాని అతని మన సంతా వేరేచోట ఉంది. ఆమె నొకటి కోరాడు, చాల సిగ్గుతో: "ఒకసారి! ఒకసారి నీ టోపీ తీస్తావూ" అన్నాడు ఆమె ఉలిక్కిపడింది.

"నా టోపీయే! తీసెయ్య మంటున్నావు" అన్నది.

"అవును. నీ వేణిక. ఒకసారి నీ చెరిగిన కురులు పైకి తీసుకో. చూడాలని ఉంది" అన్నాడు.

ఆమె "ఊహుఁ" అంటూ, "నా వేణి కేమి బాగుంది?" అని నవ్వుతూ టోపీ తీసేసి తల ఒకసారి ఎగరేసి, ముందుకు పడిన పెన్నెరులు వెనక్కి లాక్కున్నది.

"ఓహో! ఎడ్నా! నీకేశపవిత్రత, సుందరత గురించి ఏమనను? ప్రపంచంలో నా కన్నిటి కన్న ఆం దాన్ని కూర్చేవి నీకురులే" అన్నాడు హెన్రీ.

ఆనందంతో నవ్వుతూ ఆమె "అంత అందంగా ఉందా నా తలకట్టు" అంది.

పొడువై, మృదువై డాకురేకులా మెరుస్తూ భుజాలమీదకు జారిన ఆమెకేశములు ఒకమోస్తరు కోసుగా ఉండే మేరుగిరి శిఖరాకృతిని పొంది ఉన్నాయి.

"నాజుట్టు రంగు చూచి సాధారణంగా నవ్వనివారుండరు. అటువంటిది నీ కెల్లా నచ్చిందో నా కర్థమవడం లేదు." అంది ఎడ్నా. హెన్రీ ఆమెమాటలు నమ్మలేదు. మోచేతులు మోకాళ్లమీద కానుకొని, అరచేతుల్లో బుగ్గలు నిముడ్చుకొని రోషారుణవదనయై ముందుకు కూర్చొని, "నా కెప్పుడైనా కోపం వచ్చి లోలోన కుములుతూ ఉన్నప్పుడు నే నిల్లాగే కూర్చుంటాను. ఇల్లా అంటూంటే నీకు నవ్వేటాలుగా ఉందేమిటి" అన్నది ఎడ్నా. "నీమోస్తరది కాబోలు! ప్రపంచంలో జరుగుతూండే దా

రణభీషణ కార్యాలన్నిటిమీద ఏవగింపు చూపించడానికి నీచేతిలో నున్న ఆయుధ మదే కాబోలు, అనుకుంటున్నాను గాని నే నెప్పుడూ మరోలా అనుకోను. ఛా! ఛా!" అన్నాడు హెన్రీ.

"అవును. ఇది నీ కెల్లా తెలిసింది? ఈనిజం నీ వెల్లా గ్రహించావు?"

"ఓరిదేవుడా! ఇంతమాత్రం తెలుసుకోలే ననుకున్నావా? మన మిక్కడే ఉన్నాము. ఒకరి నొకరు చూసుకుంటున్నాము. ఇంతే! అనుకున్నావా? కాదు. మనం ఒకరి నొకరు తెలుసుకున్నాము. మనం ఇంతవరకూ అమాయికంగానే జీవయాత్ర చేస్తున్నాము. కాని ఇంతలో ఏదో ఒక అమేయ శక్తి మన మిద్దరమూ బాల్యావస్థ దాటలేదని తెలిసికొన్నది కాబోలు! మనలను ఒక్కదరికి చేర్చింది. అంతేనా?"

"నిజం. నిజం. నేనుకూడ ఇల్లాగే అనుకుంటున్నాను" అందామె చాల ఆత్రంతో.

"మనుష్యులు నియమించే నియమాలవల్లే ప్రపంచం ఇల్లా వుంది. ఎప్పుడైతే నీవీ మానవ శాసనాలనుండి విడివడి స్వేచ్ఛగా ఉంటావో అప్పుడే నీకు సుఖ ముంది. నీజీవితం అప్పుడు అమృతమయం అవుతుంది" అన్నాడు హెన్రీ.

"ఈవిషయాల గురించి నేను చాల తీవ్రంగా ఆలోచించాను."

"ఐతే నువ్వుకూడ నాలాగే ఉన్నావన్నమాట!" అంటూ ఆశ్చర్యంతో లోతు తెలియని నవ్వు కోనేటిలో మునిగిపోయాడు హెన్రీ. కొంతసేపటికి తెప్పిరిల్లి, "నిజంగా మన మిద్దరమే అనుకుంటాను, ఈవిశాల విశ్వంలో, జీవితంగురించి ఇంత తీవ్రంగా ఆలోచించేది. నే నెవరికీ అర్థమవను. నాకు నేనే ఏదో వింతలోకంలో బ్రతుకుతున్నా ననిపిస్తూ ఉంటుంది. నీకో?" అన్నాడు.

"నాకూ ఎప్పుడూ అంతే. అల్లాగే అనిపిస్తుంది" అంది ఎడ్నా.

"మళ్లీ రైలు ఆకొండలోయలోనికి వచ్చేస్తున్నది ఒక్కనిమిషంలో. అందుచేత ఎడ్నా! ఒకసారి నీవేణిక ముట్ట నివ్వవూ?" అన్నాడు హెన్రీ.

చటుక్కున ఆమె వెనక్కు జేర్లపడింది.

"ఊహుఁ. అదిమాత్రం వల్లగాదు" అంటూంటే ఇంతలో రైలు లోయలోంచి పోతున్నది. చీకటి ఆవరించింది పెట్టెనంతా. ఎడ్నా చల్లగా బాగా వెనక్కి జరిగి పోయింది.

## 3

"ఎడ్నా! నేను టిక్కట్లు పుచ్చుకున్నా. నే నింత డబ్బు పెట్టి టిక్కట్లు ఎల్లా కొనగలిగానో! అనిమాత్రం సంగీతభవనంలోని బుకింగుక్లర్కు తెల్లబోలేదులే! సంగీతసభ అయిపోయిన తరువాత నన్ను గేటు దగ్గర కలుసుకో. అబ్బా! ఆసిల్కురుమాలు మేలి ముసుగు వేసుకొని, ఆముత్యాలహారం మెడలో వేసుకుంటూ! ఎంతో ముద్దు వస్తూ ఉంటావు. ఉత్తరాలు నీకు కాలేజికి వ్రాయడం నా కిష్టములేదు. కాలేజిలోని పిల్లలు మనప్రణయ రహస్యాలు బైట పెడతారేమో! అని నా బెంగ. బైటపెడితేమాత్రం మనకి భయ మేమిటి? ఏమంటావు చిట్టీ! నువ్వు ఎల్లాగైనా ఆదివారం రాగలవా? ఆఫీసులో ఉన్న నీస్నేహితురాండ్రను కలుసుకోడానికి వెళ్తున్నానని ఇంట్లో చెప్పు. తరువాత మన మెక్కడో సంకేతస్థలంలో కలుద్దాము. ఎడ్నా! అబ్బా! నిన్నే! నిన్నే ప్రేమిస్తా. నీవు లేకపోతే ఆదివారాలు గడపడం దుర్భరం. ఆదివారం తప్పకుండా రావాలిసుమీ! 'టీ' ఎక్కడైనా పుచ్చుకుంటావేమో! వద్దుసుమా! తప్పకుండా రావాలి. చిట్టీ! నేను వెళ్లి వస్తాను."

"తప్పకుండా నేను వస్తాను గా హెన్రీ! నేను శనివారమే వస్తాను. ఆదివారం కూడ ఉండిపోవడానికి ప్రయత్నిస్తాను. ఇంట్లో నాకెంతో స్వేచ్ఛ. నేనిప్పుడే తోటలోంచి వస్తున్నాను. ఈవేళ సాయంకాలమంతా అక్కడేచాల హాయిగా గడిపాను. హెన్రీ, నాకు మనసారగా కూర్చొని ఏడ్చివేయాలని ఉంది. నిన్నీ రాత్రికి వదల్లేను. నేను కుర్రతనంగా అంటున్నా నేమిటి? నాతో ఏది

వచ్చినా కష్టమే హెన్రీ! సుఖంగా ఉంటే అదే నవ్వివేయడం, విచారంగా వుందీ అంటే అదే ఏడ్చివేయడం. మనం ఎంతో చిన్నపిల్లలమైనా ఒకళ్ల నొకళ్లం గ్రహించుకున్నాం కదూ? నీ వింకో క్షణమైనా ఇక్కడుంటే బాగుండు ననిపిస్తోంది. గుడ్ నైట్ రాజూ! సెలవు. నేను వెళ్లి వస్తాను."

౪

"ఆ. ఆ. ఇక్కడ బాగానే ఉంది. సుఖంగానే కూర్చున్నా. అదృష్టమువల్ల హాంగై వచ్చాటే దొరికింది" అంటూ ఎడ్నా తనకోటు తీసుకుంటూ నుంచుంది. హెన్రీ ఆమెకోటు తీసిపెట్టడాని కామెను చేరాడు.

"నీ కెందుకు శ్రమ. అయిపోయిందిలే. నేనే తీసుకున్నాను" అంటూ కోటు తన సీటులో వేసుకొని దాని మీద కూర్చున్నది. హెన్రీకూడ ఆమె ప్రక్కనే కూర్చున్నాడు.

"హెన్రీ! అవేమిటి నీచేతులోవి. పువ్వులా?"

"ఆ. రెండు గులాబీలు. చిన్నవి" అంటూ అవి ఆమె ఒడిలో పడేశాడు హెన్రీ.

"నా ఉత్తరం జాగ్రత్తగా అందుకున్నావా" అంటూ ఏదో కాగితాలకున్న పిన్ను తీస్తోంది ఎడ్నా.

"ఆ. అందింది."

ముంగురులు వెనక్కి తీసుకుంటూ హెన్రీని ప్రోగ్రాం కాగితం ఇమ్మని అడిగింది.

"ఇదిగో! నువ్వు నేను కలసి చదువుదాం. నేను పట్టుకుంటాను నువ్వు చదువుదు గాని" అన్నాడు హెన్రీ.

"ఊహుం. అది నా కిచ్చేయి. నా క్కావాలి."

"ఐతే నేను చదువుతాను. నువ్వు విను."

"తరువాత నువ్వు చదువుకుందు గాని. ముందు నా కియ్యి."

"అబ్బా! ఏమిటి ఎడ్నా!" అన్నాడు హెన్రీ నెమ్మదిగా.

"అబ్బా! ఇక్కడ వద్దు బాబూ! చాల మంది జనం ఉన్నారు" అంది ఎడ్నా.

హెన్రీకి ఆమెను ముట్టుకోవాలని బుద్ధి పుట్టడ మెందుకు? దాని కామె అంత అభ్యంతర పెట్టడ మెందుకు? ఎప్పుడు వాళ్లిద్దరు కలిసినా హెన్రీ కామెను ముట్టుకోవాలనీ, చేయిచేయి కలుపుకుంటూ పొలము గట్టున హాయిగా చల్లగాలిలో ఆమెతో షికారు చెయ్యాలనీ ఉంటుంది. పాపం! అతని కామెమీద భుజము భుజము తగిలేటట్టుగా వాలుతూ నడవాలని ఉంటుంది. అదేమో కాని ఇతను దగ్గరకు వెళ్లినకొద్దీ ఆమె వెనక్కి తక్కుచూ తారుచూ, నన్ను ముట్టుకోకోయ్! అన్నట్టుగా వెళ్లిపోతూ వస్తూ ఉంటుంది. ఆమె దూరంగా ఉన్నంతసేపూ హెన్రీ హృదయం ఆమెసమాగమంకోసం దుర్భరంగా పరితపించి పోతూఉంటుంది. ఎడ్నా ప్రక్కనుంటే ఆమె ఊర్పులు, మందమలయానిలాలై హెన్రీ ఆర్ద్రహృదయానికి శమనంగా వీవనలు వేసినట్టే ఉంటుంది, కాని అతని కా అదృష్టము పట్టలేదు. ఎప్పుడూ ఆమె అతన్ని తాకనివ్వలేదు. కాని ఆమెకుమాత్రం అతనియందు నిబిడరక్తి అని అతనికీ తెలుసు. ఆటువంటప్పుడు అతనామె కరస్పర్శ చేయవలెనని ఉద్యుక్తుడైనప్పుడల్లా ఆమె వెనక్కి జంకిపోవడ మెందుకు? ముట్టుకుందామని ఆమెను చేరినప్పుడల్లా ఎడ్నా బాధను వెలువరిస్తూ దీనంగా నేత్రదృష్టి క్రిందకు జార్చేది. వారిద్దరునూ, ప్రేమావగుంఠనము జార్చుకొని, పరస్పరావలోకనాల్లో కళ్లు కౌగిలించుకొని, ఆనంద బాష్పాలు జాలువారుస్తూ ప్రణయ రహస్యాలు మాట్లాడుతూ, యుగయుగాలు గడిపివేయగలరు. ముట్టుకోవడానికి మాత్రం ఆమె హెన్రీమీద ఆంక్ష పెట్టేది. ఇంతెందుకు! ఆమె కోటు తీసి పెట్టడానికైనా అతనికి చనువిచ్చింది కాదు.

ఆమె వింత చెయిదములు, ప్రేమ తొణికిసలాడే జిలిబిలిమాటల ధోరణి అతన్ని భావమగ్నుణ్ణి చేశాయి.

"హెన్రీ!" అని ఆమె అనడంతోనే అతను ముందుకు వ్రాలాడు. అతని అధరములురెండూ ఆలింగనం చేసుకున్నాయి.

"నీకో సంగతి చెప్పాలని ఉంది. గానసభ అయిన తరువాత చెప్తాను. తప్పకుండా చెప్పుతానే" అన్నాడు హెన్రీ.

"సరే!"

కాని అతనింకా మనోవ్యథలు చెందుతూనే ఉన్నాడు.

"అల్లా విచారంగా ఉన్నావేమి?" అందామె.

అతను తల త్రిప్పివేశాడు, లేదన్నట్టుగా.

"కాదు హెన్రీ. నువ్వల్లాగే ఉన్నావు."

"లేదు. నిజంగా లేదు." ఆమె చేతుల్లో పడిఉన్న గులాబీలకేసి చూస్తున్నాడు.

"ఐతే నువ్వు ఆనందంగా ఉన్నావా?"

"ఆహా! విను. గానసభ ప్రారంభ మవుతున్నది" అని ఆమెమాటల ధోరణి త్రిప్పేశాడు హెన్రీ.

గాన సభ ముగిసేటప్పటికి కను చీకటిగా ఉంది. నీలిరంగు వెలుతురు వీథులను, ఇండ్లను ముసిరింది. రంగు మేఘాలు వెల్లకొండమీద తేల్తూ ఈదుకొని వస్తూ ఉన్నాయి. ఎడ్నా పరిచయమైన తరువాత ప్రథమ పర్యాయము ఇవ్వేళనే అతని హృదయం బరువెక్కింది.

"హెన్రీ!" అని కేకవేసి అతనికేసి తేరిపార చూస్తూ ఉంది ఎడ్నా.

"హెన్రీ! నేను నీతో స్నేహమునకు రాదలచుకొనలేదు. నాకోసం చూస్తున్నావా యేమిటి? వద్దు. వద్దు. నేను రాను. నన్ను వదిలిపో బాబూ!"

"ఓరిదేవుడా!" అంటూ ఆశ్చర్యంతో, "నే నేం చేశాను? నువ్విల్లా గున్నావేమమ్మ ఎడ్నా? చెప్పవూ" అన్నాడు.

"ఏమీ లేదు. నువ్వు వెళ్లిపో!" అంటూ ఆమె వెనక్కి తిరిగి ప్రక్కవీథిలోకి పారిపోయి లాంతరు స్తంభానికి జేర్లబడి చేతులతో మొగము కప్పుకొన్నది.

"ఎడ్నా! ఎడ్నా! నావెర్రికుట్టీ. అదేమిటి? ఏడుస్తున్నావా? అయ్యో! వెర్రికుట్టీ! ఏమి? ఏమి?"

చేతులతో స్తంభానికి ఆనుకొని వెక్కి వెక్కి వెర్రిగా ఏడుస్తోంది ఎడ్నా.

"ఎడ్నా! ఏడవకమ్మా. తప్పంతా నాదే. నేను వట్టిమూర్ఖుణ్ణి. తెలివి మాలినవాణ్ణి. నీవిరామకాల మంతా పాడుచేశాను. నా తెలివితక్కువ ప్రవర్తనతో నిన్ను చాల క్షోభపెట్టాను. అదే కారణం కదూ? క్షమించు. క్షమించు."

కన్నులు ముకుంటూ, "అబ్బా! అది కాదు హెన్రీ! నీమనస్సు నాకొరకై క్షోభించడం నాకు చాల అసహ్యంగా ఉంది. ఎప్పుడు నువ్వు నన్ను...నన్ను...ముట్టుకుందామనుకున్నా...ముద్దు...పెట్టుకుందామనుకున్నా ...నేను నిన్ను అడ్డుపెట్టడం తలచుకుంటే నన్ను నేనే కోసేసుకుందా మనిపిస్తున్నది. నాకు నేనే అర్థమవడం లేదు. ఏమిటో! ఎందుకో అల్లా నే అడ్డుపెట్టడం? నీవంటే భయంవల్ల కాదుసుమా! నీవంటే నాకు భయం కూడా లేదు. అబ్బా! నీజేబురుమాలేదీ!" అనడంతోనే జేబులోంచి రుమాలు తీసి ఎడ్నా కిచ్చాడు హెన్రీ.

"సంగీతసభ అవుతూ ఉన్నంతసేపూ ఈవిపరీత భావమునుగురించి సంశయాలు నన్ను కలగిస్తూనే ఉన్నాయి. ఎప్పుడు మనం కలుసుకున్నా దీని గురించి ప్రసంగిస్తామని నాకు తెలుసును. ఎంచేతనో కాని మనం ఒకసారి అది చేశామంటే—ఏదో నీకు తెలుసునుగా—చేయి చేయి కలుపుకొని ముద్దు పెట్టుకుంటే—అబ్బా! అంతా మారిపోతుంది హెన్రీ! ఇప్పుడున్నంత స్వేచ్ఛగా ఉండలేమేమో! ఏదో రహస్యమైనపని చేసిన వాళ్లమవుతాము. మనమింక చిన్న పిల్లల్లా ఉండము. కాదూ? నవ్వుతున్నావా నా వెకిలితనం చూచి? అప్పుడింక నేను వెకిలి నైపోతాను. సిగ్గు ఎక్కువౌతుంది. నువ్వు నేను, నేను నువ్వు కాబట్టి మన కటువంటివి వద్దు హెన్రీ!" అంటూ ఎడ్నా అతని కేసి తిరిగి అతన్ని గట్టిగా చూస్తూ తన అలవాటు ప్రకారం చేతులతో బుగ్గలు నొక్కుకున్నది. ఆమెకు వెనక తట్టున ఆకాశముమీద ముసక కన్నేసుకొని చంద్రుడున్నాడు ప్రకృతి తొడిగిన మొగ్గలు చంద్రుని కౌగిలిలో ఉండడంచేత విడవనే లేదు. అల్లా నిలుచుని అతను ప్రోగ్రాం కాగితం ఊరికే మెలిపెడుతున్నాడు.

"హెన్రీ! నేనిప్పుడైనా నీకర్థమయానా ఏమిటి చెప్పు" అంది ఎడ్నా.

"ఆ. అర్థమయా ననుకుంటున్నాను. కాని నేనంటే, చెప్పు, ఇంక నీవు భయపడవుకదూ!" అంటూ నవ్వబోయాడు

"మనము అదంతా మరచిపోదాము. దాన్నిగురించి మరి తలపెట్టవద్దు ఈ విషాదగాథ మన ప్రణయ ప్రబంధములోనుంచి తుడిచివేదాము. ఏమంటావు?" అంటూ ఆమని ముఖవిలాసాలు పరిశీలిస్తూ.

"ఈసంగతి విన్నతరువాత నన్ను ప్రేమించడం తగ్గిపోతుందా ఏమిటి హెన్రీ! నీకు" అంది ఆమె.

"ఛా! ఛా! ఈ ప్రపంచంలో ఏదీకూడ నాకు నీయందున్న ప్రేమను తగ్గించలేవు. ఎవ్వరితరమూ కాదు మన ప్రేమప్రవాహాన్ని అరికట్టడానికి కాని, దానికి ఆనకట్ట వేయడానికి కాని" అన్నాడు హెన్రీ! ఆమాటల్లో పవిత్రత వెల్లివిరిసింది. ఉత్సాహం, ఉద్రేకం పొంగి పొరలింది.

లండను వారిక్రీడాస్థలమయింది. సెలవురోజుల్లో మట్టమధ్యాహ్నమనగా బయలుదేరి అదే తిరిగేవారు. క్రొత్తదారులు కనిపెట్టేవారు. తిరిగి తిరిగి వారు సమంగా వాళ్ల ఊరులాంటి ఊరునే చేరుకున్నారు. అక్కడిషాపులూ, మిఠాయిఅంగడులూ, టీక్లబ్బులూ, వీధులూ అన్నీకూడ వాళ్ల ఊరునే పోలిఉన్నాయి. కాని ఆ ఊరుపేరు కొంత వింతగా ఉంది. ఊరుపేరు క్రొత్తగాను, వింతగాను ఉండడంచేత ఆ ఊళ్లో ఉండిపోదామని వారికి కౌతుకం పుట్టింది.

ఆ ఊరులో చాలనుంది సముద్రముమీద ఓడల్లో పనిచేసి చీకిపోయిన ఓడమల్లయ్యలు. నేలబారుయిళ్లు. ఊరుచుట్టూ నీరు ప్రవహిస్తూఉంది. ఈ ఓడమల్లయ్యలందరూ చేతికర్రలు దగ్గర పెట్టుకొని వాకిట కూర్చొని ఇళ్లు కాపలా కాస్తూ ఉంటారు.

వీరు ఆ ఊరు చేరుకునేటప్పటికి చీకటిపడిపోయింది. అంచేత ఆఊరి ప్రజలను, ఊరివింతలను చూడడానికి వీలు లేకపోయింది. నది, దాని పరిసరములో ఉన్న ఇళ్లూ, షాపులూ వాటిలో వెలుగుతూన్న దీపాలు మాత్రమే కన్నులు కరవు దీరా చూచారు. ఒక ఇంట్లో కుట్టుమిషనుమీద పనిచేసుకుంటున్నది ఒక స్త్రీ. మిషను చప్పుడుబట్టీ, దీపంవల్ల గోడమీదపడ్డ ఆమె నీడనుబట్టీ, ఆమెను పోల్చుకో గలిగారు వీరిరువురూ.
"ఓ. ఈఇల్లు ఎక్కువ పరిశుభ్రమైన ప్రదేశంకూడాను" అన్నాడు హెన్రీ.

ఇళ్లు చిన్నవైనా వాటిచుట్టూ పూలతీగెలున్నాయి. ఇంటిముందర నీలిపందిళ్లు. కొన్ని ఎత్తుగున్నా ఎక్కడానికి కర్రమెట్లు వేశారు. ఇళ్లన్నీకూడ రాజవీధిని అంటిపెట్టుకొని వరుసగా తీరిఉన్నాయి. రోడ్డు కవతలివైపున నది, నదిగట్టు, గట్టుక్రిందను షికారుపోవడానికి చక్కనికాలిబాట, బాట కిరుప్రక్కలా గుబురుగా సీమచింతమొక్కలూ పెరిగి ఉన్నాయి. మధ్యమధ్యను 'ఓకు' వృక్షాలున్నాయి.

"ఈ ప్రదేశం చాల మనోహరంగా ఉంది. పైగా ఇక్కడ అద్దెకో యిల్లుకూడాఉంది. మనం జాగుచేయక ఈ ఇల్లు అద్దెకు పుచ్చుకొని ఇందులో వుందామా?" అన్నాడు హెన్రీ.

"హాయి. ఇక్కడుంటే మన కింకేమి కావాలి? ఎంచక్కా ఉంటుంది" అంది ఎడ్నా ముద్దుగా.

ఇద్దరూ కలిసి ఒక చెట్టుకు జేర్లబడి ఉండబోయే యింటికేసి నవ్వుతూ చూస్తున్నారు.

"ఇంటికి వెనకతట్టున చిన్నతోటకూడా ఉంది. ఇంకేం! పచ్చని తివాసిలాంటి శాద్వలస్థలమూ, గోడకు ప్రాకుతూన్న పూలతీవలూ, గుబురుగా పెరిగిన జుట్లతో చిన్నచిన్న చెట్లూ, దొడ్డీ-అంతా బాగనే ఉంది. రాత్రి అయితే నక్షత్రాలు ఆచెట్ల సందులనుంచి చూస్తూఉంటే ప్రమిదల్లో వెలుగుతూన్న చిన్నచిన్న దీపాల్లా ఉంటాయి కదూ ఎడ్నా! ఇంటిలోపలి భాగంకూడ బాగానే ఉంది సుమీ! మేడక్రింద రెండుగదు లున్నాయి. పైన పెద్దగది. గదిపైన చిన్నడాబాకూడా ఉంది. వంటగది

మాత్రం చాల చిన్నది. చీకటి కూడాను. చీకటంటే నీకు భయం కాదూ ఎడ్నా?"

"హెన్రీ! ఏమి అనుకోక ఒకసారి దీపం చూపిస్తావూ? 'యూఫిమియా' నిప్పంతా బాగా ఆర్పేసిందో లేదో వంటింట్లోకి వెళ్లి చూచి వస్తాను" అంది ఎడ్నా.

"హాయి! మన పడకగది బాగా ఉంది. రెండు కిటికీలున్న మేడమీది పెద్దగదే కదూ? ఎంతో బాగా ఉంది. గదిలో ఉంటూన్నప్పుడు నిశ్శబ్దంలో నది పాడే చిరుపాటలు వినపడుతూ ఉంటాయి కూడాను. సంగీతపు చెట్లు ఝుంఝుం శబ్దం మనం నిద్రలో కలలు కంటూ ఉన్నప్పుడు వినపడుతూ ఉంటుంది కాదు హెన్రీ!"

"నీకు చలివేస్తున్న దేమిటి ఎడ్నా?" అన్నాడు ఆత్రంతో హెన్రీ.

"లేదు. లేదు. పట్టలేని ఆనందం పొందుతున్నాను" అంది ఎడ్నా.

హెన్రీ నవ్వుతూ, "మేడమీది పెద్దగది నీకు. ఆగది నీకు సరిపోతుంది కాదూ? అందులో నువ్వాడుకోవడానికి చిన్నచిన్న మెచ్చి బొమ్మ లున్నాయి. కుర్చీ కూడ ఉందిలే. అందులో కూర్చుని నెగడు వేసుకొని తల దువ్వుకుంటూ ఉంటే నెగడు మంటలో నీవేణి బంగారపు డాకురేకులా తళతళ లాడుతూ ఉంటుంది. అది నేను చూస్తూ ఉంటాను. హాయిగా నువ్వక్కడే కూర్చొని వాలుజడ వేసుకో వచ్చును. నేను క్రింద గదిలో ఉన్న కంబళిమీద పడుకుంటా. నాకు బద్ధక మెక్కువకూడాను. 'యూఫిమియా'—మనకు పనిచేసేది—పగలేగా ఇక్కడుంటుంది? అది వెళ్లిపోయిన తరువాత మనమిద్దరమూ వంటింట్లోకిపోయి టేబిల్ మీద కూర్చుని ఏయాపిలో తిందాము, లేకపోతే దర్జాగా టీ కాచుకొని, సరదాగా పుచ్చుకుందాము. టీ కాచడమంటే నాకెంతో సరదా. టీ నీళ్లు మరుగుతూంటే వసంతఋతువులోని ఉదయకాలంలా వాటిపాట నాకెంతో ఆనంద మిస్తుంది ఎడ్నా."

"ఔను నాకు తెలుసు. ఆకాలంలో రకరకాల పక్షుల కిలకిలారావములు చెవుల కెంతో ఇంపుగా ఉంటాయికదూ!" అంది ఎడ్నా.

ఇట్లు వీరిద్దరూ భావి ఆనందమయజీవితం గురించి ఊహా ప్రపంచములో తేలిపోతూ ఉంటే ఇంటి కటకటాల్లోంచి రోడ్డు మీదకు ఒకపిల్లి పరుగెత్తుకుని వచ్చింది. ఎడ్నా "కిట్టీ! కిట్టీ!" అని దాన్ని రమ్మని పిలుస్తూ చేతుల క్రిందకు చాపింది. ఆపిల్లికూన అతిచనువుగా ఎడ్నాదగ్గరకు వచ్చి ఆమె కాళ్లను రాసుకోవడం మొదలు పెట్టింది.

హెన్రీ కొంటెతనంగా నవ్వుతూ "మన మింక షికారు వెళ్లి పోదాము. పిల్లిని ఇంట్లో వదలివేద్దాము రా! నాదగ్గర ఇంటితాళం ఉం"దన్నాడు."

ఇద్దరూ రోడ్డు దాటి ఇంటికేసి వెళ్లారు. ఎడ్నా పిల్లిని ఒడిలో పెట్టుకొని ముద్దులాడుతూ నిలబడింది. హెన్రీ గబగబ వెళ్లి మెట్లన్నీ ఎక్కి, మహా! ఇంటితాళం తీసే వాడిలాగే! తలుపుదగ్గర నిలుచున్నాడు.

మళ్లీ గబగబ క్రిందకు దిగి, "ఎడ్నా! ఇంక పద, మనం వెళ్లిపోదాము. ఇంకా ఉంటే మన మింతవరకూ అనుభవించింది ఇంకా ఇంకా పట్టిదై, స్వప్నరూపం పొంది ఆఖరుకి గుడ్డి సున్నా అయిపోతుంది" అన్నాడు హెన్రీ. * * * *

రాత్రి చీకటిగానే ఉంది గాని వెచ్చగా ఉంది. వారి కింటికి వెళ్లడాని కిష్టం పుట్టడం లేదు.

"ఎడ్నా! నాకెల్లా ఉందంటే! ఇప్పుడే వెళ్లి మన మాయింట్లో ఉండిపోవాలని ఉంది. మనమెప్పుడూ వేటికోసం కనుపెట్టుకొని ఉండకూడదు. కాలమేమిటి? అది పసిపాప. ఏక్షణాని కాక్షణమే అదీ మనం కూడ పెద్దవార మవుతున్నాము. నా కనిపిస్తుందిగదా! మన మెప్పుడూ ఏదైనా పొందాలంటే అనుకూలమైన పరిస్థితులకోసం, చిక్కే అవకాశం కోసం వేచియుండకూడదని. ఎప్పటికో పొందుతామని దానికోసం కనుపెట్టుకుంటే కాలాంతమువరకూ కనుపెట్టుకుని ఉండడమే అయిపోతుంది. నువ్వు పొందాలన్న వస్తువుకోసం కాలంకన్న ముందు పరుగెత్తి దాన్ని ముంగురులు పట్టుకుని లాక్కొని వచ్చి సంపాదించుకోవాలి గాని గ్రుక్కిళ్లు

మ్రింగుకుంటూ కనుపెట్టుకొని ఉండకూడదు. అంతేనా? నిజమేనా?"

"కాని హెన్రీ! డబ్బో? మనం డబ్బు చూసుకోవాలిగదా మరి!" అంది ఎడ్నా.

"ఛా! డబ్బుకేమి. డబ్బులో ఏముంది డబ్బు వస్తుంది, పోతుంది. ధనం చాల చంచలం. మనకేమి కావాలంటే అవి నాటంతట అవే వస్తవి. పోనీ! రాకపోతే. మనకి బెంగే లేదుగా!" అన్నాడు హెన్రీ.

అతనన్నదానికామె సమాధానమీయలేదు. ఆకాశంకేసి చూస్తూ, "అబ్బా! నాకీప్రదేశం వదలి ఇంటికి పోవాలని లేదు బాబూ" అంది.

"నిజంగా నాకూ అల్లాగే అనిపిస్తోంది. మనం ఎల్లాగైనా సరే ఇక్కడనుంచి కదలవద్దు. అయ్యో! ఈ పాటికి మనం ఇంట్లోకి వెళ్లి, మనపిల్లికి చిన్నపళ్లెమొకటి వెతికి పాలకుండలో మిగిలిపోయిన మీగడతరకలు దానికి పెట్టవలసిందే! నాకు నవ్వు రావడంలేదు ఎడ్నా! నాకిప్పుడు సుఖంగాకూడ లేదు. నీకోసం బెంగగా వుంది. ఎడ్నా! ఒకసారి మనసారగా నాతల నీ ఒడిలో పెట్టుకోనివ్వవూ? కావలిస్తే నీ చెక్కిలి నాజుట్టులో దాచుకో. అబ్బా! ఒకసారి మనసారగా ఏడ్చివేయనియ్యి" అన్నాడు హెన్రీ నింపాదిగా.

"కాని హెన్రీ" అంటూ నింపాదిగా హెన్రీ దగ్గరగా వచ్చి, "నేనంటే నీకు నమ్మకం లేదూ? మనకి తప్పకుండా ఒకయిల్లు దొరుకుతుందంటే నమ్మవూ? అప్పుడు మనకేది కావాలంటే అవన్నీ దొరకుతాయి. ఏమంటావు?" అంది ఎడ్నా.

"ఊహుఁ! అంతేకాదు అల్లా అంటే నాకు సరిపోదు. నాకు హాయిగా ఆ మెట్లమీద కూర్చుని ఇప్పుడే నా కాలిజోళ్లు విప్పుకోవాలనిపిస్తున్నది. ఏమంటావు ఎడ్నా? ఎప్పుడో ఆయింట్లో ఉంటామనే ఆశతో ఎంతకాలం గడుపడం బాబూ? నా కల్లా కాదు. ఇప్పుడే కావాలి" అన్నాడు హెన్రీ.

"అయ్యో! మనం చాల చిన్నవాళ్లమై పోయినామే! లేకపోతేనా! ఈపాటికి" అంటూ ఎడ్నా అతనికేసి దీనంగా చూపుసారిస్తూ, "లేదు లేదు. నేను పెద్దదాన్నే. ఇప్పుడు నాకిరవైయ్యేళ్ళు."

౬

హెన్రీ వెల్లికిలా నిబురుగా పెరిగిన చెట్ల ప్రక్కనే ఉన్న పచ్చిక బయల్లో పడుకున్నాడు. ఇటూ అటూ ఒత్తిగిల్లుతూ ఉంటే క్రింద ఉన్న ఎండుటాకులు గలగల చప్పుడు చేస్తూ ఉన్నవి. లేతసూర్యుని వెలుగులో పైనున్న చెట్లాకులు, ఆకుపచ్చని నీళ్లలా, జలజల స్రవిస్తూ ఉన్నట్టు కనుపిస్తున్నవి. ఎక్కడో హెన్రీదృష్టికి దూరంగా ఎడ్నా పువ్వు లేరుకుంటూ ఉంది. హెన్రీకి ఎందుచేతనో మందకొడి ప్రొద్దున్నుంచీ వదలే లేదు. జోగుతూ, కలలు కంటూ, అల్లాగే పండుకోవడం వల్ల ఎడ్నామల్లే, పువ్వు లేరడంలో ఎంత ఆనందం వుందో తెలుసుకోలేకపోతున్నాడు.

"ఎడ్నా! నీవు పోయిరా! పువ్వులకి — నేను రాలేను. నాకు చాల బద్ధకంగా ఉంది" అన్నాడు.

తన టోపీ క్రింద పారేసి ఒకసారి అతని ప్రక్కనే సాగిలపడి చల్లగా ఆమె వెడలిపోయింది. తోటంతా చాల నిశ్శబ్దంగా ఉంది. కాని మధ్యమధ్యను ఆకుల గలగలతో చప్పుడయ్యేది. హెన్రీ ఎడ్నా ఎంతో దూరంలో లేదని తెలుసుకొని, చల్లగా ఆమె ఉన్న చోటుకు వెళ్లి ఆక్కడ క్రింద మాంద్యంగా పడుకున్నాడు. అతనికి ఇవ్వేళ లేచినప్పటినుంచీ లేచినట్టే లేదు. మళ్లీ పడుకుంటాడు. మళ్లీ పడుకుంటాడు. ఊరికే అతనికీ వేళ స్వప్నములు తరంగితమవుతున్నాయి. జాగ్రదవస్థలో నుంచి నిద్రావస్థలోకి, నిద్రావస్థలో నుంచి స్వప్నావస్థలోకి అస్తమానమూ అతని ఊహాలు బండిచక్రాలవలె పరిభ్రమణ మాతూనే ఉన్నాయి. కొంతకాలం ఎడ్నాయే అతనికో కలలా అనిపించేది. ఇప్పుడిద్దరూ కూడ కలిసి స్వప్నప్రాయమైన సుఖమే పొందుతున్నామని అనిపిస్తున్నది. ఇంతలో ఇంకొక స్వప్నం అతన్ని అప్పుడే తన చెరగులోనికి లాగికోవాలని కారు చూపు చూస్తూ ఉన్నది.

"కాని నాకు మనం కలలా అనిపించడం లేదు. మనమూ, మన జీవితాలు, మన ఆనందమూ కలే అయినట్టయితే ప్రపంచమే కల అన్నమాట. మనం లేకపోతే ప్రపంచమూ ఉండదు. మన చుట్టూ ఉన్న చెట్లూ చేమలూ, ఆకాశాన్ని పారు పక్షులూ, నీలి మేఘాలూ, ఎల్లాగ మనస్థూల దృష్టికీ సూక్ష్మ దృష్టికీ కూడ సత్యంలా కనబడుతున్నాయో అల్లాగే మన మిద్దరమూ కూడ ఈ విశాల విశ్వంలో నిజం, నిత్యం" అన్నాడు హెన్రీ.

ఎడ్నా లేని రోజులను తనస్మృతిపథములో పెట్టుకొని వాటినిగురించి నిజంగా ఊహించుకొని మనోనేత్రం ఎదుట చూసుకుందామని ఎంత ప్రయత్నించినా చూడలేకపోయాడు. ఆమె వలపుచెరగుతో వాటిని కప్పివేసింది. హెన్రీ ఆమె దివ్యమంగళరూపంతో నిండిపోయాడు. మరి వేటికీ అతనిలో తావు లేదు. అతను ఆమెలో లీనమై పోయినాడు. వ్యక్తిత్వము పోనాడుకున్నాడు. అతను ఆమెను వాయువులా ఆఘ్రాణిస్తున్నాడు ఆమె సౌందర్యాన్ని తనివి తీర గ్రోలుతున్నాడు. ఆమెప్రేమనే మృష్టాన్నముక్రింద భుజిస్తున్నాడు. నడుస్తూఉంటే ఎడ్నా ఒక దివ్యమంగళ కాంతి అయి అతనిలో కలసి అతనికి జ్యోతిఃప్రభ నిస్తూ ఉంది. ప్రపంచమంతా ఎడ్నావెలుగుతో నిండినట్టుగా కనిపిస్తున్నది. ఏవస్తువును తాకినా ఎడ్నా స్పర్శమణై దానికి ఉజ్వలత నిస్తున్నది.

"నువ్వు నవ్వేసినతరువాత చాలసేపటివరకూ నీ నవ్వువెన్నెల నాకు చల్లదనం ఇస్తూనే ఉంటుంది. నీ నవ్వు కిలకిల నాహృదయ వీణకు పాటలు నేర్పుతూనే ఉంటుంది. ఇటువంటి తీయని అనుభవాలు పొందుతూ ఉన్నప్పుడు కూడా మనం వట్టి కలలమా? మనప్రేమ, మన జీవితం స్వప్నప్రాయమా? చాల్లే!" అన్నాడు హెన్రీ చాల ఉద్రేకంతో.

ఇంతలో హెన్రీ కళ్ల ఎదుటనే ఎన్నో దృశ్యాలు పెట్టె బొమ్మల్లా ఒకటి తరువాత ఒకటి కనుపడ్డవి: తనూ, ఎడ్నా చిన్నపిల్లల్లా వీథుల్లో నడుస్తూ ఉండడం, కిటికీల్లోనుంచి ఇళ్లల్లోనికి కొంటెతనంగా తొంగిచూడడమూ, దారిలో అమ్మవచ్చే బొమ్మలు కొనుక్కొని వాటితో ఆడుకుంటూ ఉండడమూ, మాట్లాడుతూ పకపక నవ్వుతూ కేరింతాలుకొడుతూ ఉండడమూ—ఇవన్నీ చూసేసి ముఖం త్రిప్పేసి బోర్లా పడుకుని ముఖాన్ని ఆకుల చాలులో దాచివేసికొన్నాడు—ఆగనికోరిక బరువువలన సోలిపోయినట్టుగా – పాపం! హెన్రీకి గట్టిగా ఆమె నెద నెద నదుముకుంటూ, విడని కౌగిలిలో ఇముడ్చుకొని, ఆమె చెక్కిలిని తన ముఖాన్ని చేర్చి, ఊపిరైనా ఆడకుండా ప్రేమచుంబనాలు పెట్టుకుందామని కోరిక.

"అబ్బా! ఇల్లా నా కాకలి దహించుకొని పోతూ ఉంటే నేను మనడం ఎలా?" అంటూ పడుకున్నవాడు హఠాత్తుగా లేచి ఎడ్నా వైపు పరుగెత్తుకొని వెళ్లాడు. ఆమె చాలదూరం వెళ్లిపోయింది పువ్వు లేరుతూ. పచ్చగా ఉన్న పల్లప్రదేశంలో ఆమె ముందుకు వంగి పువ్వులు కోస్తూ హెన్రీని చేతులెత్తి పిలుస్తూ, "హెన్రీ! త్వరగా రావాలి. రావాలి. చూడు ఎంత అందంగా ఉన్నాయో! నేనెప్పుడూ ఇటువంటి పువ్వులు చూడలేదు. రా" అన్నది.

ఆమెను చేరుకున్నాడు. తన ఆత్రంలో ఆమెను కౌగిలించుకొని ఆమె ఆనందాన్ని భగ్నం చేయడం ఇష్టం లేక కొంచెం వెనక్కుతగ్గి నిలుచున్నాడు. ఎడ్నా ఎంత వింతగా ఉంది! మాట్లాడుతూ ఉన్నంతసేపూ ఆమెనేత్రములు నవ్వువెన్నెలలు చిలుకుతూనే ఉన్నాయి. ఆనవ్వు తన్ను చూసి ఇకి, రిస్తూ ఉన్నట్టున్నది హెన్రీకి. పాలబిళ్లల్లా ఉన్నాయి ఆమె చెక్కిళ్లు.

"నా కేమీ ఆయాసంగా లేదు సుమీ! నా కంతులేకుండా ప్రపంచయాత్ర చేసివేయాలని ఉంది. హెన్రీ! నడు. చరచరా నడు హెన్రీ! హెన్రీ! నేను నడుస్తూ నడుస్తూ పైకెగిరిపోతే, నా కాళ్లు పట్టుకొని నువ్వు క్రిందికి లాగుతావు కదూ? లేకపోతే నేను మళ్లీ క్రిందికు రాను సుమీ! అల్లాగే ఆకాశంమీద కెగిరిపోతాను. ఓహో! నా కీవేళ ఎంతో ఆనందంగా ఉంది హెన్రీ! అబ్బ! ఈపట్టరాని ఆనందంవల్ల నే కాబోలు, కొంత భయం కూడ కలుగుతున్నది హెన్రీ!" అని ఎడ్నా చెప్పుతూ ఉండగానే ఇద్దరూ రెల్లుదుబ్బులు దట్టంగా పెరిగిన ప్రదేశాన్ని

చేరుకున్నారు. మధ్యాహ్నము కావస్తున్నది. సూర్యుడు తీక్ష్ణంగా లేడు. గాలి చల్లగానే వీస్తున్నది.

"ఇక్కడ కాసేపు కూర్చుందామా ?" అంటూ ఎడ్నా గుబురుగా పెరిగిన కెల్లుడుబ్బుల్లోనుంచి ఈదుకుంటూ పోయి మెత్తని ప్రదేశంమీద మేను వాల్చింది.

"హెన్రీ! ఈప్రదేశము ఎంతహాయిగా ఉంది. ఆకాశమూ, ఎగురుతూఉన్న చిన్న పక్షులూ తప్ప మరేమీ కనపడడం లేదు." అంది ఎడ్నా.

హెన్రీకూడ ఆమెప్రక్కనే వాలి ఆమె పూల సజ్జలో ఉన్నపువ్వులు ఎడ్నా మెడకు సరిపోయేటట్టుగా ఒకహారం గ్రుచ్చాడు.

"నాకు నిద్ర వస్తున్నది బాబూ!" అంటూ ఎడ్నా నింపాదిగా హెన్రీకాళ్లవైపు ప్రాకుచూ వేణికతో ముగాన్ని కప్పుకొని అతని ప్రక్కను పడుకుంది.

"హెన్రీ! ఇక్కడ మనం ఉండడం నిశ్శబ్దవాటిలో ఉన్నట్టుగా ఉంది. చాల హాయిగా ఉన్నది కదూ!" అంది.

"ఔను నిజంగా అల్లాగే ఉన్నది" అన్నాడు హెన్రీ అస్పష్టంగా.

"నిన్నొక దేవిని చేసి నాప్రేమవేదికపై ప్రతిష్ఠించుకుంటాను ఎడ్నా" అని హెన్రీ అంటూంటే ఎడ్నా లేచి కూర్చుని, "లోపలికి వెళ్లుదాము, రా" అంది.

మళ్లీ రోడ్డెక్కి చాలదూరం నడిచారు ఇద్దరూ. ఎడ్నా ఆగి, "అబ్బా! నే నింక ఈప్రపంచయాత్ర సాగించలేను. నాకాళ్లు సాగిపోయినాయి. నే నలిసిపోయినాను" అంటూనే రోడ్డు అంచునున్న పచ్చగడ్డిమీద కాళ్లీడ్చుకుంటూ నడుస్తూ, "నువ్వు, నేనూకూడ అలసిపోయినాము. ఇంకా ఎంత దూరం" అంది. రోడ్డుకేసి కంటిచూపు ఆనేవరకూ చూస్తూ, "ఏమో నాకుతెలియదు కాని వచ్చివేశాము అట్టే దూరం లేదులే" అన్నాడు హెన్రీ. ఇద్దరూ మాటా మంతీ లేకుండా మరికొంతదూరం నడిచారు.

ఆఖరికి విసుగుతో ఎడ్నా, "అబ్బా! ఇంకా చాలాదూరం ఉంది. నాకు కాళ్లు పీకుతున్నవి. పైగా ఆకలి దహించి వేస్తూఉంది. ఈపూల సజ్జను నువ్వుపట్టుకుందూ" అంది. హెన్రీ ఆమెకేసి చూడకుండానే ఆసజ్జ ఆమెచేతిలోంచి తీసుకున్నాడు.

చివరకి ఒకపల్లె చేరుకున్నారు. ఒక పూరింటి గుమ్మానికి "టీ యివ్వబడును" అనే బల్ల కట్టి ఉంది.

"ఇదే నేను అనుకున్నది. ఇక్కడికి నేచాలాసార్లు వచ్చాను. ఆచిన్న బల్లమీద కూర్చో. నేను లోపలికి పోయి టీ తెమ్మని చెప్తాను" అన్నాడు హెన్రీ.

ఆమె పాపము అలుపు తీర్చుకుంటూ బల్లమీద కూర్చుని చుట్టూ ఉన్న తోటలోని తెల్లని, పచ్చని, పువ్వులకేసి చూడసాగింది.

ఒక స్త్రీ ఎవరో వచ్చి గుమ్మానికి జేర్లబడి వీరిరువురూ ఫలహారం చేస్తూఉంటే చూస్తూ నిలుచుంది.

హెన్రీ ఆమెను ఏవో కొన్ని కుశలప్రశ్నలు వేసి మంచివాడనిపించుకున్నాడు. కాని ఎడ్నా మాత్రము ఆమెతో ఒకపలుకైనా ఆడలేదు.

"మూగనోము పట్టినావా ఏమిటమ్మా. పలుకే బంగారమా ?" అందామె, ఎడ్నాను పలుకరిస్తూ.

"లేదమ్మా. ఈతోట ఎంతో అందంగా ఉంది! దీనికేసి చూస్తున్నాను" అంది ఎడ్నా.

"బాగుందీ!" అంటూ హెన్రీకేసి చూసి, "ఆమె మీచెల్లెలా ?" అందామె.

"ఔను." అని తలూపుతూ హెన్రీ, హల్వా నోటిలో వేసుకున్నాడు.

"ఔను. ఇద్దరికీ పోలిక ఉంది" అంటూ ఆమె తోటలోకి పోయి నాలుగు తెల్ల గులాబి పువ్వులు కోసుకొని వచ్చి ఎడ్నా కందిచ్చింది.

"మాకు తెలియదు కాని, అయినా మీయెరుకను యిల్లు కావలిసిన వాళ్లుంటే చెప్తారా ? మాచెల్లికి జబ్బు చెయ్యడంవల్ల, ఇల్లు వదిలివేసి ఆమె వెళ్లిపోయింది. దాన్ని అద్దెకిచ్చివేయాలని చూస్తున్నాను" అందామె.

"చాలాకాలం ఉండారా అండీ?" అని చాల మర్యాదగా ఆమె నడిగాడు హెన్రీ.

"అది ఉండేవాళ్లను బట్టి చెప్తాను" అన్నదామె నసుగుతూ.

"సరే! నా కెవరైనా తెలిసినవారుంటారులెండి! మన మొకసారి వెళ్లి ఇల్లు ఉద్దామా?" అన్నాడు హెన్రీ.

"ఓ. అల్లాగే. దాని కేమి! ఎంతో దూరం లేదు. ఆ వీథిలో చెట్లు కనబడుతున్నాయే, ఆయిల్లే. రెండడుగుల దూరం. తాళం పట్టుకుని వస్తానుండండి" అంటూ ఆమె లోనికి పోయింది.

హెన్రీ ఎడ్నాతో, "నువ్వూ వస్తావ?" అంటే ఆమె "సరే. పద" అంది.

వారందరూ రోడ్డెక్కి గేటు దాటి ఇటూ అటూ చెట్లున్న గడ్డిదారిమీదుగా ఆయిల్లు చేరారు. అది చాల చిన్న ఇల్లు—క్రింద రెండు, మేడమీద రెండూ, గదులున్నాయి.

ఎడ్నా మేడమీదిగది కిటికీలోనుండి క్రిందకు చూస్తూ ఉంది. హెన్రీ క్రింద వీథిగుమ్మందగ్గర నిలుచుని "ఎల్లా ఉంది: నీకు నచ్చిందా?" అన్నాడు.

"చాలా బాగాఉంది. ఇల్లా రా. ఇక్కడనుంచి చూడు, ఎంత బాగా ఉందో!" అంటూ అతన్ని పైకి రమ్మని పిలిచి కిటికీలో తనో ప్రక్కకు జరిగి అతనికికూడ చోటు చేసింది. హెన్రీ పైకి వచ్చి కిటికీలోనుంచి అవతలికి వంగిచుట్టూ ఉన్న ప్రదేశాన్ని చూస్తున్నాడు. వారికి క్రిందుగా సన్నగాలికి తలలు వంకిస్తూ చెట్లున్నాయి. ఈసన్నగాలికే ఎడ్నా ముంగురులెగిరి హెన్రీకళ్ల మీద పడ్డాయి. వాళ్లిద్దరూ అక్కడనుంచి కదల్లేదు. అది సాయంసమయము. ఆకాశపు నీలాల్లోనుంచి నక్షత్రాలు కుసుమిస్తున్నాయి.

"చూడు! చూడు! అవిగో నక్షత్రాలు" అంటూ ఎడ్నా కదలనట్టు కనపడుతూనే నింపాదిగా హెన్రీ భుజముమీద వాలింది. అతనామెను ఒక చేతితో దగ్గరకు తీసుకున్నాడు. "క్రింద కనబడుతూఉన్న వన్నీ ఏంచెట్లు" అని డగ్గుత్తికతో ఆమె అడిగింది.

"ఈ కనుచీకటి గునలని మోసపుచ్చడంచేత అవేవో చెట్లలా కనుపడ్డవి. కాని కొన్ని చెట్లనిండా దేవతలున్నారు, మరికొన్ని చెట్లనిండా చక్కిబాదంకాయలున్నాయి" అని కొంటెతనంగా హెన్రీ అనడంతోనే ఎడ్నా నిట్టూర్చి, "ఇంకమనం ఇక్కడ ఉండవద్దు. వెళ్లి పోదాము రా బాబూ!" అంది.

హెన్రీ ఆమెను తన బాహుబంధంలో నుంచి విడుదలచేశాడు. ఆమె ఆగదిలోనే నడాడుతూ చెదరిన జుట్టు పైకి తీసుకుంది.

"ఏమి! ఈవేళంతా నువ్వల్లా ఉన్నావే!" అని హెన్రీని ప్రశ్నించి అతనిసమాధానంకోసం ఆగకుండగనే అతనిచెంతకు పరుగున వెళ్లి కంఠమాలగా తన బాహువులు వేసి అతనిశిరము తనయెద కదుముకున్నది.

ఉద్రిక్త హృదయంతో, "హెన్రీ! నిన్నే ప్రేమించాను. అబ్బా! నన్ను గట్టిగా అదిమి పట్టుకుందూ" అన్నదామె.

హెన్రీ ఆమెను తన కౌగిలిలో అదుముకున్నాడు. ఆమె అతనిమీద ఆనుకొని అతని కన్నుల్లో కనులుపెట్టి చూస్తూ "ఈవేళంతా ఎంత దారుణంగా ఉంది? దీనికంతకూ కారణం నాకు తెలుసును. నేనెన్నో విధాల ప్రయత్నం చేశాను: నీకు చెప్పివేద్దామని—నువ్వు నన్ను ముద్దుపెట్టుకోవడం నా కెంతో ఇష్టమని—అబ్బ! ఎన్ని సార్లు! ఎన్నిసార్లు!" అన్నది.

"ఎడ్నా! నువ్వు ధన్యవు. ధన్యవు ధన్యవు. ముమ్మాటికి ధన్యవు" అన్నాడు హెన్రీ ఆమె కన్నుల లోనికి చూస్తూ.

## ౭

"సాయంకాలమువరకూ ఎల్లా లేచి ఉండగలనా అనుకుంటున్నాను" అన్నాడు హెన్రీ.

జేబులోనుంచి గడియారం తీసి గదిలోకి పోయి పుష్పపాత్రిక పట్టుపైపెట్టాడు. టైమెంతయిందో అని గడియారం కేసి ఏడుసార్లు చూచాడు కాని సరిగా ఎంత టైమయిందో అతనికి జ్ఞాపకమే లేదు. మళ్లీ చూశాడు.

నాలుగున్నర అయింది. ఆమె బండి ఏడుగంటలకి వస్తుంది. స్టేషనుకి ఆరున్నరకే బయలుదేరి పోవాలి. ఇంక రెండు గంటల కాలం గడపాలి గదా!

మేడపైనుండి క్రిందకీ, క్రిందనుండి పైకీ మెట్లు దిగుతూ ఎక్కుతూ, "ఇది చాల సరదాగా ఉంది" అనుకున్నాడు. తోటలోనికి పోయి తెల్లపువ్వులన్నీ చెండుక్రింద కట్టి ఎడ్నా మంచం ప్రక్క ఉన్న పువ్వు పాత్రికలో పెట్టి హెన్రీ భావ ప్రపంచంలో ఎటకో తేలిపోతున్నాడు.

"ఇల్లా కాలం వెళ్లబుచ్చడం చాల విసుగుగా ఉంది. ఛా! ఈపని బాగా లేదు.......ఆమె మరింక రెండు గంటల్లో వస్తుంది. ఇద్దరమూ కలిసి కులాసాగా ఇంటికి నడచి వచ్చివేస్తాం. నేను ఆపళంగా వంటింట్లో టేబిలు మీద ఉన్న తెల్లజాడీ పట్టుకొని పాల 'బడ్డీ' యింటికి వెళ్లి పాలు పట్టుకొని తిరిగి వస్తాను. నేను వచ్చేటప్పటికి ఆమె వంటింట్లో దీపారాధన చేసి సిద్ధంగా ఉంటుంది. పిల్లిలా ఇంట్లోకి వచ్చి కిటికీలోనుంచి దీపం వెలుగులో ఆమె ఇటూ అటూ వంటింట్లో తచ్చాడడం చూస్తాను. తరువాత భోజనం చేస్తాము. భోజనం అయినతరువాత (గిన్నెలన్నీ నేనే కడిగి వేస్తాను!) సెగడుకి మరి నాలుగు పుల్లలు పెట్టి ఇద్దరమూ ప్రక్కమీద కూర్చుని అవి మండుతూఉంటే చూస్తూఉంటాము. అంతా నిమ్మకు నీరెత్తినట్లు ఉంటుంది—నిప్పు కర్రల చిటపెట ధ్వనీ, తొంగితొంగి చూస్తూఉండే మలయ కుమారికల కాలిచప్పుళ్లు తప్ప......తరువాత మేము మాకొవ్వొత్తి దీపాలు మార్చుకుంటాము. ఆమె ముందు పైకి వెళుతుంది. గోడమీద ఆమె నీలినీడ పడుతూ ఉండగా పైకివెళ్లి పోతూ 'గుడ్‌నైట్ హెన్రీ!' అంటే నేను 'గుడ్‌నైట్ ఎడ్నా!' అంటాను. తరువాత ను మేడమెట్లు దబదబ చప్పుడు చేస్తూ నామంచం మీదకురికి, ఆమెగది తలుపుల సందులోనుంచి నాగదిలోపడే వెలుతురు పీలిక కేసి అది కనపడేదాకా చూస్తూ అది ఆరిపోయినతరువాత కళ్లు మూసివేసుకొని ప్రొద్దున్నదాక పడుకునే ఉంటాను. ఇంక మాకు రేపు, రేపురాత్రి ఉంటాయి. నాలాగే అనుకుంటూ ఉంటూన్నదా ఎడ్నాకూడా? ఎడ్నా! త్వరగా రా!

నాకే చిన్న రెక్క ఉంటే
నేనే చిన్న పులుగునైతే
రివ్వురివ్వున వచ్చి
నీమ్రోల వ్రాలనా!

వద్దు వద్దు ఎడ్నా!......ఇల్లాగే ఉండాలి. నిరీక్షణ నే స్వర్గసౌఖ్యమంది ఎడ్నా! నీకర్థమయినదా నేనన్నది? ఎప్పుడైనా చిన్నపూరింట్లో ఇంత అమృతం లాంటి జీవితం గడిపినవారిని ఎవరినైనా నువ్వెరుగుదువా? చూడు! మనం ఎల్లా ఉన్నామో!

హెన్రీ క్రింద గుమ్మంలో కూర్చున్నాడు, చేతులు రెండూ ముడుచుకున్న మోకాళ్లకు పెనవేసి. ఆరాత్రి వారిద్దరూ ఓడమల్లయ్యల పల్లె చేరినప్పుడు ఎడ్నా "నేనంటే నమ్మకం లేదు హెన్రీ?" అంది.

"అప్పుడు లేదు కాని ఇప్పుడు ఉంది. 'పరమాత్మాహం పరిపూర్ణోహం' అని పిస్తున్నది నాకు నేనే" అన్నాడు హెన్రీ.

హెన్రీ తల గుమ్మంమీదకు వాల్చాడు. నేత్రాలు—నిద్రమత్తువల్ల మాత్రం కాదు, ఎందుచేతనో, మూతలు పడిపోతున్నాయి. అల్లా చాలాకాలం గడచిపోయింది. రోడ్డుమీద పైకి ఎగసిపోతూ పెద్ద తెల్ల పట్టుపురుగొకటి వెళ్తూన్నట్టుగా చూసినట్లు తలపోసుకున్నాడు హెన్రీ. అదివచ్చి ఇంటివీథి గుమ్మంమీదే వాలింది అది పట్టుపురుగు కాదు. తెల్లగౌను వేసుకున్న చిన్నబాలిక. ఎంత అందమైన పిల్ల! అతను హసిస్తున్నాడు నిద్రలో. ఆమెకూడ నవ్వుతూ వెనక్కి తక్కుతూ తారతూ తన అడుగు జాడలు చూసుకుంటూ నడచి వెళ్లి పోయింది.

"కాని ఆమెమాత్రం ఈ ఇంట్లో పిల్ల కాదు. ఈ ఇల్లు మాది. ఇందులోకి ఇంకొకళ్లు రావడమే!—అదుగో! ఆమె వస్తూ ఉంది" అనుకుంటున్నాడు మళ్లీ హెన్రీ.

ఆమె బాగా అతనిదగ్గరకు వచ్చి గౌనులోనుంచి చేయి పైకి తీసి ఒక టెలిగ్రాము అతని కిచ్చి నవ్వుతూ వెళ్లిపోయింది.

హెన్రీ దానికేసి చూస్తూ, "మంచికాన్కే. ఇది ఉత్తుత్తి బువ్వాలాట వంటిది కాదుగదా! లేకపోతే ఇది లోపల పాము లుండే వాటి వంటిదై విప్పగానే పాములు వచ్చి నాకేసి పడగ లెత్తి చూసి బుస్సలు కొట్టవు గదా!" అనుకొని కలలోనే నవ్వుకుంటూ దాన్ని జాగ్రత్తగా విప్పాడు. "ఇది పట్టినుడ తలు పెట్టిన తెల్ల కాగితం". దాన్ని పైకి విప్పి అల్లా వదిలివేశాడు గాలికి.

ఆతోటలో నీలి నీడలు ఛాయలు దేరినవి. ఆనీడ లన్నీ కలసి చీకటి గూడు కట్టి అందులో ఆఇంటినీ, చెట్లనూ, హెన్రీనీ, జెలిగ్రామునూ దాచివేసినవి. కాని హెన్రీ మాత్రం అక్కడనుంచి కదలలేదు.

---

## మీ రా బా యి

మున్నంగి లక్ష్మీనరసింహశర్మ గారు

ధర నధార్మికతా గ్రీష్మతాప ముడుప-సాధుజన మానసమ్ములఁ జల్లపఱుప
నుర్విసర్వము నూయెల లూఁచుచున్న-గాంధిదేవుని సత్త్వయోగమ్ము మహిమ
నమరనదిఁ బొల్చు బంగారు కమల మట్లు-గగనతలమున వెల్గు నక్షత్రమట్లు
వఱలె నీకర్మభూమిని భాగ్యవశత-సారసదమల మలయసమీర "మీర."
పడమటినీమయేడ! ధనవంతుని కూరిమి బిడ్డవేడ! చొ
ప్పడిన నిజేచ్ఛయేడ! మెలబ్రాయము దేడ! సమస్త భోగ్యముల్
బిడికిటిలోనివై యనుభవింపఁగ నొల్లమి యేడ! అయ్యో! లే
వడిఁ బరపాలకత్వమున వందురు భారతవర్షమేడ! క
ట్టిడివిధి యేల యిట్లు వికటించెనొ నీయెడ! గోచిపాతరా
యఁడు, చెఱసాలలం జివుకు నష్టదరిద్రుఁడు, గాంధి, ముక్తి నీ
యొకి నిడునంచు నమ్మి యిటు యోగినివైతివె పిచ్చితల్లి, నీ
యడుఁగులకుం బదింబదిగ నంజలులం ఘటియింతు సోదరీ!

---

# మా మరదలు

వేదుల సత్యనారాయణశాస్త్రిగారు (సాహితీసమితి)

ఏదో పురాణములో ఒక పతివ్రతకథ చదివాను. కుష్ఠరోగపీడితుడైన తన భర్తను బుజముమీద ఎక్కించుకొని ఆమె ఆయన కోరినవేశ్యయింటికి మోసుకొని వెళ్లినదని, ఆయనకోరిక ఈడేర్చడముకోసము ఆవేశ్యకు సేవకూడా చేసినదని చదివినప్పుడు నాశరీరము పులకరించిపోయినది. ఆ సతీమణి చరిత్రను మృదుమధురమైన భాషలో వ్రాసిన ఆకవి కృతార్థుడనుకొన్నాను. ఇంకా ఎందరో గొప్పగొప్పకవులు పతివ్రతల మహిమను పద్యకావ్యములుగా, నాటకాలుగా, నవలలుగా వ్రాసినారు. తన సతీసోదరిచరిత్ర వ్రాస్తున్నానని ప్రతికవికూడా గర్వపడిఉంటాడు. ఎందుకంటే సర్వధర్మములూ నాశనమైనా ఈదేశమున హిమాచలముకన్న ఉన్నతముగా, స్థిరముగా నిలిచిఉన్నది పతివ్రతామహిమ. సతీమతల్లుల నిట్టూర్పులతో ఈదేశమందలి గాలి యశస్సౌరభములను ప్రపంచమందంతటా వెదజల్లుతున్నది.

ఇవి స్త్రీస్వాతంత్ర్యపురోజులు. పురాణకాలపునాటి పతివ్రతల చరిత్రలకు, నేటి స్వాతంత్ర్యవాదులు, ఆకథలు అసలు అబద్ధములనీ, స్త్రీదౌర్బల్యమనీ, స్త్రీత్వమునకు అవమానమనీ, ఇంకా ఎన్నోవిధాల వ్యాఖ్యానములు చేస్తున్నారు. ఈస్థితి సావిత్రీ చంద్రమతులు మొదలైన ఆదర్శకసతులకథలకు కూడా తప్పలేదు. పూర్వకాలములో సతులకు ఈదేశమున ఎట్టిస్వాతంత్ర్యము ఉండేదో వీరు యోచించరు. ఇప్పుడు కావలసిన స్వాతంత్ర్యమేమో వీరికి తెలియదు. అందువల్లనే అనాలోచితములూ విరుద్ధములూ అయిన ఈవాదప్రతివాదములు.

ఏవిషయములోనూ పురాణములలోని సతీమతల్లులకు తీసిపోని ఒక పతివ్రతకథనే నేను ఇప్పుడు వ్రాయదలచుకొన్నాను. ఇది నాస్వకపోల కల్పితముకాదు. వాస్తవమునకు ప్రతిరూపము. నేను ఏసతినిగూర్చి వ్రాయబోతున్నానో ఆమె పౌరాణిక సతీమతల్లులవలె చిరస్మరణీయ; తేజస్విని. ఆత్మత్యాగమందు, పాతివ్రత్యమందు, సహిష్ణుతయందు ఆమె పౌరాణికసతీమణుల సంతానమని అనిపించుకొన్నది. అందువల్లనే ఆమె అక్షరరూపముగా ఉండదగ్గదని నాకు తోచినది.

ఆమె నాచిన్న ఆడుపడుచు. ఆమెపేరు దేవి. నేను వ్యక్తురాలనై మా అత్తవారింట అడుగుపెట్టినప్పుడే నాకు దేవితో ప్రథమపరిచయము. అప్పటి కామెకు పదేండ్లు.

నా మామగారు గొప్పడాక్టరు. ఆచుట్టుపట్ల ఆయనకున్నంతపలుకుబడి ఎవరికీ లేదు. ఆయనకు ముగ్గురు కొడుకులు ముగ్గురు కూతుళ్లు. అందులో మావారు పెద్దవారు.

మా దేవి కడగొట్టుది. మావారు ప్లీడరీచేస్తున్నారు. నెలకు అయిదారు వందలు సంపాదిస్తున్నారు. దేవికి ఇంకా పెండ్లి లేదు.

ఆయింట్లో దేవితోనే నాకు ఎక్కువ స్నేహము. ఆమె రాత్రింబగళ్లూ ముద్దుగా నా వెంటవెంట తిరుగుతుండేది. ఆమె చేష్టలూ, ఆమెనవ్వులూ, ఆమె ముద్దుమాటలూ మరచిపోదామన్నా మరిచిపోలేను. అమాయిక స్నేహముతో, స్వార్థరహితమైన ప్రేమతో, నిష్కపటమైన మమకారముతో మా దేవి నన్నూ నాహృదయమునూ నిలువునా వికసింపచేసేది. నేను కొంచెము సేపు మాట్లాడకుండా ఊరుకుంటే నాదగ్గరికి వచ్చి వేలు ఊపుతూ తల ఆడిస్తూ "ఆఁ, వదినా! అమ్మకోసమూ, నాన్నకోసమూ అప్పుడే బెంగపెట్టుకున్నావూ?" అని నవ్వుతూ అడిగేది. 'లే'దని నేను ఎంత చెప్పినా ఒప్పుకొనేది కాదు. గబగబ గదిలోకి వెళ్లి ఒక బొమ్మను తీసుకొనివచ్చి నాచేతికిచ్చి "ఇదుగో నాబిడ్డను నీకు ఇచ్చేస్తున్నాను. నీకు ఇటువంటి కొడుకే పుడతాడు. రేపే నీవు మీవాళ్ల ఇంటికి వెళ్లుదువుగాని, నాన్నతో అమ్మతో, అన్నయ్యతో నేను చెప్పాతాను. దిగులుపడకు. నాకూతురిని నీకు ఎందుకిచ్చానో ఎరుగుదువా? నేనుకూడా నీవెంట వస్తాను. సరేనా? ఏం? వదినా?" అని ఏమేమో అనేది.

దేవి నిజముగా దేవివంటిదే. తన కలుపుగోలు తనముతో నా హృదయములో తనకు కావలసినంత చోటు చేసుకొన్నదామె. నాకు చెల్లెళ్లు లేరు. దేవి నాకు దొరికిన తర్వాత ఆలోటు మరి నాకు కనబడనేలేదు. నాకు చెల్లెలున్నా దేవిలాగు నా హృదయమును వశపఱచుకొనేదో లేదో చెప్పలేను.

నా మామగారు చండశాసనులు. స్త్రీలను కట్టుబాటులలో ఉంచడమంటే ఆయనకు ఎంత పక్షపాతమో స్త్రీస్వాతంత్ర్య మంటే అంతకన్నా ఎక్కువ విరోధము. ఆయన ఇంగ్లీషు చదువుకొనినవాడు కాడు. అయినా స్త్రీలు ఇల్లాండ్రై ఉండడమే మంచిదని ఇటలీ ముసలోనీ లాగే ఆయనకూ ఉద్దేశ్యము. ఆయన తనకూతుళ్లను ఎవరినీ స్కూలుకు పంపలేదు. ఒక ముసలిపండితుడు ఇంటికే వచ్చేవాడు. అతనిదగ్గరనే పిల్లలకందరికీ విద్యాభ్యాసము. మా దేవికూడా ఆయన దగ్గరనే ఇంట్లోనే చదువుకొన్నది. చదవడమూ వ్రాయడమూ ఆమెకు బాగా వచ్చును. అచ్చమాంబగారు వ్రాసిన అబలా సచ్చరిత్ర రత్నమాల ఎప్పుడూ చదువుతూ ఉండేది.

పన్నెండోయేట మా దేవికి వివాహమయినది. వరునిపేరు ఉమాపతి. ఆయన బి. ఏ. ప్యాసయినాడు. వాళ్లు అంత ఆస్తిపరులు కారు. ఏదో సంసారిపక్షము. ఈ సంబంధము తన చెల్లెలికి తగినది కాదని మావారు మనసులో చాలా విచారపడ్డారు. నా మామగారు మాత్రము నవ్వుతూ "బి. యల్. చదివింతాము. ప్యాసయినతర్వాత నీకు జూనియరుగా తీసుకొందువు గాని" అని అన్నారు.

ఏలాగో దేవి వివాహము జరిగిపోయింది. మా అత్తగారు అల్లుణ్ణిచూచి రహస్యముగా "మాబిడ్డ చందమామలాటిది. అల్లుడు మాత్రము అంత రూపసికాడు." అని అన్నది. నా అభిప్రాయముకూడా సరిగా అల్లాగే. ఉన్నది. నా మనస్సులోకూడా విచారము లేకపోలేదు. పైకి ఎందుకు అనడము!! "ఏమో! దేవికికూడా ఈ సంబంధము అంత సంతృప్తి కరముగా లేదేమో?" అని నా మనసులో అనుకొనేదానను. ఎందుకంటే ఉమాపతి అంత రూపురేఖలు కలవాడు కాడుగదూ!

దేవి అత్తవారింటికివెళ్లి ఒక నెలరోజులు ఉండి తిరిగివచ్చినది. దేవికి "మొగుడంటే చాల ఇష్టమే" అని మేము అప్పుడు అనుకొన్నాము. ఒకసారి నేను ఏకాంతముగా ఉన్నపుడు "నీ మొగుడు నీకు తగినవాడేనే? నీకు ఇష్టమేనా?" అని అడిగినాను. ఆమె నవ్వి నా బుజముపట్టుకొని నొక్కుతూ, "పోలే నీవంతానూ? ఆడువాళ్లకు మొగుడికంటె ఇష్టు లెవరుంటారు?" అన్నది. నేను ఆమె రెండు బుగ్గలూపట్టుకొని నొక్కుతూ "అప్పుడే మొగుడంటే నీకు ఇంత అభిమానమేమిటే! ఈ మమకారము మాకు ఇదంతా"—అని ఏమో అనబోతున్నాను. దేవి నానోరు మూసింది. నేను వెనుకకు తిరిగిచూచాను. అప్పుడే అత్తగారు దేవుడిఇంట్లోకి వెళ్లుతున్నది.

బహుశా ఆమె మామాటలు విని టుంటుంది. అణచుకొంటూఉన్న ముసిముసి నవ్వు ఆమెముఖముమీద నాకు కనుపించింది. మా అందరిమనస్సులలో నల్లమబ్బులాగు ఆవరించిఉన్న సందేహము ఇప్పుడు విడిపోయింది. పుట్టింటికివచ్చి ఎన్నాళ్లోకాకముందేనవ్వుతూ దేవి మరల అత్తవారింటికి వెళ్లిపోయింది.

ఒక సంవత్సరము అయినది. ఒకనాడు మావారు నాతో "ఉమాపతి పరీక్షపోయింది. ఇక చదవడట. ఏదైనా వ్యాపారము చేస్తానని చెప్పినాడు. అందుకోసము అయిదువేల రూపాయలు ప్రస్తుతము కావలెనట. ఆ మొత్తము తండ్రినిఅడిగితే ఆయన చాలాకోపపడి "మింగ మెతుకులేదు మీసాలకుసంపెంగనూనె" అని ఇంట్లోఖర్చుకే నానాకష్టాలు అవుతుంటే నీకు అయిదువేలుఎక్కడ దండుకొనివస్తాను ఇప్పుడు? నీకు ఇష్టమయితే ఇంత తిని ఇంట్లో పడిఉండు లేకుంటే పో" అని కసరి చీవాట్లు పెట్టి తిట్టినాడట. ఆరూపాయలు నేను ఇద్దామనుకొంటున్నాను. ఏదోవిధముగా అతడు నాల్గుడబ్బులు సంపాదించుకొంటుంటే ఏ ఇబ్బందీ ఉండదు. అయిన సంసారము కానప్పుడు అన్నీకష్టాలే. దేవికేమైనా సుఖపడేగీత ఉన్నదేమోననే నాప్రయత్నము. అందుకే ఆడబ్బు ఇచ్చిచూతాము. ఆస్తీపాస్తీలేదు. తండ్రి కాకులకు ఎంగిలిచేయికూడా విసరని బాపతు. ఏమిచేస్తాము మరి?" అన్నారు.

నేను ఆమాటవిని మావారితో "సరే. దేవిసుఖముకోసము మీరేమిచేసినా నాకు ఇష్టమే. డబ్బుఇవ్వండి. కాని మీనాన్నగారితో కూడా కొంచెముచెప్పి ఇస్తేమంచిది. లేకుంటే ఆడబ్బు తగలబడిపోతే—"

నామాట ఇంకా పూర్తి కాకమునుపే మావారు నవ్వుతూ "ఏబ్బే, ఉమాపతి ఇంకో మోస్తరు మనిషి కాడు. మీ ఆడవాళ్ల ఆలోచనలు ఎప్పుడూ ఇలాగే ఉంటవి. ఏమయినా కానీ డబ్బు ఇవ్వడము తప్పదు." అన్నారు. నేనేమీ మాట్లాడలేదు.

నాలుగురోజు లయిన తర్వాత ఉమాపతి వచ్చి రెండుమూడురోజు లున్నాడనుకొంటాను. ఆడబ్బు తీసుకొని వెళ్లిపోయినాడు. కొన్నాళ్లు అయినది. మామామగారు ఒకరోజున మావారితో "ఉమాపతి బియ్యపు వర్తకము ఆరంభించాడట! అతనికి డబ్బు ఎక్కడిదో?" అని అన్నారు. మావారు జవాబివ్వలేదు. "అతనికి నీవేమైనా ఇచ్చావా?" అన్నారు మరల మామగారు. "ఊం. చాలా నిర్బంధపెట్టాడు. పోనీ వ్యాపారముచేసి నాలుగుడబ్బులు వెనుకవేస్తే మనపిల్ల సుఖపడుతుందని—"

మాట ఇంకా ముగియకమునుపే మా మామగారు ముఖము చిట్లించి చాలా తెలివి తక్కువపని చేశావు. వాడు వట్టి దౌర్భాగ్యుడు. చివరకు మనపిల్లను గంగలో దింపుతాడు." అని చిరాకు పడుతూ వెళ్లిపోయినారు.

కొన్ని నెలలు గడిచిపోయినవి. తొలిచూలు పురుడు పోసుకోవడమునకు దేవిపుట్టింటికి వచ్చినది. ఆమె ఒంటిని ఒకనగకూడా లేదు. నల్లపూసలూ మంగళసూత్రమూ మాత్రము మిగిలి ఉన్నవి. అది చూచి మా అత్తగారు "నీ నగలన్నీ ఏమయినవే? చేతిగాజులు కూడా—" అని ఏమో అనబోయినది.

దేవి చాలా విరక్తితో "నగలున్నవి. అవి అమ్ముకొని తినేవాళ్లుకారు వాళ్లు. ఒకవేళ అమ్ముకొన్నా అవి వాళ్లసొమ్ము. ఏమి చేసుకొంటే మనము ఏమనగలము?" అని అన్నది.

మా అత్తగారు ముక్కుమీద వేలువేసుకొన్నది. ఆశ్చర్యపడుతూ దేవి ముఖముకేసి చూచినది. దేవి ముఖము కోపమువల్ల ఎఱ్ఱపడినది. మాఅత్తగారు చాలా మనసునొచ్చుకొంటూ "ఎంతకోపము వచ్చిందే? అడగడమే తప్పా? వాళ్ల ఇంట పడ్డావని మేమంత పరాయివాళ్లమై పోయినామటే తల్లీ?" అని అన్నది.

"ఆడుబిడ్డ పరాయిఇంటిది కావడము కొత్తకాదు. కాని అంతా తెలిసి పేదవాళ్లకిచ్చివేసినతర్వాత చీటికిమాటికి ఇటువంటి మాటలలో వాళ్లను అవమానపరచడము అంత మంచిదికాదని చెప్పుతున్నాను." అని దేవి గంభీరముగా తల్లికి జబాబుచెప్పి గబగబ మేడమెట్లెక్కి పైకివెళ్లిపోయినది. నిశ్చేష్టురాలైపోయి మా అత్తగారు ఉన్నచోటనే నిలుచుండిపోయినది. నేను మాత్రము నెమ్మదిగా మేడమీదికి వెళ్లి దేవిని నాగదిలోకి పిలిచి నెమ్మదిగా "మొగుడిపక్షము వహించి కన్నతల్లితో దెబ్బలాడడానికి నీకు సిగ్గులేదే, నీ సిగ్గుచిముడ! మొగుడంటే ఒకేసారే పడి

చచ్చిపోతున్నా వేమిటి? సిగ్గుమాలినదానా?" అన్నాను.

దేవి "కాదు వదినా? నేను చూస్తున్నాను కదూ! అమ్మకుగాదు, నాన్నకు కాదు, ఎవరికీ ఆయనంటే గిట్టదు. ఆయనమీద ఇష్టము లేదు. 'మేము పేదవాళ్లము గనుక ఎన్ని తలవంపులైనా భరించితీరాలి' అని ఆయన ఎంతో దుఃఖపడుతుంటారు." అని అన్నది.

"ఏలాగైనా ఉమాపతి నిన్ను అమాంతముగా బుట్టలోవేసుకొన్నాడే. లేకుంటే ఇంత మమకారమూ ఇంత అభిమానమూ మేము ఎన్నడూ ఎరగమమ్మా!" అని నేను అన్నాను.

దేవి నవ్వుతూ "పోవే నీమాటలూను, నీవూను!" అని అన్నది. తర్వాత ఒకసారి నేను ఆమాటా ఈమాటా చెప్పుతూ రహస్యముగా 'నగలమాట ఏమిటే?" అని దేవిని అడిగినాను.

"ఎవరితో చెప్పవుగదా?" అన్నది దేవి.

"నాసంగతి నీకు తెలియదా ఏమిటి?" అన్నాను నేను.

దేవి తలవంచుకొని "వ్యాపారము చేయడమునకు మీ అన్నయ్యకు కావాలంటే ఇచ్చాను" అన్నది.

"నగలు అన్నీనా?"

ఆఁ. అవన్నీ అమ్మితే నాలుగువేలపైచిల్లర వచ్చినది.

"మరి మీఅన్నయ్య కొంతడబ్బు ఇచ్చాడే వ్యాపారమునిమిత్తమై మీ ఆయనకు?"

"ఆడబ్బు వ్యాపారములో నష్టమై పోయింది వదినా?"

"అయిదు వేలూనా?"

"ఆఁ. ఆయన చెప్పారు. చూడు ఈమాట మాఅన్నయ్యతోగాని చెపితే నన్ను చంపుకో తిన్నట్టే తెలిసిందా?"

"చెప్పను. ఎవరితో చెప్పను. కాని నీవు చాలా తెలివిమాలినపని చేశావు దేవీ? ఆడబ్బు వ్యాపారములో పోయినదని నేను నమ్మను. ఇంకేదోవిధముగా—"

నామాట కడ్డువచ్చి దేవి "లేదువదినా? ఆయన మహామోస్తరు మనిషి కాదు. ఆయనకు ఏ కళంకమూ లేదు. అదిగాక నన్ను ఎంత ప్రేమతో ఆదరిస్తున్నాడో నీవు ఊహించలేవు." అన్నది.

నాకు నవ్వువచ్చింది. నవ్వుతూ "నీవంటి తెలివితక్కువ దద్దమ్మను ప్రేమిస్తున్నట్లు నటించడము అంతకష్టమైన పనిగాదు." అన్నాను. దేవి వేళాకోళపు నవ్వునవ్వింది. ఆనవ్వులో ఆమెకు నామాటలమీద ఎంత అవిశ్వాసము ఉన్నదో నాకు తెలియకపోలేదు. ఆమె నవ్వుతూ తలఊపుతూ "వదినా? పోదు! నీమాటలూ నీవూను? నీతో ఏమాటా చెప్పగూడదనుకొంటాను. మరి చెప్ప

కుండా ఒక్కనిమిషమైనా ఉండలేను. అంత తెలివితక్కువది నేనేమికనిపిస్తున్నానుకొన్నావా? రేపో మాపో పిల్లతల్లిని కాబోతున్నాను. తెలిసినదా! సరేగాని నీవు కొంచెముసేపు ఇక్కడనే కూర్చొనిఉండు. అమ్మకు నామాటలకు కోపము వచ్చినట్లున్నది. నేను కిందికివెళ్లి ఆమెను శాంతపరచి వస్తాను." అని దేవి కిందికి వెళ్లినది.

దేవి చెప్పినమాటలు నేను మావారితో చెప్పడమా? మానడమా? నేను ఆమె దగ్గర ఒట్టుపెట్టుకొన్నాను. కాని ఆఒట్టుమీద ఉండడానికి నామనస్సు సుతరాం ఒప్పుకోవడములేదు. ఒకవేళ మావారితో చెపుతాను. చెప్పితే మామామగారికికూడా తెలుస్తుంది. పెద్ద గందరగోళము కాక తప్పదు. ఉమాపతికి గట్టిచిక్కు వస్తుంది. పోనీ అంతకంటె నాకెందుకని ఊరుకుందా మంటే మనస్సు ఒప్పుకోవడములేదు. ఉమాపతి వ్యాపారము మీదా, అతని మాటలమీదా అతనివర్తనమీదకూడా నాకు బొత్తిగా నమ్మకము లేదు. అతని విషయములో నాహృదయము చాలా విరుద్ధముగా ఉన్నది. ఏమయినా సరే దేవి లాగు నేను ఈ వ్యాపారమును నమ్మి ఉండలేను. నమ్మి ఉండడానికి మనస్కరించడము లేదు కూడా!

ఒక నెలరోజులు గడిచిపోయినవి. దేవికి ఒక మగశిశువు పుట్టినాడు. ఆమె ఆనందానికి అంతూ పొంతూలేదు. కాని చూస్తూ ఉండగానే ఆ సంతోషప్రవాహము కన్నీటి వెల్లువలో కలిసిపోయినది. ఆపుట్టినబిడ్డ పురుడు వెళ్లకుండానే మాతృహృదయములో ఆరని చిచ్చు రగులుకొల్పి మరి, ఈలోకము విడిచిపెట్టి పోయినాడు. దేవి దుఃఖము మరిచెప్పలేను. తర్వాత నేను ఆమెముఖాన నవ్వు అన్నది ఎన్నడూ చూడలేదు.

కొన్నాళ్లు అయిపోయినది. ఉమాపతి తనభార్యను తీసుకొని వెళ్లడానికి వచ్చినాడు. మామామగారు చాలా కోపపడుతూ దేవి దగ్గరికి వచ్చి "నీవిప్పుడు అక్కడికి వెళ్లవద్దు. ఈపచ్చిఒంటితో అక్కడ బండచాకిరీ చేస్తే ప్రాణానికి కూడా ముప్పు రావచ్చును." అన్నారు.

దేవి మెల్లిగా "ఎప్పటికైనా అక్కడికి వెళ్లవలసినదాననే. వెళ్లుతాను నేను నాన్నా?" అని అన్నది.

మా మామగారి మనస్సు చివుక్కుమన్నది. ఆయన తన కోపమును అణచుకొంటూ "సరే, వెళ్లు. ఇక మరి నిన్నెప్పుడూ ఇక్కడికి తీసుకొనిరానని జ్ఞాపకము ఉంచుకో. నేను బ్రతికి ఉండగా నీవు రానడానికికూడా వీలు లేదు." అని బయటికి వెళ్లిపోయినారు.

ఆయన వెళ్లిపోయిన కొంచెముసేపటికి ఉమాపతి బండీతీసుకొనివచ్చి ఇంటిముందు నిలువబెట్టించినాడు. భార్యను పిలిచినాడు. బండి ఎక్కబోయేటప్పుడు దేవి నా దగ్గరికివచ్చి నా కాళ్లకు దండముపెట్టి "చూడు వదినా?

నేను వెళ్లుతున్నాను. నాన్నగారికి నామీద ఎంతో కోపమువచ్చినది. అది పోగొట్టి యథాప్రకారమునకు తెచ్చేభారము నీది." అని కన్నులు తుడుచుకొంటూ బండిఎక్కినది. బండి కదలినది.

మా మామగారు రోగులనందరినీ చూచి రెండుజాములకు ఇంటికివచ్చినారు. రాగానే సావిట్లోనుండే 'దేవీ' అని పిలచినారు.

ఆపిలుపు విని అత్తగారు లోపటినుంచి వచ్చి "ఆమె అప్పుడే అత్తవారింటికి వెళ్లి పోయినది." అని విచారముతో చెప్పినది.

మామగారు నిర్విణ్ణులైనారు. ఒక్క మాటైనా మాట్లాడలేదు. కొంచెముసేపు అటూ ఇటూ పచారుచేసి నెమ్మదిగా బయటి సావిడిలోకి వెళ్లి యోచిస్తూ కూర్చున్నారు. ఆయనతో మాట్లాడడానికే మా కెవరికీ సాహసము లేకపోయినది.

౨

ఒకసంవత్సరము గడచిపోయినది. మా మామగారు ఒకరోజున అకస్మాత్తుగా గుండె జబ్బువల్ల చనిపోయినారు. ఈసంవత్సరములో ఆయన ఎప్పుడూ దేవి సంగతి తలపెట్టనేలేదు. ఆమె కబురు తెలుసుకోవడమునకు యత్నించ నేలేదు. ఆయనముందు దేవి పేరు ఎత్తడానికి ఇంట్లో ఎవరికీ సాహసమే లేకపోయినది. కన్న కడుపుకాబట్టి మా అత్తగారు మాత్రము ఒక సారి సాహసించి మామగారితో "అమ్మాయి కబురే తెలియడము లేదు. ఒకసారి ఎవరినైనా పంపి కొంచెము కనుక్కొంటే బాగుండును" అన్నది. మామగారు ఆమెను కసరి నాలుగు చీవాట్లు పెట్టినారు. దానితో ఆమెకూడా ఆయనముందు మరికూతురి పేరెత్తడానికి సాహ సించలేదు. మామగారు ఎంతో నెమ్మదైన వారు. కడగొట్టుకూతురంటే ఆయన ప్రాణా నికి ప్రాణము. ఆయన మనసు ఇంతగా విరిగి పోవడము నాకే ఆశ్చర్యము వేసినది. అత్తవా రింటికి వెళ్లడము విషయములో తండ్రీకూతు ళ్లకు జరిగిన సంభాషణము విననివారికి ఆయన మనస్సు ఇంత మారిపోవడానికి కారణము ఏమిటో గ్రహించడము అశక్యము. ఆసంగతి తెలియకుంటే నేనుకూడా ఊహించనే లేక పోయి ఉందును.

తండ్రి చనిపోయినట్లు దేవికి తెలిసినది. ఆమె పదోనాడు పుట్టింటికి వచ్చినది. ఇదివరకు లాగున ఆమెను ఎవరూ ప్రేమతో ఆదరించ లేదు. దానికి కారణము మామగారు పోవ డము. ఇంట్లో అందరూ విచారముతో ఉండ డము. పాపము దేవికూడా అంటీ ముట్టకుం డానే అందరికీ దూరదూరముగా మసలేది. ఆమెపైకి ఎంతగంభీరముగా ఉన్నా పితృదుఃఖ మువల్ల లోలోపల కుమిలిపోతున్నదని ఆమె ముఖము చూచి కనిపెట్టవచ్చును. ఇతరులెవ రూ తెలిసికోలేకపోయినా నేనుమాత్రము గ్రహించ గలిగాను. ఆమె తనదుఃఖమును ఎంతో లోలోపల అణచుకొంటున్నది. దేవి తనతండ్రిని ఎంత ప్రేమించేదో, ఎంత భక్తితో

గౌరవించేదో నేనెరుగుదును. అందరికంటె చిన్నకూతు రంటేనే మామగారికి పంచప్రాణాలు. ఆయనపట్టుదలా కోపమూ కలిసి అంత ప్రేమను కూడా ఇట్టే మార్చివేయగలిగినవి. ఆయనపట్టుదల ఏమోకాని చనిపోయేటప్పుడు సైతము దేవిమాట తలపెట్టలేదు.

ఈమారు దేవినిచూస్తే నాకు కళ్లనీళ్ల పర్యంతము అయినది. ఆ అందమూ, ఆ చందమూ అంతా పోయినది, ఎన్నాళ్లనుంచో జబ్బుతో తీసుకొంటున్నమనిషిలాగు ఉన్నది. ఏమి వాలకముపడ్డది! బంగారమువంటి శరీరము మాడి పోయినది. కన్నులు లోతుకుపోయినవి. ఒంటనెత్తురే కనబడడములేదు. నులకతాడు లాగు ఉన్నది.

పితృకర్మ ఏలోపములేకుండా జరుగుతున్నది. 'ఏకాహ' మప్పుడు నేను దేవిని నా గదిలోకి పిలిచి, నాచేతిగాజులూ, మెడలోని హారమూ తీసి ఆమెకు పెట్టబోయినాను ఆమె నన్ను వారించి "ఎందుకివన్నీ వదినే?"అన్నది.

"చుట్టాలూ పక్కాలూ చాలామంది ఇంటినిండా ఉన్నారు. నీవు మొండిచేతులతో, మొండిమెడతో, తిరుగుతావా మరి?"

దేవిముఖము చిన్నబోయినది. మనసులో ఉన్న విచారమంతా ఒక్కనిట్టూర్పుతో పైకివిడిచి తలవంచుకొన్నది. ఆమె గుడ్లనీరు గుడ్లకుక్కుకుంటున్నదని తెలుస్తూనే ఉన్నది. ఆమె తడికళ్లతో దీనముగా నాకేసి చూచి "ఈ ఎరవుసొమ్ములతో లేనివైభవము నటించడము ఎందుకు? ఈ ఒక్కనాటితో వచ్చేదేమిటి పోయెదేమిటి వదినా?"

"వైభవము మాటకాదు ఇప్పుడు. నీవు ఈఇంటి ఆడుపడుచువు. నలుగురూ వచ్చినపుడు కొంచెముగుట్టు నిలబెట్టుకోవడము మంచిది. ఒకనాటి కర్మమేమిటి? నీకివి ఎప్పటికీ ఇచ్చివేస్తున్నాను. నీకు మేము పరాయివాళ్లమూ ఏమిటే తల్లీ?"

దేవి మరి మాట్లాడలేదు. కనుగొలుకుల నుండి జారిన కన్నీటిబొట్లు ఆమె మనసును వెల్లడిచేసినవి.

శ్రాద్ధము ముగిసినది. ఒకరోజున మావారు ఉమాపతితో ఆమాటా ఈమాటా ప్రస్తావిస్తూ "అయితే నీ వ్యాపారము ఏవిధముగా నడుస్తున్నది?" అని మెల్లగా అడిగినారు.

ముఖము చిన్నపుచ్చుకొని చెప్పలేక చెప్పలేక ఉమాపతి "ఏమంత సరిగా-సరిగా లేదు. ధరలు పడిపోయినవి. రాబడిసున్న. చాలా నష్టమువచ్చినది" అన్నాడు.

మావారు నవ్వుతూ "వ్యాపారములోని సులువుబలువులు నీకు తెలియవు వ్యాపారము చేయడము నీవల్లగాదు. ఏదో ఉద్యోగమో సద్యోగమో చూచుకొని కాలక్షేపము చేయడము మంచిది. లేకపోతే కొన్నాళ్లకు జైలు కూడా చూడవలసివస్తుంది." అన్నారు.

ఉమాపతి మాట్లాడలేదు. మావారు ఊరుకోక "మీ నాన్నగారు ఏమంటారు?" అని అడిగినారు.

"ఆయనకూ నాకూ మాటలు లేక చాలారోజు లయినది."

"ఎందు కంతవరకు వచ్చినది?"

"కారణమేమీ లేదు. నెల నెలకూ వందో, రెండువందలో పట్టుకొని వెళ్లి ఆయన దోసిటిలో పోస్తే నా అంతమంచివాడు ఉండక పోవును. ఆయనకు మేము ఇంట్లోఉండడమే గిట్టదు. అందువల్లనే కొన్నాళ్లపాటు మీ చెల్లెలిని ఇక్కడ అట్టేపెట్టవలె ననుకొంటు న్నాను. నేను ఏదో హోటల్లో భోజనము పెడతాను. కొన్నాళ్లు పోతే సంగతి సంద ర్భాలు చూచుకొని ఒకయిల్లు అద్దెకు తీసు కొని వేరేకాపురము పెడతాను."

"ఆహోటల్లో ఈ హోటల్లో తిని నీవు మాత్రము ఒళ్లు చెడగొట్టుకోవడ మెందుకు? అక్కడ నీకు ఇబ్బందిగా ఉంటే నీవుకూడా ఇక్కడనే ఉండవచ్చు. నా చెల్లితోపాటు నీకు కూడా ఇంతభోజనము పెట్టలేనిదుఃస్థితి ఇంకా నాకు రాలేదు. నీవు వ్యాపారము చేయలేవు. ఏదైనా ఉద్యోగము చూడవచ్చును. నీకు ఏలాగు అనుకూలమైతే ఆలాగే చేయవచ్చు. అనవసరముగా మీ నాన్నగారితో తగాదా పెట్టుకోవడ మెందుకు? మనస్పర్ధలు పెరగ నీయకూడదు."

అప్పటినుంచి ఉమాపతి అత్తవారింటనే భార్యతోపాటు ఉన్నాడు. రోజూ మధ్యా హ్నము భోజనముచేసి బయలుదేరేవాడు. తిరిగి రాత్రి పన్నెండూ ఒంటిగంటకు ఇల్లు చేరేవాడు. 'అదే'మని ఎవరైనా అడిగితే ఏదో సాకుచెప్పేవాడు. ఇంటి అందరికీ అత నంటే అసహ్యము పుట్టినది.

అర్ధరాత్రమువరకు కాచుకొని ఉండి అత నికి ఎవరు తలుపు తీస్తారు? ఇంట్లో నౌకరీ వాళ్లందరూ విసుగుకొనేవారు. వంటబ్రాహ్మ ణుడు ఈయనగారు వచ్చినదాకా కనుపెట్టు కొని ఉండేవాడుకాడు. అందరి భోజనాలు కావడముతోనే వెళ్లిపోయేవాడు. వండిన అన్నమూ కూరలూ తనగదిలో ఉంచి, దేవి మాత్రము మేడవీధి వరాండాలో కనుపెట్టు కొని ఉంకి, వీధివైపు రెప్పవాల్చక చూస్తూ అర్ధరాత్రమువరకూ మేలుకొని ఉండేది. కాలిచప్పుడు కాగానే మెల్లగా మేడదిగివెళ్లి వీధితలుపు తీసి అతనిని గదిలోకి తీసుకొని వచ్చి భోజనముపెట్టి అప్పుడు కొం చెము కునుకు తీసేది. ఇంతకుముందు ఒకటి రెండు సారులు ఈసంగతి తెలిసి మావాడు కూకలేశారు. అందువల్ల ఇంతజాగ్రత్త అవస రమయినది. ఈవరుసచూచి ఉమాపతివిషయ ములో అందరికీ అనుమానము పుట్టినది. అతని ప్రవర్తనను గూర్చికూడా. కాని ఈ ప్రపంచ ములో ఏసందేహమూ లేనిది అతని భార్య ఒక్కతే. ఈవిషయమై మేమెవరమైనా ఏదైనా చెప్పితే నమ్మేదికాదు. కాని ఊరికే ఏడ్చేది.

ఉమాపతి అప్పుడప్పుడు భార్యద్వారా అత్తగారిదగ్గరనుంచో, లేకపోతే మావారి దగ్గరనుంచో ఏభై, అరవైరూపాయలు అడిగి తీసుకోవడము సాగించాడు. ఎందుకని అడిగితే

"నాపర్సు ఎక్కడనో పోయిం"దని ఒకసారి, "తప్పకుండా ఈవేళ ఇస్తానని ఒకతనికి వాగ్దానము చేసినాను. ఇవ్వకపోతే మర్యాదపోతుంది" అని మరొకసారి, అత్యవసరమైన పని ఉన్నది. ఇప్పుడిస్తే మళ్లీ నాలుగురోజులలో తిరిగి ఇచ్చివేస్తాను"అని వేరొకసారి ఇలాగే ఎన్నో చెప్పేవాడు. వ్యవహారము ముదిరినది. డబ్బుకోసము భార్యను వేపుకొనితినడము ప్రారంభించినాడు. ఈసంగతి అందరికీ తెలిసినది. ఒకనాడు మావారు "ఇకనేను డబ్బు ఇవ్వను"అని నిస్సంకోచముగా చెప్పివేసినారు. ఇవ్వవద్దని తల్లితో కూడా గట్టిగా చెప్పినారు.

కొన్నాళ్లు జరిగిపోయినది. ఒకనాడు మా రెండోవదినగారి మగడువచ్చినాడు. ఆ రోజుపగలు ఆయన జేబులోవి రెండు పది రూపాయలనోట్లు పోయినవి. ఎంతో గందరగోళము జరిగినది. ఇంట్లో అందరూ ఎంతో మనసు నొచ్చుకొన్నారు. మాట్లాడకుండా మావారు ఆడబ్బు బావగారికి ఇచ్చివేయబోయినారు. కాని ఆయన తీసుకొననేలేదు. పైగా చాలా అభిమానపడినాడు. ఆయన వెళ్లిపోయినతర్వాత మావారు ఇంట్లో నౌకర్ల మీద చాలా కోపపడినారు మొఱ్ఱో మేమేమీ ఎరగము, అని వాళ్లు ఒకటేగోల. అసలు సంగతి నౌకర్లు ఎవరూ మేడ ఎక్కనే ఎక్కరు.

అసలు సంజవేళ నాగదిలో నేను తల దువ్వుకొంటున్నాను. మెల్లగా దేవి అక్కడికి వచ్చినది. ఏవో ఆసంగతీ, ఈసంగతీ మాట్లాడుకొన్నతరువాత హఠాత్తుగా దేవి ఏడుస్తూ "వదినా? చెప్పడానికి నాకు నోరు రావడములేదు. ఆడబ్బు నేనే తీసుకొన్నాను. ఎంతో అవసరమని మీఅన్నయ్య అడిగినారు. ఏమిచేయను? నేను చస్తే బాగుండును వదినా? నలుగురూవింటే ఏమంటారు?" అని నొసట కొట్టుకుంటూ చెప్పినది.

నేను నిశ్చేష్టురాలనైపోయినాను. దేవి ఇంత అధోగతిపాలవుతుందని నేను ఎన్నడూ అనుకోలేదు. పెనిమిటి సుఖము కోసము తాను పదిమందినోళ్లలో పడడానికికూడా వెనుదీయలేదు. దేవిని నేను మెచ్చుకొననా? నిందించనా? ఆమెముఖముచూస్తే నాగుండె కొట్టుకొంటున్నది. దుఃఖముతో పశ్చాత్తాపముతో ఆమె హృదయము తగులబడి పోతున్నదని తెలుస్తూనేఉన్నది. చేసినపనినిగూర్చి ఆమెకు ధైర్యములేకపోలేదు. లేకుంటే తప్పు ఒప్పుకోవడమునకు సాహసించగలదా?

అనుతాప పరిపక్వమై ఆమెహృదయము పండిన గోరింటకాయవలె ఉన్నది. ఎంత తేలికమాట దానికి తాకినా చెక్కలైపోతుంది. అదిగ్రహించి నేను గబగబ గదితలుపు గడియ పెట్టి ఆమెను ఓదార్చడమునకు ఆరంభించినాను. ఎవరికైనా ఈసంగతి తెలుస్తుందేమోనని నేను ఇంతశ్రద్ధ వహించినాను. కాని నాశ్రద్ధ పనికిరాలేదు. దేవి తన నేరము తానే ఒప్పుకొన్నసంగతి అందరికీ తెలిసిపోయినదని రెణ్ణాళ్లతర్వాత నాకు తెలిసినది. కాని నౌకర్ల

నందరినీ బెదిరించి ఎవరినీ నోరెత్తకుండా చేసింద అత్తగారు. ఇది వెల్లడిఅవుతేనేగాని తమ నిజాయితీ యజమానుడికి తెలియదని వాళ్ల యేడుపు. అందరూ దేవిని సంశయదృష్టులతో అవమానపరుస్తున్నారని తెలిసి నేను చాలా అసహ్యపడినాను. సంశయించడమునకు మరి అభ్యంతరము ఏముంటుంది?

ఆరునెలలు గడచిపోయినవి. రేపు మా అబ్బాయికి అన్నప్రాశనముహూర్త మనగా ఆరోజు సాయంకాలము మావారు నాగదిలోకివచ్చి రెండువందల రూపాయలు నాచేతికిచ్చి "నీదగ్గిరఉంచు. రేపు తీసుకొంటాను" అన్నారు.

ఆరూపాయలు తీసుకొని నేను నవ్వుతూ "ఇవి ఇక మీకు రావుమరి! వీటితో అబ్బాయి మెళ్లోకి గొలుసు చేయిస్తాను" అన్నాను.

"ఏమీ తోచకపోతే సరి! అవి ఖర్చుపెట్టడమునకు వీలులేదు. రేపు చాలాఅవసరము ఉన్నది." అని మావారు వెళ్లిపోయినారు.

దేవి అప్పుడు అక్కడనే ఉన్నది. నేను పెట్టెతీసి నోట్లు అందులోపెట్టి తాళమువేసి తాళపుచెవులగుత్తి పట్టుపుతలగడక్రిందపెట్టి కిందికి వెళ్లిపోయినాను. ప్రొద్దుట మావారు నన్ను ఆడబ్బు అడుగలేదు. నాకుకూడా ఆసంగతి జ్ఞాపకము రాలేదు.

కుర్రవాడి అన్నప్రాశనము జరిగినది. నాలుగురోజులైనతర్వాత మావారు వచ్చి "ఏది? ఆవేళ నీకిచ్చినడబ్బు?" అని అడిగినారు. నేను పెట్టెతీసి చూచినాను నోట్లు కనబడలేదు. పెట్టెలో వస్తువులన్నీతీసి కింద పారవేశాను. నాకు వణుకుపుట్టింది. నా వెదకడము వగైరా చూచి మావారు చిరాకుపడడము మొదలుపెట్టారు. "ఆ రూపాయలు కనుపించడములేదు" అని నేను నెమ్మదిగా అన్నాను. మావారు నామాట నమ్మలేదు. నమ్మక "ఉన్నచోటువదలి అక్కడా ఇక్కడా వెదికితే ఎక్కడఉంటవి? ఆడబ్బుతో చాలా అవసరము ఉన్నదీ, గొలుసూగిలుసూ చేయించడమునకు ఇప్పుడు వీలులేదు అని నేను మొదటనే నీతో చెప్పినాను. అందుకోసము—"

ఈ విధముగా ఎన్నో నిష్ఠురోక్తులు అన్నారు. నాకు ఎంతోకోపము వచ్చినది. 'నేను తీసుకొనలేదో దేవుడా' అని ఎంత చెప్పినా ఆయన నమ్మకము లేదు. ఏమి చేయను! ఉక్రోషము వచ్చి ఏడ్వ మొదలు పెట్టాను. మా అత్తగారు గబగబవచ్చి "ఎందుకు ఏడుస్తావుతల్లీ! గదిలోకి ఎవరు వచ్చినారో, ఎక్కడపెట్టినావో కొంచెము యోచించిచూడు. పెట్టెలో పెట్టినవి ఏమవుతవి?" అన్నది. ఆరూపాయలు దాచుకొని పోయిన వని నేను అబద్ధమాడుతున్నాననే అందరి అభిప్రాయము.

మా అత్తగారి మాటలతో హఠాత్తుగా నాకు దేవిమాట జ్ఞాపకము వచ్చినది. ఎవ్వరు లేకుండా చూచి ఆమెను నాగదిలోకి తీసుకొనివెళ్లి "వేళాకోళానికి నీవేమైనా తీసి దాచినావా దేవీ" అని అడిగినాను.

ఆమె రెప్పవేయకుండా నాకేసి ఒక మారు చూచినది. నేను కొంచెము జంకి పోయినాను. దేవికి ఎంత అభిమానమో నే నెరుగుదును. వెంటనే ఆమె తలవంచుకొని "అవును. నీపెట్టెతీసి నేనే ఆరూపాయలు తీసుకొన్నాను. మీ అన్నయ్య ఒక మార్వాడీకి అప్పు ఉన్నారట. వాడు చంపుకొని తింటున్నాడని ఆయన అదేపనిగా బాధపడితే నేనే ఆడబ్బుతీసి ఆయనకిచ్చినాను" అన్నది.

నేను ఒక నిట్టూర్పువిడిచి "ఈమాట మీ అమ్మదగ్గర ఒప్పుకొంటావా?" అని గంభీరముగా అడిగినాను.

"అమ్మదగ్గర నేకాదు. అందరిదగ్గర ఒప్పుకొంటాను. కాని ఆ మార్వాడీమాట మాత్రము చెప్పను." ఈమాట అని గబగబ మేడదిగివెళ్లి వాళ్ల అమ్మతో "వదినెపెట్టెతీసి ఆరూపాయలు నేనేతీసి మీఅల్లుడికి ఇచ్చాను. ఈమాట నీవు అన్నయ్యతోకూడా చెప్పవచ్చును." అని చెప్పినది.

మాఅత్తగారువెళ్లి కొడుకుతో చెప్పినది. ఆయన నవ్వుతూ "దేవికి శుశ్రూషచేసి ఆమెదగ్గర పతిభక్తి నేర్చుకొమ్మని నీకోడలితో చెప్పు" అని ఆయన అన్నారు. ఏమి అననీ నామనసు కుదుటబడ్డది.

ఈసంగతి ఎవరికీ తెలియకుండా కప్పిపుచ్చవలెనని మావారునవ్వి ఊరుకొన్నారు. కాని మా అత్తగారు ఊరుకోలేక పోయినది. అల్లుణ్ణి, కూతుర్ని తిట్టిపోసినది. చాలా గందరగోళము జరిగినది.

ఆ మరునాడే మధ్యాహ్నము రెండు జాములవేళ ఉమాపతి తనపెళ్లాన్ని తీసికొని ఇంట్లోనుంచి వెళ్లిపోయినాడు. అత్తగారు కూతురుమొగాన ఇంతకుంకుమపు బొట్టుకూడా పెట్టలేదు. అసలు మాట్లాడనేలేదు. ఈ మట్టమధ్యాహ్నము ఎక్కడికే ప్రయాణమని ఎవ్వరూ అడుగనైనా అడుగలేదు.

సాయంకాలము కచ్చేరీనుంచి వచ్చి మావారు ఈ సంగతి విన్నారు. వాళ్లఊరు కబురుచేసినారు. వాళ్లు అక్కడనే ఉన్నట్లు కబురు తెలిసినది.

3

రమారమి ఒక సంవత్సరముపైగా జరిగి పోయినది. ఈలోపల ఎన్నో మార్పులు తటస్థించినవి. నాకర్మము కాలిపోయినది. మావారు అకస్మాత్తుగా చనిపోయినారు. నా మనసంతా పాడయిపోయినది. చాలా జబ్బు చేసినది. పిల్లలకుకూడా శరీరముతో స్వస్థత లేదు. మానాన్నగారువచ్చి నన్నూ పిల్లలనూ తీసుకొని విశాఖపట్టణము వచ్చిఉన్నారు. ఆ బ్రహ్మాండమైన జబ్బులో మంచముమీద ఉండగానే నాకు దేవి మరణవార్త తెలిసినది. చచ్చిపోవడమునకు ముందు దేవి నాకొక జాబు వ్రాసినది. ఆజాబు ఇట్లున్నది.

పెద్దవదినే!

ఈ ఉత్తరము నీకు అందేలోపలనే నేను మరి ఈలోకములో ఉండను. ఉండలేను. నాకు ఏలోకము వ్రాసిపెట్టి ఉన్నదో, ఏ చీకటిలో

కలసిపోతానో ఇప్పుడు ఊహించలేను. ఈలోకము విడిచిపెట్టడమునకు ముందు నీతో చెప్పుకొనవలసినమాటలు ఈజాబులో వ్రాస్తున్నాను. నీవు నన్ను కన్నతల్లిలాగు కడుపులో పెట్టుకొని ఆదరించినావు. తోబుట్టువువలె చేదోడు వాదోడువైనావు. ప్రియసఖివలె నీహృదయములో చోటిచ్చినావు. దేవతవలె ప్రేమించినావు. నేనెప్పుడూ నీదగ్గర ఏవిషయమునూ దాచలేదు. ఇప్పుడూదాచను. కోరినా అంతట నేనే ఆత్మహత్య చేసుకొంటాను. ఇంతకన్నా నాకు మరొకమార్గములేదు. నేను బ్రతికి ఉండడము వట్టివిడంబనమని నాకు తోస్తున్నది. ఈ మాటలనుబట్టి నీవు నా మనస్సు పాడయిపోయినదని, వెఱ్ఱిఎత్తినదని అనుకొనవచ్చు. కాని కొంచెము నామాటలన్నీవిని యోచిస్తే నా మనస్సూ మెదడూ సరియైనస్థితిలోనే ఉన్నవని, నేను పిచ్చిదాననై పోలేదని నీకేతెలుస్తుంది. నీవుమాత్రము నన్ను క్షమించు. ఆత్మహత్య మహాపాపమని నీవు అనవచ్చును. కాని ఇప్పుడు పాపపుణ్యవిచారణ చేయడమువల్ల కాలహరణముతప్ప నాకు మరొకప్రయోజనము కనబడడములేదు.

ఆవిచారతో నాకు అవసరమేలేను. నేను చచ్చిపోయినతర్వాత దేవుడు నాకు స్వర్గమే వ్రాసిపెట్టాడో, నరకమే వ్రాసిపెట్టాడో, ఏదైనాసరే నాకర్మఫలమని నేను దానిని అనుభవిస్తాను. నేను బ్రతికిఉండగా దేవుడు నా అదృష్టంతో ఎంతనిష్ఠురముగా ఆటలాడుకొన్నాడో నీవెరుగుదువు. ఇక చచ్చినతరువాతి విచారము నాకెందుకుచెప్పు? సరే. నా అదృష్టము చివరకు ఎట్లు పరిణమించినదో మాత్రము నీకిప్పుడు తెలుపవలెనని నా సంకల్పము.

మీఅన్నయ్య ఏదో ఆఫీసులో నౌకరీ చేస్తున్నాడు. ఆ ఆఫీసుకు సంబంధించినడబ్బాదస్కము యావత్తూ మీ అన్నయ్యచేతిలోనే ఉంటుంది. అందులో మూడువేలరూపాయలవరకు రహస్యముగా ఆయన ఖర్చుపెట్టుకొన్నాడు. ఇది ఎన్నాళ్లనుంచి జరుగుతున్నదో ఏమో నాపాపములాగు నేడు బయటబడ్డది. ఆయనపేర వారంటుతిరుగుతున్నది. ఆయున దొరకకుండా ఎక్కడనో దాగుకొన్నాడు. ఎంతోరహస్యముగా నిన్నరాత్రి ఇంటికివచ్చి నాకు దర్శనమిచ్చినారు. నాచేతులు పుచ్చుకొని ఏడుస్తూ మొదటినుంచి జరుగుతూ వస్తున్న తనపాపకథ ఆమూలాగ్రముగా నాతో ఏకరుపెట్టినారు. ఆయన పందెపుగుఱ్ఱపుపరుగుతో ఒక స్త్రీవలలోపడి ఉన్న సమస్తమూ దానిపాదాలకు సమర్పించుకొన్నారు. వదినే! ఈలోకములో ఇంత మోసము ఉన్నదని నాకు తెలియదు. నేను నాహృదయమందిరములో నిలుపుకొన్న దేవతామూర్తిని పాడుచేసినదెవరు? నేను నాభర్త కోసము ఎంత అవమానము పాలయినానో, ఎన్నిసహించినానో నీవెరుగుదువు. నాభర్తకన్న దేవుడులేడని మనసులో ఎంత సంతృప్తిని పొందేదానను? ఎంత గర్వపడేదానను?

నీవు ఎన్నోసారులు ఎన్నో నాకు చెప్పినావు. కాని నేను నమ్మలేదు. అసలు విననే వినలేదు. నాభర్తమీద నాకున్న విశ్వాసము నన్ను, అప్పుడు సత్యమును గ్రహించకుండా చేసినది. ఆయన మరొక ఆడుదానికి తనసర్వమూ అమ్ముకుంటాడనే మాటనే నేను నమ్మలేదు. నీకు జ్ఞాపకము ఉన్నదో లేదో ఒకనాడు మనము భారతములోని 'సత్యాద్రౌపదీసంవాదము' చదివినాము. అందులో 'భర్తపై భార్యకు అనుమానము పుట్టకూడదు. పుట్టితే మరి ఆసంసారము దుఃఖాకరము. భర్తవిషయమై అవిశ్వాసమూ, అనుమానమూ కలిగిన ఆడుది తన సర్వనాశనమును తానే చేసుకొన్నదగును' అనుమాటలు నాహృదయమునకు పట్టిపోయినవి. పతియెడ అవిశ్వాసము కలిగి సర్వనాశనమైన వారికధలు ఎన్నో చదివినాము. అందువల్ల ఎవరు ఎన్ని చెప్పినా నేను నాభర్తను ఎన్నడూ ఏవిషయములోనూ సందేహించలేదు. ఆ సంశయచ్ఛాయను కూడా నాహృదయానికి అంటకుండా జాగ్రత్త పడినాను. నేను పరిపూర్ణవిశ్వాసముతో ఎవరిని ఆరాధిస్తున్నానో వారు ఇంత నీచకార్యమునకు ఒడిగట్టుతారన్నమాట నవ్వులాటకు కూడా అనుకోలేకపోయినాను. వదినే! ఈపాడు లోకము ఎంతనిష్ఠురము! కాని పురుషజాతి గర్వమునూ, కృతఘ్నతనూ, నేను ఇప్పటికి కూడా ఊహించలేకున్నాను. ఇదంతా నావిధి అనుకొంటున్నాను. నాభర్తకోసము వృద్ధుడైన నాతండ్రిమనసు ఎంతనొప్పించినానో నీవెరుగుదువు. అదే అతని మరణమునకు కారణము. నేను అందరినిందలకూ, అసహ్యతకూ పాలయినాను. అంతవరకెందుకు? ఎన్నోసారులు నన్ను నేనే అసహ్యించుకొనేదానను. ఏమయితేనేమి? సర్వమూ నిష్ఫలమై పోయినది. నిష్ఫలమైనదని ఇప్పటికీ అనుకొనలేకుండా ఉన్నాను. మావారు ఏడుస్తూ నారెండుచేతులు పట్టుకొని "దేవీ! నీవే నన్ను బ్రతికించవలె. జైలుకువెళ్లితే చావుతప్పదు. డబ్బిస్తే పోలీసులు మరి కేసుపెట్టరు." అని అన్నారు. ఆయన కన్నీటితో నా మానాభిమానాలు తుడుచుకొనిపోయినవి. అవమానమన్నమాటే మరిచిపోయి నేను ఈవేళప్రొద్దుటనే మాఅమ్మదగ్గరికివెళ్లి సంగతి అంతా చెప్పివేసినాను. చిన్నన్నయ్య దగ్గరికివెళ్లి కాళ్లూ కడుపూపట్టుకొని బ్రతిమాలినాను. కాని వారు నావైపేచూడలేదు. ఒక నిట్టూర్పుకూడా వదలలేదు. పైగా మా చిన్నన్నయ్య సంగతి అంతా విని నిర్దాక్షిణ్యముగా "వాడు జైలుకు వెళ్లడమే మంచిది" అన్నాడు. ఇక మాఅక్కయ్యల సంగతి చెప్పవలసినదేమున్నది? అందరూ వేళాకోళాలూ ఎద్దేవాలూ మొదలుపెట్టారు. అక్కడ మరి నేను ఉండలేకపోయినాను. వెంటనే వచ్చినదారి పట్టినాను. ఈసమయమున నాతండ్రిలేడు. పెద్దన్నయ్య లేడు. నీవుకూడా పుట్టెడుజబ్బుతో దూరాన ఉన్నావు. నీవు ఉంటేమాత్రము ఏదోదారి చూపెట్టేదానవే. చివరకు మీతండ్రితో చెప్పి అయినా డబ్బుతీసుకొనివచ్చి నన్ను గట్టెక్కిం

చేదానవు. మీతండ్రి ఘరానామనిషి. ఉదారుడు. నేను ఆయనకు కూతురువంటిదాననే. మీరుంటే ఏలాగైనా కాపాడేవారు.

కాని మరి నాకు ఆ ఆశలేదు. మీనాన్నగారుకూడా నీదగ్గరనే ఉండిపోయినారు. నీవు ఖాయిలామనిషివి. పుట్టెడుదుఃఖములో తల మునిగి ఉన్నావు. ఇంతకూ నేను నిర్భాగ్యురాలను. నాకు ఈజగత్తు సర్వమూ శూన్యము. మా ఆడుపడుచు లందరూ నన్నుచూచి ముసిముసినవ్వులు నవ్వుతున్నారు. మామామగారి మాట ఇక చెప్పవలసిన పనిలేదు. అసలే ఎడ మొగము పెడమొగము. ఇప్పుడు మరింత. నేను ఏమిచెయ్యను వదినే?

ఇప్పుడు రాత్రి ఒంటిగంట కావస్తున్నది. ప్రపంచమంతా హాయిగా నిద్రపోతున్నది. ఒక్క నేనుమాత్రమే నాభవిష్యత్తును ఆలోచించుకొంటూ జాగరము చేస్తున్నాను. నాభర్త వచ్చేవేళ అయినది. డబ్బు ఎక్కడను దొరకలేదని ఆయనతో చెప్పడము ఏలాగు? ఇప్పటి ఆయన వాలకమూ, ఆయన దుఃఖమూ చూస్తే నీవుకూడా ఏడువకుండా ఉండలేవని చెప్పగలను. చిక్కులోనుండి బయటపడడమునకే అను, పశ్చాత్తాపమే అను, ఏమైనాసరే ఆయనస్థితిచూచి నేను భరించలేక పోతున్నాను. ఆయనకంటికి కడవెడుగా ఏడుస్తూ "దేవీ! నాకు తల్లిలేదు. ఉన్నతండ్రికూడా లేనివాడితో సమానము. నీవుతప్ప నాకు ప్రపంచములో నా అన్నవారు ఎవరూలేరు. ఏరీతిగానైనా నన్ను బ్రతికించు." అని అంటూ ఉంటే నాహృదయము చెక్కలైపోతుంది. "డబ్బు కావలసివచ్చినపుడు ఆయనకు నీవు కావలసివస్తావు. అతనంత స్వార్థపరుడూ, కృతఘ్నుడూ మరి ఉండబోడు" అని నీవనవచ్చును. వదినే! నాబ్రతుకులో స్వార్థమనేది నశించిపోయినది. సర్వమూ ఆయనకోసమే. తన ప్రయోజనముకొరకు కావలసినంతమట్టుకు నన్ను వినియోగించుకొననియ్యడముకన్న నాకు కావలసినదేమిటి? స్వార్థమనీ, అభిమానమనీ, నేను ఇప్పుడు సమయము దొరికి నడగదా అని ఆయనను ఉపేక్షించి ప్రాయశ్చిత్తముచేయనా? అంత కాఠిన్యము స్త్రీజాతిలో లేదనే నానమ్మకము. ఇప్పుడు మా అత్తగారు బ్రతికిఉంటే తన కొడుకును కష్టసముద్రములో విడిచిపెట్టి ఆమెచూస్తూ ఉండగలదా చెప్పు! ఎవడైనా కూనీచేస్తే ప్రపంచమంతా అతనిని నిష్ఠురముగా చూచి అసహ్యించుకొనవచ్చును. కాని తల్లిమాత్రము తన సంతానమును రక్షించుమని భగవంతునికి కోటిమొక్కులు మొక్కుకొంటుందనే నానమ్మకము. నేనుకూడా అట్టితల్లుల సంతానమును. నిజము చెప్పుతున్నాను ఆయనమీద నాకిప్పటికీ కోపముగాని, దుఃఖముగాని, కసిగాని లేదు. ఆయన వ్యాపారమునుగురించి నేను విచారించలేదు. ఇప్పుడుకూడా విచారించను. నాలో ఏలోపములేకుండాఉంటే అంతేనాకు సంతృప్తి. ఇప్పుడు నామనస్సులో ఏమున్నదో నేను వ్రాయలేకపోతున్నాను. ప్రపంచమంతా ఒకపక్షము. నేనొక్కతెనే ఒకపక్షము. ఇప్పటి

కైనా నాకున్న ఆధారము, ప్రపంచమున కంతటికీ అపరాధి అయిన నాభర్తగారు. లోకములోకమంతా ఆయనను తిట్టి దుమ్మెత్తిపోసి నాశనము చేయడమునకు తన నోరు తెరుచుకొని ఉన్నది. నాకున్న కాస్తపిసరు కూడా ఇప్పుడు వదలివేయడము నాతరమా! కాని ఆయనను రక్షించేసామర్థ్యము నాకు లేదు. రేపు నాదగ్గరనుంచి నాభర్తను పోలీసులు పట్టీసుకొనిపోతారు. నేను కన్నులు తెరుచుకొనిచూస్తూ నిలబడి ఉండవలసినదేనా? ఉండలేను వదినే! ఏది నా ముఖ్యకర్తవ్యమో దానిని నిర్వహించేశక్తి నాకు భగవంతుడియ్యలేదు. నా అశక్తిని నాభర్త గ్రహించడమునకు ముందే అసలు నేను ఈ లోకమును విడిచిపెట్టి వెళ్లిపోతాను. ప్రాణములతో ఉండి నేను ఆయనను విపద్దేవతకు ఒప్పగించలేను. దౌర్బల్యమనీ, నైచ్యమనీ, తెలివి తక్కువ అనీ నన్ను గురించి లోకులు ఏమైనా అనుకొననీ! తిట్టనీ, దీవించనీ, నేనుమాత్రము దానికి భయపడను, అసహ్యపడను. కాని ఒక్కదానికి భయపడుతున్నాను. ఈనామరణ వార్త విని నీవుగుండె చెక్కలయ్యేటట్లు ఏడుస్తావు. నీకుకలిగే బాధ తలచుకొంటే నాకు ఇప్పుడు ఏడుపు వస్తున్నది. నీవు నామీద కోపగించకుండా ఉంటే నా కదే పదివేలు.

వదినే! ఈవేళ తిథి ఏమిటో తెలుసునా? ఫాల్గుణశుద్ధసప్తమి. సరిగా ఈరోజుననే నా భర్తను నేను మొట్టమొదట చేరుకున్నాను. అది అంతా ఇప్పుడు నాకు జ్ఞాపకము వస్తున్నది. అప్పటివలెనే ఇప్పుడు వెన్నెలకిటికీలోనుంచి చంద్రుడు నావైపు చూచి నవ్వుతున్నాడు. వెన్నెల నామీద పడుతున్నది. ఆనాటిపాట మారంగక్కయ్యపాడినది. ఇప్పుడు జ్ఞాపకము వస్తున్నది.

ఏటికే నాకింక జడుపు-ఒక్క
నాటికిని రాబోదె విడుపు-
నాహృదయనాథుండు, నాజంట విడకున్న
నాకీప్రపంచమ్మెనందనోద్యానమ్ము. ఏటి.
కాలమేఘాలు లోకాల కనుమూయనీ
మాయదేనా చందమామ చిరునవ్వు. ఏటి.
కటికచీకటి కాటుకలపూత పూయనీ
నన్నుబాదవునె పండువెన్నెలలవెలుగు. ఏటి.
నిదురలో మరపులో నెనరు జాగరములో
వదలిపోవనిశరద్వైభవ మ్మిదెయుండ ఏటి.

ఆహా అది ఒకరోజు. మరల ఇది ఒకరోజు. దానికి దీనికి ఎంతోవ్యవధానము! ఆ నాటి వెన్నెలలలో నా హృదయేశ్వరుని పాదాల దగ్గర ఆశ్రయము పొందినాను. ఈనాటి వెన్నెలలలో మరల ఆ పాదాలదగ్గరనే ఆశ్రయము కోరుతూ వెళ్లిపోతాను. ఇప్పుడే పదనిముసాలలో ఆయన వస్తారు. వదినే! సెలవు తీసుకొంటాను. నీకు వేనవేలు నమస్కారాలు. నన్ను క్షమించుసుమా! ఆయన వచ్చేవేళ అయినది. ఆయనముఖము చూస్తే నాకు మరల బ్రతుకుమీద ఆశపుట్టవచ్చును. రక్షించ

లేని అశక్తురాలను. ఇక ఆలస్యము చేయను. ఆయనను ఉద్ధరించేభారము ఆయన దేవుని మీదనే పడవేశాను. ఈశ్వరుడు నన్ను పూర్తిగా పరీక్షచేశాడు. నా హృదయము ఎరుగును. మొన్న పత్రిక చదువుతుండగా చని పోవడమునకు దారి తెలిసినది. అదిగో! గది మూల ఉన్న కిరసనాయిలుడబ్బా మృత్యు దేవతవలె నాకేసి చూస్తున్నది. జనన మరణ ములకూ, సుఖదుఃఖములకూ అతీతమైన జ్యోతిర్లోకములో, నిష్కళంకమూర్తిని నా దేవతను మరల పొందుతాను. నన్ను ఆశీర్వ దించు వదినే! సెలవు.

అభాగ్యరాలు నీ 'దేవి'

ఇక నేను వ్రాయవలసినదిలేదు. ఈఉత్త రము తండ్రిగారి కిచ్చినాను. ఆయన భాస్కర రామాయణములో సీత అగ్నిప్రవేశఘట్టము చదువుతున్నారు. నేను ఆయనను పిలువ బోయేటప్పుడు చదువుతున్న పద్యముతో నా దేవి మరణయాతన అనండి, లేకుంటే ఆనంద మనండి నా మనోనేత్రమునకు గోచరించినది.

"పవడపు రాశిలోని నవ
భర్మశలాకయుఁ బోలె, చారుప
ల్లవముల కుప్పలో నిడిన
లాలితచంపకదామ మట్లు, ర
క్తవనజరాజి హంసియనఁ
. గా నరుణార్చి మధ్యమునను న్న యా
నవశశిరేఖపోలె దహ
నస్థితయయ్యె విదేహకన్యదాఁ."

గ్రంథము మూసిపెట్టి మానాన్నగారు ఆ ఉత్తరము చదువ మొదలుపెట్టారు. నా అవస్థ వ్రాయలేను. దేవి భౌతికశరీరమును ఆకలిగొన్న అగ్నిహోత్రుడు సంతోషముగా తన జిహ్వాసప్తకమును చాచి ఆరగించి ఉం టాడు. కాని నాదేవి నా హృదయములోనే ఉన్నది. హా! దేవీ! లోకము ఏమనుకొననీ, నీవు నాకు మాత్రము అపరసీతా దేవివి.

మానాన్నగారు ఉమాపతివిషయములో ఏమి ఏర్పాటుచేసినారో నే నడుగలేదు. బహు శా ఆడబ్బు ఇవ్వవచ్చును. అతనిని విడిపింప వచ్చును. కాని నాముద్దు మరదలు కనబడదు గదా!

ఉమాపతి ఎక్కడ ఉన్నాడో తెలియదు. తెలిసికొనవలెనన్న తలంపుకూడాలేదు. ఏమి లాభము!!

ఈ మృదుసైకతమ్ముల శయించిన నా ప్రియురాలి మోహపుం
బ్రేమలు నిండి ప్రత్యణువు పిల్చును నా యెద వేగిరింప; ఇం
దామృతముగ్ధహాసము నవామృతముల్ కురియించెనేమొ, ఆ
శామధురమ్ములై కదలుఁ జల్లనిగాలులు వీచినంతనే.

శ్యామలయామినీ ప్రళయమందుఁ దపించిన వేళ నెన్నఁడో,
ప్రేమదరిద్ర మీ హృదయవీథిని మల్లియపూలతావులే,
కోమలతారకాతరళ కోరక తోరణపంక్తులే, సుధా
కౌముదులే, సుమాంతర వికాసములే, నిముసమ్ము మాత్రమే.

ఒకనిముసమ్ములోననె వియోగములోని యనంతమైన ప్రే
మకుఁ బరితృప్తి నొందుటకు మాత్రమె జీవము నిల్పికొంటి; మూఁ
గ కనుల సైఁగచేయు నిసికాటుక చీఁకటి రేకలందుఁ దా
రకల విధాన నెంత మధురంబులొ యప్పటి సౌఖ్యభావముల్.

మిసిమివెలుంగు టందముల మించెడు మల్లియ కన్నెసంపదల్
విసపు వెలుంగుతోడఁ బలవించిన మృత్యువు పిల్చినంత వె
క్కసమగు గాఢవేదనలఁ గ్రాఁగి తపించి కృశించు పోలికన్
నుసియయిపోయి యిప్పుడు కనుంగొనరానివి నీ స్వరూపముల్.

ఈ స్మృత మృత్తికాణువుల నీమసిరాసుల యంతరమ్మునం
దీ మధురాత్రిశీలి కురియించిన శైశిర వేదనాశ్రుమా
లామిహికాంబుపూరము లలంకరణమ్ములుగా గ్రహింతువా
ప్రేమకు నోఁచుకోనివి దరిద్రము లయ్యవి యారిపోవునో ?

ఈయెద యాఁగిపోదు భరియింపఁగఁ జాలని భారమేదియో
మోయుచు మ్రోఁగు నూరకయ మూఁగతనమ్ము వహించి శీతల
చ్ఛాయ వసంతమోహన నిశాసమయమ్మున గాలి వీచినన్
బ్రాయపుఁ జిన్ని పూవులు ప్రభాతముకోసము వేగిరింపవో ?

చెదరవు యామినీరమణి చీర మెఱుంగులమీఁది చుక్కలున్
గదలికలంద వీయలలు కాని విషాదము నందు నిట్లు చ
క్కఁదనపుఁ జుక్కనా విరహకంఠము నందలి మూఁగ త్రోవలం
దొడిగి పదేపదే వెడలనూదెద వేటికి నశ్రు గీతముల్.

విడివడు వెన్నెలన్ మిసిమివెల్గులు తోఁచిన యంత నంధమై
యడరు నిశీథమందు మృదుహాసము వెల్లువయై పెనంగు, నె
క్కుడయిన ప్రేమవేదన మొగుడ్పు వహించిన నాయెడంద కె
న్నఁడు నిఁక లేవుగా నమృతనాట్యముఁ జూపెడు నీవిలాసముల్.

మెలఁకువ లేని నిద్ర విరమింపని యట్టి శ్మశాన వాటికన్
గలఁచెడు నాయెలుంగు నిసికాటుక చీఁకటిచిల్చికొంచు, వె
ల్గుల పథమందుఁ బోవు నినుఁగూడునొ, గాలుల నంతరించునో,
తెలిసికొనంగదే, అనువదింపఁగలేను మదీయభావముల్.

మిలమిల వెల్గుబాట తుది మెట్టున నిల్చిన నీవు వెన్క చూ
పుల నిరుకైన యీ పుడమి మూలకుఁ ద్రిప్పుచు, మ్రోడువారు నా
గళమునఁ బూలమాలికలుగా, స్వరనంత పవిత్ర తేజ మీ
తలఁపులమీఁదుగాఁ బరపి దగ్ధముసేయుము, చాలు నంతియే.

నా కిఁకముందు జీవితమునన్ సుఖమున్నది శూన్య; మీనిశా
భీకర తామసీవిలయ వీథుల పోలికఁగాని తావకా
లోకవినీల దీధితివిలుప్త మనోహర కాంతి పుంజ శో
భాకుసుమాగత ప్రణయవాసన కేసుమి నాదు ప్రాణముల్.

# వాహనత్రయం

నందివాడ చిదంబరరావుగారు. B. A., B. L.

జనసామాన్యం, ఒకచోటునుండి వేరొక చోటునకు పోవలెనంటే, ముఖ్యముగా మూడు వాహనములనే విరివిగా వాడుచున్నారు. అవే ఎద్దుబండి, జట్కాబండి, మోటారుబస్సు. ప్రతీ మూడింటినీగూడా ఇప్పుడు, ఏదో "త్రయం" అని, చాలామంది బహుఘనాఘనా ప్రయోగించుచున్నారు. ఇప్పుడు మంత్రులు ముగ్గురేగనుక వారిని 'మంత్రిత్రయం' అంటున్నారు. ఈమధ్యే ముగ్గురు వితంతువులు కలిసి కాఫీ దుకాణం పెట్టి, దానిని "విధవత్రయం యొక్క విశ్రాంతిభవనం" అని అనడంగూడా విన్నాం. ఇటీవలనే "సులక్షణసారం" దగ్గర బెట్టుకొని, మనిషికి, సాడేతీను పద్యాలు అతికిన ఆసామీలు ముగ్గురు కలిసి, గ్రూపు ఫోటో తీయించి దానిని "కవిత్రయం" అనిచెప్పి పేపర్లో వేయించడంగూడా అందరూ ఎరుగనిదిగాదు. ఫిలాసఫీ బ్రాంచిలో బి. యే. పరీక్షకు రాజమండ్రి కాలేజినుంచివెళ్లిన వాళ్లందరూ ప్యాసు అయినప్పటికినీ, ముగ్గురుమాత్రమే ఫేలయి, "విశ్వవిద్యాలయముయొక్క అక్రమములు" అనే శీర్షిక క్రింద వారు ఒకవ్యాసం పేపర్లో బనాయిస్తూ, క్రింద "పరాభూతత్రయం, రాజమండ్రి కాలేజీ" అని అనడంగూడా చూశాం. దీనినిబట్టిచూస్తే అడ్డమయిన ప్రతీ మూడింటినీగూడా ఏదో "త్రయం" అని దబాయించవచ్చునని తెలుస్తోంది. అందుచేతనే, ముక్కుపొడుం, చెక్కపొడుం, కాఫీపొడుం కలిపి "భస్మత్రయం" అని మనం వాడడంలో ఏమీతప్పులేదు. చుట్ట, బీడీ, సిగరెట్టును కలిసి "సమిధత్రయం" అని ప్రయోగించవచ్చు. ఆ విధంగానే, టీ, కాఫీ, కోకో, ని "కషాయత్రయం" అని నిక్షేపంగా వాడవచ్చు. అదేమాదిరి, ఎద్దుబండీ, జట్కాబండీ, మోటారుబస్సుని కలిపి "వాహనత్రయం" అని నేను నామకరణం చేశాను—భారసాలచేసి బ్రాహ్మణ సంతర్పణచేయక పోయినా.

ఈ వాహనములకన్న ప్రశస్తములైన ఏరోప్లేను, జోడుగుఱ్ఱాల బగ్గీ, బైసికిల్ ఉన్నప్పటికీగూడా, యీ వాహనత్రయమునకు యింకా పేరు ప్రతిష్ఠలు పోలేదు. మెడలో గోచీలుగల పెద్దప్లీడర్లు చెన్నపట్నం నుంచి రోజుకిరాయికి, అప్పుడప్పుడు మనవూళ్లు వచ్చినా గూడా, మనవూళ్లో ఉన్నప్లీడర్లకు యింకా పేరుప్రతిష్ఠలు తగ్గనట్టు. పొరుగూరు భోగంవాళ్లు మనవూళ్లకి అప్పుడప్పుడు వచ్చినాగూడా, యిక్కడి భోగంవాళ్లకి యింకా రాబడి తక్కువ అవనట్టు.

ఈ వాహనములను గురించి వ్రాయునప్పుడు, నడుపు వారిని గురించి గూడా తెలిసికొనవలెను. నడిచేది ఎద్దయినా, బండీయొక్క మంచి చెడ్డలు నడిపేవానివే—పనిచేసేది గుమాస్తాలే అయినా, పేరు ప్రతిష్ఠలు కలెక్టరువే. పరీక్షప్యాసు అయ్యేందుకు, చెమటలు ఓడ్చేది అబ్బాయే అయినా, ప్యాసుకు కారణం పెళ్లాంవలనే. "బండీవాడిలో ఏముంది? ఎద్దు మొద్దయితే బండీవాడు ఏంచేస్తాడు" అన్నవాళ్లకి ప్లీడర్లు గదంవాయించి ఏమి చెప్తున్నారంటే, "భారతయుద్ధమే మనకు ప్రమాణం. దృష్టాంతరములు (Case law) లేకపోలేదు. పార్థసారథి అర్జునిని యొక్క రథాన్ని నేలలోకి దించెయ్యకపోతే, కర్ణుడు అర్జునిని తోసి రాజనేవాడే. కాబట్టి ఉన్న గజాఅంతా తోలేవాడిలోనే ఉంది" అన్నారు. కాని, మరికొందరు బండీవాడు గూడా, అసలు బండీలో ఒక భాగమే అని అంటున్నారు. అదీ కొంతవరకు నిజంగానే కనబడుతూ ఉంది. ఏమీ అంటే బండీవాడు కునికిపాటు పడుతూ ఉన్నప్పుడు గూడా బండీ నడుస్తూనే ఉంటుంది. అప్పుడు బండీవాడు తాత్కాలికంగా అచేతనమయి పోయి, బండీలో ఒకభాగమువలె బండీ ఎలా నడిస్తే ఆలాపోతూ ఉంటాడు. అందుచేత బండీ నడిపేవానిని గురించి గూడా కొంత చూడవలసి ఉంటుంది.

ఎద్దుబండీవాడు సాధారణంగా వయస్సులో కాస్త ముదిరినవాడై యుంటాడు. అన్నీ ఉడిగిఉంటాయి. కాని జట్కావాడు, అలా ఉండక, మంచి వయస్సులో ఉండి, ఒకరిని ఒకదెబ్బవేసినా, పడ్డా, కాస్త దృఢంగా ఉంటాడు. బస్సుడ్రైవరు, సాధారణంగా, పై యిద్దరికన్నా వయస్సులోనూ పిన్నయే, కారణాంతరములవల్ల శరీర దార్ఢ్యములోనూ లోక్కే.

ఎద్దుబండీవాడు అన్నీ తీరినవాడగుట వల్ల, అందంగా ఉన్నట్లు నటించడానికి ప్రయత్నాలు అట్టే చేయడు. దేహపోషణలోనూ, వెంట్రుకల పోషణలోనూ, కాస్త శ్రద్ధ తక్కువ. జుట్టు విషయంలో, దేశవాళీగా అంగుళం పాతిక వసారా ఒహటి ముందుంచి, దానికి కాపలా నిమిత్తం, వెనకాతల ఒహ ముడిని, డఫేదారు లాగున నించో బెడ్తాడు. కాని, జట్కావానికి, బస్సు డ్రైవరుకీ, ఈదేశవాళీ పద్ధతి నచ్చదు. వెంట్రుక సమస్య, విక్టోరియా హాస్టలు విద్యార్థులను బాధ పెడుతూఉన్నట్లు, వీరినిగూడా చాలా బాధపెడుతూ ఉంది. వీరికి, ఏమిఉన్నా లేకపోయినా, క్రాఫుమాత్రం, ఏదో రకం, ఉండి తీరాలి. మరొక్కవిషయం. ఎద్దుబండీవాని వెంట్రుక రాజములు, యజమాని యెడలగూడా అవిధేయత గనబరస్తూ, దువ్వెన్నకు సహితమూ లొంగవు. ఈ వెంట్రుకలయొక్క అవిధేయత Civil Disobedience అవునో గాదో, గవర్నమెంటు వారిని కనుక్కొనక పూర్వము, ఎవ్వరును అభిప్రాయమును యిచ్చుటకు సాహసించుట లేదు. ఏది ఎలాఉన్ననూ, ఏకాలమందు తనతో జన్మించి, తనను విడిచిపెట్టక, అనవరతమూ తనతోనే ఉండి, తనతోపాటు పెరిగిన సాటి వెంట్రుకలకి, సాలుకి ఒకమాటు సహితమూ మేతవేయక, ఎద్దుబండీవాడు వెంట్రుకల యెడల అంత కాఠిన్యము వహించినపుడు, వెంట్రుకలు యజమాని యెడల అవిధేయత చూపడంలో ఏమీ తప్పులేదు. కాని, జట్కావాడు, వారమున కొకసారెన్నా, తలకు, యింతనూనె పులిమి, శిరస్సు మీద బడిన మ్యునిసిపల్ రోడ్డు భస్మమును, యితరులకు కనబడకుండా చేస్తాడు.—వారమున కొకసారెన్నా ముఖమున బొట్టుపెట్టి, పెద్ద చదువులు చదివిన అడంగులు, తమ అయిదువ తనమును జ్ఞాపకం చేసుకుంటూ ఉన్నట్టు. అయితే, బస్సు డ్రైవరు యొక్క తల సహజంగా బిరుసు అవడంవల్ల, యితనికి ఏవేసులైనో, కనీసం, ఏ పెట్రోలు జెల్లియో, కావాలిగాని, ఉత్త కొబ్బరినూనె పనికి రాదు. బస్ వేగమునకు, క్రాపింగు, తరుచు చెదురుతూ ఉన్నప్పటికినీ, ఈబస్సు డ్రైవరు ఎప్పుడో వీలుచేసుకొని, దానిని సరిచేస్తూ ఉంటాడుగాని, దాని దారిని అలా వదిలివేయడు—దూరదేశాల్లో ఉద్యోగాలయిన కొందరు పెద్ద మనుష్యులు, భార్యారత్నములను, వాళ్ల దారిని అలా యింటిదగ్గర వదలివేసినట్టు. అదిగాక, జట్కావాడు, ఏ ఉదయమునకో ఒకమాటు దువ్వి ఊరుకుంటాడుగాని, బస్సు డ్రైవరు, దార్లో ఏ అవసరం వస్తుందో అని చెప్పి, ఒక చిన్న అద్దం, దువ్వెన్నాకి ఎప్పుడూ జేబులో అమరుగానే ఉంచుతాడు—పరీక్షకు వెళ్లే విద్యార్థులు నోట్సు కాగితాలు పంట్లాం జేబుల్లో అమరుగా ఉంచినట్టు.

ఎద్దుబండీవాడు గెడ్డం తీయించడంలో శ్రోత్రియ బ్రాహ్మణుని కన్నా గూడా సుస్తీ చేస్తాడు. మంచి రోజు దొరకక శ్రోత్రియునికి ఆలస్యమయితే, "గెడ్డం మాస్తే కొట్టుందా యేమిటి? దేనికి అడ్డం?" అని చెప్పి, వాడు ఆలస్యం చేస్తాడు. అదిగాక, వాడు గెడ్డం తీయించడానికి ఒక ముహూర్తం, వసారా గీకించడానికి వేరే ముహూర్తం అంటూ రెండు కర్మలు నడపడు. "Two birds at one shot" అని పెద్దలు శెలవిచ్చినట్లు, రెండూ ఒకేసారి కానిస్తాడు—లౌక్యులు, ఒడుగుకీ, పెళ్లికీ, వేరే వేరే ఖర్చు అవకుండా, రెండూ ఒకేసారి కానిచ్చినట్టు. జట్కావాడు వెంట్రుక నిర్మూలనంలో ఎద్దుబండీ వానికన్న శ్రద్ధ కనబర్చినా, బస్సు డ్రైవరుకి అందడు. నిత్యక్షౌరంలో మాత్రం బస్ డ్రైవరు, కాలేజి విద్యార్థులకే, కొత్త ప్లీడర్లకి తీసిపోక, నిత్యమూ పరగడుపునసే, గెడ్డం ఊడిచేయిస్తాడు.

దుస్తులు ధరించడంలో, ఎద్దుబండీవానిది, కేవలమూ గాంధీ ఫక్కీ. ముతకగుడ్డ, మోటు వ్యవహారం. పాగా, పంచా, ఉంటాయిగాని, చొక్కా ఉండదు.

కాని, జట్కావానికి, బొత్తాములున్నా లేకపోయినా, చొక్కా మాత్రం విధిగా ఉంటుంది — కొంతమంది అరవ ఉద్యోగస్తులకి, పంట్లాముకి బొత్తాములున్నా లేక పోయినా పంట్లాం మాత్రం ఉన్నట్టు.

కాలవశాన్ని, పట్టలేని సమయమున సహితమూ ఏ బనియను మీదో ఓటర్నింగు కాలరు కోటు. ఒకటి వేస్తాడేగాని బనియంటితోటి అలా అట్టే ఉండడు.

ఎద్దుబండివానికీ, జట్కావానికీ చేతిగడియారం సాధారణంగా వుండదు. బస్సు డ్రైవరుకిమాత్రం, తిరగ నివ్వండి, తిరగకపోనివ్వండి, గడియారంమాత్రం వుండి తీరాలి — సెకండుక్లాసులో యెక్కే కొంతమంది రైలు ప్రయాణికులకి, ఇంగ్లీషు రానివ్వండి, రానివ్వక పోనీయండీ, ఇంగ్లీషు పేపరుమాత్రం చేతులో ఉన్నట్టు. అది పరిశీలించి యెవడు చూస్తాడేమిటి అని చెప్పి, బొమ్మల గడియారంగూడా కొంతమంది ఉంచినట్టు. నిజబెట్టి ఎవడు చూస్తాడు అనే ధైర్యంతో కొందరు పెద్దమనుష్యులు, చిరిగిన షర్టుపై, చిరుగు గనబడకుండా, కోటుతొడిగి, గాంభీర్యంగా పెద్దపెద్ద మీటింగులకు వెళ్లినట్టు.

యెద్దుబండీవాని తత్వానికి వేడిపుట్టించాలంటే, స్వదేశంలో తయారయిన చవకరకం చుట్ట చాలు. ఇతగాడు, విదేశీవస్తువాడక పోవడంలో గాంధిగారికి ముందువాడు. జట్కావాని తత్వానికి వేడిపుట్టించాలంటే కాస్త యెక్కువ వేడిచేసేదిన్ని, మహమ్మదీయ సాంప్రదాయమైనట్టిదిన్ని అయిన కరీం. జాడీబీడీ అవుసరం. వీనికి హిందూ మహమ్మదీయ సమ్మేళనం అంటే, చెప్పుకోడుగాని, గాంధీగారికంటె ఎక్కువ యిష్టం. కాని, బస్సు డ్రైవరుకి, పై రెండూ పడవు. ఇతడు విదేశీవస్తువైన వాచి సిగరెట్టునే విరివిగా వాడతాడు. ఊర్కేవస్తే, ఖరీదుగల సిసర్సు సిగరెట్లను కాల్చడానికి గూడా ఇతనికి ఏ అభ్యంతరం లేదు. మొత్తంమీద, స్వంతవస్తువులకన్న, పొరుగింటి వస్తువులలోనే మజా ఉందని ఇతని అభిప్రాయం.

బేరంచేస్తే, కిరాయి విషయంలో, ఎద్దుబండీ వాడు, అడిగినదానికన్న, కాస్త తగ్గుతాడు. ధరలో తగ్గినంతమాత్రమున తనగౌరవం తగ్గుతుందని అనుకోడు — ధరలో తగ్గినంత మాత్రమున తమ తాలూకు ఆత్మగౌరవం తగ్గుతుందని పెద్దప్లీడర్లు సహితమూ అనుకోనట్టు. కాని జట్కావానిదగ్గర ఇలాంటిపప్పులు ఉడకవు. వాడు అడిగినంతా మనం యివ్వవలసిందేగాని, మనం యిచ్చినంత వాడు పుచ్చుకోడు.

ఎద్దుబండీవాడు సహజంగా కొంచెం సాధు. అనుకున్న దానికన్న కాస్త దూరం పోవలసివచ్చినా, వేరే ఓపని చెప్పినా, విసుపులేకుండా పనిచేస్తాడు — కష్టమయినా, విసుపు లేకుండా, చెప్పినమాట స్వంతపెళ్లాం విన్నట్టు. కాని, జట్కావాడు, మరతుమించి పని చేయడు సరిగదా, కాస్త బరువైన సామాను బండీలో పెట్టమన్నా సరే, రోడ్డుమీద గుఱ్ఱం కంటె ఎక్కువ హరాం చేస్తాడు — హిందువుడిని పెళ్లాడిన దొరసాని చేసేటట్టు. ఇక, బస్సుడ్రైవరు వేరే ఏ పనీ చేయడు సరిగదా, ఎక్కినవాళ్లతో మాటేమాట్లాడడు. అందులో పురుషులైతే చూడేమాడడు!! అతని పూచీ అల్లా, ఒక్క బస్సుతోలడమే. అమాటకువస్తే బస్సుబోల్తా కొట్టించడం గూడా అతనిదే పూచీ అని కొందరు అంటున్నారు.

ఎద్దుబండీ విషయంలో, ఎద్దు ఎంతసాధో తోలే వాడూ అంతేసాధు. కోపం అనేది మొహంలోనూ లేదు, మాటలోనూ లేదు. కొరడా ప్రయోగంలోగూడా వీనికి కోపం గనబడదు. కాని జట్కావాడు మాత్రం ఉత్తబడిలో పంతులుమాదిరి శాంత స్వభావం గలవాడు గాడు. అతనికి కొరడాలో ఎంతచురుకుందో నాలుకలో అంత చురుకు ఉంది. అతనికోపంలో ఉన్న ఎర్రతనం, తరుచు అతని కళ్లల్లో కనబడుతూ ఉంటుంది, అంతమాత్రమున, అతడు ఏదెన్నా పుచ్చుకుంటాడు అని అనుమానించడం గూడా అట్టే సమంజసం గాదు. ఇక బస్ డ్రైవరు, సహజంగా మితభాషి. ఇతడు, విద్యావిహీనుడైన జిల్లాబోర్డు ప్రెసిడెంటు లాగుననూ, నిరక్షర కుక్షి అయిన మ్యునిసిపల్ చైర్మను లాగుననూ వాఖ్యారత్వంలో నమ్మకము లేనివాడు.

బస్సుకి కదిలేందుకు పెట్రోలు ఎంత అవసరమో, డ్రైవరుకి, వుదయాన్నే పనిచేసేందుకు కాఫీ అంత అవుసరం. అదిగాక బస్సుడ్రైవరు కేవలమూ కాఫీ మతస్థుడగుటవల్ల ముఖప్రక్షాలన ముందూ, కాఫీ వెనకాతలా, అన్న నియమం లేదు కొందరికి వివాహం ముందూ, ఔపాసనం వెనకాతలా అన్న నియమం లేనట్టు. కాని జట్కావాడికీ, ఎద్దుబండీవాడికీ, యిలాంటి కాఫీ నియమములు లేవు. ఒకవేళ, ఎప్పుడైనా, సరదాపడి, సాయంత్రంవేళ ఏదైనా పుచ్చుకున్నా, అది ఒక నిత్య అవుసరములలో చేరిందిగాదు—నవీన నాగరకులకు నిత్య క్షౌరం లాగున.

ఎద్దుబండీవాడు కాస్తభూత దయగలవాడు. సంపాదనలో నుంచి తను యింతతిన్నా, యెద్దుకుకూడా ఏదో పడేస్తాడు. అంచులో, అన్నగారు పంపకములలో యిచ్చినట్టు వాటాయే యిస్తాడుగాని, మనువర్తిలాగున ఏదో రెండుపరకలు రాల్చి ఊర్కోడు. కాని జట్కావాడికి తన పొట్టమీద ఉన్న శ్రద్ధ గుఱ్ఱం పొట్టమీద వున్నట్టు గనపడదు. గయ్యాళిఅత్తగారు కోడలికి వేసినట్టు ఏవో నాలుగుపరకలు, రోజువిడిచి రోజు రాలుస్తాడేగాని, దాని కడుపు నిండా పెట్టడం తరుచు వినం. గడ్డిమోపుల ఆడవాళ్లతో, కారణాంతరములవల్ల, బేరం రోజూ చేసినా, గడ్డిమోపులు రోజూ కొంటున్నాడు అండానికికూడా అట్టే అవకాశంలేదు—లోభి గుఱ్ఱపుబండీ పెడదామనే అభిప్రాయం యెప్పుడూ లేకపోయినా, గుఱ్ఱాలు అమ్మకానికి వచ్చినప్పుడుమాత్రం "దజను ఎలాయిస్తావోయి" అని అడిగినట్టు. కాని, బస్సుడ్రైవరు, ఈవిషయంలో చాలా వుదారస్వభావం గలవాడు. నష్టపోయేది బస్సు యజమానిగాబట్టి.

ఎద్దుబండీ విషయంలోనూ, జట్కావిషయంలోనూకూడా తోలేవాడూ, యజమానీ, కలిపి ఒక్కడే—కొత్తప్లీడరు మొదట రోజుల్లో గుమాస్తా, ప్లీడరూకూడా తనే అయినట్టు, బంట్రోతు, చెప్పినమాట వినకపోతే హెడ్డుమాష్టరూ, బంట్రోతుకూడా ఒకడే అయినట్టు. అందుచేత-తనే యజమాని అవడంవల్ల, తోలేవాడికి, ఎద్దన్నా, గుఱ్ఱం అన్నా, సహజమైన ప్రేమ ఏర్పడుతుంది. అవిగూడా, తోలేవాడు సరిగా మేపినా,మానినా, వాడికి ప్రాణం యిస్తాయి. కాని బస్సుకిమాత్రం యజమాని వేరు, తోలేవాడు వేరు—వెనకటికి, ఒక యిల్లాలికి పెళ్లి అయినచోటు వేరూ, ప్రేమవున్నచోటు వేరూ, అయినట్టు. అందువల్ల బస్సుకీ, డ్రైవరుకీ మధ్య ప్రేమానుబంధం ఏమీ ఏర్పడదు. ఈకారణంవల్లనే బస్సుయొక్క ఆయుర్దాయం జట్కాకన్నా, ఎద్దుబండికన్నా గూడా తక్కువే అని జ్యోతిష్కులుగుండెమీద చెయ్యి వేసి చెప్తున్నారు.

మొత్తంమీద స్వతంత్రవృత్తులు అన్నింటిలోనూ నిజమైనస్వతంత్రం వున్నటువంటి వృత్తి, యీబళ్లు తోలేవాళ్లదే అని చెప్పక తప్పదు.

తోలేవాడి విషయం చూశాం గనుక, యింక వాహనములను గురించి కొంత పరిశీలించడం అవసరం.

ఎద్దుబండీ జట్కాబండీ స్వదేశీరకం. బస్సు కేవలమూ విదేశీ. అందుచేతనే మనవాళ్లకి బస్సుమీద మోజు బండిమీద లేదు—సిజర్సు సిగరెట్టుమీద మోజు నాటుచుట్టమీద లేనట్టు. అందులో, ఇంగ్లీషుముక్క వచ్చిన వాళ్లకి బహిర్దేశంబాగేగాని మన మంచి అక్కరలేదు. వీరిని ఏమన్నా అంటే "ఆఁ ఎంతసేపూ స్వార్థమేనా, అవతలవాళ్ల బాగు కోరక్కర్లేదా, అని గదంవా యిస్తారు. ఎద్దుబండీ, జట్కా స్వదేశీ అవడంవల్ల చౌక. బస్సు విదేశీ అవడంవల్ల ప్రియం—స్వంతభార్య చవుక, వుంచుకొన్నది ప్రియములాగున. ఎద్దుబండీకి జట్కాకీ, మెషీను ఎంతచౌకయో మేతయూ అంతే చౌక. బస్సుకి మెషీను ఎంతప్రియమో మేతయూ అంత ప్రియమే—చిన్న వుద్యోగస్థులకి జీతములు ఎంతతక్కువవో, లంచములూ అంతతక్కువనే. పెద్ద వుద్యోగస్థులకి జీతములు ఎంత పెద్దవో, లంచములూ అంత పెద్దవే.

ఈప్రపంచకములో ఎక్కడచూచినా చక్రమునకు గౌరవం యిస్తున్నాడు. శ్రీకృష్ణునియొక్క ఆధిక్యతనుగురించి అభిప్రాయమిస్తూ, ఈమధ్య ఒకాయన, శ్రీకృష్ణునిలోని గొప్పతనం అంతా ఆయన సుదర్శనచక్రంలోనే వుందిగాని, ఆయనలో ఏమీ లేదనిన్ని, ఆ చక్రం

లాగుకుంటే ఆయన పస అప్పుడే తెలిసేది, అనిన్ని, అన్నాడు. మొన్నమట్టుకు మొన్న, ఒకజ్యోతిష్కుడు, హిందూదేశ నాయకులలో పేరుగాంచిన ఒకఆసామీని గురించి మాట్లాడుతూ, "ఆయనలో ఏముంది? ఆయన జన్మ చక్రంలో వుందిగాని. సింహాలగ్నం; లగ్నంలో రవి, బుధ, కుజులు; ద్వితీయమందు గురు చంద్రులు. ఇంకేమి కావాలి. అచక్రం నాకిస్తే ఆయనకన్న నేను గొప్పవాడినగుదును" అని అన్నాడు. ఈమధ్యే, ఒక సాముద్రిక శాస్త్రజ్ఞుడుగూడా ఒక కలెక్టరుగారి అరచేయిచూచి, ఆయనకు అబ్బిన అదృష్టం అంతాకూడా ఆయన వ్రేళ్లలోగల చక్రములలోనే ఉన్నట్టు చెప్పియున్నాడు. షేక్సుపియరు కవిగూడా మన అదృష్టమును ఒక చక్రముతో పోల్చియున్నాడు. అందుచేత చక్రముయొక్క గొప్పతనమును చులాగ్గా తీసివేయడానికి వీలులేదు. ఇప్పుడు వాహనముల విషయములోగూడా, చక్రమనేది చాల ముఖ్యమైన భాగము. బండీయొక్క చురుకుతనం చక్రమును బట్టిగూడా ఉంటుంది. ఈ చక్రము యొక్క గొప్పతనమును చక్రాంకితములు లేనివారు సహితమూ ఒప్పుకోక తప్పదు. ఎద్దుబండీయొక్క చక్రం పెద్దది. జట్కా చక్రం దానికన్న కొంచెం చిన్నది. బస్సు చక్రాలు, అన్నిటికన్నా చిన్న చక్రాలు. అయితే, బస్సు చక్రాలు తక్కిన వాహనముల చక్రములకన్న సైజులో చిన్నవైనప్పటికిని, వడిలో మాత్రం, తక్కిన వాటికన్న ఎక్కువ వేగము గలవి— రెండవ పెండ్లాముకి వయస్సు తక్కువైనా నాలుకలో మాత్రం వడి ఎక్కువ ఉన్నట్టు. వేగం విషయంలో జట్కాబండీ ఎద్దుబండిని చూచిన్ని, ఎద్దుబండీ పడవను చూచిన్ని, కాస్త ధైర్యం తెచ్చుకుని బ్రతుకుతున్నాయి గాని, లేకపోతే, బస్సు వేగం చూచాక ఈపాటికి బెంగతో మంచం ఎక్కి ఉండాలిసిందే.

మరొక్కవిషయం. మానవుని మంచి చెడ్డలు తెలిపేది జన్మచక్రం ఒక్కటే కాని, ఎద్దు బండీకి జట్కాకి రెండేసి చక్రాలు ఉన్నాయి. ఈ శకటములను అనాదిని కనిపెట్టిన మూలపురుషుని అభిప్రాయం ఊహించడం అట్టే కష్టంగాదు. మానవుని యొక్క మంచి చెడ్డలు నిర్ణయించేది మానవుడు ఒక్కడే గనుక వానికి ఒక్కచక్రం చాలును. కాని బండీయొక్క మంచి చెడ్డలు నిర్ణయించేది ఎద్దూ బండివాడూ— రెండు అయి ఉన్నాయి. అందుచేత బండీకి రెండుచక్రాలు అవసరం. దీనినిబట్టిచూస్తే బస్సుకి నాలుగు చక్రములు ఉండుటవల్ల, దాని యొక్క మంచి చెడ్డలు నాలుగింటి మీద ఆధారపడి యున్నట్లు కనబడుతుంది— మ్యునిసిపల్ రోడ్లు, తోలే డ్రైవరు, ఎదురుగుండావచ్చే బస్సు డ్రైవరు యొక్క మద్యపానముమీది అభిప్రాయములు, యజమాని జాగ్రత్త. అందుచేత దానికి నాలుగుచక్రాలు అవసరం.

అదిగాక "ఏకచక్రే మహాభోగీ, ద్విచక్రే రాజపూజితః" అని పెద్దలు ఈ బండీచక్రములను గురించియే అనాదిని అన్నట్టుగా, ఇప్పుడిప్పుడు, రిసర్చి చేసినవారు చెప్తున్నారు. దీనినిబట్టి చూస్తే, ఎద్దుబండీవానికి జట్కావానికి గూడా రాజపూజ్యత ఉండడంవల్ల వీరికి ఎప్పుడో ఒహప్పుడు ఏ "బండీబహదూర్" బిరుదో రావచ్చునని సాముద్రిక శాస్త్రజ్ఞులు అంటున్నారు. ఇందులో కొందరు బాగా తెలిసినవారు బండీవాడికే గాకుండా, బండీ ఎక్కినవారికి గూడా రాజపూజ్యత కలుగ వచ్చునని అంటున్నారు. ఈమాటను బట్టియే నిరుద్యోగులు మద్రాసులో ఉద్యోగప్రయత్న సందర్భములో బస్సులు ఎక్కటమాని జట్కాలను ఎక్కువగా వాడు చున్నట్లు అప్పుడే తెలుస్తోంది.

ఎద్దుబండీ, జట్కాకన్న, కొంచెం విశాలంగా ఉండడంవల్ల, లోపల మొగవాళ్లున్నా, ఆడవాళ్లున్నా, యిద్దరూ ఉన్నా, కాస్త, ఒకరినొకరు తగులకుండా, విశాలంగా కూర్చోవడానికి అవకాశం ఉంటుంది. అందుచేత, అస్పృశ్యత (Untouchability) విషయంలో, శ్రోత్రియుల మాటే ఎద్దుబండీలో గౌరవింపబడు తుంది గాని, గాంధీగారి మాట నెగ్గదు. ఇహ, జట్కా విషయం. ఇది అసలే యిరుకు. అందులో, జట్కావాడు, ఎక్కింది మొదలుకుని, ఎక్కినవాళ్లని, "పైకిరా, పైకిరా" అంటూ బాధపెట్టడం వల్ల, అసలే యిరుకు చోటులో, చివరభాగం కొంత, ఎవరికో ముడుపు కట్టి

నట్టు వదలివేసి, మిగిలిన కాస్త చోటులో, నలుగురూ ఇరుక్కోవాలి అందుచేత, యిక్కడ, విధిగా, ఒకరి నొకరు ముట్టుకుని తీరాలి. కావునసే యిక్కడ అస్పృశ్యత విషయంలో, గాంధిగారి మాట నెగ్గుతోంది గాని, శ్రోత్రియుల మాట శిరసావహింప బడటం లేదు. బస్సులో కూడా, పోలీసువారి అప్రమత్తతచే జనము పర్వదా క్రిక్కిరిసి యుండుటవల్ల, యిక్కడకూడా, అస్పృశ్యత విషయంలో, గాంధీగారి మాటే నెగ్గుతూ ఉంది.

ఎద్దుబండీలోనూ, జట్కాలోనూ, సాధారణంగా, ఎక్కేవాళ్లందరూ బంధువులో, స్నేహితులో అయి ఉంటారుగాని, పరాయివాళ్లు ఉండరు. బస్సులో ఎక్కేవారంతా, అట్లు బంధువులో స్నేహితులో అయి ఉండరు. కాని, ఎక్కేటప్పుడు ఎట్లున్ననూ, దిగేలోపల ఈమధ్య కొందరు కొందరు స్నేహితులూ అవడమూ ఉంది. ఆమాటకు వస్తే, కొందరు కొందరు బాంధవ్యం చేయడంకూడా వింటున్నాం—విద్యార్థులు, అంతకు పూర్వం పరిచితులు అయినా కాకపోయినా, పరీక్షహాలులో మాత్రం, తాత్కాలికంగా, జవాబులు సంప్రతింపు కొరకు స్నేహితులైనట్లు.

ఇహ మతవిషయంలో, ఎద్దు శివునిపార్టీ. అందుచేత ఎద్దుబండీ ఎక్కేవాళ్లు కేవలమూ శివభక్తులు అని చెప్పక తప్పదు. అందు కనే, విష్ణుభక్తులు, సాధారణంగా ఎద్దుబండీ ఎక్కక, ఎంతదూరమైననూ నడిచి వెళ్లెదరు. అందులో, ఉల్లిపాయలు పచ్చివి తినని వారైతే, ఎద్దుకేసి చూడేమాడరు.—దానిపేడ వాడడానికి అభ్యంతరం లేకపోయినా. కాని, ఈనూట పదకొండ్లలో ఇంగ్లీషుముక్క అలవడ్డ కొందరు, ఇటీవలనే బయలుదేరి, ఎద్దుబండీ ఎక్కడం గనుక మిక్కిలి అవసరం అయినప్పుడు, నామములు చెరిపివేసి ఎక్కవచ్చు నన్నారు—తద్దినం నాడు ముఖప్రక్షాళనముందు కాఫీ, యిడ్డెను వగయిరా పుచ్చుకున్నా తప్పులేదని, పెద్దచదువులు చదివిన వారు ఈ మధ్య అంటూవున్నట్లు.

గుఱ్ఱం కలికి అవతారం యొక్క వాహనం అవడం వల్ల, జట్కా ఎక్కేవాళ్లురాబోయే కలికి అవతారం యొక్క భక్తులని తెలుస్తూనే ఉంది. అందుచేత జట్కా ఎక్కేవారు విష్ణుభక్తులే

కాని, బస్సులో ఎక్కేవాళ్లకి, దుమ్ము తమకం వల్ల, ముఖమునంటలి బొట్టు పూర్తిగా దుమ్ముచే కప్పబడి యుండుటచే, బస్సులో వారు నిలువుబొట్టువారో, అడ్డబొట్టువారో, శ్యాంపేను కలం చుక్క బొట్టువారో నిర్ణయించడానికి అవకాశం లేదు. అట్లు ఈబస్సు జనితమైన భస్మం—దీనినే కొందరు పామరులు రోడ్డు దుమ్ము అని అంటారు—బస్సులోని ప్రయాణికులు విష్ణుభక్తులో శివభక్తులో నిర్ణయించడానికి వీలు లేకుండా చేయుట వల్ల, ఈ బస్సులో శివకేశవులకు భేదం ఏమియూ లేదని తెలియుచున్నది. అందువల్లనే, బస్సులంటూ వచ్చినతరువాత, తెలుగు దేశంలో ఎలా ఉన్నప్పటికీ, అరవ దేశంలో మాత్రం, అదివరలో అయ్యర్లకూ అయ్యంగార్లకూ ఉన్న పేచీలు సగం తగ్గి ఊరుకున్నాయి.

ఎద్దుబండీ ఎక్కితే గమ్యస్థానానికి అనుకున్న దానికంటె ఒకపూట ఆలస్యంగా వెళ్లినా దేహానికీ ప్రాణానికీ అపాయముండదు. కాని జట్కా గనుక ఎక్కివెళ్లడం తటస్థిస్తే, యింటికి చేరుకునేటప్పటికి, మళ్లీ ఏ వడ్డీ మంగలి (Interest barber) నో ఒకడిని పిలిపించి దేహానికి మరమ్మతు చేయిస్తేనేగాని మళ్లీ మూడురోజులదాకా యీ భౌతికదేహం ఏపనియూ చేయలేని స్థితిలో ఉంటుంది. ఇహ బస్సుఎక్కి వెళ్ల వలెనంటే, ఈ బస్సుబోల్తారోజుల్లో, ఎక్కకముందే కాస్త దూరదృష్టితో, ఏ రెండు మూడు భీమాకంపెనీల లోనో (Life Insure) చేయించి ఓ చిన్న విల్లు ఒకటి వ్రాసి దగ్గర పెట్టుకొని, మరీ బయలుదేరితే మంచిది. గాని లేకపోతే వెనకాతలవాళ్లు చాలా యిబ్బంది పడవలసి వస్తుంది.

ఎద్దుబండి సాధారణంగా ముక్కుకి సూటిగా ఒకవైపుకే నడుస్తుంది—లంచములు తినని జిల్లాబోర్డు ప్రెసిడెంటులాగున. కాని, గుఱ్ఱం గనుక హరాం చేయడం మొదలిడితే అది ముందుకీ వెనకకీ కూడా నడుస్తుంది— ఈమధ్య ఇండిపెండెంటు పార్టీవారు స్వరాజ్యపార్టీ

వారి కొకమాటు, జస్టిసుపార్టీవారి కొకమాటు ఓట్లు వేసినట్టు. ఇహ బస్సుకి ముందు వెనకలకి వెళ్లడం సహజమే. కాకపోతే అప్పుడప్పుడు తల్లక్రిందుగా మొగ్గ మాత్రం వేస్తూ ఉంటుంది—స్వరాజ్యపార్టీవాడు జస్టిసుపార్టీలో చేరినట్టు.

ఎద్దుబండీవాడికీ, జట్కావాడికీ గూడా పోలీసు యిన్స్పెక్టరుగారింట్లో పెళ్లివచ్చినా, జిల్లాబోర్డు ప్రెసిడెంటుగారి ఎలక్షను రోజు వచ్చినా ఏమీనష్టం ఉండదు. కాని బస్సువానికి మాత్రం కారణాంతరములవల్ల ఆరోజు రాబడి సున్నాయే.

మేత విషయంలో ఎద్దూ, గుఱ్ఱం ఘనపదార్థమున్నూ, ద్రవపదార్థమున్నూ గూడా పుచ్చుకుంటాయి. కాని జీర్ణకోశం తిన్నగా పనిచేయక పోవడంవల్ల బస్సుకి ఘనపదార్థం పడదు. ఇది ఫక్తు (Liquid diet) మీదనే ఆధారపడిఉంటుంది. ఇలా బస్సుకి జీర్ణకోశం సరిగా పనిచేయక పోవడంవల్లనే తరుచు అది సంతర్పణబ్రాహ్మణుని వలెకూస్తు ఉంటుంది అని చాలామంది డాక్టర్లు చెప్తున్నారు.

ఎద్దుబండినిన్నీ జట్కానిన్నీ లాగేది జీవజంతువు అవడంవల్ల వాహనమును లాగునపుడు కాస్త దయాదాక్షిణ్యంతో మంచి చెడ్డలు ఆలోచించి దార్లో ఉన్న పిల్లల మీదనుగాని, కదలలేని వృద్ధులమీదనుగాని అవి బండీని పోనియ్యవు. కాని బస్సుకి అసలు హృదయ మనేదే లేకపోవడంవల్ల డ్రైవరు కాస్త ఏమరుపాటుగా ఉన్న సమయములలో అది ఏ తెలియని చిన్నపిల్లల మీదకో, ఏకదలలేని వృద్ధునిమీదకో పోవడం తటస్థిస్తుంది— హెడ్డుమాష్టర్లు అమాయకులైన తెలుగు పండితులమీదకు అనవసరంగా ఎగురుతూ ఉన్నట్టు.

ఈ వాహనములు స్థిరాస్తియా చరాస్తియా అను సందర్భంలో అవి చరాస్తియే అని ఈ మధ్య దాకా అందరూ ఒప్పుకుంటూనే ఉన్నారు. కాని బస్సులు వచ్చిన తరువాత అవి దార్లో పాడయి చలనము చచ్చి దారికడ్డముగా పడియున్నపుడు మాత్రం కొందరు పాత ప్లీడర్లు అవి స్థిరాస్తి కిందకువచ్చునని కొత్త మునసబుల దగ్గర యిటీవల దబాయిస్తూ ఉన్నట్టుగూడా తెలుస్తోంది. ఈ అభిప్రాయమును హైకోర్టువారు ఎంత వరకుమన్నించెదరో యింకనూ చూడవలసియున్నది.

మొత్తంమీద, ఈవాహనములు, శాసనసభ సభ్యులవలెనూ, జిల్లాబోర్డు సభ్యులవలెనూ స్వార్థ పరత్వమును బూనియున్నట్టు కనబడవు. ప్రతీమానవుడునూ ఈ వాహనములవలన ఎన్నోవిధముల లాభమును పొందుచున్నాడు. మోటారు బస్సులు వచ్చినతరువాతనేగదా అప్పులవాళ్లు వచ్చుచున్నారని తెలియగానే బాకీదార్లు పొరుగూళ్లకు వెంటనే బస్సులమీద వుడాయించేస్తున్నారు. జట్కా ఉండడంవల్లనేగదా యవ్వనస్త్రీ భార్యాగాగల ముసలి మగలు కోర్టునుండిగాని, బజారునుండిగాని, రోజునకు మూడు నాలుగు పర్యాయములు యింటికి వచ్చి, భార్యారక్షణము అసలు ఉన్నదీ లేనిదీ చూచుకొని పోవడానికి అవకాశం గలుగుతోంది. జట్కా ఉండడం వల్లనేగదా, మనవిరోధికి ఏ పరాభవమన్నా జరిగినప్పుడు ఊళ్లో పదిమందితోనూ, వెంటనే జట్కామీదవెళ్లి, సులువుగా తెలియపరచి రావచ్చు. వైద్యులకు, బస్సుల మూలమున ఏర్పడిన నూతన వ్యాధులను చికిత్సచేయుట వల్లనేగదా మంచి రాబడి వచ్చుచున్నది. పల్లెటూళ్ల యందలి కమ్మ యువకులు పట్నవాసములో క్రాపింగు చేయించుకొనుటకునూ, కాఫీహోటలునకు వెళ్లుటకునూ గూడా, బస్సులేగదా కారణము. జ్యోతిష్కులచే వాహనయోగం లేదని చెప్పబడ్డవాళ్లు, స్వల్పఖర్చుతో వాహనయోగమును పొందుటకుగూడ యీ బస్సులేగదా కారణము. ఇట్టి లాభములు యింకనూ ఎన్నియో ప్రజలు, యీవాహనముల వల్ల పొందుచున్నారు. అయిననూ యీవాహనములవల్ల నష్టములుగూడ, వెతికినచో గనుపింపకపోవు. యీ బస్సులు వచ్చిన తరువాత, మైలకభుర్లూ, పురుడు కభుర్లూ, బొత్తిగా, మరీ వెంటనే తెలియడం వల్ల, ప్రజలు చాలా యిబ్బంది పడవలసి వస్తూ ఉంది. ఇప్పుడు, శుభశోభనాదులకు మరీ పిలవడం తరువాయిగా, పొయిలు ఎత్తివేసి బస్సుమీద బడివచ్చి, బంధువుల యిళ్లు గుల్లలుచేసి చక్కాబోతున్నారు. బస్సు బోల్తాలవల్ల పోయే జనసంఖ్య

ఎక్కువగ నుంటుటవల్ల, భీమాకంపెనీలకు అపారమైన నష్టము కలుగుమన్నది. ఇట్టి నష్టములు ఏవో కొన్ని ఉన్ననూ, మొత్తముమీద ప్రజోపకారిగానున్న బస్సుని, జట్కాని, ఎద్దుబండిని ఎక్కేటప్పుడు సంతోషంగా అవసరముచొప్పున ఎక్కి దిగేటప్పుడు "అబ్బే ఉత్తవెధవ బస్సు, వెధవ జట్కా వెనవబండి" అని అనడం ఎవరికీ గూడా సమంజసం కాదు. దిగేటప్పుడు అట్లు హేళన చేయడం ఈరోజులలో మిక్కిలి గొప్ప అంటువ్యాధి క్రింద పరిణమించింది. ఎందులోనైననూ, మొదటఉన్న ఉబలాటం, చివర ఉండక పోవడమే, యీ దురభ్యాసమునకు కారణము.

---

# నెలబాలుఁడు

జి. జాషువకవి గారు

గగనకల్యాణి, గండభాగమున నిడ్డ - కాలపురుషునిగురునఖక్షతమువోలె
మంచునవ్వుల నదె; చందమామబుడుత - జననమైనాఁడు, పశ్చిమశైలశిఖరి.

నిండు పున్నమనాఁటి కీనీటుకాఁడు-కళలు పదియాఱు నేరిచి గర్వపడును
అమరులు భుజింతు రితని దేహమును గమిచి - యమవసకుగాన రాఁ డితఁ డల్పజీవి.

కుముదము తేనెతో నెదురుకొన్నది పూజకు, చందమామ, యం
దముగలవాఁడు, చుట్టమని నాలుగుదిక్కులనుండి సర్వలో
కము తలయెత్తి, పిల్లనెలగానికి వందన మాచరించె, సాం
ద్రములగు నీ చూపు లమృతంబును జిందును శీతలంబులై.

చుక్కపడంతి నీకొఱకు స్రుక్కుచున్న దమాసనుండి కెం
పెక్కిన కన్నుమూసుకొనియెక్ కుముదంబు నిశావధూటి నీ
చిక్కని మంచువెన్నెల భుజించుచకోరము కంటినీరు న
ల్దిక్కులఁ జిమ్ముచున్నది, మదించి జగంబును గ్రమ్మెఁ జీఁకటుల్.

పున్నమనాఁడు నీవు పరిపూర్ణశరీరుఁడవై సుధావిలా
సోన్నతి నవ్వుచుం బాడముచుందువు లోకము సంతసింపనో
క్రొన్నెలబాల! యాఱుపదిరోజుల జీవికి నవ్వువచ్చునే,
యన్నము వట్టునే, పరహితార్థివి నీకు విచారమున్న దే!

అదుగో సింహికపట్టి నీతెరువుకం దడ్డంబుగా నిల్చి, నీ
రదకుంజంబునఁ బొంచినాఁ డతనిదంష్ట్రల్ క్రూరముల్ సుమ్ము నీ
మృదుదేహంబును గాసిపెట్టుకొని యిల్లెన్నాళ్లులోలోనఁ గ్రు
ళ్లెదవన్నా, ధరణిహితార్థము, నిశాలీలావతీవల్లభా ?

---



## బొమ్మరిల్లు

సూరికీ సీతికీ వెంకికీ ఆవాళే వాళ్లమ్మ తల నీళ్లోసి కాటికా బొట్టూపెట్టి చాకలితెచ్చిన పరికిణీలు కట్టి అల్లరి చెయ్యకుండా నడవలో ఆడుకోండి అని పంపించింది.

ఆడుకోడానికి వెంకి తనలక్కపిడతలూ దొండకాయలూ తెచ్చుకొంది. సీతి బొమ్మలూ నాగవిల్లి పిడితలు పట్టుకువచ్చింది. సూరితాటాకు బొమ్మలు తీసుకొచ్చింది.

వాళ్ల నాన్నకూరలు తేవడానికి బజారుకు వెళ్లాడు. వాళ్లమ్మ అప్పుడే నీళ్లోసుకొని మడి కట్టుకొంటోంది.

"సూరీ, సూరీ, నాకో తాటాకుబొమ్మ చేసి పెట్టవూ" అంది సీతి.

"నాకో" అంది వెంకి.

"తాటాకు లెక్కడున్నా యేమిటి చెప్మా ఇప్పుడు బొమ్మలు చెయ్యడానికి!" అంది సూరి.

"నేను తాటాకులు . తెచ్చుకోనా" అంది సీతి.

"తెచ్చుకో" అంది సూరి.

"నాకో" అంది వెంకి.

"అక్కయ్య తాటాకులతో నీకూ చేసిపెడతాలే అమ్మా" అంది సూరి.

"నా తాటాకు లివ్వను" అంది సీతి అప్పుడే నాలుగు తాటాకు ముక్కలు పరికిణీలోదాచి తెచ్చి.

"ఇంకో రెండు తేవా పాపం. వెంకికికూడా చేసి పెడదాము" అంది సూరి

"తాటాకు లెక్కడున్నాయమ్మా ఇంకాను" అంది సీతి.

"ఇవెక్కడవే సీతీ" అని సూరి అడిగింది.

"నేను నాన్న మంచంకింద దాచుకొన్నానూ" అంది సీతి.

"పోనీ నీకు బూరాలు చేసిపెడతానులే" అంది సూరి.

"బూరాలికి కొబ్బరాకు లెక్క డున్నా యమ్మా ఇప్పుడు" అంది సీతి.

"నే· తెచ్చిపెడతాలే దానికి కొబ్బరాకులు" అని సూరి వీధులో కొబ్బరిచెట్టు దగ్గిరికివెళ్లి కాళ్లెత్తి మట్ట అందుకోబోయింది. అందింది కాదు. అప్పుడే ఆదారిని ఒక అబ్బివెడు తూంటే, "అబ్బీ, అబ్బీ, నా కో రెండు కొబ్బ రాకులు కోసివ్వవు" అని అడిగింది.

"ఎవరమ్మాయి వమ్మా నువ్వు" అని నాలుగు కొబ్బరాకులు కోసి ఇచ్చాడు.

"రామ్మూర్తిగా రమ్మాయిని" అనిచెప్పి సూరి ఇంట్లోకి పరుగెత్తుకు వెళ్లింది.

అందరూ నడవలో కూర్చున్నారు. సూరి పరి కిణీలో కొబ్బరాకులూ తాటాకులూ పోసు కొని తాటాకుబొమ్మలు చేస్తోంది. సీతిబొమ్మకి బట్టలు కట్టడానికని పాతగుడ్డలకోసం ఇల్లంతా వెదుకుతోంది. వెంకి సూరిపక్కను కూచుని బొమ్మలు చెయ్యడం చూస్తోంది. రెండే తాటాకుబొమ్మ లయ్యేయి.

ఆబొమ్మలు అక్కడ పెట్టి కొబ్బరాకులతో ఒకపెద్ద బూరా ఒకచిన్న బూరా వెంకికీ, సీతికో బూరా, తనకో బూరా చేసుకొంది.

సీతి పాత గుడ్డపీలికలతోటీ, కాటిక్కాయ తోటీ, కుంకుంభరిణీతోటీ, వచ్చి,

"ఏవే సూరీ నాబొమ్మలు" అంది.

"అవిగోనే తీసుకో" అంది సూరి. సీతి ఆ బొమ్మలకి కాటికెట్టింది. పసుపురాసి కుంకుం పెట్టింది. పాతగుడ్డలతో పమిటివేసి బట్ట కట్టింది.

"సూరీ, నాకో పూసలదండ ఇవ్వవుటే దీనికి వేస్తాను." అంది.

"నాబొమ్మలకో అంది" సూరి.

"నీకు రెండున్నాయి గావుటే" అంది సీతి.

"నువ్వు పాడిచేస్తావమ్మా నీకివ్వను" అంది సూరి.

"పాడిచెయ్యనే. అక్కయ్యవు కాదూ? నాకో దండివ్వవు?" అంది.

సూరి తనబొమ్మ మెడలో ఒక నల్ల పూసల దండ తీసి సీతికిచ్చింది. సీతి ఆదండ తనబొమ్మ మెల్లో వేసింది.

కొబ్బరి బూరాలు రెండూ వెంకి పుచ్చుకొని ఊదబోయింది. ఊ దేయికావు.

"అలాగ్గాదే వెంకీ. ఆపీపి, నోట్లో పెట్టుకొని గట్టిగా ఊదు" అంది సూరి.

"నే ఊదిపెట్టనా నీకు వెంకీ?" అంది సీతి.

"వత్తు" అని వెంకి బూరా ఊదింది.

సీతికూడా తన బూరా తీసుకొని ఊదింది. బాగా ఊదలేదు. కీచుమంటూ ఊదింది.

"సూరీ నా బూరా పీపి బాగాలేదు. మంచిది పెట్టిపెట్టవు'టే" అంది సీతి.

"అంతేనే అది. అదేమిటి బాగా ఊదుతూంటేనే" అంది సూరి.

ముగ్గురూ బొమ్మలు ఒళ్లోపెట్టుకొని బూరాలు ఊదడం మొదలుపెట్టారు.

ఇంతట్లోకి వాళ్ల నాన్న బజారునుంచి వచ్చాడు. కూరలూ, అరిటిపళ్లూ, దోసకాయలూ, వెలక్కాయలూ, తెచ్చాడు. సూరి ఒక వెలక్కాయ పుచ్చుకొంది. సీతి ఒక వెలక్కాయ పరికిణీలో దాచుకొని ఒక అరిటిపండు పుచ్చుకొంది. వెంకికి వాళ్ల నాన్న ఒక అరిటిపండు పెట్టాడు.

"నడవనిండా ఏమిటమ్మా ఈ ఆకులన్నీనీ" అన్నాడు వాళ్ల నాన్న.

"బొమ్మలూ బూరాలూ చేసుకుంటున్నాము నాన్నా" అంది సీతి.

"నాన్నా, నాన్నా, ఇదో బూరా" అంది వెంకి.

"ఊదు వెంకీ బూరా ఊదు" అన్నాడు వాళ్లనాన్న.

"వెంకి బూరా నోట్లో పెట్టుకొని గట్టిగా ఊదింది. వాళ్ల నాన్న నవ్వాడు. సూరీ సీతీకూడ నవ్వారు.

"ఈచిన్నబూరా బాగా ఊత్తుంది. పెద్దబూరా బాగా ఊత్తునాన్నా" అంది వెంకి.

"ఆడుకో అమ్మా ఆడుకో" అన్నాడు వాళ్ల నాన్న.

నడవలో ఆకులన్నీ సూరి ఎత్తివేసి వీధిలో పారేసింది.

అందరూ కలిసి వసారాలోకి వెళ్లిపోయారు.

వెంకి అరటిపండు సగం కొరికేసుకుతింటోంది.

"అరటిపండు తినకే వెంకీ; మనము బొమ్మరిల్లు కట్టుకొందాం; కట్టుకొన్నాక గుజ్జెన్నగూళ్లొండుకుందా" అంది సీతి.

"అమ్మ కోప్పడుతుందే సీతీ" అంది సూరి.

"అమ్మ చూడకుండా ఇక్కడ కట్టుకుందాం" అంది సీతి.

"అమ్మతో చెప్తాను" అంది వెంకి.

"నీకు అరటిపండెడతానులే అమ్మతో చెప్పకు" అంది సీతి.

"ఊఁ" అంది వెంకి.

ముగ్గురూ కలిసి గోడమూల బొమ్మరిల్లు కట్టడం మొదలెట్టారు. మంచినీళ్లు కావాలని వాళ్లమ్మ నడిగి సీతి చెంబెడునీళ్లు తెచ్చింది. వెంకి పెంకులూ బెడ్డముక్కలూ తెచ్చింది. నల్లమన్ను సూరి పోగోసి అదంతా నీళ్లతో కలిపింది సూరీ సీతీ కలిసి ఆరాళ్లతోన్నూ,

మన్నుతోనూ చిన్నగోడలు లేవదీసేరు. ఆ గోడలమధ్య రెండు ఇటికముక్కలు నిలబెట్టి ఇంకో ఇటిక అడ్డంగాపెట్టి వాటినిండా మన్ను పట్టించి అలుకుతున్నారు.

వెంకి ఓమూలా, సీతిఓమూలా, సూరి ఓమూలా గోడలూ ఇల్లూ అలికివేశారు. అందరిచేతులూ మన్ను అయ్యేయి.

తరవాత దానిముందుకూడా మన్నుతో అలికారు. ముగ్గుపెట్టాలని అనుకొన్నారు. ముగ్గు తెస్తే వాళ్లమ్మ కొడుతుందేమోనని భయమేసింది. అందుకని గోళ్లతో మన్నుమీద ముగ్గుల్లాగ గీతలు గీశారు.

"చూడవే, సూరీ, చూడు; నాగోళ్లు ఎంత బాగున్నాయో. నిన్నను ఆకాశంమీద కొంగలు వెడుతూంటే.

"కొంగా కొంగా
నాగోళ్లుచ్చుకు
నీగోళ్లియ్యి
నాగోళ్లుచ్చుకు
నీగోళ్లియ్యి"

అని కేకవేశాను. అప్పుడు కొంగ తనగోళ్లు నాకిచ్చి నాగోళ్లు పట్టుకుపోయింది." అందిసీతి.

"అన్నీ అబద్దాలే" అంది సూరి.

"అక్కా నాగోళ్లూతూడు" అంది వెంకి.

"బాగున్నాయమ్మా. ముగ్గుపెట్టు" అంది సీతి.

"పిల్లకి అంతా గోటు" అంది సూరి సీతిని చూచి.

"నీకే గోటు" అంది సీతి

"చిట్టి చిట్టి గోళ్లు
సింగారాయిడి గోళ్లు
మాతాత గోళ్లు
మండాపరాళ్లు"

అని పాడుతూ సూరిగీతలు గీస్తోంది.

చిన్ని చిన్ని గోళ్లు
సింగారాయడి గోళ్లు
మాసూరి గోళ్లు
మండాప రాళ్లు"

అని సీతి సూరిని ఆక్షేపించింది.

చిన్ని చిన్ని గోళ్లు
సూరేకాంతం గోళ్లు
మాసీతి గోళ్లు
మండాప రాళ్లు"

అని సూరి మళ్లీ ఆక్షేపించింది.

"చిన్ని చిన్ని గోళ్లు
సీతారాముడి గోళ్లు
మా వెంకి గోళ్లు
మాసూరి గోళ్లు
మండాప రాళ్లు"

అని మళ్లీ సీతి అంది.

"మంచి పిల్లవే! ఊరుకుంటావా ఒక్కటెయ్యనా? పాపం వెంకి నెందుకంటావు" అంది సూరి. సీతి ఊరుకొంది.

ముగ్గులుపెట్టాక మన్ను చేతులతో నలుపు కొని దులిపివేసుకొన్నారు. ఇంట్లో తాటాకు

బొమ్మల్ని పెట్టారు. నైవేద్యం అని వెంకి తిన్న నగం అరటిపండూ, ఇంకో అరటిపండూ వెల క్కాయలూ పెట్టారు. తరవాత బూరాలు పుచ్చుకొని గట్టిగా ఊదారు.

బొమ్మలకి నైవేద్యంపెట్టి అరటిపళ్లూ వెలగ పళ్లూ ఆమట్టిచేతులతోనే తినేశారు. తరవాత సూరీ సీతీ కలిసి బొమ్మరిల్లు పాట పాడారు.

"చిట్టిచిట్టి మిరియాలు
చెట్టుకింద పోగోసి
పుట్టమన్ను తెచ్చి
బొమ్మరిల్లు కట్టి——"

"అల్లాగ్గాదే సూరీ" అని సీతి నవ్వుతూ ఇలాగ పాడింది.

"చిట్టిచిట్టి మిరిమీాలు
వసారాలో పోగోసి
నల్లమన్ను తెచ్చి
బొమ్మరిల్లు కట్టి
బొమ్మరిల్లు బిడ్డనుకంటే
సూరి తలకునూనె లేదు
వెంకి తలకు చమురులేదు"

"నన్నూ వెంకినీ ఎందుకంటావూ? నేనూ పాడు కుంటాను" అని సూరి పాడింది.

"సీతి తలకు నూనె లేదు
సీతి తలకు చమురు లేదు"

సీతికి ఉడుకుమోత్తనం వచ్చింది వెంకికూడా "పుత్తమన్ను తెత్తీ బొమ్మరిల్లుకత్తీ" అంటూ కూచుంది.

"నన్నెందుకు ముందరనాలి?" అంది సూరి.

"నేనన్నానా ఏమిటి? నేను పాడుకొన్నానూ" అంది సీతి.

"నేనూ పాడుకొన్నానూ; నీకెందుకు; ఉడుకు మోత్తనం" అంది సూరి.

"పుత్తమన్ను తెత్తీ,
బొమ్మారిల్లు కత్తీ,
సూరితలకీ నూనెలేదు
సీతితలకీ చమురులేదూ"

అని వెంకి పాడుతోంది. సూరీ సీతీ దానిని చూచి నవ్వారు.

తరవాత సూరిబొమ్మకీ సీతిబొమ్మకీ పెళ్లి చేతా మనుకొన్నారు.

సూరి ఆడపెళ్లివారు.

సీతి మగపెళ్లివారు.

వెంకి నాజట్టు అంటే నాజట్టు అని ఇద్దరు దెబ్బ లాడుకొన్నారు. ఇద్దరికీ తగువు పరిష్కారం కాలేదు. వెంకినే అడుగుదా మనుకొన్నారు.

"వెంకీ, నీకు నేకావాలా, సీతికావాలా" అంది సూరి.

"నే కావాలి కాదమ్మా నీకు" అంది సీతి.

"అలా అడక్కూడదు" అంది సూరి.

"అడగనులే. అయితే. వెంకి నాతోటే జట్టు కడుతుంది" అంది సీతి.

"వెంకీ చెప్పవే. నేగావాలా, సీతి కావాలా" అంది సూరి.

"నువ్వా సీతిని" అంది వెంకి.

"నాపేరు ముందు చెప్పింది. నేనే" అంది సూరి.

"అమ్మో అమ్మో నాపేరూ చెప్పిందీ" అంది సీతి.

ఇలాగా తగువు పరిష్కారం అయిందికాదు.

సూరి సీతిని ఒకరిబుజంమీద ఒకరు చేతులు వేసుకొని ఉజ్జీలుకట్టుకు వెంకి దగ్గిరికి వచ్చి, వెంకీ నీకు కంటె కావాలా, కాసులపేరు కావాలా" అని సీతి అడిగింది.

"కంటె" అంది వెంకి.

కంటె సీతి. కాసులపేరు సూరి. అందుచేత సీతీ వెంకీ మగపెళ్లివారయ్యారు. సూరి ఒక్కర్తే ఆడపెళ్లివారు. సీతీ వెంకీ చేతులు పట్టుకొని దూరంగా నిలబడ్డారు.

సూరి వాళ్లకు దూరంగా నిలబడి వాళ్లకేసి తిరిగి పాడింది.

"చినచిన దొంతుల్ చిటారిదొంతుల్
లక్కామేడల్ లవంగ మొగ్గల్.

చిన్నీ మేం పిల్లనిస్తామే
చిలకా మేం పిల్లనిస్తామే
దాయీ మేం పిల్ల నిస్తామే

తామర మొగ్గల్లూ తామరమొగ్గల్లు"
సీతీ వెంకి ఇలాగ పాడారు.

"చిన చిన దొంతుల్ చిటారిదొంతుల్
లక్కామేడల్ లవంగ మొగ్గల్

చిన్నీ మీ రేయింటివారే
చిలకా మీ రేయింటివారే
దాయీ మీ రేయింటివారే

తామరమొగ్గల్లూ తామరమొగ్గల్లు."
అప్పుడు సూరి మళ్లీ పాడింది.

"చినచిన దొంతుల్ చిటారిదొంతుల్
లక్కామేడల్ లవంగ మొగ్గల్

చిన్నీ మేంమంచి బ్రాహ్మలమే
చిలకా మేంమంచి బ్రాహ్మలమే
దాయీ మేంమంచి బ్రాహ్మలమే

తామరమొగ్గల్లూ తామరమొగ్గల్లూ" అప్పుడు మళ్లీ సీతి ఇలాగ పాడింది.

"చిన చిన దొంతుల్ చిటారిదొంతుల్
లక్కామేడల్ లవంగ మొగ్గల్.

చిన్నీ నగ లేంపెట్టాలి
చిలకా నగలేం పెట్టాలి
దాయీ నగలేం పెట్టాలి

తామరమొగ్గల్లూ తామరమొగ్గల్లు" సూరి ఇలాగ చెప్పింది.

"చిన చిన దొంతుల్ చిటారిదొంతుల్
లక్కామేడల్ లవంగమొగ్గల్.

చిన్నీ మాకు కాసులు కావాలి
చిలకా మాకు కాసులు కావాలి
దాయీ మాకు కాసులు......"

"అమ్మాయీ, ఒసేవు సూరీ, ఏమేవు సీతీ. ఒకరూ పలకరేమిటమ్మా" అని వాళ్లమ్మ కేకవేసింది.

"ఇక్కడాడుకుంటున్నామే" అంది సీతి.

ఇంతట్లోకే వాళ్లఅమ్మ వచ్చిచూచింది.

"ఏమిట్రా ఇది. ఇల్లూవళ్లూమన్నే. ఈవాళ పొద్దున్నేనా తలంటి నీళ్లోస్త? చెపతా ఉండండి మీాపని" అని వాళ్లమ్మ కోప్పడింది.

వాళ్లమ్మమాట విని వాళ్లనాన్నకూడా వచ్చి చూచాడు.

సీతి ఏమీాఅనకుండానే ఏడ్చింది. సూరి బిక్కమొగం వేసింది.

వెంకి వాళ్లనాన్న కాళ్లు కాగలించుకొని "నాన్నా, నన్నెత్తుకోవూ" అంది.

వాళ్లనాన్న వెంకిని ఎత్తుకొన్నాడు.

"చేతులుకడుక్కొని నాన్నగారు స్నానంచెయ్యడానికి నీళ్లు తోరపవే సూరీ" అంది వాళ్లమ్మ.

సూరి సీతీ నీళ్లు తోరపడానికి వెళ్లారు.

---

# కవిప్రశంస

కొత్తపల్లి సూర్యారావు గారు

కల మనెడు మంత్రవేత్రంబుఁ గావ్యకర్త-యనెడుజాలికుఁ డాడింప నతిగోచ
రంబు నమ్మఁడు మిగులదూరంబు నదియు-నమ్ముఁ బ్రత్యక్షమట్లు మానవుఁడు వింత.

కవితాజాలము విప్పిన-గవివలలోఁబడని దొకటి గలదే సత్యం
బువలె నసత్యము దోఁచును-నవునది కా దనియుఁ, గాని దవునని తోఁచున్.

కలిలో సింగము లేదు; హంసములకుం గాలంబు గాదంద్రు; వేఁ
టలురా నెల్లవనంబులన్ శరభఖడ్గ వ్యాఘ్ర సింహంబుల
న్వాలయించుం; గలహంస లేదనిన నుర్వీభృత్కుమారీజనం
బులు పెంప న్నడనేర్పఁ జేయు నివిగోఁబోలుం గవిప్రౌఢిమల్.

కవి యను గౌరవంబు చిరకాలముఁబట్టియు సర్వలోక సం
స్తవ మయి యున్న దట్లగుటఁ దత్కవిగర్వము మేరమీాఱెఁ దా
నెవి వచియించు నవ్వి జను లెల్లయు నమ్మఁగఁ జేయు మాఱుమా
ట పలుక రొక్కరుం గవికడంక యటందురు చిత్రమయ్యెడున్.

ఆప్తవాక్యము గ్రాహ్యమైనఁ గన్ను-మూసి కట్టెఁడుగంతకు మురిసిమెప్పు
కొందు రేమందుఁ జిత్రము కూటసాక్ష్య-మచ్ఛమగుచుండె నెట్లొప్పనంతరాత్మ.

పద్మము మోము, చేతులును బద్మములే కనుదోయిపద్మముల్
పద్మము డెంద మజ్జలును బద్మము లేసిరియిల్లుపద్మమే
పద్మము బ్రహ్మతల్లియు సభాస్థలి పీఠము నేమి పుణ్యమో
పద్మము చేసికొన్నది సెబాసు కవీశ్వరు నోటిలోఁబడన్.

కుట్మలములుఁ బెద్దకుధరంబులును భర్మ-కలశములును జక్కవలును బిల్వ
ఫలము లౌర సుకవిభావన నొకవస్తు-వెంతగారడీఁడొ వింతసుకవి!

సింహద్వారము దూఱును-సింహాసనమెక్కుఁ జేయు సింహధ్వనియున్
సింహావలోకియగునయి-సింహము లేదనును గాను సిరియలవడమిన్.

కలహంస లేదు కలిగినఁ-గలదే క్షీరములు నీరుఁ గలిపిన క్షీరం
బులు ద్రావి నీరువదలెడు-కళ యెఱిఁగినదనుచు సోదె గనుఁగొనియె నొకో!

కవియన నన్వ్య డెవ్వఁడు సుఖంబగు వాక్యమె కాని దానిలోఁ
గవియును గావ్యమున్ గలవు కంచునఁ దాళము నాదమున్ బలెం
గవియుదయించుఁ గావ్యమునఁ గావ్యము తత్కవికల్పితంబు న
క్కవియును సత్కవిత్వము నకారణబంధులు జీవకోటికిన్.

వివరముగాఁ బురాణకథ విప్పివచించెడు నప్పుడేఁ గ్రొ
త్తవియగు వాక్యముల్ బహువిధంబులు సామ్యము లర్థచిత్రముల్
వ్యవధిని వానికే పరిచితార్థము దెల్పుట యజ్ఞులైనను
జవిగొని గ్రంథము ల్చదువఁ జాలమి కిచ్చెడు మార్గమే కగున్.

వీరణ స్తంభ మనిచెప్పి వెనుకదాని-నవుకుగంటని తెల్పుట యందు మఱియు
నొక్కయుదపానమని దాని ప్రక్కనూత-ననెడు భారతరీతియు నల్ల తోఁచు.

ఒకరురచించినట్టిదె మఱొక్కరు మించి చమత్కరించి యం
తకును విలక్షణంబుగఁ బదక్రియఁ గూర్చుట భావవృద్ధిచేఁ
తక యనవచ్చు నాత్మపరితర్పణకై యనవచ్చు నన్నియుం
బ్రకటము లోకరంజనకరంబులు సత్కవిలోకకృత్యముల్.

కవిసమయంబు నొక్కతఱిఁ గన్గొనఁబోయిన నాకుఁదోఁచు నీ
ః విధచమత్క్రియాకలిత విస్తృతకల్పన మీకుఁ దెల్పఁగా
దు విదులు మీరమర్చినవి దుర్బలమద్గ్రహణేంద్రియంబుచేఁ
దవిలి గ్రహించినంతయు ముదంబునఁ బైకుబికింపఁ జూచెదన్.

తంతులు లేక నాకసముదారిని దూరముపోయి వైద్యుతో
దంతము యంత్రపేటికకు నందెడు రీతిని గాలిత్రోవ న
శ్రాంతముఁ జేరుఁగావుతను శ్రావ్యముగాఁగ మదుక్తి కర్ణపే
ట్యంతరసీమ బాలురకు నంతికులేనియు దూరులేనియున్.

నాగరాజు





(ఒక అజంతశిల్పచిత్రము ననుసరించి)

చిత్రకారుడు: తలిసెట్టి రామరావుగారు, బి. ఏ., బి. యల్., పార్వతీపురం.




## గోమాత శాపం

చూస్తే చాలు, కడుపు నిండుతుంది. ఆవంటే ఆవు గాదు. 'కామధేను'వే కేవలం భూలోకంలోకి దిగి వచ్చిందా? అనిపించేటంత ముచ్చటగా ఉంటుంది. ఇట్టి గోమాత ఒకప్పుడు చూలుకట్టింది. రమారమి, ఆసమయంలోనే ఒక ఇల్లాలు గర్భం ధరించింది. ఆమెను అంటి పట్టుకున్నవారెవ్వరూ ఉన్నట్టు తోచదు, చేదోడువాదోడవడానికి. అంచేత, కాబోయే ఆమాత, గోమాతతో చిన్న ఒడంబడిక చేసుకుంది. మఱేమీ లేదూ, పరస్పరం, సహాకారులై, ఒకరికొకడు పురుడు పోసుకోవడం.

అంతట, కొన్నాళ్లకు— మనుష్యస్త్రీ ముందుగా బిడ్డను కనింది. అనుకున్న ప్రకారం ఆవు వచ్చి నానా చాకిరీ చేసి, తనమాట అక్షరాలా నెఱవేర్చుకుంది. సరే, తరువాత ఆవుకి ప్రసవకాలం ఆసన్నంకాగా, ఇల్లాలిని ఆహ్వానించింది. కాని, ఊహు! 'ముందు మాటలు వెనుక ఉండడం' ఎంతటివారికి? 'దిక్కులేనివారికి దేవుడే దిక్కు' అనుకొని, ఆవు, తనగొడవ తనే చూసుకుంటూ, ఎల్లాగైతేం, పాపం, చల్లగా ఈనింది. తల్లీ, బిడ్డా ఖులాసాగా ఉన్నారు.

నమ్ముకున్నందుకల్లా బాగా 'తలవెంట్రుకతో గొంతుకోసింది'కదా యిల్లాలు, అని వొళ్లు మండుకొచ్చి, ఆవు ఈ పెద్దమనిషిని గుఱించి కనబడినవాళ్లతోటీ, కనబడనివాళ్లతోటీ, అడిగినవాళ్లతోటీ, అడగనివాళ్లతోటీ ఎఱిగున్నవాళ్లతోటీ, ఎఱుగనివాళ్లతోటీ, ఈముచ్చట చెప్పగొచ్చింది. 'నీకు తెత్తునా, నీకులానికంతా తెత్తునా' అని, ఆఅమ్మకే కాకుండా, మానవజాతికంతా కళంకం తెచ్చిపెట్టింది, తన తీవ్రప్రచారంవల్ల. 'పుల్లాకు చాలును, మేడ తగులబెట్టడానికి.' మనుష్యులు కృతఘ్నులు అనేమాట భూలోకంలో నలుదిక్కులా చాటింపయింది, ఏ వార్తాపత్రికలోనూ ప్రకటన వేయించక్కఱలేకుండనే.

ఇంతటితో కసి తీఱక, గోమాత ఈవిధంగా ఘోరశాపం ఇచ్చేసింది: "మాజాతిలో బిడ్డ పుట్టీపుట్టగానే సంతోషంతో స్వతంత్రంగా చెంగున లేచి గెంతులేస్తాంటే, మానవులబిడ్డలు పుట్టుకతోటే ఏడుస్తూ, ప్రతివిషయంలోనూ పరసహాయం అపేక్షిస్తూ, మలమూత్రాల్లోపడి పొర్లాడుచుందురుగాక!" అని.

కథ కంచికి పోయింది, మనం యింటికి వచ్చాం.

ముద్దా విశ్వనాథం

## దురాశ

ఒకవూళ్లో మంచి మహారాజు వొకరెడ్డి వుండేవాడు. ఆయన గొప్పదాత. బాగాచదువుకున్నవాడు కూడా. వాళ్లనాయన తొంభైయేళ్ల ముసిలాయన చచ్చిపోయినాడు. రెడ్డి ముసిలాయన కర్మాంతాలు మాబాగా చేశాడు. వేలకొలదిగా బ్రాహ్మలు వచ్చారు. వాళ్లకు దినాం సంతర్పణలు చేశాడు. రెడ్డి కడాపటి నాడు అందరికీ దక్షిణ తృప్తిగా యివ్వాలనుకున్నాడు. నాడు సందెవేళ అందరిని తమ దొడ్లోకి పిలిపించాడు. తాను పక్కన రూపాయల పళ్లెంపెట్టుకొని దొడ్డివాకిటి తిన్నెపయిన కూచున్నాడు. ఒకొక్క బ్రాహ్మడుగా లోపలి నుంచి వస్తూవుంటే ఒకొక్కడికి రెండేసిపిడికిళ్ల రూపాయలు యిస్తూవచ్చాడు. ఒకొక్కరికీ యిరవయిరూపాయలకు తగ్గకుండా వున్నింది.

దక్షిణతీసుకుని యివతలికి వచ్చిన బ్రాహ్మల్లో ఒకాయన నిండా ఆశపోతు. ఆయనకు దక్షిణ మళ్లీ తీసుకోవాలని బుద్ధి పుట్టింది. బాగాచీకటిపడింది. అంతే, దొడ్డికి వెనకవైపుకు పోయినాడు. ఎత్తుగావున్న దొడ్డిగోడ ఎట్లాగో ఎక్కాడు. గభాలున లోపల దూకినాడు గోడకింద బాగాపెరిగున్న నాగజెముడు పొదలో పడ్డాడు. 'కుయ్యో మొర్రో' అని అరవడం మొదలుపెట్టాడు. లోపల వున్నవాళ్లంతా అక్కడికి పరుగెత్తివచ్చారు. రెడ్డికూడావచ్చి దీపంతెప్పించాడు. అందరుచేరి పొదలో పడివున్న ఆయన్ను ఇవతలికియీడ్చారు. ఆయనవొళ్లి నిండా సందులేకుండా ముళ్లుయెక్కివున్నాయి. 'ఇదేం కర్మంబాపడా' అని రెడ్డి అడిగాడు. ఆ బ్రాహ్మడు సంస్కృతంచదువుకున్నవాడు; కొంచెం కవిత్వంకూడ చెప్పగలవాడు. అందుచేత మూలుగుతూ మూలుగుతూనే వొక శ్లోకం చెప్పి తంటాలుపడుతూ లేస్తూ ఆచీకట్లో యెక్కడికో పోయినాడు. అందరూ ఆయన తెలివితక్కువకు నొచ్చుకున్నారు — కథ కంచికి వెళ్లింది మనం యింటికివచ్చాం.

ఆయనచెప్పిన శ్లోకం యిది:

క్షుత్తృడాశా స్త్రయో దారా
మయి జీవతి నాన్యగాః,
తాసా మంత్యా ప్రియతమా
తస్యా శ్శృంగారచేష్టితమ్.

దీనికర్థం: 'ఆకలీ, దప్పీ, ఆశా అనేవి మూడూ నాకు ముగ్గురు పెళ్లాలు. వాళ్లు నా కుత్తికలో ప్రాణి వున్నంతవరకూ నన్నొదిలి పెట్టిపోరు. వాళ్లల్లో కడాపటి దానిపైన నాకు నిండా మోజు. ఇదామె తాలూకు శృంగార విలాసం'అని. "దత్త."

---

## గుప్తం

ఒక పల్లెటూళ్లో ఒక బ్రాహ్మడుండేవాడు. ఆయన మహాశ్రోత్రియుడు. దినంతెల్లవారే స్నానం,సంధ్యా,బ్రహ్మయజ్ఞం, పార్థివం యిలాటివాటితోనే రామాకృష్ణా అని కాలక్షేపంచేస్తూ ఉండేవాడు. ఆయన చాలాదరిద్రుడు. జరుగుబాటు తక్కువ. కాని ఎవ్వరినీ యాచించలేడు పాపం. 'అయ్యో, మంచి బ్రాహ్మడే' అని యెవరయినా అయాచితంగా ఇచ్చేదాంతోనే భుక్తిగడుపుకుంటూ ఉండేవాడు.

ఆయనభార్య ఆనిత్యదరిద్రం పడలేక 'ఏమండీ, రాజుగారిని చూచి ఏదయినా అడగరాదటండీ, ఆమహారాజు అందరికీ ఇస్తాడుటకద!' అంది. ఆమెమాట త్రోశెయ్యలేక ఒప్పుకున్నాడు. కాని 'రాజుగారిని చూడడానికి ఎప్పుడువెళ్లడం' అని ఆలోచిస్తూనే కొన్నాళ్లు గడిపాడు. ఇట్లా ఉంటే, రాజుగారి తల్లికి పెద్దజబ్బు చేశిందనీ, అందుకని ఆరాజు ఏవేవో గొప్పదానాలు చేస్తాడనీ తెలిశింది. ఇదేసమయమని ఆ పేదబ్రాహ్మడు రాజుగారి పురోహితుణ్ణి ఆశ్రయించాడు. ఆయన కనికరించి కోటలోకి తీసికెళ్లాడు. రాజుగారితో చెప్పి, ఆయనకు ఒకగుఱ్ఱాన్ని దానం చేయించాడు. ఆగుఱ్ఱంతో ఏం చేయడానికీ తోచక బ్రాహ్మడు దాన్ని యింటికి తోలుకొని వచ్చాడు. పెరింట్లో కట్టేశాడు రోజూ—తాను బ్రహ్మయజ్ఞం అదీ చేసుకున్న తర్వాత, పవిత్రాలుకట్టుకున్న దర్భలను దానిముందరవేసి, ఉద్ధరిణితో నీళ్లను దానికి తాగపెడుతూ వచ్చాడు. కొన్నాళ్లయింతర్వాత ఒకనాడు అట్లాగే చేసి తిండిలేక ఎండిపోయిన ఆ గుఱ్ఱాన్ని చూస్తూ నిలుచున్నాడు. గుఱ్ఱం 'ఉహాహుహు హుహూ' అని సకిలించింది. ఆవెఱ్ఱిబ్రాహ్మడికి కోపంవచ్చింది. 'ఉభయాపవిత్రాలూ తిని ఉద్ధరిణి నీళ్లూ తాగి ఉహాహుహుహు అంటున్నావా" అని మీదవున్న తడిబట్టతో కొట్టాడుదాన్ని. అది కిందబడి గిలగిల తన్నుకుని చచ్చిపోయింది పాపం. కథ కంచికి వెళ్లింది; మనం ఇంటికివచ్చాం.

హనుమచ్ఛాస్త్రి.

---

# పిల్లల పాటలు

గోపరాజు రాజన్నగారు
సంపాదించినవి



చేతిలో బెల్లం ఉన్నంతసేపే
కాకి బలగమంతా
చేతిలో బెల్లం చెల్లిపోతే
చేరరెవ్వరు చెంతా
కలిమి కలిగిననాడు కలరు
బంధువులు
కలిమి లేకున్ననాడు లేరు
బంధువులు.



అరటిపళ్లు కొబ్బరికాయలు-అమ్మవారికీ

పూటిగా ధనమంత-పూజారికి

చెంగల్వ పూదండ-సీతమాలక్ష్మికీ

చేతిలో కాసూలు-సన్యాసికి

భక్తితో మొక్కాలి-మా అమ్మకూ

చేతులూ జోడించి-చెలువు మీర.



చుక్కలన్ని నావి

సూర్యుడంత నాది

చందమామ నాది

జాబిల్లి నాది

మొక్కలన్ని నావి

మల్లి మొగ్గ నాది

ఊటనీరు నాద

ఊరు వాడ నావి

దేశం అంతా నాది

దేవుడు కూడా నాది.





చిట్టి చిట్టి మిరియాలు

చెట్టుకిందా పోసారు

బొమ్మరిల్లూ కట్టారు

బొమ్మల పెళ్లిళ్లు చేసారు

వియ్యపురాలికి నూనేలేదు

వియ్యపురాల్తో వచ్చినదానికి నెయ్యా లేదు.



# నీడ గడియారము

కో. నరసింహాచారి గారు

ఇంతకు ముందు ప్రమోదూత సం. చైత్ర మాస భారతి సంచికయందు ఒకవిధమగు నీడగడియారమునుగుఱించి చెప్పియుంటిని. ఆ నీడగడియారము, ఏదైన ఒక సమప్రదేశమున (horizontal surface) అడ్డముగా నమర్చదగినదై యున్నది. ప్రస్తుతము నే జెప్పబోవు నీడగడియారము అడ్డమగు ప్రదేశమున మాత్రమే గాక నిలువుగా (vertical) నుండు గోడ మొదలగు ప్రదేశములందుగూడ నమర్చదగియున్నది. దీనియందు ఒక నిలువుపలక (vertical board) యు, ఒక అడ్డపలక (horizontal board) యుగూడ నున్నవి. ఈ రెండు పలకలమధ్య నీడను జూపు ముల్లు అమర్పబడియుండును. ముల్లుయొక్క నీడ రెండుపలకలపైనను బడును. ఏదైన నొక ప్రదేశమునకు ప్రయోజనకారి యగునట్లు నీడ గడియారమును చేయవలెనన్న, ఆప్రదేశముయొక్క అక్షాంశము (degree of latitude) ను తెలిసికొని దాని నాధారముగ గడియారమును చేయవలెనని ముందటి వ్యాసమునందే చెప్పబడెను. అదేవిధముగ నిప్పుడు చెప్పబోవు గడియారమునుగూడ అక్షాంశమును గుర్తెరింగి చేయవలసియున్నది.

(చిత్రము 1) క ఖ గ ఘ అను నొక కాగితమును గాని, అట్టను గాని తీసికొనవలసినది. గడియారమును చేయుపద్ధతిని తెలిసికొనిన పిమ్మట నీ అట్టయొక్క పరిమాణమును నిర్ణయించుట సులభము. దానిపై మధ్యభాగమున నిలువుగా బ మ అను రేఖను వ్రాయవలెను. మఱియొక కాగితమున (చిత్రము 2 నందు చూపినరీతి) మనము తలచుకొను ప్రదేశముయొక్క అక్షాంశమును గలిగిన ఉ ఎ ఏ అను సమకోణత్రిభుజమును (right-angled triangle) వేయవలెను. త్రిభుజముయొక్క ఉ ఏ అనువాదము మనయిష్టము వచ్చినట్లు నిర్ణయించుకొనవచ్చును. ప్రస్తుతము అక్షాంశకోణము 20 అని తీసికొనబడినది.

ఎ ఏ అను కర్ణము (hypotenuse) నుండి ఊ ఉ అను లంబము (perpendicular) ను వేయవలెను. పిమ్మట క ఖ గ ఘ అను కాగితముపై వేయబడిన బ మ అను రేఖపై బ అ అను భాగము ఉ ఏ కును, అ మ అను భాగము ఉ ఎ కును సమానముగ నుండునటుల జేసికొని ప ఫ అను అడ్డగీతను అ గుండా వేయవలెను. అటువెనుక అ ఇ అను భాగమును ఉ ఊ (చిత్రము 2) అను రేఖకు సమానముగ గ్రహించవలెను. ఇ కేంద్రముగను, ఇ అ అర్ధవ్యాసముగను ర అ ల అను అర్ధవల




1

20° అక్షాంశములకు
నీడగడియారము




3



యమును వేయవలెను. ర ల అను వ్యాసము ప ఫ కు సమాంతరము (parallel) గా నుండవలెను. పిమ్మట ర అ ల అను అర్ధవలయమును అ ఇ కి ఇరుప్రక్కల ఆఱేసి సమభాగములుగ భాగించవలెను. అట్లు సమముగ భాగించెడి రేఖలు ప ఫ అను రేఖను క్రమముగా **7, 8, 9, 10, 11,—1, 2, 3, 4, 5** అను ప్రదేశములందు చేరునటుల పొడుగుగ వ్రాయవలెను. పిమ్మట **7, 8** మొదలగు గుర్తులనుండి బ కు నుమ కును రేఖలను వేయవలెను. బ మ కు ఎడమప్రక్క నుండు భాగమునందలి రేఖలన్నియు ఉదయకాలమునందలి గంటలను తెలియపఱచును. బ మ కు కుడిప్రక్క నుండు రేఖ లన్నియు అపరాహ్ణమునందలి గంటలను దెలియజేయును. బ జ ఉదయమున ఆఱుగంటలను జూపు రేఖయు, బ ఝ సాయంత్రమున ఆఱుగంటలను జూపు రేఖయును. తక్కిన సంఖ్యలు ఆయాగంటలను తెలియజేయును. ఉ ఎ ఏ అను త్రిభుజనువంటి యొక అట్టను గాని, తగరపు రేకును గాని కత్తిరించి ఉ ఏ అను పాదము (Base) ను బ అ పై నుండునట్టుల బిగింపవలెను. పిమ్మట క ఖ గ ఘ అను అట్టను ప ఫ వెంబడి మడిచి, ప ఫ గ ఘ అను భాగమును అడ్డపలకగాను, ప ఫ క ఖ అను భాగమును నిలువు పలకగాను ఉండునటుల చేయవలెను. అపుడు తగరపురేకుయొక్క ఉ ఎ అను నిలువు అంచు అ మ అను భాగమును తాకుచుండును. ఇందలి ఉ ఎ ఏ అను తగరపు రేకునీడను చూపుముల్లు అగును. దానినీడ ఏ రేఖపై బడునో దానినిబట్టి గంటను నిర్ణయించవచ్చును.

గడియారమును ఉత్తరముఖముగా గోడపై తగిలించవలెను.

పై పద్ధతిని చేయబడిన గడియారము కొయ్యపలకలతో చేయవచ్చును. పలకల అంచులను మనయిష్టము వచ్చిన విధముగ అలంకారయుతముగ జేయవచ్చును (చిత్రము 3 చూడుము). గడియారమునకు గావలసిన కొలతలను, భాగములను ముందుగా నొక కాగితముపై వేసికొని వాటిని కొయ్యపలకలతో జేయబడిన గడియారముపైకి మార్చుకొనవలెను.

# మోతీలాలు నెహ్రు స్మృతి

కావ్యకళానిధి శతావధాని పి. చిదంబరశాస్త్రి గారు

పొడమితి వార్యవంశమున భూజనులెల్ల నుతింపఁజాలు నె
క్కుడు విభవంబుతోడ సమకూరినభోగము లందినాఁడ వే
ర్పడ నిజదేశమాతృవరివస్యకుఁడై సకలస్వ మిమ్మెయిన్
విడుచుటె కాక ప్రాణములు వీడితి నెహ్రుమహాశయాగ్రణీ!

భోగములొందుపట్లఁ బరిపూర్ణుఁడవంచును దేశసేవకై
త్యాగము చేయుచోట్ల వెనుకాడనిబంటవటంచుఁ జాల నూ
రేగితి వెల్ల దేశముల నింతటికంటెను నీకు భూమిలోఁ
గాఁగలకార్య మున్నదె యొకండును నెహ్రుమహాశయాగ్రణీ?

ప్రారంభింపరు ప్రాజ్ఞు లేకృతియుఁ బ్రారంభించుచో వీడఁగాఁ
బోరా కార్యము బొందినుండి యసువుల్ వోకుండునందాఁక నం
చారూఢిన్ గనినట్టి న్యాయమును నన్వర్థంబు గావించి నా
వౌరా! నీవు నుతింప నర్హుఁడవు కావా? నెహ్రుధీరాగ్రణీ!

ధనికు లనేకు లుందురు స్వదారసుతోదర పోషణంబునన్
దనిసెడివారు వారలకుఁ ద్వద్యశమబ్బునె? వేయిజన్మముల్
పనివడి తల్లక్రిందుగఁ దపంబొనరించినఁగూడఁ గప్పురం
బున కిల నుప్పుగల్లు సరిపోవునె? నెహ్రుమహాశయాగ్రణీ!

విడిచితి గేహమున్ ధనము వీడితి వాత్మసతీసుతాదులం
దడరెడురాగమెల్ల విడనాడితి వన్నివిధంబులన్ బడల్
పడితివి దీక్షతోఁ గడకు భారతమాతఋణంబుదీర్చి నీ
వుడిగితి నీకు లోపమన నున్నదె? నెహ్రుమహాశయాగ్రణీ!

అనుభవించితివి రాజాధిరాజులుగూడ - ననుభవింపఁగ రానియట్టి సుఖము
అభ్యసించితివి దేశాంతరస్థులు గూడ - నోహో! యనందగు హూణవిద్య
ఆర్జించితివి లోక మాద ంపఁగఁగల్లు - రాజ్యాంగతంత్ర నిర్మాణశక్తి
అర్పించితివి భారతావనిసేవకై - యాత్మీయమైన సర్వార్థవితతి
నిలిపితివి దిక్తటంబుల నిజయశంబు - చెందితివి దివ్యమగు స్వర్గమందిరంబు
నన్నివిధముల ధన్యుఁడవైతి వీవు - మోతిలాల్ నెహ్రునామ! నిర్ముక్తకామ!

---

# దైత్యులు

దైత్యులు, దైతేయులు, అసురులు, దనుజులు, దానవులు, రక్షస్సులు, రాక్షసులు, కౌణపులు, క్రవ్యాత్తులు, క్రవ్యాదులు, అస్రపులు, ఆశరులు, అసురులు, యాతుధానులు అను శబ్దములు పర్యాయ పదములుగా సంస్కృత నిఘంటువులందు వ్యవహరింపంబడి యుండుటవలన వారందఱు నేకజాతిజాతు లనియును, క్రూరస్వభావులనియును, హీనచరిత్రు లనియును, నరమాంస భక్షకులనియును బెక్కుజనుల తలంపు. పురాణములను లెస్సగాఁ బరిశీలించినచో నట్టితలంపు భ్రాంతిమూలకమనియే యేర్పడును. పురాణ విషయములను జర్చించుటకుఁ బూర్వము తత్తచ్ఛబ్దములకుఁ బండితు లిచ్చిన నిర్వచనములను పేర్కొందము. (కశ్యపుని ప్రథమ భార్యయయిన) దితికిఁ బుత్త్రులగుటవలన దైత్యులు, మఱి దైతేయులు; సుర లేనివా రగుటవలన అసురులు; (కశ్యపుని వేఱొకభార్యయ యిన) దనువునకుఁ బుత్త్రులగుటవలన దనుజులు, మఱి దానవులు; (రక్షత్యాత్మాన మేవేతి రక్షః; రక్ష ఏవ రాక్షసః) తమ ప్రాణములనే రక్షించుకొనువా రగుటవలన రక్షస్సులు; రక్షసులే రాక్షసులు. రాక్షసులు కేవలము తమ ప్రాణములనే రక్షించుకొనువారా? తమభార్యల ప్రాణముల నయినను, బిడ్డల ప్రాణముల నయినను రక్షింపనివారా? ఇది యేటి నిర్వచనము? శబ్దార్థమునందు లేని "తమ ప్రాణములనే" యను నాకాంక్ష యేల? "ఆశ్రితుల" యను నాకాంక్ష గూడదా? రక్షించువా రగుటవలన రక్షస్సులు, రక్షస్సులే రాక్షసు లని కర్మపదలోపముఁ జేసి చెప్పినను, బండితుల నిర్వచనముకంటె నసమంజసముగా నుండదు. కుణపములను (శవములను) దినువా రగుటవలన కౌణపులు; మాంసమును దినువా రగుటవలన క్రవ్యాత్తులు, మఱి క్రవ్యాదులు; రక్తమును త్రావువా రగుటవలన అస్రపులు; హింసించువా రగుటవలన ఆశరులు; ప్రాణములను దీయువా రగుటవలన అసురులు; వ్యథపెట్టువా రగుటవలన యాతుధానులు. వ్యవహరింపఁబడుచున్న పర్యాయపదములయొక్క నిర్వచనములను ముగించుటవలన నిఁకఁ బురాణ విషయములను దడవుదము.

ఒక విషయ మన్ని పురాణములందు నేకవిధముగా నుండక భిన్నభిన్న రూపములను దాల్చి యుండును. అట్లగుటవలన సర్వసాధారణ జనాదృత పురాణకథిత విషయములను బట్టియే చర్చించుట యుక్తముగదా. కశ్యప ప్రజాపతికి దితి, అదితి, దనువు, వినత, కద్రువ యను నైదుగురు భార్యలు. అందు దితివలనఁ గలిగినవారు దైత్యులు లేక దైతేయులని పిలువఁబడిరి. అదితివలనఁ గలిగినవా రాదిత్యులు లేక యాదితేయులని చెప్పఁబడిరి. దనువువలన

గలిగినవారు దనుజులు లేక దానవులని నుడువఁబడిరి. వినతాసంతతి గరుడాది పక్షినిచయము; సాటి కద్రువాసంతతి వాసుకిప్రభృతి సరీసృపచయము.

కృతయుగమునందు దైత్యాదిత్యులకు జరామరణముల నొందక మనవలె నను నిచ్ఛ గలుగఁగా వారు పాలకడలిని ద్రచ్చిరి. [వాల్మీకి రా. బా. కా. స. ౪౫, శ్లో. ౧౫, ౧౬, ౧౭, ౧౮]. అప్పుడు పాలకడలియందు వరుణునిసుత యయిన వారుణి (సుర) జనించి, వరింప రాఁగా దానిని దైత్యులు నిరాకరించిరి; ఆదిత్యులు గ్రహించిరి. [వాల్మీకి రా. బా. కా. స. ౪౫, శ్లో. ౨౩, ౨౪]. సురను గ్రహింపకుండుటవలన దైత్యులసురులయిరి; సురను గ్రహించుటవలన నాదిత్యులు సురలయి మోదముఁ బొందిరి.

[శ్లో. అసురాస్తేన దైతేయా
స్సురాస్తే నాదితేస్సుతాః,
హృష్టాః ప్రముదితా శ్చాసన్
వారుణీ గ్రహణాత్సురాః.
వాల్మీకి రా. బా. కా. స. ౪౫, శ్లో. ౨౫].

పాఠకులారా, వరించి వచ్చినసురనే నిరాకరించినదైత్యులు రక్తపాయులును, శవభక్షకులునయి యుందురా? వారిలోఁ గొందఱు రణరంగమునందు రౌద్రరసము ద్రేకించినపుడు వైరిరక్తమును ద్రాగియుండవచ్చును. దుశ్శసేనుని రక్తమును భీమసేనుఁడు ద్రావినట్లు మహాభారతమునందుఁ గలదు. ఒక్కచుక్కయయినను మిగులకుండ రక్తబీజ్యునిరక్తమును గాళికాదేవి పానమొనర్చినట్లు దేవీపురాణము నుడువుచున్నది. దైత్య దానవులలోఁ గొందఱు జిహ్వాచాపల్యవశులయి యనుపాకృత వివిధమాంసభక్షణము సలిపి యుండవచ్చును. యజ్ఞశేషము గాని మాంసమును దినుటవలననే వారు కోణపులని నిందింపఁబడిరి.

[శ్లో. యజ్ఞాయ జగ్ధిర్మాంసస్యే
త్యేష దైవో విధిస్స్మృతః,
అతోఽన్యథా ప్రవృత్తిస్తు
రాక్షసో విధిరుచ్యతే.
—మనుస్మృతి, అ. ౫, శ్లో. ౩౧].

పచ్చిపీనుఁగులనే మెసవువారుండరుగదా! యజ్ఞదత్తమాంసమును దేవతలును, యజ్ఞశేషమాంసమును ఋషులును దినుట సుప్రసిద్ధ విషయము.

ఆధిక్య మాలోచించితిమా, దైత్యులగు వాయు నిరృతులు దిక్పాలకులు. కృత్యము లాలోచించితిమా, బలి చక్రవర్తి మహాదాత; ప్రహ్లాద విభీషణులు పరమభాగవతులు; రావణ బాణాసురులు శైవశ్రేష్ఠులు; మయుఁడు శిల్పివరుఁడు. దైత్యదానవులశక్తియు, నధ్యవసాయమును, శౌర్యవీర్యగాంభీర్యాదార్యములును సుప్రసిద్ధములు. వారిలోఁ గొందఱు యజ్ఞనాశకులును, బరవనితారతులును, ప్రాణిహింసకులు నున్నంతనే వారందఱను యాతుధానులు, నాశరులు, నాసురులు ననవచ్చునా? దేవతలందఱును, మానవులందఱును బవిత్రచరిత్రులా? దేవతలకు రాజగు నింద్రునిచర్యలను బరికింతము. అతఁ డెందఱ తపస్సులను

జేయఁ బ్రయత్నింపలేదు!! యజ్ఞమును జేయు చుట పాపమును, దపమును జేయుచుట పుణ్యము నా? అతఁడు దన సవతితల్లికడుపునఁ జొచ్చి గర్భమును ఛేదించుట యుక్త కృత్యమా? అహల్యను జేయుచుట పవిత్రకార్యమా? వృత్రాసురుని జంపుట పౌరుషమా? జంభాసురాదులను జంపుట హింసాకరము గాదా? అధిపతి వెల్లడియగుటవలన నీతఁడు దేవతల నటుంచి మానవులఁ జాతము. నరవరులయిన శిశుపాల దంతవక్త్ర జరాసంధ దుర్యోధన దుశ్శాసనాదుల పనులు నింద్యములు గావా? మహమ్మదు తగ్లాకు, తైమూరు, నాదర్షా మొదలయినప్రభువులచేత లెట్టివి? గతించినవారిని వెదక నేల? ఇప్పటిజనులలో ననంస్కృత మాంసము మొదలగు నభక్ష్యవస్తు ప్రకరము, నుడికియు నుడుకని మత్స్య మాంసములను, బచ్చిగ్రుడ్లను దినువారును, బరాంగనా మానభంగము సేయువారును, బరద్రవ్యహర్తలును, ప్రాణిహింసకులును, మఱియు నతిదారుణ కర్మకరులు నుండుట మన మెఱుంగుదుము గదా. ఉపరికథితాచరణముల వలన నఖిలదేవతలును, నిఖిలమానవులును నింద్యచరిత్రు లగుదురా? పాఠకులారా, వ్యక్తిగతాచరణముల వలనను, సమయోపయుక్తాచారములవలనను సమగ్రకులమును దూషించుట గాని, భూషించుట గాని యుక్తము గాదు.

సురాసుర నరులకు వైవాహిక సంబంధము లుండుట దెల్లము. పులోమదానవుని కూఁతురు శచి. ఆమె యింద్రుని మహిషి. బ్రహ్మపుత్త్రికయయిన యహల్య మానవుఁ డయిన గౌతమున కియ్యఁబడెను. దమయంతిచేత వరియింపంబడుట కింద్రాది దిక్పాలకులు ప్రయత్నించిరి. ఊర్వశి పురూరవుని వలనను, మేనక విశ్వామిత్రునివలనను సంతానములం గనిరి. వజ్రనాభుని కూఁతురయిన ప్రభావతిని బ్రద్యుమ్నుఁడును, బాణాసురుని కూఁతురయిన యుషను అనిరుద్ధుఁడును బెండ్లియాడిరి. ఇట్టివి మఱి కొన్ని గలవు. ఇట్లుండ నసురులు నిందితు లయిరేల? తత్కారణములను లెస్సగా నాలోచింపఁగా వారియందు దేవతలకుఁ గలద్వేషభావమును, దేవతలయందు మనుజులకుఁ గల పక్షపాతిత్వము నని సహృదయుల హృదయములకుఁ దట్టక మానదు.

విష్ణుపురాణాదులందు నసురుల చరిత్రావళి విపులముగా వర్ణింపంబడి యున్నను, వారికి రక్షో రాక్షసనామములు గలిగిన వైనము స్ఫుటముగాఁ గాన రాకుండుట శోచనీయము.

జనిగుణకర్మములవలన నసురు లందఱు నేకకులజులును, క్రూరాత్ములును, సభ్యత్వహీనులును గారనియుఁ, బ్రత్యేక కులమునందును దుష్టచరిత్రులు గొందఱుందు రనియు, నట్లున్నంతనె సమగ్రకులము నిందితము గాఁ జాలదనియు నుపరికథిత విషయములను మనమున నిడి దీర్ఘముగా నాలోచించు వ్యక్తి దప్పక నమ్మునని నమ్ముదము.

---

# హాస్యచిత్రకారుడు










# మాస్టరు అంజి నిర్యాణము

(కార్తిక పూర్ణిమ) డాక్టరు గోవిందరాజుల వెంకట సుబ్బారావుగారు, L. M. S.

ఇప్పుడే ఇంటి కొచ్చి దిగాలపడి పడుకొని, దీనిని వ్రాయటానికి మొదలెట్టాను. ఆకాశంలో నేమో నిండుచంద్రుడు పరుగెత్తుకు పోతున్నాడు: వాడేమో ఉత్తరానికి; వెళ్లిపోతూ మేఘాలు దక్షిణానికి. మా అంజిప్రాణాన్ని తనపొట్ట నెట్టుకున్నాడు వీడు. శల్యాలు మాకు వదలేసి, మహారసజీవి ఉసుర్లను లేవతీసు కెళ్తున్నాడు. ఒకటే పరుగెత్తటం. రెండుగంటలయిం దిప్పటికి. ఆగమంటే ఆగడు. పొరపాటుపడ్డాడేమోనని నా ఆశ. వీడిని ఆపటం నావశమా? అయితే నాగతేమిటి? వాడితల్లి, బంధువుల గతేమిటి? మరిచాను, మా నాట్యసభ గతేమిటి? రేపు రాదూ ఆకాశంలోకి, నిలవేసి కక్కమంటాను. అయిపోయిందని మళ్లా తెల్ల మొఖం వేస్తే ఏం చేసేది?

అయిపోయింది, బాబూ, అయిపోయింది. నేటితో ఋణం తీరిపోయింది. మళ్లా కనపడ్డుగా? నిజమేనా ఇదంతా? ఎవరు పోయినా ఇంతే కాబోలు!

కొన్నాళ్లక్రింఎట, నేను పోతాను, అప్పుడు మా అంజిత తప్పక నన్ను మోసేవాళ్లలో ఒకడను కొన్నాను. అదటు, ఇదటు అయింది. నిజంగా దేవుడనేవా డొకడున్నాడా? లేక ఉంటే నిద్రపోతున్నాడా?

నాదా, పెద్దజబ్బాయె! వీడిదా, జ్వరంతో మొదలెట్టె: రాను రాను క్షయ: దాని త్రాడు తెంచుకొని, పేగుల్లో మొదలెట్టింది. నాకు ప్రాణాన్నిచ్చిన రంగాచారిగారి కత్తికి ససేమిరా అంది. కాని భయపడి మూడునెల్లు, మూలపడి మూలిగింది. అప్పకర్మవ్యాధి కాబట్టి, భాద్రపదంలో మొదలెట్టి వీడి ఉక్కుశరీరాన్ని పీల్చి పిప్పి చేసి, ఈలలితహృదయాన్ని తిని తిని, వదిలిపెట్టక తీసికెళ్లిపోయింది.

ఇంతకన్న ఏం చేస్తుంది? అభం శుభం, అన్నెం పున్నెం ఎరగని ఈబ్రహ్మచారిని దేనికి తీసుకెళ్లింది? ఉత్తమజన్మ మొదలెట్టించటానికా, లేక జన్మరాహిత్యం చెయ్యటానికా? ఏమో! ఉత్తమజన్మ అంటాం గాని, అది మళ్లా ఉత్తరానికి దక్షిణమే కాదు బాబూ! జన్మరాహిత్యానికే మా అంజిని పరమేశ్వరు డార్చేశాడు. నాకు తెలిసినంతవరకు ఏపాపం చెయ్యని ఈ చిన్నవాడికిది ఆఖరుజన్మే! ఏమైనా ఉంటే తనఆరునెలలక్షోభతో కర్మ ననుష్ఠించాడు. ఋణం తీర్చుకొన్నాడు: బాకీలు మిగుల్లు లేవు.

వెళ్లిపోయినా డనంతంలోకి; పరమేశ్వరుడి నిత్యనాటకభవనంలోకి. నాయినా! నీలలితకళల్లోను, నీసహజసుగుణాల్లోను, నీ ఉన్నతభావాల్లోను, నీ భక్తిలోను,

నీసౌరభ్యంలోను మునిగి తేలుతూ, ఆనందమయుస్వ పుడవై అక్కడ్నే నృత్యం చేస్తూ ఉండు. కొన్ని యుగాలకైనా నిన్ను చూస్తాలే! నీప్రేమ కర్పణం ఈహృదయమే; దాన్నయినా తీసుకెళ్లు!



శ్రీ తంగిరాల ఆంజనేయులు గారు, (మాస్టరుఅంజి)

మొదలుకొద్దాం. మా అంజిగాడ్ని నేను ఎఫ్ఫే చదువుచున్నప్పుడు మొదట చూట్టం. మే మప్పుడొక ప్రాతవిద్యార్థిసంఘాన్ని పెట్టి, దాని సంవత్సరోత్సవానికి గయోపాఖ్యానం ఆడటానికి రిహార్సల్లు వేస్తున్నాం. నేనేమో భీముడు, సాత్యకి వేషాలు వేశేరోజులు. వీడ్నొకరోజున వాడి మేనమామ పిల్లలమఱ్ఱి సుందరరామయ్యగారు, వెంట తీసుకొచ్చి, "నా మేనల్లు" డన్నారు. "పాడరా అబ్బాయి" అంటిని. ఆరోజుల్లో పద్యం పాడితేనే ఛెడ్డగొప్ప. ఏం చేశాడూ! హార్మణీ నొక్కమని సవాల్ చేసి నదురూ బెదురూ లేకుండా 'నరకాసుర'లో సీసపద్యం ఒకటి పటాక్షేపంతో అభినయించి పనిచేశాడు. "మమ్మ నందర్నీ మించుతావురా, కొద్దిరోజుల్లో" అని మనసార వెఱ్ఱిగా దీవించాను. దగ్గరున్న వాళ్లకొంచెం మనస్సు కలక్కుమనేటం తయింది. ఏ అవస్థలో అన్నానో కాని కొన్నాళ్లకు మమ్మ నందరినీ మించిపొయ్యాడు. రామవిలాస సభలో కుప్రకారులో ఇంత పైకి వచ్చింది వీడేనని వేరే వ్రాయక్కర్లేదు: ఆంధ్రప్రేక్షకలోకాని కంతా తెలిసినవిషయమే.

వీడు ఏవిధంగా వృద్ధి చెందిందీ వ్రాయాలంటే చాల కష్టం. కొన్నిదశల జ్ఞప్తికి తెచ్చుకోగలను కాని, దశలమధ్యఉన్న స్థితులు మట్టుకు చాత కావు. గారడీవాడు చెట్టు మొలిపించిన మోస్తరుగా పెరిగాడు: మళ్లా ఆగారడీవాడే సంచిలో వేసుకుని ఇతరచోట్ల చూపించటానికి తీసికెళ్లాడు. శ్రీరామవిలాససభ పూర్ణమైనవెలుగులోకి వచ్చేసరికి మాఅంజికూడా పాడిదిననక్షత్రాల్లో ఒక తేజోవంతమైన నక్షత్రం. మబ్బులు కప్పి విచ్ఛిన్నమైనతర్వాత మరింతశోభతో ప్రకాశించాడు. అందరిచేతను "శహబాస్! చిచింద్రీ" అని అనిపించుకొన్నాడు. తనబీదతల్లి కక్కరకొచ్చేసరికి మాలదైవం మాయంచేసేసాడు. వీడేకపుత్రు డాధీమంతురాలికి.

మొట్టమొదట చిల్లరవేషాల్లో ఆరితేరిపొయ్యాడు. ఏవేషమైనా అతిస్వాభావికంగా సూక్ష్మవిచారణతో వేసేవాడు. చాలమందికి వేషం స్వాభావికంగా ఉంటే చాత దానికి తగినట్టుండదు. రెండూ కుదరటం చాల కష్టం. అది కాక, వీట్లో అధికారం సంపాయించండే పెద్దవేషాలు చాలాకష్టం. చేతయినా అవి ఏదో, ఎక్కడో, పట్టిస్తూనే ఉంటాయి. ఇది నాఅనుభవం మీద చూసిన సంగతి. చిల్లరవేషాలు నమ్మకంగా, న్యాయంగా, జయప్రదంగా నటించటంలో పాద్యే దేమిటి? సిగ్గు—'శరం'—చిల్లర్లో ఉండే చిలుము. (చిల్లర్లో ఉండే చిలుం పోగొట్టుకోటం చేతయితే రూపాయికి మెరుగు పెట్టటం చేతవుతుందని నాఆశయం) ఇవ్వే, పెద్దవేషాల్లో మొదట్నే దూకేవాడికి ఎదురొచ్చే దయ్యాలు. అనగా అనగా దుష్యంతుడివేష మనుకోండి. మాచిన్నతనంరోజుల్లో పదిరాగాలు పదిపద్యాలమీన విసిరాడంటే ఇచ్చేసేవాళ్లు, పని శెంత పీలగా ఉన్నా సరే. "ఉన్నవాళ్ళల్లో ఇంకెవరున్నారోయి, వాడే లే" అనేవాళ్లు పైగా. ఇలా రాజుగారి ముచ్చెల్లోకి కాళ్లొచ్చేసరికి,

అవి ఎంత అసహ్యంగా ఉన్నా సరే, ఎంత తగనివన్నా సరే, వేసుకొని తెయ్యిమనేవాడు. అదేలా ఉండేదీ నే వేరే చెప్పాలా? ముందర ముచ్చెలు తుడవటం చేతయితే తర్వాత అవి వేసుకొంటే బాగుంటుంది. ఇదే విధంగా తలగుడ్డా దుస్తులూ అనుకోండి. ఎంతమందికో మీసం త్రిప్పటం చేతయ్యేది కాదు. చూసైనా ఉండాలి లేక త్రిప్పైనా ఉండాలి; లేకపోతే ఏలా వస్తుంది?— గాథలోకి దిగాను— ఇక అసలు విషయం.

బొబ్బిలినాటకంలో మర్తెసువేషం మొదట నన్నాకర్షించింది. ఇంగ్లీషువాడిలాగా కాకుండా, ఫక్తు ఫ్రెంచివాడిలాగ వేషంలోనూ, భాషలోనూ, నడకలోనూ చూపించాడు. "ఎంత అవకాశాన్ని ముక్కట్టుకున్నావురా" అనుకొన్నా నాబుస్సీవేషంలోనుంచి.

కుర్రవాడని తెలిసి కూడా భాగవతుల రాజగోపాలంగారు, అప్పుడు సభ proprietor గారు, ఖుస్రూఖాన్ వేషం ఇచ్చేశారు. ఆరాత్రి ప్రతాపరుద్రీయంలో అతిముచ్చటగా, గాంభీర్యంగా అభినయించాడు. "పైకొస్తున్నాడు గొప్పనటుడు, కాచుకోండి పెద్దవాళ్లు" అనేశారు చూసినవాళ్ళంతా.

ఇలా ఉండగానే, అకస్మాత్తుగా స్త్రీవేషం కూడా ఒకమారు ధరించాడు: 'నరకాసుర' నాటకం; కొత్తఫక్కీగా తయారుచేశాం; సుందరరామయ్యగారు నరకాసురుడు; వీడేమో ఊర్వశి. స్టేజిలో ఎప్పుడూ ఉండేవాణ్ణి, ఎందుకో నాటకంరోజు పిట్టులోనే కూర్చుని మొదట్నుంచి, చూస్తున్నాను. ఒక మెరుపులాగా రంగంలోకి వచ్చాడు. ఆరోజున చూపిన అభినయం వర్ణనాతీతం. కంచుకం లేకుండా గులాబీసిల్కు చీర కట్టి తయారైనాడు. వేషం అప్సరస్త్రీలని మించిపోయింది. వాండ్లవద్ద ఉండే యేదో యొక వెలుగూ, తళతళ, కళకళ, మబ్బులోనుంచి, గాలిలోనుంచి వస్తున్నట్టు జిలుగు గల్గి అంతకు మించినపోకడలతో వ్యవహరించాడు. అప్సర ఏవిధంగా నడవాలి? ఎవరికైనా తెలుసునా? తెలిసింతర్వాత నడవగల్తురా? వీడివద్దకున్న కళలో ప్రాశస్త్య మేమంటే, ఏవేషమో ఆవేషంలో అంతా లీనమైపోయ్యేవాడు. అన్నట్లు "అంజి" అని ఎవరికీ చాలాసేపు గుర్తురాలేదు. గాలిలో నడిచినట్లు, నీళ్ళలో నిలువున యీదుతున్నకాళ్ళలాగా, లలితంగా, సుఖంగా, హాయిహాయి అనేలాగా, అంజవేశాడు. మళ్లా ఆనడక నే నెక్కడ చూడలేదు. ప్రమీలవేషంలో కాకినాడ జగన్నాయకులు ఆఖరుసీనులో అర్జునుడివద్ద నిల్చున్నప్పుడు అలా నటించాడు. అది రమ్మంటే వచ్చేనడ క్కాదు: ఆసమయానికి స్త్రీచిత్తమైపోయి, దానిజిలిబిలి, దానిమిలమిల పట్టుపడాలి, లేకపోతే పట్టించుకోవాలి. సుందరరామయ్యగారు నిజంగా పారవశ్యములోకి వెళ్లాడు ఆరోజున. మేనల్లుడి అభ్యుదయము ఆయన్ని ఆనందబాష్పాలలో ముంచినది. మా సంగతి అంతకంటె. ఎందుకో జ్ఞాపకము రాకుండా యున్నది, మళ్లా ఆవేషం య్యాలేదు వీడు; వేస్తే ఆడవేషం అంబాజీపేట ఆముదములాగా తగులుకుంటుం దని నాతో చెప్పినట్లు లీలగా వుంది.

పోని, హాస్య ప్రాధాన్యమైన వేషాల్లో లేదా అంటే, వాట్లోను ఆరితేరి పొయ్యాడు. 'సొరాబు-రుస్తుము'లో కోర్టు ఫూలు వేషం అతిరమ్యంగాను, ముచ్చటగాను ఉండేది. ఈ సందర్భములో ఒకమాట చెప్పాలి శుంది. కండక్టరుగారు ఏదో యొకవేషం యిస్తారనుకోండి. రిహార్సల్సు వచ్చేటట్లు అయిపోతాయి; నాటకము అంతా తయారైపోతుంది; ఆరోజు రాత్రి హాలుదగ్గర ఏం పూసుకోవాలో, ఏం వేసుకోవాలో ఆలోచించడం మొదలుపెడతా రెంతమందో. లేదా, వీటిని దేవుడికి వదలేసి ఉన్నవాటితో తయారౌతారు. రంగంమీదికి వచ్చే సరికి వేశింది ఆవేషమని తమకూ, ప్రేక్షకులకూ అర్థంకాకుండా మట్టుకు చేస్తారు. ఈకుర్రవాడు ఎన్నిరోజులముందరో తనవేషాన్ని ఆలోచించేవాడు. పర్షియన్ కోర్టు ఫూలుదుస్తులు, అతిజాగ్రత్తగా ఊహించి, పరిశీలించి, తూచి, ఆశరుకు నమ్మి, కట్టించుకొన్నాడు. ఇంతశ్రద్ధాభక్తులతో తనవేషాన్ని భజించేటప్పుడు ఎవరికి ముద్దు రాదు, ఎవరిహృదయము కరవళ్లు దొక్కదు?

ఇదే విధంగా యింతకన్న అతిసూక్ష్మ విచారణతో 'అనసూయ'లో కష్టువాడి వేషం తయారైయ్యే

వాడు. వేళ్ల వంకరటింకరలదగ్గరనుంచి, ఆ దుర్గంధపు పుండ్ల ఆకారమువరకు, నడకలోను, ముఖభావాలలోను, సకరుణంగా, అతిస్వాభావికంగా ఉండేవి. నన్నెప్పుడూ కుష్ఠుజబ్బునుగురించి అడిగియుండలేదు: వీడి కీచాకచక్యం ఎలా పట్టుపడిందీ నా కర్థంకాలేదు. వీడిపుట్టుకలోనే కల్గియుండాలని ఎప్పుడు అనుకుండేవాణ్ణి. ఏదైనా క్రొత్తవేషం యిస్తే వెంటనే వాడి కండ్లెదుట ముందుగా తా నావేషంలో ఏలా వుండేది, వుండబొయ్యేది, నమ్మకంగా, తీర్చినట్లు, కనపడేది. దాన్ని వెంటనే ఒక ఛాయాపటం తీసి తన హృదయంలో పారేశేవాడు. తర్వాత దాని కావలసిన తృణాలదగ్గరనుంచి భిణాలవరకు, జాగ్రత్తగా, పట్టుదలతోను, భక్తితోను, సేకరించేవాడు. దానిఫలితము యేలా పరిణమించేదీ ప్రేక్షకులకు చాలామందికి విశదమైన విషయమే.

ఇదంతా తలచుకునేసరికి నాకు "పూర్వ రామవిలాససభ" రోజులు జ్ఞాపకమువస్తున్నయి. సందర్భం అది కాదు కాబట్టి దానిని గురించి వ్రాయను. దాని మొదటి అవస్థ "పూర్వ" లేక "అపూర్వరామవిలాససభ";— రెండవది, బలపతిరాయ, సుందరరామయ్యగార్లు మానుకొన్నతరువాతది, "ఉత్తరరామవిలాససభ";—మూడవది, శిథిలమైన తర్వాత కొన్నాళ్ళకు పుట్టింది, "ఉత్తరోత్తర రామవిలాససభ." "ఉత్తరరామవిలాససభ" రోజుల్లో పైకి వచ్చిన నాటకం 'కన్యాశుల్కము'. దాంట్లోనే వీడు అభినవరామప్పపంతులై కీర్తి పొందాడు.

అసల్లోనే, అనగా పూర్వరామవిలాససభరోజుల్లోనే, గద్యనాటకాలు పైకి తెద్దామని, లేకపోతే వాటిని వ్రాయిద్దామని, 'మృచ్ఛకటిక', 'ముద్రారాక్షసము' మొదలైన సంస్కృతనాటకాలు సాధ్యమైనంతవరకు ఆరాధిద్దామని ఉన్నతోద్దేశాలు ఉండేవి: ఆచరణలో బెట్టటానికి అవకాశాలు ఉండేవి కావు: ఏదో వెధవ అవాంతరాలతో కొట్టుకుంటూ ఉండేవాండ్లం.

ఆఖరుకు దీన్ని ఆడితీరాలని పట్టుపట్టినవాండ్లల్లో నే నొకణ్ణి. పాత్రలు నిర్ధారణచేశాం: అసాధారణ గద్యనాటకం గాబట్టి ఊరకే రిహార్సల్సు కొట్టుతున్నాం. మూడో రిహార్సల్లో రామప్పపంతులువేషగాడు బాగా అర్థముచేసుకున్నట్టు నాకు కనుపించలే. మా 'అంజి' ఒకమూలగా కూర్చొని నాఅవస్థంతా చూస్తున్నాడు. వాడికండ్లు ఓరగా చూశాను. నా కావలసినదూకుడు కనబడ్డది: వెంటనే గ్రహించాను. "నాయనా! యీలా వచ్చి కుర్చీలో కూర్చొని, దిద్దుకోరా నీమధురవాణ్ణి" అన్నాను. వెంటనే కొంచెం ఆలోచనా సాలోచనా అభినయించి, అభిష్టించాడు. కొంచెము సాగేవరకే "వీడేరా యీవేషాని" కని అర్థమైపోయింది. దీనిని వీడికి మార్చి అసలువాడికి మరొకటి సర్ది, సాగించాం.

మొదటి నాటకానికి యెనభై రూపాయిలు వచ్చినట్లు నా కింకా జ్ఞాపకం. వరుమానం తక్కువా, మాకు ఉత్సాహము ఎక్కువాగా యుండే నాటకం యిది. హాలు పూర్తిగా నిండిపోయింది: రక్తిగాను, జయప్రదముగాను నడిచింది, మొదటిసారి అనకుండా. రామప్పపంతులు వెంటనే ప్రేక్షకుల నాకర్షించేశాడు. ఇక మధురవాణిసంగతి వేరే చెప్పాలా? మా స్థానంవారి చిన్నవాడు తన నాట్యకళాకౌశలానికి అఖరు మెరుగు దిద్దేశాడు. రాను రాను యీనాటకం ఆంధ్రప్రేక్షకులో కాన్ని యెలా ఆకర్షించిందీ, తేటతెల్లమైనవిషయమే గనుక, నేను ఎక్కువగా వ్రాయక్కరలేదు. ఎప్పుడూ యిద్దరూ ఒకరి నొకరు మించాలని దూకేవారు నాటకంలోకి. మొదటిసీనుతోనే ఉడాయించేవాణ్ణికనక, వెంకటేశంతో, మామగారియింట్లో నాబుచ్చమ్మభాగవతంలో కొట్టుకుంటూ ఉండేవాణ్ని. అయినా నిజమైన ప్రేమ మామధురానికే ఉండేది గనుక, విమానం ఎక్కి వచ్చి, సీనులచాట్నుండి గుటకలు మింగుతూ, వీండ్లిద్దరినీ చూచేవాణ్ని. "తీరిపోయిందారాయో, యేం జేయమంటారు నన్ను". కసితీర యీనియోగప్పంతులు అవస్థ చూసి చూసి బిగ్గరగా సంతోషించేవాణ్ని. కాని 'గాడిద' సీను మొదల్లో మధురం తాంబూలము యిస్తూన్నప్పుడు వీడు కాళ్లు ఊస్తూ రాగం వెల్లికిరిసిపొయ్యేటట్టు రక్తి రసం కుప్పించేటప్పుడు నాకు "నిజంగా దీనికి వీడిమీద కూడా ప్రేమ గుదిరిందా" యని భయమేసేది. ఆఖరుకు సౌజన్యారావుపంతులింట్లోకి వచ్చి నామధురం నన్ను

బయటపెట్టి, కొత్త ప్రపంచాన్ని చూపించేవరకు, యీవిధంగానే యుండేది నాకు.

గిరీశాన్ని వదిలించుకొని ముచ్చట దీర వీడ్ని మళ్లా చూస్తాను. బ్రహ్మచార్రైనా ఆరితేరిపోయిన రసికుల్ని మించిపోయ్యేవాడు, ఆ అకు లందుకొనే సీనులో: ఉత్తరంలో 'గాడిద' అని చదువుతున్నప్పుడు, మధురం విరగబడి నవ్వేటప్పుడు, వీడు చూపించే దేశెతనం, అమాయికత్వం వర్ణనాతీతం——.

"వెండిగిన్నెకోసం మొచ్చాను" అంటే, "తీసికెళ్లు" అని వీడు వెంటనే, అదేస్థాయిలో జాణతనంతో అనే టప్పుడు ప్రతినాటకానికి గొల్లుమని చప్పటలు యిచ్చే వారు. గిరీశంచేత నెత్తిమీద దెబ్బ తిన్నతర్వాత హనుమంతుడంత యెగిరేవాడు; నియ్యోగపుడా బుట్టిపడి పోతుండేది. వీడి "డేమేజీలు", "కోర్ట్లు" మరపురావు, బాబూ, మరపురావు! ఉన్నది తిని, ఊసుపోక; అఖండ వైప్రివేట్లుగిరి చలాయిస్తూ; శాఖాచారం, మర్యాదా అని నలభై యేండ్లుపై బడ్డ నెత్తిమీదికి వచ్చినా, భోగంటూం పనోక త్తెను తగిలింపించుకొని; యింటా బయటా రోసి; మీసం మెలేస్తూ; పయికి పటారం లోపల లొటారంగా యుండే ఆరువేలతనం, వీడు బాగా గ్రహించాడు ఆ నల్లలాంకోటు, తలకడ్డ, మీసం, కిర్రుచెప్పులు ఎవ్వరికీ మరపురావు. చుట్ట చుట్టడం లోను, మణీబాక్సులోనిడబ్బు తీయటంలోను లక్షభావాలు కుప్పించే వాడు. "శ్మశానంపాట" వినేటప్పుడు సింహావలోకనంలో, "ఒకఅక్క ఉంది; అది యెప్పుడూ నా గుమ్మము మీద అడుగెట్టలేదు" అనుకొని లింగదేహానికి పెట్ట తిగిలే టప్పుడు అతిచక్కగా అభినయించేవాడు. వీడిరామప్పంతులువేషాన్ని గురించి యింతకంటె వ్రాయక్కరలేదనుకొంటాను. ఈవేషం ఒకటే చాలు, వీడికీర్తిఎప్పుడూ చాటుతుండడానికి.

"మాష్టరు అంజి" అని ఎలా వచ్చిందని అడగ్గలరు. ఒకప్పుడు బందరు నాటకాలకని మాసభ వెళ్ళినప్పుడు వీడికాశలాన్ని మెచ్చి నాస్నేహితులు ఉబ్బూరి రామక్రిష్ణరావుగారు యీనామకరణము చేశారు. తర్వాత రాను రాను మాకూ, ఆంధ్రలో కానికీ అదే అలవాటయిపోయింది. ప్రతివాడు "మాష్టరు అంజి, మాష్టరు అంజి" అనేవాడు కాని యింటిపేరు మరచిపొయ్యారు: యింటిపేరు 'తంగిరాల', వీడిపేరు 'ఆంజనేయులు'.

తర్వాత కొన్ని సంవత్సరాలకి కొంతమంది స్నేహితులం కలసి "శ్రీనాట్యసభ" స్థాపించాం. వీడే దానికి నామకరణం చేసింది. అసల్లో తరచూ 'కన్యాశుల్కము', 'కంఠాభరణము' 'ప్రతాపరుద్రీయము' ఆడేవారం. మా సభకని వీడు చేసిన కృషి, వీడు పడిన శ్రమ నే నెన్నడు మరవలేను: మాసభికులు వీడిఋణము తీర్చుకొనేది గాదు, తీరేది కాదు. 'కంఠాభరణము' నాటకంలో సుబ్బలక్ష్మి వేషము అతిస్వాభావికంగా యుండేది. వేషంలో వీడిని పోలిన వెధవావిడ్ని నే నొకమారు చూశాను. వీళ్లిద్దరికి దేనిలోను భేదం కనుపట్లేదు,——నడకలో సహా. "ఇదేమి ఘోరంరా" అంటే, "ఆవిడ్ని చూశే అంతా తయారైనాను" అన్నాడు.

పైన చెప్పిన నాటకాలు గాక, అప్పుడప్పుడూ, రాఘవాచారిగారు బెజవాడ వచ్చి నాటకాలు ఆడినప్పుడల్లా యేవో కొన్ని వేషాలు మాసభికులు వెళ్లి వేయటం ఆచారమైపోయింది. అప్పుడు ఒకమారు ప్రహ్లాదనాటకములో పాములవాడివేషం వేశాడు. నాజన్మలో అలా తయారైన వేషాన్ని నేను చూడపోను. తలగుడ్డ, గోచీ, నాగస్వరంబుర్ర, పాకళ్లు, నడకలు, నిజమైన యెరుకలవాడ్ని అనుకరించినవి. ఫోటో తీయించి ఉంచుదామనుకొన్నాను. యెందుకో అశ్రద్ధ అయిపోయింది. అకాలమరణం అని తెలియలేదు.

ఫిఫ్తుఫారం (fifth form) వరకే చదివినప్పటికీ, 'Hamlet'|లో ఒకమారు రెండో (Grave-digger) వేషం వేశాడు; కొత్తయినప్పటికి Irving Shakes-peare లో బొమ్మలు చూచి వేషం తయారుచేసికొన్నాడు. ఉచ్చారణ, భావప్రకటన అతిరమ్యంగా కుదిరిపోయినయి. అందరూ, "Alround actor; వీడు మీకు, మీసభకు ఆభరణం" అన్నారు.

వేషంలోనుంచి వేషంలోకి మారటం వల్లేరు మీద బండినడకే వీడికి. ప్రతాపరుద్రీయంలో యెన్ని వేషాలు వేశేవాడో, యెంతతొందరతో, చాకచక్యంతో మారేవాడో అందరికీ తెలిసినసంగతే. ఒకటిరెండుమార్లు మొదటిసీనులో రామప్పంతులు వేషం మార్చుకొని, అగ్నిహోత్రావధాన్లు భార్య వెంకమ్మగా వెంటనే సీనులోకి తయ్యారైయ్యేవాడు. వెంకమ్మ వేషగాడు అప్పుడప్పుడు ఎగగొట్టేవాడు. ఆ కొరత ఉండేది గాదు. ఇంతస్వల్పకాలములోనే పెద్దబొట్టు పెట్టుకొని, చీర కట్టుకొని, అతివినయంగా, కూరలు తరుగుతూ కూర్చొని పాతివ్రత్య ముట్టిపడేటట్టుగా అభినయించేవాడు. మళ్లా నిమిషాలమీద రామప్పంతులుగా మారేవాడు. ఇప్పటికీ చాలామంది ప్రేక్షకులకు యీ "అవాంతరపు వెంకమ్మ" మాఅంజే యని తెలియదని నానమ్మకం.

ఒకసారి ప్రతాపరుద్రుడు, పేరిగాడు; తర్వాత కొన్నిసార్లు పేరిగాడిపాత్ర అనన్యసామాన్యంగా నటించాడు. వేషంరీతే మార్చి కొత్తపోకడలు పోయ్యాడు. కొత్తఅర్థాలు తీశాడు. కొత్తభావాలు విశదీకరించాడు. రాజువేషంలో చెవికి ఒక కాడలాంటిఆభరణం తయ్యారుచేసి పెట్టుకున్నాడు. ఒక్క దానితోనే ప్రతాపరుద్రుడనవచ్చు. "ఎప్పుడు చేశావురా దీ"న్నంటే, "సంవత్సరమైంది. యీవేషం మీ రెప్పుడో నాకకస్మాత్తుగా తగిలిస్తారని నాకు తెలుసు" నన్నాడు. ప్రతి వేషానికి, అంతెందుకు, ప్రతి ఆకర్షించేవస్తువుకు, స్త్రీకి సవరో, యేదో ఒకటో, తప్పితే రెండో సుందరతనామైనట్టియు, రసోత్పత్తినిచ్చేటట్టియు ఆభరణములో, కొన్ని నెలవులో ఉంటాయి. వాటిని తీసివేసి గాని, మూసివేసి గాని చూస్తే జీవరసం పోయినట్లుగా మనకు తేటతెల్లముగా కనబడ్తుంది. ఉదాహరణలు ఎన్నియైనా యివ్వవచ్చు. ఎంతో గొప్పనటుడైతే గాని వీటిని పసిపట్టటం కష్టం. "వసంతసేన వేషం వేస్తావురా అంజీ" అని అడిగితే, తాను కొంచెము పొడుగు, లావు తక్కువ అని, సరియైన విగ్గు, చీరె దొరకటం కష్టం అని, సొమ్ములు తయారు చేసుకొనే సరికి ఆరునెలలు పడుతుంది అని, మిగతావిషయాలకు ఏమి భయము లేదని ఒకమారు చెప్పాడు. ఎంత చిన్నవేషమైనా గొప్ప పరిశీలన చేసేవాడు. చాలాసార్లు యితరులకు పరిశీలించిపెట్టేవాడు. 'రోషనార'లో వీడి దావూద్ వేషం చూస్తే వీడి జాగ్రత్త బోధపడుతుంది.



మాస్టరుఅంజి:
'రోషనార' నాటకంలో 'దావూద్' పాత్ర:
('రోషనార'ను చూసినప్పుడు) "హేడ్యాడ్ వస్తున్నాడు."

వీడికళాకౌశలాన్నిగురించి ఎంతైనా చెప్పవచ్చు. కాని యిప్పటికే చాటభారతం అయిందని భయం వేస్తుంది.—అన్నట్టు వీడిజీవితం అభిమన్యుడిని తలపుకు తెస్తూంది.

కుర్రవాడైనా అతిమానుషం కలవాడు. జంకు గొంకు లేదు. నిరుపేదవాడైనా ఎవరినీ దేనికీ దేబిరించే వాడు కాదు. పండ్లు బిగపట్టి, చిత్తం చెడసకుండా ఎన్నికష్టాలైనా పడేవాడు. రెండురోజు లన్నము దిన కుండా ఉన్నా మా కెవ్వరికీ తెలిసేది కాదు: కాని నాస్నేహితులు డాక్టరు చంద్రమౌళి సత్యనారాయణ రావుగారు కనిపెట్టి, తగినది చేస్తూయుండేవారు. వీడి నోటిగుండా ఎప్పుడూఅబద్ధం అనేది నే నెరుగను. నమ్మకం విశ్వాసంలో వీడితర్వాతనే యెవరైనా. దేనికైనా, పైసాలతో సహా లెక్క అప్పజెప్పేవాడు. కష్టపడనిదీ కానీ డబ్బైనా హేయం అనేవాడు. ఆకలిబాధ—సంసారబాధ—పడేటప్పుడు రెడ్డిగారి 'ఉమ్రాఖయ్యాం'లోనిది "అంతము లేని యీ భువన మంత పురాతనపాంథశాల" అనేపద్యమూ, కొడవటిగంటి సుబ్బయ్యగారి 'భిక్షువు'లో "భువిని గల సర్వవస్తువుల విడిచి దండము ధరించు జడదారి నేను రాత్రి యేమి దివంబేమి రాజమార్గమేమి శ్మశానవాటిక యైన నేమి నాకు" అనేపద్యమూ గాంభీర్యమైన గద్గదికతో చదివేవాడు. నిజంగా నాపంచప్రాణాల్లో ఒకడు వీడు: వీడు లేని కొరత నాలోను, మాసభలోను ఎప్పుడు కనబడుతూ ఉంటుంది.

వీడు పెండ్లి జేసుకోలేదు. నే నెప్పు డడిగినా, "యిరవైయొనిమిదవయేట మరణం నాకు" అనేవాడు. వీడినమ్మకము అర్థమైయ్యేది కాదు. ఎవడో కేరళపక్షిగాడు చెప్పాడు అనేవాడుపైగా. ఎగతాళిపట్టించేవాడ్ని. యీరాత్రి నన్నే ఎగతాళిపట్టించాడు. లగ్ననిశ్చయము అయిన వీడి పెద్దమేనమామ కూతురు సంబంధము ఆరు సంవత్సరాల్నాడు వీడు విఘాతం చేశాడు. 'రేపు'అనగా చెన్నపట్నం పారిపోయాడు: "నీపిల్లను చేస్తే వెధవరాలవుతుంది, యిరవైయొనిమిదవయేట పోయేవాడ్ని, నామాట నమ్మ"అని మేనమామతో చేతులుపట్టుకొని బ్రతిమాలుకొని ఏడుస్తూ చెప్పాడట. యీపూర్వగాథ ఆయనగారు నాతో చెప్పుతున్నాడు: ఇంతలో యింట్లో ఘొల్లుమన్నారు; లోపలికి పొయ్యేసరికి అంతా అయిపోయింది.

వీడికని యిరవై రోజులు శ్రమదమాలుపడి అయాచితంగా తనకాళ్ళన్నంతా ధారపోసిన 'రాజు' అనే దక్షిణాదివైద్యుడు యీరాత్రి రాలేదు. వీడిముఖము చూడడానికి భయమువేసిందట.

ఆఖరుమాపు చూద్దామనుకొన్నాను. "వెళ్లుతున్నా అండీ!" అనబోయ్యాడు: ముఖములో కళ యేమైనా తప్పితేగా! చిత్తాన్ని బిగబట్టే యీశుచ్ఛరీరాన్ని వొదిలాడు: అదృష్టవంతుడు.

దీనిని యిక వ్రాయటం ఆపివేస్తాను. ఆకాశంలో నిండుచంద్రుడేమో పరుగెత్తుక పోతున్నాడు. వాడేమో ఉత్తరానికి————.

శ్రీరామ, రామ. ఓమ్ శాంతిః శాంతిః.

---

# నాటకాల ఉత్తరం

"The ignorance of the actor is only to be surpassed by the ignorance of the audience."—T. Raghavachary.

"నటకుల తెలివిమాలినతనాన్ని మించగలిగింది మళ్లీ ప్రేక్షకుల తెలివిమాలినతనం ఒక్కటే."—టి. రాఘవాచారి గారు.

మా బావకు నాటకాలంటే మా పెద్దసరదా. అతని సరదాకు తగినట్టు, ఆమధ్య అతిడు

## ప్రతివాదిభయంకరం రంగాచార్యులుగారు

క్రిస్టమస్ రోజుల్లో మదరాసు వచ్చి దిగిన సమయంలోనే ఆంధ్రమహాసభవారి నాటకాలుకూడా కలిసివచ్చాయి. 31 వ తేదీ నాడు నాటకం చూచి వచ్చాడు, మర్నాడు ఉదయం ఎక్స్‌ప్రెసులో మళ్లీప్రయాణమైనాడు. నాటకాలనుగూర్చి సావకాశంగా ఒక్కనాడూ నాతో మాటాడిందే లేదు. కాని అక్కడకు పోయినతర్వాత, ఇక ఉండబట్టక కాబోలు, నాకొక నాటకాలఉత్తరం పారేశాడు. అందులో వ్రాసిన యీక్రింది విషయాలన్నీ ఆనాటకాల నాలుగురాత్రల్లో అప్పు

దప్పాను తాను ప్రేక్షకులనుండి నేర్చుకున్నాట్ట. ఆమాట లను బట్టీపట్టి మరీ వ్రాశా డనుకొంటూ నాను.

*　　*　　*

"ఎవరండీ స్వామీ ఆయన ?"

"రాధాకృష్ణయ్యగారు."

"అది కాదు. అద లెవరని."

"భీష్ముడు."

"అంతేః?"

*　　*　　*

"(రంగస్థలంమీదనుంచి) అతివా దాపగ నేల... బింబాధరా."

"వన్స్‌మోర్."

"ఉండు. ఉండు. ఉండవయ్యా!"

"ఏం ఉండాయ్యా?"

"మళ్లీ ఎట్లా పాడతాడయ్యా?"

"దమయంతి నలుడురూపం పోల్చుకొని లోప లికి చక్కాపోయిందయ్యా అప్పుడు. మళ్లీ వన్స్‌మోర్ విని, బయటికి వచ్చి, నలుణ్ణింకొకసారి పరకాయించి వెళ్లిందా మరి?"

"ఏమిటిదయ్యా యిది? బాగున్నప్పుడు కాక పోతే మరెప్పుడు పాడుతా డంటా!"

*　　*　　*

"ఏమిపాటలో! 'నీలవేణీ వాణీ శారదా'. ఏంపా డేశిందయ్యా? ఇదుగో చూడు, ఇదీ పాట. ఆఁ...... 'నీలవేణీ వాణీ శారదా.'"

"ఉశ్. ఉశ్. ఉండవయ్యా. అక్కడ స్టేజి మీద ఎవరో యేమిటో చెబుతున్నారు విననీవయ్యా."

"రాఘువాచారి మంచి ఏక్టరట కాదూ."

"(ఆక్షేపణపూర్వకంగా)ఆ. గొప్పఏక్టరే. ఆయన నోరు విప్పిందే పాట."

*　　*　　*

"తోశేశారు. తోశేశారు."

"ఏమిటి? ఏమయిం దేమిటి?"

"కలిపురుషుడూ లేదు; జూదమూ లేదు ఒక్క సారి తోశేశారు అడవిలోకి."

'ఎరక్కపోయి కొన్నాం సీజను,రూపాయిన్నర!'

'ఇదంతా యెందుకో తెలుసునా? ఆ బెల్లంకొండ సుబ్బారావుని యెల్లాగయినా స్టేజిమీదికిలాక్కొద్దామని'

'ఉండూ ఉండూ,అక్కడ వాళ్లేమిటో మాట్లాడు తున్నారు......నలుడూ దమయంతీ ఉద్యానవనంలో నోయి.

'పాపం తోశెయ్యలేదురా.'

*　　*　　*

(రంగస్థలంమీద వియోగపుడైన నలుడు.) 'హా! ఈ పాము నన్నెంతగా కరచినది?'

'అదుగో బాహుకుడు.'

'బెల్లంకొండ......'

'రాఘువాచారి.'

'సుబ్బారావురా.'

'రాఘువాచారిరా.'

'అబ్బ! ఏంగొడవయ్యా యిది!'

*　　*　　*

'ఏమిటిది కద?'

'............ ..'

'వా డిప్పుడే బోంచేసి వచ్చాతే యింటికాడనుండి. అందు కదుగుతుండా.'

'చిత్రనళీయం.'

'అదుగో, ఆ యనే ఒకవకీలు. వకీలు.'

'..............'

'ఆంధ్రమాసబ మెంబరు.'

'..............'

'బలే తమాసాగాళ్లే'

'ఇస్సు. ఏమిటయ్యా, నన్ను వదలవింకా!'

*　　*　　*

'ఉత్తరాంది నీపాటలూ పద్యాలూ పాడితే ఊరు కుంటారటండీ?'

'ఈపద్యాలన్నీ (ప్రహ్లాద నాటకంలో పాడేవి) చాలాభాగం భాగవతంలోవే నాయెను. ఉత్తరాదిదీ పోతన్న భాగవతమే, ఇక్కడిదీ పోతన్న భాగవతమే మరి.'

'సరే కాని, మన్లో మనమాట, రాఘవాచార్లుగా రంత గొప్ప ఏక్టరంటారే, ఏంఏక్టరు చెప్పండి?'

'ఏం? మీకు నచ్చలేదా యేమిటి? నిజమే లెండి, చాలామందికి రాఘవాచార్లుగారు నచ్చరు.'

'ఏమిటో, ఏమిపాటో, ఏమిఏక్టరో. మన ఉత్తరాదినయితేనా, జమాయించి పాడరూ? ......అరెరె. ఆబండబ్బాయిని చూడ్రా—సీమసుద్దే తినేస్తున్నాడ్రా. అహహాహా హాహాహా. బలేఏక్టర్రా.'

* * *

ఇంకా ఈలాంటివి చాలా శేర్చుకున్నాట్ట మా బావ నాటకాలు చూచే సమయంలో. 'అన్నీ జ్ఞాపకానికి రావడం లేదు ప్రస్తుతం. జ్ఞాపకం తెచ్చుకొని మరొకసారి వ్రాస్తా' నన్నాడు.

---

# ప్రశ్రయము

కె. అన్నమరాజశర్మ గారు

ప్రణయినీ! అమృతాంచిత ప్రథల నీను
నీ కపోలంబులందున నృత్యమాడు
రక్తిమాంకూరముల రాగ రసము చింద
విడుతునే నేడు ముద్దుల గడుగకుండ?

రామణీయొందుపాంత గాత్రులందు
మాధవీలతాగృహాంతముల మాటు నిల్చి
వీణ సవరించి భావాతివేలమైన
ప్రేమగీతంబుఁ బాడఁగా వేగ రమ్ము.

బొండుమల్లెల తావులు నిండుకొనిన
కొండ కోనలఁ జయింప కోర్కె గలదొ
వనకురంగివిలోచనా! భయము దక్కి
రమ్ము నాతోడ ప్రణయసామ్రాజ్య మేల?

చెలులు తీరంచు నుంతయుఁ జింత వదు
తరళ నేత్రల హరిణకాంతలు నిరంత
రంబు నిచుఁ గూడి మోహనారణ్యసీమ
లీలమై నడతెంత్రు శంపాలతాంగి!

లేఁతమామిడి కొమ్మల కూఁత లిడుచు
గండుకోయిల జపియించు గానమునకు
కల్పనముఁ జేసి యర్థముల్ కవిని గాన
పాటలాధర! వినిపింతుఁ బ్రతిదినంబు.

పవలు రేలకు భేద మేర్పడక శ్రావ్య
రాగములఁ జిల్కు సెలయేటి రావములరు
రమ్యసికతాస్థలంబుఁ జేరంగ రమ్ము;
అబల! వచియింతు నందు రహస్య మొండు.

"మల్లెపువ్వులు"

# కన్నంబాడి-టిప్పూ ధర్మనిరతి

టి. రంగాచార్యులుగారు

కన్నంబాడి ఆనకట్టను జూచుటకు కొందరు మిత్రులము కలిసి యేగియుంటిమి. అచట ఆనకట్టను, దాని నడిమిభాగమున నున్న శ్రీకావేరీ దేవతావిగ్రహమును, అందుండి ప్రవహించుచున్న కావేరిజలమును, క్రిందిభాగమున నేర్పఱుపఁబడియున్న కృతకజలపాతములను, అప్పుడప్పుడే యభివృద్ధిదశలోనికి వచ్చుచున్న కృత్రిమారామములను, గావేరిలో వెల్లువలు మితిమీఱి వచ్చినయెడఁ దమకుఁదామె ద్వారకవాటములు తెఱచుకొనవీలగునట్లు నూత్నముగ నిర్మింపఁబడుచున్న యుపకరణవిశేషములఁ జూచి యబ్బురపడుచు నీ నిర్మాణములకుఁ గారణకర్తృభూతులగు శ్రీ విశ్వేశ్వరయ్యగారి కీర్తిని భావించికొనుచు ఆనకట్టకు ముందుభాగమున నున్న యొక గృహమున విశ్రమించితిమి.

మే ముండిన యాచోట ఆనకట్ట నిర్మాణక్రమమును దెల్పు ఛాయాచిత్రములును, కావేరి యుత్పత్తి మొదలుకొని సాగరసంగమము వఱకును గల భూభాగమును జూపు నంటిచే నేర్పఱుపఁబడియున్న "భూ వివరణఫలకము" నుండెను. అందే యొక్కభాగమున ఉరుదుభాషతోఁ జెక్కఁబడిన యక్షరములు గల స్ఫాటిక శిలాశాసనమును, దాని యాంగ్ల కర్ణాటకానువాదకశిలలు నుండెను. ఈ శాసనమువలనఁ గన్నంబాడి యానకట్ట నిర్మాణప్రయత్నము నిన్న నేఁటిది కాక టిప్పూసుల్తాను కాలములోనే జరిగినదని స్పష్టపడెను. అట్టివారి శంకుస్థాపనశిల కన్నంబాడి యానకట్ట కట్టుటకుఁ బ్రారంభింపఁబడిన కొంతకాలముననే యా సమీపముననే దొరకినదనియు దీనిని టిప్పూ స్వంతముగ వ్రాయించెననియుఁ జెప్పిరి. ఈ యంశమును ధ్రువపఱచు ఛాయాచిత్రము గూడ నందుఁ గననయ్యెను. దానిని జదివినపిమ్మటఁ గలిగిన యబ్బురమునకు మేర లేదయ్యె. టిప్పుకూడ నిట్టి యుదారచిత్తుఁడా యని యాశ్చర్యముకలిగించినయా శాసనముయొక్క మూలమిది.

(యథామాతృకము)

'(కరుణాళువాద భగవంతన హెసరినల్లి స్థాపిత వాదుదు)

1794 A. D.

పైగంబర్ మహమ్మదర జన్మదినదింద ప్రారంభవాద సౌరమానలెక్కయ సావిరద ఇన్నూరు ఇప్పత్తొందనెయ సంవత్సరవాద షాదాబ్ శుభవర్షదతకిమాసద ఇప్పత్తొంభత్తనెయ తేదీ యాద సోమవార శుభదివస సూర్యోదయాత్పూర్వ అరుణోదయకాలదల్లి శుక్రగ్రహ బలయుక్తవాదవృషభలగ్నదల్లి భగవంతనఛాయాస్వరూపరాద హజరత్ టిప్పూసుల్తానరాదనావు ఇష్టార్థప్రదాయకనాద భగవంతనకృపె యిందలు పవిత్రవాదకలీఫ్ పదవియల్లిద్దు జగత్తిగె సార్వభౌమప్రాయరాగిద్దపైగంబర్ మహమ్మద్ ప్రేరణారూపవాద దివ్యసహాయదిందలు రాజధానిగె పశ్చిమదిక్కినల్లి కావేరినదిగె అడ్డవాగి చిరస్థాయియాద ఆణెయన్ను కట్టిసలు శంకుస్థాపన మాడిద్దేవె. ఈకార్యవు ప్రారంభవాదుదు నమ్మింద. ఇదు పూరైసువంతె అనుగ్రహిసువుదు భగవంతన అధీనదల్లిదె.

ఈకార్యవు ప్రారంభవాద దివససూర్యచంద్రరూ శుక్రనూ గురువూ శుభయోగవుంటాగువంతెనేరి ఫలదాయకరాగిద్దారె.

ఇల్లి నిర్మిసల్పడువ ఆణెకట్టెయు సర్వేశ్వరనాద భగవంతన అనుగ్రహదింద ధ్రువ నక్షత్రమండలదోపాదియల్లి శాశ్వతవాగినిల్లలి. జగన్నియామకనాద భగవంతన అనుగ్రహదింద దొరకిరువ నమ్మ సర్కారవు వెచ్చమాడిరతక్కంథ స్వోపలక్షధనవు సహభగవత్ప్రదనేవార్థవాగియే వెచ్చమాడల్పట్టిదె. హిందె కృషియాగదెయిద్ద భూమియన్ను యావమనుష్యను వ్యవసాయమాడి ధాన్యవన్ను

గలి ఇతరబెళెయన్నాగలి బెళెయుత్తానో అంథవను
వ్యను ఈ మొదలె కృషియాగుత్తిరువ జమీనుగళరైతరు
నమ్మసర్కారక్కె కొడువతరిగె ఆయమక్కాలుభాగ
దష్టన్ను మాత్రకొట్టరేసాకు. ఉళిదభాగవన్ను భగవత్ప్రీ
త్యర్థవాగిధర్మక్కెబిట్టిదె. హొసదాగి భూమియన్ను
సాగుమాడువరెల్లరూ పుత్రపౌత్ర పారంపర్యవాగి
ఆచంద్రార్కవాగి అవరవర భూస్థితియన్ను అనుభవిస
కొండు బరబహుదాగిదె. శాశ్వతవాగి కొట్టిరువ ఈ
కొడగెగె యావమనుష్యనాదరూ విఘ్నాచరణమాడిదరె
అథవా అవన్ను తప్పిసిదరె అంథా క్రూరాత్మను పాపిష్ట
నాదసైతాననో పాదియల్లి మనుష్యవర్గక్కె శత్రువెందు
భావిసల్పడువను. అవను ఇల్లియరైతరిగె మాత్రవే అల్లదే
అఖిలజగత్తిగూ ద్రోహమాడిదవనెందు భావిసల్పడువను."

"(కరుణాళువగు భగవంతుని పేర స్థాపింపఁబడినది.)

పైగంబర్ మహమ్మద్ జన్మదినమునుండి ప్రా
రంభమైన సౌరమానశకముయొక్క వేయిన్ని రెండు
వందల తొంబదియవ సంవత్సరమైన (1794 ఎ. డి.)
షాదాబ్ శుభవర్షముయొక్క తకినెల యిరువదితొమ్మిదవ
తేదియైన సోమవార శుభదినమున సూర్యోదయాత్పూ
ర్వము, అరుణోదయకాలమందు శుక్రగ్రహబలయుక్త
మైన వృషభలగ్నమునందు భగవంతుని ఛాయాస్వరూపు
లైన హజరత్ టిప్పూసుల్తానులను మేము, ఇష్టార్థప్రదా
యకుఁడగు భగవంతుని కృపవలనను, పవిత్రమైన కలీఫ్
పదవినుండి జగత్తునకు సార్వభౌమప్రాయులైన పై
గంబర్ మహమ్మద్ ప్రేరణారూపమైన దివ్యసహాయము
వలనను, కావేరీనదికడ్డముగాఁ జిరస్థాయియైన యాన
కట్టను గట్టుటకై శంకుస్థాపన ను చేసితిమి. ఈ కార్యము
ప్రారంభింపఁబడినది మాచేత. ఇది పూర్తియగుటను
గ్రహించుట భగవంతుని యధీనమునఁ గలదు.

ఈ కార్యము ప్రారంభింపఁబడినదినమున సూర్య
చంద్రులును శుక్రుఁడును గురువును శుభయోగము కలుగు
నట్లుగఁజేరి ఫలదాయకులుగా నున్నారు.—

ఇక్కడ నిర్మింపఁబడుచున్న యానకట్ట సర్వే
శ్వరుఁడైన భగవంతుని యనుగ్రహముచేత ధ్రువనక్షత్ర
మండలమువలె శాశ్వతముగా నిలుచుఁగాక! జగన్నియా
మకుఁడైన భగవంతుని యనుగ్రహముచేత దొరకిన మాస
ర్కారు వెచ్చించిన లక్షోపలక్షల ధనముగూడ భగవ
త్పాదసేవకుఁగానే వెచ్చింపఁబడినది. పూర్వము కృషి
చేయకున్న భూమి నేమనుష్యుఁడు వ్యవసాయముచేసి
ధాన్యమును గాని మఱొకపంటనుగాని పెట్టునో యట్టి
మనుష్యుఁడును, ఇంతకుఁ బూర్వమే కృషిచేయుచున్న
రైతులును మాసర్కారుకిచ్చు కందాయములో ము
క్కాలుభాగ మిచ్చినమాత్రమునఁ జాలును, మిగిలిన
పాతికభాగము భగవత్ప్రీత్యర్థమై ధర్మార్థముగ విడువఁ
బడినది. క్రొత్తగ భూములు సాగువారందఱును పుత్ర
పౌత్రపారంపర్యముగ నాచంద్రతారార్కముగ వారి
వారి భూస్థితి ననుభవించికొనవచ్చును. శాశ్వతముగ
నీయఁబడిన యీదానమున కేమనుష్యుఁడైనను విఘ్నమా
చరించినట్లయినను, లేక దానిని దప్పించినట్లయినను, అట్టి
క్రూరాత్ముఁడు పాపిష్ఠుఁడగు సైతానువలె మనుష్యవర్గ
మునకు శత్రువని భావింపఁబడును. అతఁడిపట రైతు
లకు మాత్రముకాక జగత్తుకంతయు ద్రోహముచేసినట్లు
భావింపఁబడును."

ఏమిది? ఇతఁడు మనము చరిత్రములలోఁ జదివి
నట్టి టిప్పుకంటె నితరుఁడా యేమి? చరిత్రములలోని
టిప్పు నిష్కరుణుఁడు, ప్రజాకంటకుఁడు. అన్యమత
నిష్కారణవిరోధి. క్రౌర్యమున నౌరంగజేబువంటివాఁడు.
శాసనమువలనఁ దెలియుచున్నట్టి టిప్పన్ననో మహాకరుణా
ళువు. ప్రజాసేవాతత్పరుఁడు. అన్యమత పద్ధతుల గౌర
వించువాఁడు. అత్యంత వినయాన్వితుఁడు. కేవల భగవద్భ
క్తుఁడు. కాని టిప్పు 1782 వ సంవత్సరమునుండి రాజ్య
పాలకుఁడుగ నుండుటచేతను, దాను రాజ్యమునకువచ్చిన
పండ్రెండు సంవత్సరములకు రాజధాని సమీపప్రదేశము
ననే సావధానముగఁ బరిశీలించి చర్చించి యానకట్ట
నిర్మాణమున కుద్యుక్తుఁడగుట కవకాశముండుటచేతను
పై శంకుస్థాపన శిల యాతఁడు నాటినదే యనుటలో
నించుకంతయు సందియములేదు. గుణాగుణచర్చకుఁ
గడంగినచోఁ జరిత్రపు టిప్పునకును, శాసనపు టిప్పునకును
హస్తిమశకాంతరము గలదు.

"ఈ కార్యము ప్రారంభింపఁబడినది మాచేత. ఇది పూర్తియగునట్లనుగ్రహించుట భగవదధీనమునఁ గలదు.

* * * * *

ఇతఁడు రైతులకుమాత్రముకాక జగత్తునకంతయు ద్రోహముచేసినట్లు భావింపఁబడును."

అనువాక్యములు స్వర్ణాక్షరములతో లిఖింపఁబడవలసినవి కదా! ఏవీ చరిత్రములలో నిట్టియంశములు. హిందు మహమ్మదీయ ద్వేషవ్యాజమున మహమ్మదీయప్రభువులకు లేనిపోనికళంకముల నతిశయోక్తులతో నంటఁగట్టి పరస్పర భేదభావముల హెచ్చించుటకంటె నాచరిత్రాంశములకు వేఱొట్టిఫలితముకలదు? తాను మహమ్మదీయుఁ డగుటచేత టిప్పుసహజముగ స్వమతప్రేమగలిగియుండవచ్చును. కాని యంతమాత్రముననే యతనికి నీచకృత్యములొనర్చుట నంటఁగట్టుటయా! నిష్పక్షపాతముతోఁ బరిశీలించినచో టిప్పువలె నెందఱు మహమ్మదీయరాజుల నిష్కళంక చరిత్రములఁజాటుదృష్టాంతము లెన్ని లభింపఁగలవో!

---

## నీదర్శనము, నీసేవ

సయ్యదు బదరుద్దీను సాహెబ్ గారు

నీపాదయుగళంబు నాబాష్పములఁ గడిగి,
నీకు నుపహారముగ నాయాత్మ నర్పింతు;
　　నిన్ను సేవింతు నోదేవ, నీవు
　　గైకొనుము నేఁ జేయు సేవ.

నీకొఱకుఁ బ్రేమరస మీహృదయపాత్రలో
నుప్పొంగుచున్న దది చెప్పఁజాలనియటుల,
　　దీనిఁ బానముచేయర మ్ము; రమ్ము,
　　నాహృదయ మిదె యందుకొమ్ము.

నీదివ్యదర్శనము, నీపాదసేవనము,
అమృతభోగ్యములు, నాకఖిలభాగ్యము లవియె;
　　దర్శనం బీయ రావోయి, నన్ను
　　ధన్యాత్ముఁ జేయ రావోయి.

నీసేవయే నాదు నిజమైనజీవనము,
నిరుపమానంబైన నిండైనజీవనము;
　　నిన్ను సేవింతు నోదేవ, నాకు
　　దయసేయుమోయి నీసేవ.

---



౫. విలియం బెంటింకు ప్రభువు-రణజితసింహుడు

[“టైమ్సు ఆఫ్ ఇండియా” ఉగాదిసంచిక (1931) యందలి త్రివర్ణచిత్రమునుండి.]



౬. షాజహాను మరణము

["టైమ్సు ఆఫ్ ఇండియా" ఉగాదిసంచిక (1931) యందలి త్రివర్ణచిత్రమునుండి.]



# పునర్విమర్శనము

156

## మనుచరిత్రరచనాకాలము

కుందూరి ఈశ్వరదత్తుగారు, B.A.

'పెద్దన్న, న్యాయిజ్, లక్ష్మీనారాయణ' అను శీర్షికతో శ్రీ వెంకటరమణయ్యగారు మనుచరిత్ర రచనాకాలమును గూర్చి మఱల నేను వ్రాసిన దానికి విపులమగు విమర్శనమును వ్రాసిరి. 'ఎత్తిపొడుపు మాటలు వాదమును గెల్పింపఁజాలవు. వాదమునకు బలము నొసఁగునవి అనువగు ఆధారములు, యుక్తులును' అని విమర్శతత్త్వనిర్ణయమును గావించి, వారినీతిని వారే తమవ్యాసమునందు నిల్పుకొనలేక పోయిరి. విమర్శనమును వారేవ్యక్తిగతమును గావించిరి. వారు చెప్పిన నీతికి నేనైనను బద్ధుఁడ కావలసియున్నది.

మొదటివిషయము: పెద్దన ఆంధ్రకవితా పితామహుఁ డన్న బిరుదము మనుచరిత్ర రచించిన తరువాత వచ్చియుండునని నేను వ్రాసినది సరికాదని వారివాదము. శ్రీ వేంకటరమణయ్యగారు పెద్దన్న పెక్కుసంస్కృతాంధ్రగ్రంథముల రచించెనని చెప్పినదానిని నేనాక్షేపించితిని. మఱల నాక్షేపించవలసిన స్థితికి వారే పాల్పడిరి. పెక్కుగ్రంథములనఁగా నెన్ని? వారు మనుచరిత్రకాక మఱి మూఁడు గ్రంథములను చెప్పుకొనిరి. అందొకటి తెలుఁగు; రెండు సంస్కృతము. రంగరాట్ఛందములోని హరికథాసారమువినా, నేను వినియుండలేదనియు, నాంధ్రలోక మెఱుఁగదనియు నేను వ్రాసితిని. దానికి వీరు ప్రత్యుత్తరముగా హరికథాసారము, సత్యావధూపరిణయము, రసమంజరి గ్రంథములు పెద్దన రచించియుండెననిరి. వీరికి శ్రీ ప్రభాకరశాస్త్రిగారి వ్యాసమాధారము. శ్రీ శాస్త్రిగారు మాత్రము తద్గ్రంథములు పెద్దనయే రచించియుండెనని విస్పష్టముగా నదింపఁగలరా?

ఆముక్తమాల్యదపీఠికలో రాయ లాగ్రంథముల రచించితినని కదా చెప్పుకొనెను. శ్రీ వేంకటరమణయ్యగారు ఆముక్తమాల్యదలోని యంశములన్నియు విశ్వసనీయములని తలంచుచు, వారు తమ వ్యాసములలో రాయలకృతాముక్తమాల్యదయని పలుమాఱులు ప్రశంసించి రాయల వాక్యములు ప్రమాణములుగా సహితము గ్రహించిరి. ఆముక్తమాల్యదలోని యీక్రింది పద్యము వారెఱుంగుదురా!

"సీ. పలికితు త్ప్రేక్షోపమలజాతి పెంపెక్క
రసికులౌనన మదాలస చరిత్ర
భావధ్వని వ్యంగ్యసేవధి గాఁగఁ జె
ప్పితివి సత్యావధూప్రీణనంబు
శ్రుతి పురాణోపసంహిత లేర్చి కూర్చితి
సకలకథాసారసంగ్రహంబు
శ్రోత్రఘుచ్ఛటలు విచ్చఁగ రచించితి సూక్తి
నైపుణిజ్ఞానచింతామణికృతి
గీ. మఱియు రసమంజరీముఖ్యమధురకావ్య
రచన మెప్పించికొంటి గీర్వాణభాష
నాంధ్రభాష యసాధ్యంబె యందు నొక్క
కృతి వినిర్మింపు మిఁక మాకుఁ బ్రియము గాఁగ."

పైపద్యములో పెద్దనకు ముడిపెట్టిన గ్రంథములే రాయలు తాను రచించితినని చెప్పుకొనెను. అదికాదు; భూవల్లభుఁడు కల్లలాడుచుండెనని శ్రీ వెంకటరమణయ్యగారు పలికినచో నాకు సంతోషమే. కావున శ్రీ వెంకటరమణయ్యగారు పెద్దన్న బహుళసంస్కృతాంధ్రగ్రంథనిబంధకుఁడని వ్రాసిన విషయము కేవలమూ

పరిహాసాస్పదమైనసంగతి. ఇక పెద్దనయే ఆముక్తమాల్యద రచించెనన్న విషయము పైసంగతితోఁ బోల్పఁదగినది. శ్రీవెంకటరమణయ్యగారు వాదమునకై వ్రాసినవిషయము గాని, వీరెప్పుడును వీరివ్యాసములందు పెద్దన్న కృతాముక్తమాల్యదయని చెప్పలేదు. వారే ఆకృతికర్తృత్వమునుగూర్చి ప్రతీతిలోఁ ద్రోసివేసిరి. కాఁబట్టి పెద్దన్నకు మనుచరిత్ర రచనవల్లనే ఆంధ్రకవితా పితామహుఁడని బిరుదువచ్చినదనునది 'పిడివాదమో', 'సత్యావధూపరిణయము', 'రసమంజరి'అను పెక్కుసంస్కృతాంధ్రగ్రంథములు విరచించుటచే వచ్చెననునది పిడివాదమో శ్రీపంతులవారు సెలవిచ్చెదరుగాక!

నేనువ్రాసినదంతయుఁ జదువుకొని, దానికంతయు ప్రత్యుత్తరమీయక కొంతకప్పిపుచ్చినచో ధర్మమగునా? కృత్యాదియందు

"హితుఁడవు చతురవచోనిధి
వతులపురాణాగమేతిహాసపదార్థ
స్మృతియుతుఁడ వాంధ్రకవితా
పితామహుండ వెవ్వ రీడు పేర్కొనఁ గీర్తిన్."

అని పెద్దన్న చెప్పుకొనుట పొసఁగునా యను దానికి నేనిదివఱకే ప్రత్యుత్తరమిచ్చి కావ్యతీర్థులగు శేషాద్రిశర్మగారు రిట్టిధర్మసందేహములకు సమాధానమిచ్చిన తెఱంగెఱింగించితిని. దాని కంతకును వీరు సమాధానము చెప్పక యుండుట న్యాయ్యమా? కావున పెద్దన రచించిన మనుచరిత్ర వినా యిద్గ్రంథములేవియు లేక, మనుచరిత్ర రచించినను గాక, ఇక ఆంధ్రకవితాపితామహయన్న బిరుదు ఊరక పెద్దనకు సంభవించెనని చెప్పుట శ్రీ శేషాద్రిశర్మగారు వ్రాసిన ఫక్కిని 'యుక్తి'గాక మఱియొకటి కాదు. మనుచరిత్రవంటి కావ్యరత్నమును రచించి, ఆంధ్రకవితాపితామహ యన్న బిరుదమును సంపాదించుకొనెననుట సరసమా? ఊరకయే రెండు పద్యములల్లి సంపాదించెననుట సరసమా?

మనుచరిత్రకుఁ బూర్వము పెద్దన యితరగ్రంథముల రచించియుండఁడని నేను వ్రాసిన దానిని వారాక్షేపించిరి. కొందఱు కవులు తాము రచించిన గ్రంథములను పేర్కొనిరి కొందఱట్లు సేయలేదు. గ్రంథములు వ్రాసినప్పుడుగదా, వారట్లు పేర్కొన్నను, పేర్కొనకపోయినను! కాని యేగ్రంథములు వ్రాయనప్పుడో? నా మతముప్రకారము మనుచరిత్రకు పూర్వము పెద్దన యేగ్రంథమును రచించియుండలేదని.

న్యూనిజ్ వాక్యములు ప్రమాణములు కావా?— న్యూనిజ్ వాక్యములు ప్రమాణార్హములు కావని 'కల్యాణ కలుబరిగెలు-కృష్ణరాయలు' అను వ్యాసమునందు శ్రీ వెంకటరమణయ్యగారే వ్రాసిరి. ఏవిషయమై చర్చించుచుంటిమో, యావిషయమె 'అంత విశ్వసింపఁదగినది కాదని వారు వక్కాణించిరి. మఱియొక నెల గడచకపూర్వమే, న్యూనిజ్ వ్రాసినది సత్యమైనదనియు, ఫెరిస్తా వ్రాసినది కల్లయనియు వ్రాయుట వారికే సమంజసముగఁ జూపట్టెను. ఒక వ్యాసమునందొకవిషయము సప్రమాణము: రెండవ వ్యాసమునందప్రమాణము. అప్పటను, ఇప్పటను గుల్బర్గాలో బందీకృతులైన బహమనీ రాజపుత్త్రులసంగతియే! ఈవిపర్యాసమునకుఁ గారణము సంగీత సూర్యోదయకారుని వాక్యములు. అతఁడును న్యూనిజ్ చెప్పిన విషయమునే-సుల్తానుపుత్త్రులను చెఱసాలనుండి రాయలువిముక్తులఁ గావించెననుదానిని-వ్రాసియుండెను. అది కాదనలేము. న్యూనిజ్ వ్రాఁత సరికాదను విషయము కాలమునుగూర్చి కాని, నడచిన కథనుగూర్చి కాదు. శ్రీ కృష్ణస్వామి అయ్యంగారును, శ్రీ లక్ష్మణరావు గారును గుల్బర్గాదండయాత్ర 1514 సంవత్సర ప్రాంతముల జరిగియుండెనని చెప్పిరి. వారి వాక్యములే ప్రమాణములుగాఁ గొని, యావిషయములో వారితో నేకీభవించి, మనుచరిత్ర రచనాకాల నిర్ణయమునకుఁ బూనుకొంటిని.

ఆముక్తమాల్యదలోఁ గళింగ దిగ్విజయానంతరము కల్బరిగెనగరమును జయించితినని రాయలు చెప్పుకొనెను. దాని తర్వాత యేదులఖానోగ్ర కపాలమర్దన ప్రశంసను వ్రాసుకొనెను. శ్రీ లక్ష్మణరావుగారి మతముప్రకారము, శ్రీ వెంకటరమణయ్యగారి యభిప్రాయము ప్రకారము ఆ విషయము 1512 లోనో, అంతకుపూర్వమో!

దాని ప్రకారము కళింగదిగ్విజయమును, కల్బరిగెదండయాత్రయు, 1512 సంవత్సరమునకుఁ బూర్వమే కావలెను! అది చరిత్రకు విరుద్ధము. రాయలు వ్రాఁతకన్న, న్యూనిజ్ లక్ష్మీనారాయణుల వాక్యములు ప్రమాణములా?

రాయచూరు యుద్ధానంతరము బహమనీసుల్తాను కుమారత్రయము, ఎట్లు చెఱనుండి విముక్తినిజెందిరో చరిత్రకారులు నిర్ణయింపలేరు. శ్రీ వెంకటరమణయ్యగారు 'కలుబరిగె—కృష్ణరాయలు' అను వ్యాసమునందు న్యూనిజ్ వాక్యములు సందర్భశూన్యములని త్రోసివేసిరి. 'పెద్దన, న్యూనిజ్, లక్ష్మీనారాయణ' అను వ్యాసమునందు వేదవాక్యమనిరి. కాని పైవృత్తాంత మాకాలముననెట్లు పొసఁగునో చెప్పక ఫెరిస్తా యబద్ధపు పంచాంగము నల్లెనని యొక్కపెట్టున త్రోసిరాజనిరి. ఆకాలమున బహమనీ సుల్తానునకు ముగ్గురుపుత్రులు బ్రతికియుండిరా? ముగ్గురును కారాగృహమున, దినములు గడుపుచుండిరా? ఈవిపర్యయమునకు శ్రీ వెంకటరమణయ్యగారు ప్రత్యుత్తరమిత్తురు గాక!

మనుచరిత్ర — ఆముక్తమాల్యద

మనుచరిత్ర రాయచూరు యుద్ధానంతరమే, విరచింపఁబడినచో పెద్దన తద్విజయమేల వర్ణింపకుండునని నేను వ్రాసినదానికి నన్నే సమాధానముచెప్పుకొనుమని కొన్ని ప్రశ్నలనిచ్చిరి. వారిప్రశ్నలన్నియు వాదమునకు అప్రస్తుతప్రశంసలు—రాయచూరు యుద్ధమునకుఁ బూర్వమె, మనుచరిత్రయు, ఆముక్తమాల్యదయు విరచింపఁబడెనని నావాదము ఆముక్తమాల్యదరచనాకాలనిర్ణయమును గావింపుచు శ్రీ లక్ష్మణరావుగారు, తద్గ్రంథరచనా కాలమును 11-2-1519 అని నిర్ణయించిరి. ఆనిర్ణయము శ్రీకాకుళశాసనము ననుసరించియైయున్నది.*

ఆముక్తమాల్యదపీఠికలో రాయలు, మనుచరిత్రలో వర్ణింపఁబడిన దిగ్విజయము పద్యముల ప్రథమ పురుష క్రియలను మధ్యమపురుష క్రియలుగామార్చి తానే మరల వ్రాసికొనెనుగదా! మనుచరిత్ర రచించిన తర్వాతనే కదా రాయలు ఆముక్తమాల్యదను రచించియుండవలెను! లేకపోయినచో నాగ్రంథములోని పద్యముల రాయలు తన గ్రంథములోఁ గైకొనుట పొసఁగనేరదు. కావున మనుచరిత్ర ఆముక్తమాల్యదరచనా కాలమైన 11-2-1519 తేదీకి పూర్వమే విరచింపఁబడి యుండవలెను.

ఇఁక ఆపంచగౌడధాత్రీప్రశంస.—ఈవిషయము నాదృష్టిపథమున కెక్కలేదని వారు నన్నాగతాళిసేసిరి. శ్రీ లక్ష్మణరావుగారే వారొనర్చిన కాలనిర్ణయము సరిగానుండక పోవచ్చునని చెప్పిరి "ఈకాల మిదివఱకూహించిన కాలముతో సరిపోవుటలేదు. ఈరెండుకాలములలో నేదినిజమో శోధింపవలెను" అని వ్రాసిరి. శ్రీ వెంకటరమణయ్యగారు ఈవిషయమై ప్రస్తావించి, శ్రీ లక్ష్మణరావుగారు వ్రాసిన పైరెండువాక్యములు ఏల ఉదాహరింపరైరో సెలవిచ్చెదరా! ఇది వారివాదమునకు సహకారికాదనిచెప్పి, ఆవాక్యములు వ్రాయకుండుట పాడియా!

మనుచరిత్రలోని యీక్రింది పద్యమును జూడుఁడు:

"కుకురు, కాశి, కురు, కరూశ, కోస, లాంధ్ర, సింధు, బాహ్లిక, శకాంగ, వంగ, సింహళేశ కన్యకామణి
ప్రకరపాణి ఘటితరత్న పాదుకాకలాచికా
ముకురవీటికాకరండముఖ్యరాజలాంఛనా!"

అను పద్యమున కెట్టియర్థమో.

"ఆవాడపతి శకంధర సింధురాధ్యక్షు
లరిగాపు లెవ్వాని ఖరతరాసి
కాపంచగౌడ ధాత్రీపదం బెవ్వాని
కసివారుగా నేఁగునట్టిబయలు."

అను సీసపాదముల కదియే యర్థము. కుకురు, కాశి, కురు, కరూశ, కోసల, ఆంధ్ర, సింధు, బాహ్లిక, అంగ, వంగ, సింహళదేశాధిపుల రాజకుమార్తలే కృష్ణరాయల కూడిగము చేయుచున్నప్పుడు, ఆవాడ శకంధర సింధురాధ్యక్షు లరిగాపు లేలకారు! ఇందులఁగూర్చి నేను మూనముద్ర వహించితిననియు, నేనెఱుంగనట్లు నటించితిననియు వ్రాయుట శ్రీ వెంకటరమణయ్యగారు బోధించిన విమర్శతత్త్వమునకు విరుద్ధము.

* ఈతేదికి పదునైదుదినముల క్రితమని నేను నవంబరు 1930 భారతిలో వ్రాసితిని.

రాయలు కళింగ దిగ్విజయమును ధాతుసంవత్సర పుష్య బహుళ ద్వితీయకుఁ బూర్వమె కావించి, పొట్టునూరిలో విజయస్తంభమును నెలకొల్పెనని కంజీవర శాసనములు తెల్పుచున్నవి. రాయలు పొట్టునూరిలో జయస్తంభమును బ్రతిష్ఠించి, రాజమహేంద్రముమీఁదుగా విజయనగరమును జేరి, యచ్చటనుండి కంజీవరమునకు వచ్చెనని శాసనపరిశోధకులు తెల్పుచున్నారు. వారి యభిప్రాయము నీ క్రింద నిచ్చుచున్నాను:

'Nos 474 and 533 of 1919. (18-10-1516) Para 44, Epigraphical report for 1920. 'Of these two copies of the same inscription copied at Conjeevaram give a complete list of conquests prior to Saka 1438 and contain so far as historical introduction is concerned the same information as 574 of 1902 and 196 of 1903. The second series of conquests were, that in the view to subdue the country of Kalinga, he started again for Bezwada, laid seige to the fort at Kondapalli and captured alive.............. and marched to Simhadri and after erecting a pillar of victory at Potnur, he performed certain Mahadana...and thence returned to Vizayanagar via. Rajahmundry. (Vide Para 80 for 1908—09). The King then made a religious tour to the south and halting at Conjeevaram in the way made to the Varadarajah'a present of...Vimana etc.

రాయలు కళింగదిగ్విజయానంతరము విజయనగరమునకు విచ్చేసెనని చామర్లకోటకైఫీయతులోనున్నట్లు శ్రీ రామమూర్తికృత కవిజీవితములలో నున్నది.* పెద్దన్నయు మనుచరిత్రయందు విజయయాత్రలు పొట్టునూరి విజయస్తంభ ప్రతిష్ఠతో సరిపెట్టుటచే, మొదటి సింహాచలశాసనకాలమైన ధాతసంవత్సర చైత్ర బహుళ ద్వాదశినాఁటికిని, కంజీవర శాసనకాలమైన ధాతసంవత్సర పుష్య బహుళ ద్వితీయకును మధ్యనేకదా తద్విజయము పూర్తియైనదని చెప్పవలెను. ఆకాలముమధ్య రాయలు విజయనగరములో కొంతకాల ముండెను. నా మతముప్రకారము మనుచరిత్ర రచనాకాలము నేననుకొనినట్లు 1520 కుఁ బూర్వ మనఁగా 1516 సంవత్సరముగు చున్నది. శ్రీ లక్ష్మణరావుగా రూహించినట్లు గుల్బర్గా దండయాత్ర క్రీ. శ. 1514 సంవత్సర ప్రాంతముననే యైనయెడల యీ నిర్ణయమునకు వారి ప్రణ్యమాయరి నాకు సహకారి కాఁగలదు.

ఎట్లయినను నా మతముప్రకారము మనుచరిత్ర రచనాకాలము క్రీ. శ. 1520 పూర్వమే యగుచున్నది కాని, తరువాత కాదు.

రాయల కెంభావివిజయవర్ణనము రాయచూరు యుద్ధమును స్ఫురింపఁజేయుచున్నదని శ్రీ కృష్ణస్వామి అయ్యంగారి యభిప్రాయమును జెప్పి, దానితో నేనేకీభవించుట, శ్రీ వెంకటరమణయ్యగారి విమర్శ పరిజ్ఞానమునకుఁ బరిహాసహేతువయ్యెను. వీరు న్యూనిజ్ విషయమై యీ చరిత్రకారుఁడు వ్రాసిన వ్రాఁత లసత్యములని యొకప్పుడును, సత్యములని మఱి యొకప్పుడును వ్రాసిన విచక్షణులగుటచేత నిట్టి విషయములు సహితము వారి సత్యాన్వేషణపరాయణత్వమునకు గుఱి యయ్యెను.

మనుచరిత్ర క్రీ. శ. 1526 సంవత్సరము తర్వాతనే పెద్దన్న రచించియున్నచో శ్రీ లక్ష్మణరావుగారి యభిప్రాయము ప్రకారమే, రాయలుదివంగతుఁడై స్వర్గలోకమున నింద్రసభలో నాకృతికన్యకు మంగళసూత్రమును గట్టియుండును. శ్రీ లక్ష్మణరావుగారు రాయల నిధనకాలముఁగూర్చి వ్రాయుచు, "రాయలు శా. శ.1446 లోనే మృతినొందియుండవచ్చును. తరువాత 1452 వఱకును అచ్యుతరామరాజాదులు కలహపడుచు రాజ్య మరాజకముగానున్న కాలమందుఁ గొందఱు నాయకులు తటస్థులుగనుండి వీరివైపుఁజేరక వారివైపుఁజేరక యుండవచ్చును.........శాసనములను శోధించెడు వారందఱును కృష్ణరాయనిశాసనములు శా. శ. 1446 తరువా

* కవిజీవితములు:—కృష్ణరాయలు, పుట 576.

తిని శోధించునపుడు నేను రాయల నిధనకాలమును గూర్చి పైని వ్రాసిన విషయములను జ్ఞాపకముంచు కొందురని నమ్ముచున్నాడ నని చెప్పిరి.*

అదియును గాక ఆ సంవత్సరప్రాంతముననే పుత్రవియోగదుఃఖముచేఁ గుందుచు, దేశమునందు విప్లవాంపహరములు మొలకలిడి, దురవస్థలోనున్న రాజమార్తాండుఁడు కృతులనందుచుండె ననుటకన్న, దిగ్విజయానంతరమె మనుచరిత్రను కృతినందెననరాదా! పారిజాతాపహరణము రాయలట్లు కృతినందెనని నిరూపించితిని గదా! రాయల నిధనకాలము సరియైనదియౌఁ గానిదియౌఁ జర్చనీయాంశమైనను, ఆనిధనకాలము 1526 సంవత్సరమునకు బూర్వమే కావచ్చుననెడి ప్రతిబంధక మొకటి వచ్చెనుగదా?

నానిర్ణయము సరియైనది కాదని దృఢముగ వారి మనోనిశ్చయమున కాంధ్రలోకమున కెఱింగించిరి. మాటలు నేర్వనివారెవ్వరు? వారొనర్చిన కాలనిర్ణయము సరియైనది కాదని నేను నొక్కి చెప్పెదను.

---



---

* లక్ష్మణరాయ వ్యాసావళి, పుట ౮౩.

సంధ్య :—

ఆర్యజనలోక హృదయవిహాయసమున-నూతన యుగోదయారుణ జ్యోతి వెలుఁగ
నమృతజీవనము పయోధరముల దొలుక-దాండవము సల్పుచుండె సంధ్యాకుమారి !

అవి హోమకుండానలారుణ జ్వాలలా, యలముకొన్నవి ప్రాగ్దిశాంతరమున?
అవి ధూమరాజీ విహారంబులా, కారు గ్రమ్ముకొన్నవి మేఘగణము లట్లు?
అది యజ్ఞశాలయా, యాసేతు హిమవన్నగాంతరస్థంబైన యార్యభూమి?
వేల్చుచునుండిరా వేదోక్తవిధి హవ్య కోటి ముప్పదిమూఁడు కోట్ల జనులు?
అవల ప్రభవింపఁబోలు జ్ఞానార్క-బింబ-మిమ్మహాయజ్ఞఫలముగా నేపు మిగిలి
స్వర్గధామంబునుండి విశ్వప్రపంచ-శాంతిరమ యవతరించు నిశ్చయము భువికి. (?)

హారతులెత్తుచున్ జగమునందలి యందము లెల్ల వచ్చి కై
వారము సేయఁగా మహిత వైభవముల్ వెలయించు, రాజ్ఞియై
స్వైరవిహారధీరయగు స్వర్గకుమారి ; క్షణంబులోన బం
గారముగాఁగ మార్చెను జగం బఖిలంబుఁ గృషీవలాగ్రణీ !

స్వేచ్ఛాస్వీకృతచిత్రవర్ణ యగుచున్ సౌందర్యసామ్రాజ్య మే
కచ్ఛత్రంబుగ నేలుచున్న యది ; యజ్ఞానాభిధానాంధకా
రాచ్ఛాదంబుఁ దొలంగఁజేసి, విపులార్యావర్త మాత్మీయదే
హచ్ఛాయావృతమై వినూతన శుభోద్యత్కాంతి పొల్పారఁగన్.

ఈ యుషస్సుందరియే కదా దివ్య సౌందర్యంబు వర్షించు ధరణిపైన ;
ఈ స్వర్గనందనయే కదా ప్రకటించు దివిఁ బుట్టు కాంతిసందేశములను ;
ఈ కళారసలోలయేకదా పలువింతనగిషీపనులు చూపు గగనసీమ ;
ఈ జగన్మోహినియేకదా యమృతంబు పంచిపెట్టును కళోపాసకులకు ;
ఈ మహాగాయనీమణియేకదా త- లంప విశ్వగీతంబు పల్లవి గ్రహించి
పాడుకొను, మానిహృదయవిపంచి యందు-వేదగాంధర్వకృతు లాలపించుచుండు.

నునుగాలి యలలై సోఁకినఁ గందిపోవునో సుకుమారమూర్తి, యీసుమశరీర;
పసలారు నెమ్మేని మిసిమిపై మసి పూసినటు లౌనో మొయిళుల నలుపుడాలు;
కసుగందునో యేమొ పసిమిలేమొండకే యెండకన్నెఱుఁగని యీలతాంగి;
కరఁగి కలియునో యేమొ విరిసి విరియుచు సింగి నీలాల చాలులోఁ దేలి సోలి;(?)
ఆగమాంతశిరోవర్తియా ముకుందు-చరణతలములఁ జెలువారు నరుణిమయయి
కాంతి దళుకొత్తు నాయుషఃకమలనేత్ర- యీ ఘనీభవించిన భూమి కెటుల డిగ్గు!

ఆయరుణరాగ మంటినదోయి, యార్య-భూతలమునందు ప్రత్యణువునను గూడ
క్రమతరమైన యా యుషఃకాంతులందు-భావిభారతలక్ష్మి తాఁ బ్రతిఫలించు.

అంటియు నంటుకోక చెలువారెడు నద్దకముల్ సెలంగ నీ
మంటికి మింటి కద్దు సుకుమారపు శిల్పము లెల్లఁ బైరులై
పంటవలంతిపై నభముపైఁ బలువన్నెల, నెంత వింతలో
పంటలు పండిపోయినవి! బాపురె! కోసుకొనంగ రావొకో!

అది సకలావనీతల జనావనపావనమైన కాంతియై
యుదయము నందుచున్నఁదదుగో మృదులారుణ నవ్యశోభ పూ
ర్వ దిశఁదలిర్చి రత్నముల రాసులు నీపయి గ్రుమ్మరించుచు
న్నది కనుమోయి! నీవు యుగనాథుఁడవయ్య కృషీవలోత్తమా!

ముప్పదిమూఁడుకోట్ల దళముల్ చెలువారెడు పద్మరాజమై
యొప్పిన భారతావని నవోదయశోణ సువర్ణవల్లరుల్
కప్పిన యంత నూతనవికాస మెలర్పఁగ రేకులన్నియున్
విప్పుచునున్న మేటిరమణీయతఁ గాంచఁగదయ్య కర్షకా!

తొలకరినాళ్ల తూర్పుదెసఁ దోఁచిన యీపసిపాపప్రొద్దుతోఁ
జెలువము భూమి ప్రాలి, యొకచేతను మేఁడి వహించి దుక్కి-టె
ద్దుల నదలించుచున్ పుడమి దున్నెదు నీకృషి కాత్మ మెచ్చి నీ
తలఁగల తెల్లపాగ మడతన్ పురి విచ్చినజాడ దోఁచెడిన్.

అవభృథస్నానమోయన శ్రమాంబుకణంబులు జాలువారు మూ
ర్తివిలసనంబుతో వసుమతీసముపాసనతోడ నిత్యయా

గవిధి భజింపుచుండెడు జగద్ధితబుద్ధి వహించు సోమయా
జివనఁ దనర్చి భాగవతజీవనమున్ వెలయింతు కర్షకా!

శ్యామలమూర్తి మేఘములచాటున చక్రము ద్రిప్పుచున్న కే
ళీమయ తత్త్వమే ప్రతిఫలించుచునున్నది చూడఁగా, ప్రజా
స్వామిక రాజ్యతంత్ర పరివర్తనలన్ వెలయించు ధాత్రిలో
నీమెయి నీలిచాయ నును నిగ్గులలోనఁ గృషీవలాగ్రణీ!

వరుసన్ బ్రాహ్మణక్షాత్ర తేజములు నా వైశ్యత్వముంగూడ ను
ర్వరఁ బాలించినవోయి, నీవిమలసేవాధర్మమే నేఁడు రా
జ్యరమం గైకొని యేలుచున్నదని పాశ్చాత్త్య ప్రజాపాలనా
చరితల్ చాటుచునున్న విన్నియును విశ్వశ్రేయమున్ గూర్చుతన్.

ఆశల్ పల్లవితంబులై వెలయ సంధ్యాకాల మర్క ప్రభా
కైశోరత్వము దాల్చి భూవలయమున్ గైసేసె, నవ్యోద్యమా
వేశస్ఫూర్తి వెలుంగ నీహలము వేవే దోలుమీ వీయుగ
ప్రాశస్త్యం బెదలోఁ దలంచి మహా ప్రారంభ సంరంభివై.

భోగవిమోహితంబును, తమోహతమై, జడయంత్రబద్ధమై
నాగరికంబు పేరిటి యనాగరికం బది తన్గలంప, నేఁ
డో గృహమేధి! నిన్గొలువనున్నది లోకము, దీని కింక నీ
నాఁగలియే శరణ్యమగునా! తలపోయ విచిత్ర మింతయున్.

అంటినవోయి యా యరుణప్రభలు మేన నై పోమె నీకు పట్టాభిషేక;
మింద్రియంబుల నావహించిన జడతయుఁ జీకటు లంతంతఁ జెదరిపోమె;
పొంగారుచుండె నుత్తుంగరంగద భంగ భంగంబు లెగయ నీప్రాణశక్తి;
అగునోయి నీ సకలాంగకంబులయందు నుత్తమ జ్ఞాన సూర్యోదయంబు
నమ్ము నామాట, నిను నీవు నమ్ముకొనుము-భావియుగ శాంతవీరుఁడవీవు, శాంతి
ధర్మమయ జీవనంబు సంస్థాపనంబు-సలుపఁగల వీవె నా నమస్కారము లివె!

---

# హిందూదేశపు ఆర్థిక దాస్యము

హిందూదేశపు ఆర్థిక చరిత్రను పరిశీలించిన కొన్ని ముఖ్యాంశము లేర్పడుచున్నవి. తొల్త నెరొ్కనదగిన దేదన, మనపాలకులు ఆర్థికవిషయముల యెడ్ల ఒకక్రమమైన విధానము ననుసరించియుండలేదు. తాత్కాలిక ప్రయోగములు (Experiments) చేయుట, వాటివలన కలుగు లాభనష్టములను గమనించి సవరించుకొనుట, పరిస్థితులు వారిచేతికి మించినప్పుడా ప్రయత్నమును మానుకొనుట, ఇట్టివి ప్రముఖముగా కనబడుచున్నవి. అందుచే మనకు పేర్పడ్డపద్ధతులన్నియు ఆకస్మికములే. ఇందులకు నిదర్శనము లెన్నియే నికలవు. 1899 వ సంవత్సరమున 'ఫౌలర్ కమిటీ' వారి ఎదుట లిండ్సేదొరగారు తమ ప్రణాళికను నివేదింపగా ఆ 'కమిటీ' వారు ఆపద్ధతి నిరుపయోగమని త్రోసివైచిరి. ప్రభుత్వము వారుకూడ దానిని నిరసించిరి. కాని తరువాత కొలది కాలమునకు ప్రభుత్వమువారు ఆపద్ధతినే ఆచరణలో నుంచిరి. 1913 వ సంవత్సరమున జె. యం. కీన్సుదొరగారు ఆపద్ధతికే 'బంగారుమారకపు ప్రమాణము' (Gold exchange standard) అని నామకరణము గావించి, అదిసర్వోత్కృష్టమని చాటిరి. 1914 వ సంవత్సరమున 'చేంబర్లేనుకమీషను' వారు దానికే తమ ఆశీస్సులనొసగి చిరస్థాయిగానుండునని దీవించిరి. 1919 వ సంవత్సరమున 'బేబింగ్టనుస్మిత్ కమిటీ' వారిని, ఈ పద్ధతిలోని లోపములను సవరింపవలయునని ప్రభుత్వమువారు కోరియుండిరి. తరువాత 1925 వ సంవత్సరమున 'హిల్టను యంగ్ కమిటీ' వారు మరల ఈ పద్ధతిని నిరసించిరి. ఇక రూపాయిమారకపురేటునుగూర్చి చూతము. 1893 వ సంవత్సరమున హర్షెల్ కమిటీవారు రూపాయికి 16 పెన్నుల రేటును నిర్ణయించిరి. 'ఫౌలర్ కమిటీ' వారు 1899 వ సంవత్సరమున రూపాయికి 16 పెన్నులరేటును బలపరిచిరి. ఆరేటు 1914 వ సంవత్సరమువరకును మారలేదు. ఆ కమిటీవారే హిందూదేశమునకు బంగారు నాణెములను, బంగారు ప్రమాణమును (Gold standard with gold currency) ప్రవేశపెట్టవలయునని సిఫార్సు చేసిరి. 1900 వ సంవత్సరమున ప్రభుత్వమువారు 20 లక్షల సవరనులను చెలామణి (Circulation)లో నుంచిరి. కాని ఆ సంవత్సరము క్షామమగుటచేతను, దేశమున కధను పక్షము 1500 లక్షలసవరలు కావలసి యుండగా, 20 లక్షలు చాలకపోవుటచేతను ఈ నాణెములు ఖజానాలోనే నిలిచిపోయినవి. పదునాలుగు సంవత్సరముల తరువాత చేంబర్లేను కమీషనువారు హిందూదేశమునకు బంగారు నాణెములు పనికిరావను వాదమునకు కారణముగా అప్పటి వృత్తాంతమును తడవుట కేవలము హాస్యాస్పదము.

తరువాత వెండిధర హెచ్చినప్పుడు ప్రభుత్వము వారికి కష్టదశ ప్రారంభమాయెను. యుద్ధకాలమునందు హిందూదేశపు సరకులకు 'మిత్రమండలి' (Allies) వారు సుమారు 240 మిలియన్ల పౌనులు (24 కోట్ల సవరలు) ఈయవలసియుండిరి. రూప్యములను ముద్రించుట లాభకరముగాకపోయెను. నోటుకాగితములకు ఆధారముగా నుంచబడిన 'సెక్యూరిటీ'ల మొత్తమును (Fiduciary portion of the paper currency reserve) 14కోట్ల నుండి 120కోట్లవరకు 9 ఆర్డినెన్సులతో పెంచిరి. అప్పటికిని వారిచేతకాక, 1919 వ సంవత్సరమున 'బేబింగ్టనుస్మిత్ కమిటీ' వారిని నియమించిరి. ఈ కమిటీవారు రూపాయికి 2 షిల్లింగుల బంగారము (gold) రేటును నిర్ణయించవలయునని సిఫార్సుచేసిరి. ఈ కమిటీలో సభ్యులుగానుండిన సర్ దాదిబాదలాల్ గారు (ఒకరే భారతీయులు) ప్రభుత్వమువారు 16 పెన్నులరేటును రెండు షిల్లింగులకు మార్చుట నిప్పుతో చెర్లాటమనియు, దీని వలన చాల విపత్తులు సంభవించుననియు జోస్యము చెప్పిరి. కాని వీరిమాటనుత్రోసివైచి ప్రభుత్వమువారు రూపాయికి రెండుషిల్లింగుల బంగారు [illegible] రేటు

ను నిర్ణయించిరి. బంగారుమారకపు ప్రమాణముయొక్క ఆశయము మారకపురేటు నిశ్చలముగానుండుటయే అయిన ప్రభుత్వమువారప్పుడు మారకపురేటును హెచ్చింపక రూపాయులనమ్ముకొట్టుటకు కలిగెడినష్టమును బంగారు ప్రమాణపు మూలధనము (gold standard reserve) నుండి భరించియుండవలసినది. అందుచే బంగారు మారకపు ప్రమాణము పరీక్షాసమయమున ఓడిపోయెను. 1919 డిసెంబరు నెలకు మారకపు రేటు 2 షి. 4 పెన్నులకు హెచ్చిపోయెను.

1920వ సంవత్సరము ఫిబ్రవరినెలకు వెండిధర తగ్గిపోగెను. మారకపురేటుకూడ 1 షి. 11 పెన్నులకు దిగెను. వెండిధర హెచ్చినప్పుడు రేటు హెచ్చించిన ప్రభుత్వమువారు, వెండిధర తగ్గిపోయినప్పుడు రేటును తగ్గించవలసియుండెను. అట్లు చేయక ప్రభుత్వమువారు 2 షిల్లింగులరేటును పోషించుకొనుటకై 'రివర్సు కౌన్సిళ్ల' ను అమ్మెదమని ప్రకటించిరి. 1920 జనవరి మొదలు సెప్టెంబరువరకు 5,53,82,000 సవరలకు రివర్సు కౌన్సిళ్లమ్మబడెను. వీటిని ప్రభుత్వమువారి జాబితాలో నున్న వారికే అమ్మిరి. బజారు రేటునకును ప్రభుత్వమువారి రేటునకును కలభేదముతో 'రివర్సు కౌన్సిళ్ల'ను కొన్నవారు ముమారు 40 కోట్ల రూప్యముల ఆదాయమును బడసిరి, ఈనష్టమును హిందూదేశము భరింపవలసివచ్చెను. సవర 15 రూప్యముల వంతున కొన్న 'సెక్యూరిటీ'లను 10 రూపాయల వంతున అమ్మట తటస్థించెను. చివరకు సెప్టెంబరుకు ప్రభుత్వమువారు తామింక రివర్సు కౌన్సిళ్ల నమ్మజాలమనియు, మారకపురేటుతో జోక్యము కలుగ జేసికొనమనియు ప్రకటించిరి. ఈ రివర్సు కౌన్సిళ్లవలన హిందూదేశములోని ధనము విదేశములకు పోవుట తటస్థించెను. బంగారు మారకపు ప్రమాణముయొక్క సూత్రముల ప్రకారమైనను, ఎంతమొత్తమునకు రివర్సు కౌన్సిళ్ల నమ్మిరో, అంతమొత్తమునకు నోట్లను రద్దుచేయవలసి యుండెను. ఈ 'రివర్సు కౌన్సిళ్లు' మనదేశమునకు చేర వలసిన ద్రవ్యము కంటె, ఈయవలసినధన మెక్కువ అయి నప్పుడే అమ్మవలెను. అట్లు నోట్లు రద్దుచేయక పోవు టచే ధరలు నిలకడగా పెరిగిపోయినవి. హిందూదేశపు ఎగుమతులు దిగుమతులకన్న ఎక్కువగా నుండుకాలమున, వ్యాపారేతరకార్యములకు 'రివర్సు కౌన్సిళ్ల' నమ్ముటచే మారకము జూదముగా పరిణమించెను. ఈ 'రివర్సు కౌన్సిళ్ల' వలన దేశమునకు కలిగినష్టములను శ్రీమాన్ టి. యస్. కృష్ణమూర్తి అయ్యరుగారు 'రివర్సు కౌన్సిళ్లు, మరికొన్ని పట్టపగలు దోపిళ్లు' (Reverse councils and other organised plunders) అను గ్రంథమున విపులముగా వివరించియున్నారు. ఇవి "అర్థశాస్త్రజ్ఞాన శూన్యులును, వ్యాపార సమాచారములలో 'ఓ-న-మలు' తెలియని సర్ మాల్కాం హెయిలీ దొరగారిని 'ఆర్థిక సభ్యులు'గా నియమించుటచే కలిగిన ప్రమాదము" లని రూఢిపరచిరి. వీరి అంచనాప్రకారము హిందూదేశము నకు వాటిల్లిన నష్టము మొత్తము 50 కోట్ల రూప్యములు. దేశమొకవంక విషజ్వరములచే బాధపడుచుండ, నిరక్షరకుక్షులు లెక్కకు మిగిలియుండగా, దారిద్ర్యము దేశమును పీల్చివేయుచుండ ప్రభుత్వమువారి ప్రయోగము నకు దేశమున కొక సంవత్సరమునకు నష్టము 50 కోట్ల రూప్యములా! ఇట్లు దోపిడిలో మునిగియుండిరి యే ప్రపంచమంతయు. నవంబరు 11 తేదిన యుద్ధవిరామము నకుగా రెండునిమిషములు తమతమ పనులను చాలించిరి. కాని కలకత్తాలోని 'కాక్సు అండు కంపెనీ' వారు మాత్రము తమ లాభమును పోగొట్టుకొలేక రెండునిమిష ములుకూడ తమపనిని కట్టిపేయరైరి.

1923వ సంవత్సరమున మారకపురేటు 16 పెన్ను లకు దిగెను. అప్పుడు ఆరేటుప్రకారము రూపాయి మారకమును స్థిరపరచవలయునని ప్రజలు ప్రభుత్వము వారిని కోరిరి. కాని ప్రభుత్వమువారందుల కియ్యకొన లేదు. చెలామణిలో నున్న రూప్యములను తగ్గించుచు ఎన్నోపాట్లుపడి 1926వ సంవత్సరమునకు మారకపు రేటును 18 పెన్నులకు తెచ్చిరి. 2 షిల్లింగుల రేటు వలనకలిగిన లాభములను చవిజూచి వదలలేక మరల 16 పెన్నులకంటె ఎంతహెచ్చుగానిర్ణయించిన అంత మేలని ప్రయత్నించిరి. లండనులోని హిందూదేశపు మంత్రియు, గా ప్రతినిధి ఆస్థానియందు ఆర్థిక సభ్యుడగు సర్ బేసిల్ బ్లాకెటుగారును వారీగా 18 పెన్నులకు

స్థిరపడుచుకొన్నట్లు [illegible] ఒప్పుకొందిరి. 1926 వ సంవత్సరమున 'హిల్టన్ యంగ్ కమీషన్' వారుకూడ 18 పెన్సుల రేటునే [illegible]సిరి. అందులో సభ్యులుగా నుండిన సర్ పురుషోత్తమదాసు ఠాకూర్దాసుగారు 16 పెన్సుల రేటును బలపరచుచు ప్రత్యేకనివేదికను తయారుచేసిరి. 1927 వ సంవత్సరమున ప్రభుత్వమువారు 18 పెన్సుల రేటును స్థిరపరుపవలయునని ఢిల్లీ శాసనసభలో నొక చట్టమును ప్రవేశపెట్టిరి. ఈచట్టమును ప్రవేశపెట్టుచు సర్ బేసిల్ బ్లాకెటుగారు 18 పెన్సులే స్థిరపడినరేటు (Defacto ratio) అనియు, అది 9 నెలలనుండి అమలులోనుండుటచే, ఆరేటు ప్రకారము వస్తువులధరలు సర్దుకొనియున్నవనియు వాదించిరి. మరియు 11 ఆర్థికసూత్రములను చెప్పి వీటికి బదులు చెప్పుడని, సభ్యులకు సవాలు చేసిరి. శ్రీ జమ్నాదాసు మెహతాగారు వీరికి జవాబుచెప్పుచు 18 పెన్సులరేటును పొందుటకు, నిలుపుకొనుటకు ప్రభుత్వము వారు పడ్డపాట్లను వివరించిరి. 'వస్తువులధరలనుగూర్చి ముచ్చటించుచు, "వస్తువులనగా ఆర్థికవస్తువులు, అనగా ప్రభుత్వోద్యోగీయుల జీతములు, హిందూదేశపు ఋణముల వడ్డీలు మొదలగునవి. ఇవి ఎంత గొప్ప ఆర్థిక సభ్యులు చెప్పినను 18 పెన్సుల రేటుప్రకారము సరిపడవు". మేమిచ్చు రూపాయిల కెక్కువ విలువ నిర్ణయించి, తమ జీతముల కెక్కువడబ్బు సంపాదించుకొనవలయునను ఆశ ప్రభుత్వోద్యోగములలో నున్న తెల్లవారికిని, విదేశముల దిగుమతివ్యాపారమున కనుకూలము కలుగజేసి, దేశీయవ్యాపారమును నాశముచేయవలయునను ఉద్దేశము ఇంగ్లీషు వర్తకులకును కలవనియు, దీని వలన రయితులకు శాశ్వతముగా తమపంటల ఎగుమతులకు తక్కువరూపాయిలు లభించుచుననియు జమ్నాదాసు మెహతాగారు చాటిరి. సర్ పురుషోత్తమదాసు ఠాకూర్దాసుగారు బ్లాకెటుగారి పదునొకండు సూత్రములను [illegible]ముగా ఖండించి అందొక్కటియు నిలువకలవని నిరూపించిరి. "ఈ రేటును ప్రభుత్వమువారు చాలకాలము నిలుపుకొలేరని నేను జోస్యము చెప్పగలను." అని పురుషోత్తమదాసుగారు పల్కిరి. "హిందూదేశమున [illegible] రిపోర్టునుండియు, ఒక్కొక సభ్యుల ప్రత్యేక నివేదికలనుండియు ఉదాహరించుచున్నా[illegible]" నుని ఆర్థికసభ్యులు నుడివిరి. "నిజమే. నా గ్రహచారమేమన బ్రిటిషువారు ఏర్పరచుకమిటీలలో భారతీయులను కొద్దిమందినే నియమింతురు. ఇంగ్లీషువారు ఈ దేశమువైపు మాటలాడరు. కాబట్టి ఆకమిటీలలో నియమింపబడిన భారతీయులు ప్రత్యేకనివేదికలను తయారుచేయవలసివచ్చును. ఈదేశమువారు వాటినే పలుమారు ఉదాహరించుటయు తటస్థించును. సర్ జేమ్సుబెగ్బీగారి చేంబర్లేను కమీషనులోను, సర్ దాదిబాదలాల్ గారు 'వెలింగ్టను స్మిత్ కమిటీ'లోను, నేను హిల్టన్ యంగ్ కమీషనులోను ఉండు అదృష్టమో, దురదృష్టమో నాకు కలిగినది" అని సర్ పురుషోత్తమదాసుగారు నుడివిరి. ఈచట్టముపై చర్చకు సర్ బేసిల్ బ్లాకెటుగారు జవాబుచెప్పరైరి. తీర్మానము రెండు వోట్లతో నెగ్గెను. ఈ తీర్మానమునకు వోట్లు సంపాదించుటకు ప్రభుత్వము వారు పడ్డపాట్లను వివరింప నవసరములేదు. ఈ విషయమున నైతికజయము 16 పెన్సులవాదుల (జాతీయవాదుల) దేయనుట నిర్వివాదాంశము.

ఈచట్టము నేర్పరిచిన తరువాత ఈ 18 పెన్సుల రేటును పోషించుకొనుటకు ప్రభుత్వమువారు పడుచున్న పాట్లను కొంతవిచారింతము. ఈ శాసనము అమలులోనికివచ్చిన తరువాత 9 నెలలు మాత్రమే రేటు 18 పెన్సులుండెను. ప్రభుత్వమువారు భగీరథప్రయత్నములు చేయుచున్నను ఈరేటు 18 పెన్సులవరకైనను పోలేదు. కడచినవారమునందు బాటిల్వాలా కిరానిగారి వ్యాపారవిమర్శనలో ఇట్లుకలదు (ఫిబ్రవరి 14వ తేది 1931) బొంబాయి క్రానికలుపత్రికలోనుండి అనువదింపబడినది): "రూపాయి మారకపు రేటు ఈ వారములో స్థాయిగానుండినది. త్వరలో తీరిపోవుబిల్లులను 1 శి. 5¾ పె. పైగా అమ్మలేకపోయిరి. ఈ వారములోకూడ పోయినవారమువలె ఎక్కువమొత్తమునకు 'రివర్సుబిల్లులు' అమ్మబడినట్లు తెలియుచున్నది. 'కరెన్సీ' యొక్క 'డిప్యూటీ కంట్రోలరు' గారు ఫిబ్రవరి 7 వ తేదీ అంతయువ్యాపారమునకు తమనివేదికలో ఇట్లు చెప్పుచున్నారు. అందులోనున్న 'వేషయిక [illegible]

మొత్తము ఇంగ్లాండు ట్రెజరీకి 10,78,759 పౌనులను మార్చినట్లు తెలియుచున్నది.

1930 ఏప్రిలు 1వ తేదీనుండి 52,09,735 పౌనులకు 'రివర్సు బిల్లు'లమ్మబడెను. ఈకాలములోనే 'పేపరు కరెన్సీరిజర్వు'నుండి 78,43,976 పౌనులు మార్చబడినవి. పేపరుకరెన్సీ రిజర్వులోనున్న బంగారు లోహము గత డిసెంబరునుండి 6 కోట్లు తగ్గినవి. దీనివలన ఆమార్పు వలన ఏర్పడు అంశములు మరింత స్పష్టము లగుచున్నవి. ఇందువలన తేలు సారాంశమేమనగా సరాసరి వారమునకు ఒక కోటిరూపాయలు విలువగల బంగారము మనమూలధనమునుండి క్షీణించుచున్న దన్నమాటే. ఈలాటి మార్పులవల్లను, హిందూదేశపునోట్లకుఆధారముగా నున్న లోహపు మూలధనమును తగ్గించుటవల్లను కలిగెడి ప్రమాదములను పలుపరు వివరించియున్నాము. బ్యాంకులు రాబోవు నెలలోని రేట్లను స్పష్టముగా చెప్పలేక యున్నవి. ఇప్పుడు చెప్పబడు రేట్లన్నియు నామకార్థములే_"

దగ్గరబిల్లులకు 1 షి. $5\frac{3}{4}$—ఫిబ్రవరి 1-$5\frac{23}{22}$—మార్చి 1-$5\frac{2}{23}$ ఏప్రిలు 1 $5\frac{9}{16}$

ఇట్టి అస్వాభావికపురేటును పోషించుకొనుటకై చెలామణిలోనున్న నాణెములు నానాటికి తగ్గింపబడుచున్నవి. దీనివలన ధనమున కవసరమగు కసాలాను కలిగించి బ్యాంకిరేటు హెచ్చుచేయబడుచున్నది. ఇప్పుడు ఇంగ్లాండులో బ్యాంకిరేటు నూటికి 3 వంతునను, ఫ్రాంసు, అమెరికాలలో నూటికి 2 వంతున నుండగా, హిందూదేశమున ఇంపీరియలు బ్యాంకిరేటు నూటికి 7 మిగుల విపరీతముగా నున్నది. వ్యాపారము చురుకుగా నున్నప్పుడు ధనము చేయవలసినపని ఎక్కువగా నుండుటచే, దేశముయొక్క "సెంట్రలుబ్యాంకు" తన మూలధనమును రక్షించుకొనుటకై తనరేటును హెచ్చుచేయును. మనదేశమున అలాటి సెంట్రలుబ్యాంకు లేనేలేదు. పైగా ప్రపంచమున అన్నిదేశములలోను వ్యాపారము మందగించి ధనము విరివిగా తక్కువ వడ్డీకి లభించుచుండ మనదేశములో మాత్రము ఈ 18 పెన్నులరేటును పోషించుకొనుటకై నూటికి 7 వంతున బ్యాంకిరేటు సాగింపబడుచున్నది. వస్తువులధరలు విపరీతముగా తగ్గిపోవు కాలమునందే చెలామణిలోని నాణెములను తగ్గించుటచే ధనమునకు విలువ ఎక్కువై వస్తువుల ధరలు ఇంకను తగ్గిపోవుట తటస్థించుచున్నది. వీటికితోడు లండనులో సవరల అప్పులు విరివిగా తీసికొనబడుచున్నవి. రెండువారముల క్రిందటనే 17 మిలియన్ల సవరలు లండనలో మన ప్రభుత్వమువారు అప్పుపుచ్చుకొనిరి. సుప్రసిద్ధవణిక్పుంగవులగు ఠాకూరుగారు, సర్ పురుషోత్తమదాసుగారు "వెనుక 1920వ సంవత్సరమున రెండు షిల్లింగుల రేటు సాగించుటకు 'రివర్సు బిల్లు'నమ్ముటచే దేశమునకు సుమారు 50 కోట్ల నష్టము కలిగినది. మరల ఈసారి ఎన్నికోట్లు వ్యయమగునో?" అని విషాదముతో పలుకుచున్నారు. ఎన్నాళ్లాడగలరో ఈయాట! ఇట్టితరి గతవారమున బెన్నుగారు పార్లమెంటులో "హైందవశాసనసభవారు 18 పెన్నులరేటును నిర్ణయించిరి. ఆరేటింకమారదు. దానిని ప్రభుత్వమువారు తమ యావచ్ఛక్తిని వినియోగించి పోషించెద"రని అభయమిచ్చిరి. వెనుక రెండుషిల్లింగులరేటు నిలుపుకొనుటకై 50 కోట్ల రూప్యములు నష్టము కావించి విఫలులైరి. ఈసారి ఏమగునో చూతముగాక. 1927వ సంవత్సరమున సర్ బేసిల్ బ్లాకెట్ గారు '18 పెన్నులే స్థిరపడినరేటు' అని పలికియుండిరి. అదియే క్రమమైనరేటు అయినయెడల ప్రభుత్వమువారు యావచ్ఛక్తిని వినియోగింపవలసిన అవసరమెందులకు? సర్ బేసిల్ బ్లాకెటుగారు వస్తువుల ధరలు 18 పెన్నుల రేటుకు సర్దుకొనినవని పలుమారు పల్కియుండిరి. 1930 జనవరిలో ఇంగ్లాండు దేశములోని వస్తువులధర సార్ బెక్కుదొరగారి లెక్కప్రకారము చూపుడు సంఖ్య (Index number) 125. అమెరికా సంఖ్య బ్రాడ్‌స్ట్రీటు లెక్కప్రకారముకూడా 125. కలకత్తా సంఖ్య 131. కాని డిసెంబరు నెలకు ఇంగ్లాండు అంక 102కు దిగెను. అమెరికా అంక 103కు తగ్గెను. కలకత్తా అంక 101 అయ్యెను. ఇంగ్లాండు, అమెరికాల అంకలు 23,22 తగ్గగా కలకత్తా అంక 30 తగ్గినది. హిందూదేశమున వస్తువుల ధరతగ్గుట ఇంగ్లాండుకంటె 1/3 ఎక్కువగా నున్నది.

దీనివలన బ్లాకెటుగారు తెలిపినవస్తువుల ధరలు సర్దుకొనుట కేవలము అపోహమని విదితమగుచున్నది. ఈరేటును 16 పెన్సులకు [illegible]యునని గాంధిగారి 11 వరకు లలోకలదు. మితవాద ప్రముఖులును వణిక్పుంగవులును దీనికే కోరుచున్నారు. కావున రాబోవు 'రెండవ [illegible]' సభా వేళమున 16 పెన్సుల యోధులకును (knights) 18 పెన్సుల యోధులకును గొప్ప యుద్ధము జరుగగలదని ఊహింపవచ్చును. ఇక ఇంగ్లాండులోనున్న మన 'రిజర్వు'ల సమాచారము యోచింతము. మొదట ఈ 'రిజర్వు'లేల చేయబడినవో ఎవరికిని తెలియదని కీన్సు దొరగారుకూడ ఒప్పుకొని యున్నారు. ఫౌలర్ కమిటీ వారు (1899) రూపాయలను అచ్చుగొట్టుటవలన కలిగిన లాభములను బంగారులో హిందూదేశమున నిలువజేయవలసినదనీ దీనిని బంగారుప్రమాణము (gold standard) ప్రవేశపెట్టబడినప్పుడు, నాణెముల కాధారముగా నుంచవలయుననియు సిఫార్సు చేసిరి. ప్రభుత్వమువారీ 'రిజర్వు'ను ఇంగ్లాండులోనుంచిరి. 1907వ సంవత్సరమున దీనిలోనుండి కొంత ద్రవ్యమును వ్యయపరచి రైళ్లసామానులను కొనిరి. మారకపురేటును పోషించుకొనుటకే ధనము పనికివచ్చునను జ్ఞానము వారికప్పటికి కలిగియుండలేదు. తరువాత భారతీయులు వలదని ఎంత మొరపెట్టుకొనినను వినక ఈరిజర్వును (Gold Standard Reserve) బ్రిటిషు సెక్యూరిటీలలో నుంచిరి. 'పేపరు కరెన్సిరిజర్వు' తోట్లు నోట్లకు ఆధారముగా ఏర్పరుపబడినవి. దీని నేల ఇంగ్లాండులోపల ఉంచవలయునో విశదము కాలేదు. దీని మారకపురేటును పోషించుకొనుటకు రెండవనిధిగా దాచుకొనుట గొప్పతప్పని వేరుగా చెప్పనవసరము లేదు. అదియునుగాక సాధారణముగా హిందూదేశపు ఎగుమతులు దిగుమతులకన్నను ఎంతయో ఎక్కువ కాబట్టి సాధారణముగా హిందూదేశమునకే ధనము చేరవలసియుండును. అట్టితరి ఏ పరదేశములకో కనసారియైనా కలుగు [illegible] ప్రభుత్వమువారు 55 మిలియన్ల పవనులను (గోల్డుస్టాండర్డురిజర్వు 42 మిలియన్లు—పేపరుకరెన్సీ రిజర్వు 18 మిలియన్లు) నిలువజేయుట హాస్యాస్పదము. ఈడబ్బుతో హిందూదేశమున బంగారు ప్రమాణము (Gold standard) ను ప్రవేశపెట్టకూడదా యని [illegible] గూర్చి హిల్టను యంగ్ కమీషనువారిట్లు వ్రాసిరి: "ఈ ధనమును ఇంగ్లాండు తనమూలధనము తగ్గిపోవు ననుభయముతో ఇవ్వదు. అమెరికా తన వెండివ్యాపారమున కాటంకము కలుగునను భీతితో ఇంగ్లాండునకు అప్పివ్వదు. కావున ఆధనము ఇంగ్లాండు ఇచ్చుటకు వీలులేదు. అమెరికానుండి అప్పుతెచ్చుకొని ఇచ్చుటకుగూడ వీలుపడదు. మరియు హిందూదేశము బంగారు ప్రమాణము (Gold standard) ప్రవేశపెట్టిన ప్రపంచములోని వెండిని కొనువారెవ్వరును ఉండరు. అది ప్రపంచవ్యాపారమునకు చాల ఇబ్బందులు కలుగజేయును. అందుచే హిందూదేశమునకు బంగారు ప్రమాణమును ప్రవేశపెట్టుటకు వీలులేదు." హిందూదేశము బంగారు లోహమును ఆభరణములకొరకును, దాచుకొనుటకొరకును విశేషముగా కొనునని ప్రసిద్ధి. సంవత్సరమునకు షుమారు 400 మిలియన్ల డాలర్ల విలువగల బంగారము గనులనుండి తీయబడుచున్నది. అందులో షుమారు 130 మిలియన్ల డాలర్ల విలువగల బంగారు హిందూదేశమున మాయమగుచున్నది. బంగారు నిలువ జేయుటకు కారణము, బంగారు పోయిన మరల దొరకదను అనుమానమేకదా? హిందూదేశమున బంగారు ప్రమాణమును, బంగారు నాణెములును ఉన్నయెడల ఇట్లు బంగారు దాచుకొనవలసిన అవసరముండెడిది కాదు. సర్ డేవిడ్ బార్బరుగారు శాసనసభలో ముచ్చటించుచు ఇట్లని పల్కిరి "ఇంగ్లాండు దేశస్థులు 1816 నుండి 1914 వరకు బంగారు ప్రమాణము ననుభవించిన వ్యామోహమే వారిని యుద్ధకాలమందు విరమింపబడిన బంగారు ప్రమాణమును మరల పొందుటకు విశ్వప్రయత్నములు చేయించుచున్నది. 1500 సంవత్సరములు బంగారు నాణెముల కలవాటుపడిన భారతదేశీయులకు బంగారుపై వ్యామోహముండుట యందేమియు ఆశ్చర్యము లేదు." అట్టితరి ప్రభుత్వమువారు లండనులో 55 మిలియన్లను నిలువజేయుటయు, హిందూదేశమున జనులు బంగారు దాచుకొనుటయు ఈరెండు అలవాట్లుకూడ బంగారు [illegible] పద్ధతివలన కలిగిన ఫలితములే! బంగారు మారకపుపద్ధతి వలన ఈ దేశమునకు మిగిల్చిన బంగారమును [illegible]

ననే ఉంచవలయును గాని లండనులో నుంచుటకేలాటి సమర్థనమును కనబడదు.

మరియొకవిషయ మేమనగా ఇంగ్లాండుకు నష్టము కలిగించి హిందూదేశమునకు లాభముకలిగింప ప్రయత్నించిన ఆర్థికసభ్యులెవ్వరును రాజప్రతినిధి మంత్రివర్గమున లేరుకాని ఇంగ్లాండుకు నష్టముకలుగని విషయములలో హిందూదేశమునకు మేలుచేయవలయునని సంకల్పించిన ఆర్థికసభ్యులు కొందఱుకలరు. 1899 వ సంవత్సరమున ఫౌలర్ కమిటీ నిర్ణయముల ప్రకారము బంగారు నాణెముల నచ్చుగొట్టు టంకసాలను (Gold Mint) నెలకొల్పుటకు హిందూదేశపు ప్రభుత్వమువారు సమకట్టిరి. కాని ఇగ్లాండులోని హిందూదేశపు మంత్రి అభ్యంతరములచే ఈవ్యవహారము మూలబడెను. 1912 వ సంవత్సరమున ఈవిషయమై కీ. శే. సర్. విఠల్‌దాసు ఠాకర్సే గారు శాసనసభలో నొకతీర్మానమును ప్రవేశపెట్టిరి. అప్పుడు రాజప్రతినిధిగానున్న కర్జను ప్రభువుగారును, వారి ప్రభుత్వవర్గమువారును ఈ విషయముపట్ల సుముఖులై బొంబాయిలో బంగారు నాణెముల నచ్చువేయు టంకసాలను తెరచిరి. కాని అచ్చుకొట్ట సంకల్పించినది ఇంగ్లీషువారి సవరకనుక అందులకు బ్రిటిషుఖజానావారి అనుమతి కైకొనవలసివచ్చెను. మరల హిందూదేశపు మంత్రియు, బ్రిటిషు ఖజానావారును అడ్డుతగిలిరి. ఆవరణము మంచిదికాదనియు, మంచి ఉద్యోగి లేడనియు, హిందూదేశమున కింతవ్యయ మెందుకనియు, దీనికి సరిపడ్డ బంగారము ఈదేశమున దొరకదనియు, ఇట్లు ఒకదానికొకటి సంబంధములేని అభ్యంతరములను చెప్పసాగిరి. చివరకు హిందూదేశపు ప్రభుత్వమువారు విసిగిపోయి ఈప్రయత్నమునే మానుకొనిరి. మరల ఈవిషయము ప్రస్తాపనకేరాలేదు.

1893 వ సంవత్సరమునకు పూర్వము వెండి ఎవరైనను టంకసాలకు తెచ్చిననాణెములుగా అచ్చుగొట్టి ఇచ్చెడు వారు. పూర్తి విలువకలనాణెముగుటచే దేశములో అచ్చుగొట్టబడెడు రూప్యములో సంవత్సరమునకు 1/4పాలుకరగింపబడెడివి. రూపాయనుచూపుడు నాణెముగా (Token Coin) మార్చుటచే ఈ రకముగా చెలామణిలోనున్న అనవసరములగు నాణెములు కరగింపబడెడి అవకాశము తొలగిపోయినది. చూపుడు నాణెము లధికము గుటచే కలిగెడి నష్టములను సర్ జేమ్సుబెగ్బిగారు (1914 వ సంవత్సరమున చేంబర్లేను కమీషనులో సభ్యులు) ప్రత్యేక నివేదికలో వివరించియున్నారు. అందువలన రూపాయి ఎందుకొనికి మార్చుకొనుటకు వీలులేని వెండిపై ముద్రింపబడిననోటు అయిపోయినది. ఎందులోనికి మార్చుకొనుటకు వీలులేని నోట్లను (Inconvertible paper) అచ్చువేయువప్పుడు ఏప్రభుత్వమువారుకూడ ఎక్కువ నోట్లనచ్చువేయు దుష్టప్రకృతికి లోనగుదురు. అట్టితరి ఇంగ్లాండు మేలుకొరకై పాలింపబడు హిందూదేశమున బంగారు మారకపు ప్రమాణము (Gold exchange standard) వంటి పద్ధతివలన హిందూదేశమునకు వాటిల్లిన నష్టపరంపరల నెన్నంటినని వివరింపగలము? ప్రపంచములో అన్నిదేశములలోను ఒక ఉచిత టంకసాలకలదు. చీనాదేశముతప్ప మితరఅన్నిదేశములలోను బంగారు ప్రమాణము అమలులో నున్నది. చీనాదేశము కూడా వెండిప్రమాణమును వదలి బంగారు ప్రమాణమునే స్వీకరించునని గతవారమున ప్రచురింపబడెను. హిందూదేశమునకట్టి ప్రాప్తి ఎన్నడోకదా?

ఇక మన 'రిజర్వుబ్యాంకుబిల్లు' సమాచారము చూతము. 1922 వ సంవత్సరమున నానాజాతీయసమితి (League of Nations) వారు ప్రతిదేశమునకును ఒక 'సెంట్రలుబ్యాంకు' ఆవసరమని తీర్మానించిరి. అందుచే సర్ బేసిల్ బ్లాకెటు గారు 1927 వ సంవత్సరమున రిజర్వు బ్యాంకు చట్టమును ప్రవేశపెట్టిరి. 'సెలెక్టుకమిటీ'యందు ప్రభుత్వమువారును, ప్రతిపక్షులును, అంగీకరించి వలయుమార్పులను గావించిరి. అప్పుడు లండనులో నున్న హిందూదేశపు మంత్రి ఆజ్ఞచే ఈ చట్టముపసంహరించుకొనబడెను. అంతటబ్లాకెటుగారు ఇంగ్లండునకుపోయి తిరిగివచ్చి వేరొక చట్టమును శాసనసభలో ప్రవేశపెట్టుటకు ప్రయత్నించిరి. మొదటిచట్టములో రిజర్వుబ్యాంకుపై శాసనసభకు అధికారముకలదు. రెండవచట్టమున అది తీసివేయబడెను. ఈ 'రిజర్వుబ్యాంకు' గవర్నరు మొదలగు ఉద్యోగులను ప్రభుత్వమువారే నియమింపవలయు

రాలిన పత్రముల్ కలకలం బొనరింప, మరుత్కిశోరమం
దాలస యానవై నిదురయు ట్లరుదెంచెదు నిన్న నీలియ
ద్దాల కవాటముం దెరచి తళ్కున జాబిలి తొంగిచూచె కా
బోలు; తపించు నా కనుల మొట్టవు స్వప్నపు ఛాయ సేనియున్.

*　　*　　*　　*　　*

ఆమె నిశావసాన సమయాగత బాల సమీర శీతల
శ్యామలమైన వేకువ బయళ్ల వియోగ వినిర్గతాశ్రుమా
లామలినం బొనర్చి, చదలన్ విడబారు తమంబు నీడ వి
శ్రామము నొందు, మై మరపొసంగు పురాస్మృతి రెప్ప లంటగన్.

*　　*　　*　　*　　*

ఏ హరుడో విషంబు భరియించెను కంఠమునం దటంచు కో
లాహలమయ్యె సంస్తవములన్ భువనావళి; త్వద్వియోగ హా
లాహల మీ విశీర్ణపు గళంబున డాచిన నాకునై నిశా
సాహసికా! జగమ్మెవరు జార్చరు కారుణికాశ్రు వేనియున్.

*　　*　　*　　*　　*

తడబడి వచ్చు నీ మృదు పదమ్ములకుం బ్రణమిల్లి ధన్యతన్
తొడిమలు వీడె నీ పుడమితొయ్యలి చేరువ పూవు; లాశతే
యుడిగిన నా తమో[illegible]ముసుండి స్రవించు విలాపగీతి నీ
యెడద యొడిన్ సుషుప్తి గనియెన్ తుది రేయి నిసుంగు పోలికన్.

ఆమె శయించె మున్నిచట; నామెయ యొత్తిడి కంగులల్లె శ
య్యామృదసీమ నిల్చినవి యాశలు వీడిన జాడలట్లు! నే
నీ మధుమందిరంబు కరదీపము కౌ[illegible] ప్రభా
యామున యామినీ సదృశమై నినదించును [illegible].



౭. మాద్రి – పాండురాజు

(విశాలభారతి-కళాంకన



౮. లండనునగరమున థేమ్సునదిపయి సూర్యసందర్శనము
౧౯౩౧ సంవత్సరము ఉగాదినాడు పొగమంచు క్రమ్మియుండ
పగలు రెండుఘంటలవేళకు.

'G. S. A.' ఛాయాచిత్రము.



౯. క్రుమ్ములాటను దప్పకొనుటకు
'G. S. A.' ఛాయాచిత్రము.



## చిత్రసంచయము

### కావేరివఱదలు

ఇది ౧౯౩౦ సంవత్సరమున వచ్చినవఱదల సమయమున తీసిన ఛాయాచిత్రము. ఇందు వఱదలపయి నట నట పడవ లాడుచున్నవి.

### తిరుతలయూరు దేవాలయము-పెద్ద తటాకము

ఈ తిరుతలయూరు తిరుచినాపల్లి మండలమున నున్నది. ఇచట రావణాసురుడు చిరజీవిత్వమును గోరి శివునిగూర్చి తపముజేసెను. చిరకాలమునకు పిమ్మట నొక యగ్నికుండమును నిర్మించి శివునకు ప్రీతిగా తనతలల నొక్కొక్కటిగా నరకి హోమముచేయుచుండెను. పదియవ తల నరకనుండ శివుడు ప్రత్యక్షమయి యతని వరముకోరుమనెను. రావణుడు చిరజీవిత్వమును కోరెను. రావణునికి వెనుక డాగి విష్ణువు అటుచేయవలదని సంజ్ఞచేసెను. శివుడెగబెట్టెను. చిత్రమునందలి తటాకమే ఆకుండమని ప్రతీతి.

### అక్బరుపుత్రసందర్శనము

అంబరురాజగు విహారమల్లునికూతును అక్బరు పెండ్లాడెను. అతడు పెండ్లాడిన హైందవవనితలలో నామె మొదటిది. ఆమె సలీముకుమారుని ప్రసవించెను. ఆకుమారుని అక్బరుచక్రవర్తి చూచుచున్నట్లు ఇందు చిత్రింపబడినది. ఫతేపూరు సిక్రియందలి యంతిపురము. సలీముకుమారు నొక మేలిముసుగు వైచికొనియున్న యువతి యెత్తికొనియున్నది. తల్లి సేలపయి శయనించియున్నది. అక్బరు, అతనివెంట రాజాభగవానుదాసు, తోడర్ మల్లునున్నారు

### రాణాప్రతాపసింహుడు—శక్తసింహుడు

సలీముకుమారుని పలుమారు సిలుగులపాలుచేసిన ప్రతాపుని నొకమారు తురుష్కసేనలు చుట్టుముట్టినవి. అత డపుడు చేటకము నెక్కి నిస్సహాయుడుగ పాఱిపోయెను. ఇరువురు మొగలు యోధు లాతని వెంటాడిరి. వారిని దప్పించుకొన నొక్క మొగిని గుఱ్ఱమును దినమంతయు బఱవెత్తించెను. చేటకము పరువిడి పరువిడి చివర కొక కొండదోనను దాటి యపాయము నప్పటికి తప్పించెను. కాని యదియును క్షతగాత్రమగుటచే మరల వారి కందుబాటయ్యెను. అంత 'నీలాశ్వయోధుడా' యను పిలుపు ప్రతాపునకు వినవచ్చెను. అతడు వెనుకకు దిరిగి చూచెను. ఒక్కరౌతుమాత్రమే కాన్పించెను. అతడు ప్రతాపుని సోదరుడు శక్తసింహుడు. అన్నయెడ తనకు గలిగినద్వేషమువలన దేశద్రోహియై యతడు అక్బరును గలిసికొనియుండెను. ఇపు డన్న యశ్వము నెక్కి నిస్సహాయుడయి పోవుచుండుట శత్రుసైన్యమునుండి చూచెను. అతని ద్వేష మంతరించెను. హృదయము ప్రేమార్ద్రమయ్యెను. లజ్జాదుఃఖములతో నిండుకొనెను. చిత్రమున శక్తి తమ్ముడన్నకాళ్లపయిం బడి మన్నింప వేడుచున్నాడు. ప్రతాపునియశ్వము చేటకము సోదరుల కైకమత్యము కుదిరినపిదప నచ్చట మరణించెనట.

### విలియంబెంటింకుప్రభువు - రణజితసింహుడు

ఈ యిరువురకు ౧౮౩౧ సంవత్సరమున మైత్రి కుదిరినది. సంధిసమయము దగ్గరుచున్నకొలది రణజితసింహుడు భీతిల్లదొడగెను. ఇం దేదో మోసమున్నదని

యతడు శంకించెను. జ్యోతిషికులను రప్పించెను. వారు శాస్త్రగ్రంథములను బరిశీలించి ఫలమనుకూలముగ నుండునని నిశ్చయించిరి. "రెండు ఆపిలుపండ్లను గొనిపోయి యొకదానిని బెంటింకునకును, రెండవదానిని అతనికార్యదర్శికిని ఇమ్ము. వారాపండ్లను సంకోచింపక కైకొందురేని అది శుభసూచకము. కార్యము కట్టివచ్చినదని నిశ్చయింపుము" అనిరి. తొలుతరణజితసింహుడు బెంటింకు నేమొద దటస్థించెను కాన నాతనికే రెండుపండ్లను ఇచ్చెనట. అతడును వానిని సంకోచింపక కైకొనెనట. అటనుండి యిద్దఱును సంధి జరుగనున్న గుడారములోనికి బోయిరి. చిత్రమున రణజితుడు బెంటింకుప్రభువును సన్మానించుచున్నాడు.

## షాజహాను మరణము

ఔరంగజేబుతండ్రి షాజహానును రాజ్యభ్రష్టుని చేసి ఆగ్రాలో చెఱయందుంచెను. షాజహానందేడేండ్లుండి మృతినొందెను. ఆచెఱసాల యొకసుందరమందిరము. అది యొకద్రాక్షావనమున నున్నది. ప్రాణములు పోవునపుడాతడొకింత యూది లేచి వెనుక నొకని నానుకొని ఎదుట కాన్పించుచున్న తాజ్ మహాలును గని జీవముల విడిచెనట. చిత్రమున నాతడు మరణశయ్యపయి నుండి తాజ్ మహాలును జూచుచున్నటు లున్నది.

## మాద్రి—పాండురాజు

నల్లరంగును గాని, మరి యేరంగును గాని యొక్కదానినే పూసి, ఆపూయుటతోనే యొకవ్యక్తి లేక వస్తువు నాకారమేర్పడునట్లు చేయుట చిత్రకళావిధానములలో నొకటి. ఆవిధానమునకు సిలొహుట్ (Silhoutte) అని ఆంగ్లమున పేరు. ఈ జాతిచిత్రములకు రేఖలతో గాని, వెలుగుచీకటులతో గాని పని లేదు. చిత్రకారుడు ఒక్కతెరగున రంగును పూసి యుద్దిష్టమగు నాకృతికి భావము, సౌందర్యము, వయఃపరిమాణము మొదలగు విశేషములను కల్పించును.

ఈచిత్ర మట్టిది; వనమున మాద్రీ పాండురాజు లొకచెట్టుక్రింద గూర్చున్నారు. మాద్రిచిత్రము సౌందర్యసౌకుమార్యాదుల కాటపట్టుగ నున్నది. పాండురాజు ముఖమున నౌదాసీన్యము, హృదయ గాంభీర్యము, శాపభీతి —కనుపట్టుచున్నవి. ఇట్టిది పాండురాజుమూర్తి: నవవికసిత యౌవన కుసుమ భాసురమగునది మాద్రిమూర్తి; ఇవి యొండొంటికి విరుద్ధములయి యున్నవి. ఈసన్నివేశము చిత్రకారుని కళాకౌశలమునకు నిదర్శనము. చిత్రమునందలి చెట్లు, తీగలు, వానిపయి గూర్చున్న పిట్టలు నీచిత్రమునకు ప్రాణమువలె నొప్పియున్నవి.

ఆకసమువంకకు పెరుగుచున్న న్యూయార్కు నగరము



‘ అబు హసను ’ నాటకమునందలి యొకరంగము



శ్రీయుతులు హరీంద్రనాథ ఛటోపాధ్యాయులుగారు— నాయకుడు.
శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయిగారు— నాయిక.




## శృంగార కంఠాభరణము

క్రౌను నాల్గుపుటల సైజు పు. ౧౩౪ వెల రు. ౧-౮-౦

సంపాదకులు, ప్రకాశకులు: శ్రీగంటి సూర్యనారాయణశాస్త్రిగారు, శృంగారగ్రంథమాల, తపాలు పెట్టె నెం 11౦ రు చెన్నపురి.

నేఁడాంధ్రదేశమునఁ బలువురు క్రొత్తక్రొత్త యాభరణముల నాంధ్రవాణికి సమర్పించుచున్నారు. ఈశృంగార కంఠాభరణమునట్టిదేయగు నొక్క క్రొంగ్రొత్త యాభరణము. శాస్త్రిగారు 'ఇతరవాఙ్మయములలోవలె నొక్కొక్క రసమునకు పెక్కు గ్రంథముల చొప్పున మన యాంధ్రవాఙ్మయమున ప్రకటింపబడలే'దని యాలోపమును దీర్చుటకై 'సారస్వతరస సారము సర్వతోముఖముగ వ్యాప్తినొందించుటకును, రసస్వరూపమును గ్రహించి యానందించుటకును రసవిశేషనిర్వచన గ్రంథములు ముఖ్యావశ్యకములని తలంచి యొక్కొక్క రసమున కొక్కొక్క గ్రంథమును పరిపూర్ణముగ ముద్రించి ప్రకటింపదలంచి, 'ప్రథమమున రసరాజముగు శృంగారరసము యొక్క స్వరూపస్వభావాదులను ప్రకటించు గ్రంథరాజమును ఇట్లు ముద్రింపించి ప్రకటించినారు. శాస్త్రిగారి ప్రయత్నము మిగుల నభినందింపఁదగినది; రసజ్ఞత, సహృదయత మెచ్చదగినవి. వీరితలంపు నిరంతరాయముగఁ గొనసాగునేని ఆంధ్రవాణి సర్వాభరణభూషితయై యితోధిక సుందరరూపమున విలసిల్లఁగలదు.

ఈ నూతనాభరణమునకు సుప్రఖ్యాతులగు ఆంధ్రమహాశయులు పరికరములను సమర్పినారు. వారిలోఁ బలువురు భారతి, గృహలక్ష్మి మొదలైన పత్రికలవలనను, ఆంధ్రపత్రికా, సమదర్శనీ-ఉగాదిసంచికలవలనను ఆంధ్రలోకమునకుఁ జిరపరిచితులు. ఇందు రసస్వరూపమును వివరించు వ్యాసములు రెండుమాత్రమే. కథలు మూఁడు గలవు. తక్కినవానిలోఁ బద్యఖండకావ్యములు మిక్కిలిగ నున్నవి. ఆభరణము నందలి రత్నములుకొన్ని యింపక ముదుకదనము గలిగియున్నవి.

ఆంధ్రలోక మీయాభరణమును వలచి శ్రీశాస్త్రిగారి ప్రయత్నము కొనసాగునట్లు చేయఁదగును.

---

## లీలావతి (అపరాధపరిశోధకనవల)

గ్రంథకర్త: నందివాడ కామేశ్వరరావుగారు, బి. ఏ., ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము, పిఠాపురము. వెల ౧-౮-౦.

పాఠకలోకమునకు చిరపరిచితుడగు అరిందముఁడీ యీనవలయందలి అపరాధపరిశోధకుడు. యోగీంద్రుడును నిం దొకపాత్రయే. కాని, యపరాధిమాత్రము నారీమూర్తిని దాల్చిన పరంతపుడు! 'లీలావతి' యాభయంకర 'స్త్రీ'యొక్క పేరు.

ఈనవలయందలి కథ మిక్కిలి చమత్కృతికలది. చివరవరకు లీలావతియు, పరంతపుడును నొకవ్యక్తియే యని యూహించుట యసాధ్యము. అరిందముని నిరూపకశక్తి చక్కగ బ్రదర్శింపబడి యున్నది. కొన్నిస్థలములయందు చదువరులుద్వేగచిత్తులు కాగలరు. అరిందముడు చనిపోయెనని లోకమునకు ప్రకటింపబడు ఘట్టమట్టివానిలో నొకటి.

ఇందలికథయంతయు స్వకల్పితమని గ్రంథకర్త గారు పీఠికలో వక్కాణించియున్నారు. శైలి చక్కగ నున్నది.

సర్ వాల్టరు స్కాట్ (ఆంగ్లనవలాకారుడు) గారి ఫక్కిని గ్రంథకర్త యీనవలయందలి పలుప్రకరణములందు ప్రారంభమున సందలి యంశముల కెంతయు నొప్పియుండు పద్యములను జేర్చియున్నారు. కళాపూర్ణోదయము, ఉత్తర హరివంశము, భోగినీ దండకము మున్నగువానినుండి యీపద్యములు గైకొనబడినవి.

స. చ. శా.

---

# గ్రంథ స్వీకారము

## శ్రీస్కాందమహాపురాణము: యుద్ధకాండము

గ్రంథకర్త: కోడూరి వేంకటాచల కవిగారు. శైవప్రచారిణీ గ్రంథమాల, వరంగల్లు. వెల రు. ౧-౪. రాయలుసైజు: ౭౬ పుటలు.

---

## ప్రణయ చాంచల్యము

గ్రంథకర్త: తేకుమళ్ల రామచంద్రరావుగారు, ఎమ్. ఏ., బి ఎల్. ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము, పిఠాపురము. డిమ్మిసైజు: ౨౪౫ పు. వెల రు. ౧-౮.

---

## మొగలాయీ దర్బారు

ద్వితీయ, తృతీయ, చతుర్థ భాగములు (3 సంపుటములు). అను: మొసలికంటి సంజీవరావుగారు. సరస్వతీ గ్రంథమండలి, రాజమహేంద్రవరము. డిమ్మిసైజు: (౧) 3౧౪, (౨) 303, (3) ౨౭౯ పుటలు. వెల ప్రతి సంపుటము రు. ౧-౮.

---

## (i) నీతిపదవి

ప్రథమ ద్వితీయభాగములు (రెండుసంపుటములు). క్రౌనుసైజు: (౧) ౮౦ పుటలు; వెల ౮. అ. (౨) ౧౬౪ పుటలు; వెల ౧౪ అ.

## (ii) సన్మార్గ దర్శిని

మొదటి, రెండవ, మూడవభాగములు (3 సంపుటములు). క్రౌనుసైజు: (౧) 3౨ పుటలు; వెల 3 అ. (౨) ౪౦ పుటలు; వెల ౪ అ. (3) ౬౪ పుటలు; వెల ౫ అ.

పై రెండుగ్రంథములకు కర్త: గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారు. విద్యావినోదినీ గ్రంథమాల, చిత్తూరు.

---

## (i) నీతిపద్యరత్నాకరము

క్రౌనుసైజు: ౧౦౦ పుటలు. వెల ౧౦ అ.

## (ii) చమత్కార చాటుపద్యములు

డిమ్మిసైజు: 3౨ పుటలు. వెల ౬ అ.

పై రెండుగ్రంథములు సమర్పించినవారు: దాసరి లక్ష్మణస్వామిగారు, పిఠాపురము (తూర్పుగోదావరి జిల్లా).

---

## మధురావిజయము

గ్రంథకర్త: తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి గారు క్రౌనుసైజు: ౧౦౫ పుటలు. వెల ౧౦ అ. గ్రంథములు దొరకుటకు విలాసము: బ్రహ్మశ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు, రామలింగేశ్వర పేట, తెనాలి.

---

## కాదంబరీకథాసారము

(పూర్వభాగము) గ్రంథకర్త:—భీమరాజు సత్యనారాయణరావుగారు. క్రౌనుసైజు: ౯౯ పుటలు. వెల ౧౦ అ. పుస్తకములు దొరకుటకు విలాసము. జె. కృష్ణస్వామిశర్మ గారు, ఒంగోలు (గుంటూరుజిల్లా).

---

## బాణగద్యకావ్యకథలు

గ్రంథకర్త: శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి గారు. క్రౌనుసైజు: ౪౪ పుటలు. శ్రీపాదశాస్త్రి అండుకో., పిఠాపురము, తూ. గోదావరి.

## సంగీతవిద్యాబోధిని

గ్రంథకర్త: యర్రంశెట్టి జగన్నాథముగారు. ప్రకాశకులు: కొండపల్లి వీరవెంకయ్యాగారు, సత్యనారాయణ బుక్కుడిపో, రాజమండ్రి. డిమ్మిసైజు: ౧౭౮ పుటలు. వెల రు. ౧.

---

## (i) ఆత్మకథ

ద్వితీయసంపుటము. కర్త: మహాత్మాగాంధి. అనువాదకులు: శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు.

క్రౌనుసైజు: ౩౮౮ పుటలు. వెల రు. ౧.

## (ii) జీవన ప్రభాతము

శ్రీ వెంకటరమణిగారు రచించిన 'Murugan the Tiller' అను ఆంగ్లనవలకు అనువాదము. అను: పోలవరపు రామబ్రహ్మంగారు, యమ్. ఏ. క్రౌనుసైజు: ౪౭౬ పుటలు. వెల రు. ౧-౮.

పైరెండు గ్రంథములకు ప్రకాశకులు: కాశీనాధుని నాగేశ్వరరావుగారు, ఆంధ్రగ్రంథమాల, ౭, తంబుచెట్టి వీథి, మద్రాసు.

---

## దాసు లింగమూర్తి జీవితము

గ్రంథకర్త: పాలపర్తి సూర్యనారాయణగారు, డాక్టరు గంగరాజు వెంకటరామయ్యాగారు. ప్రకాశకులు: డా. గంగరాజు వేంకటరామయ్యాగారు, చాగల్లు; డిమ్మిసైజు: ౮౪ పుటలు. వెల ౧౨ అ.

---

## ప్రేమచందుకథలు

అనువాదకుడు: దినవహి సత్యనారాయణగారు. ప్రకాశకుడు: సంపాదకుడు, సరస్వతీగ్రంథమాల, కాకరపఱ్ఱు, తణుకుతాలూకా, ప. గోదావరి. డిమ్మిసైజు: ౧౨౨ పుటలు. వెల ౧౨ అ.

---

## (i) సత్యనారాయణస్తవము

ఫుల్‌స్కేపు ౧౬ సైజు: ౧౧ పుటలు. వెల ౨ అ.

## (ii) గంగాలహరి

పండితరాయకృతి కాంధ్రీకరణము. డిమ్మిసైజు ౧౨ పుటలు. వెల ౪ అ.

పైరెండు గ్రంథములకు కర్త: పండితారాధ్యుల నాగభూషణముగారు. కవితాభిలాషిణీ సంఘము, ముమ్మిడివరము, తూర్పుగోదావరి.

---

## శ్రీలక్ష్మీనారాయణీయము

పూర్వకవి గోకులపాటి కూర్మనాధకవి విరచితము. సంపాదకులు: దేవులపల్లి వీరరాఘవశర్మగారు, కాజులూరు, కాకినాడ తాలూకా, తూర్పుగోదావరి. క్రౌనుసైజు: ౨౫ పుటలు. వెల ౩ అ.

---

## శ్రీభవానీశంకరార్ధాష్టోత్తరశతకము

గ్రంథకర్త: బాలకవి కూరపాటి వేంకటరత్నముగారు. ప్రకాశకులు: యార్లగడ్డ కొండయ్య చౌదరిగారు, వేళంగి, కాకినాడ తాలూకా, తూర్పుగోదావరి.

---

## జ్ఞానబోధిని

సంపాదకులు: దంతుర్తి శ్రీరామమూర్తిగారు. అప్పల వీరవేంకటజోగయ్యశాస్త్రిగారు. ప్రకాశకులు దంతుర్తి రామమూర్తి అండు బ్రదర్సు, వమురుపాక తూర్పుగోదావరిజిల్లా.

---

## ఉత్తమధర్మము

గ్రంథకర్త: ఇమ్మడిరాజయ్యగారు, ఉపాధ్యాయుడు, చెన్నూరు (ఆదిలాబాద్ జిల్లా). చిన్నసైజు ౧౫ పుటలు. వెల ౧ అ. ౬ పై.

---

## (i) అభిజ్ఞాన శాకుంతలము

కుంభకోణ, ప్రభుత్వకళాశాలా, ప్రధానసంస్కృతపండితులగు శతావధాన శ్రీనివాసాచార్యులు వ్రాసిన సంస్కృతవ్యాఖ్య, భూమికలు; 'ఒక మాస్టర్ ఆఫ్ ఆర్ట్సు' రచించిన ఆంగ్ల ఉపోద్ఘాతము, అనువాదము, జ్ఞాపికలు—కలది.

క్రౌను సైజు: పుటలు ४४ + ६८ + ३२० + ६८ + ०२४.

## (ii) మాలవికాగ్నిమిత్రము

ఆంగ్లమున ఉపోద్ఘాతము, అనువాదము, జ్ఞాపికలు రచించిన వారు: ఎ. యస్. కృష్ణారావుగారు, యం. ఏ. (చెన్నపురి, లయోలాకళాశాల, లెక్చరరు); తొలుపలుకు వ్రాసిన వారు: మహామహోపాధ్యాయ, విద్యావాచస్పతి యస్. కుప్పుస్వామి శాస్త్రిగారు, యమ్. ఏ., ఐ. ఇ. యస్. (చెన్నపురి, రాజధానీకళాశాల, సంస్కృతాచార్యులు)

క్రౌను సైజు: పుటలు ८ + ६८ + ०२८ + ८२ + ०४८ + ८.

పై రెండు గ్రంథములకు ప్రకాశకులు: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, ८२, ఎస్ప్లనేడు, మద్రాసు.

---

## మేఘసందేశము

మల్లినాథవ్యాఖ్య, విద్వాన్ జి. జె. సోమయాజి (యమ్. ఏ. యల్. టి.) గారు రచించిన జ్ఞాపికలు, వివరణములు, మూలమునకు ఆంగ్లానువాదము—కలది. క్రౌను సైజు: పుటలు २३ + ०८ + २४ + ०३०.

పుస్తకములు దొరకుటకు విలాసము: వి. రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, ८२, ఎస్ప్లనేడు, మద్రాసు.

---

## (i) శబ్దప్రాసాదః

(జౌద్భిదభూమిక యనెడి ప్రథమభూమిక.) వైద్య పదార్థబోధక నిఘంటువు. క్రౌను సైజు: ००३८ పుటలు. వెల రు. ८-४-०.

## (ii) చరకసంహిత

ఇంద్రియస్థానము. ఆంధ్రటీకాసహితము. క్రౌను సైజు: ०२० పుటలు. వెల రు. ०-४-०.

శబ్దప్రాసాద గ్రంథకర్త, చరకసంహితా టీకాకారుడు: 'వైద్యవల్లభ' రాణీ వెంకటాచలపతి ప్రసాద శాస్త్రిగారు. శ్రీ వెంకటేశ్వర ఆయుర్వేదకళాశాల ప్రధానపండితుడు, బెజవాడ.

---

## బ్రహ్మచర్యము

గ్రంథకర్తలు: పాలడుగు శేషాచలార్య, ఆరికపూడి వేంకటరామచౌదరిగార్లు. ఆదర్శ గ్రంథమండలి' ఎలమర్రు, కృష్ణాజిల్లా. క్రౌను సైజు: २३८ పుటలు. వెల రు. ०-८-०.

---

## పారమతల్లి శతకము

గ్రంథకర్త: మహాకవి కాశీభట్ట కృష్ణరాయ శాస్త్రిగారు, సాలూరు (బి. యన్. రైల్వే), విశాఖపట్నం జిల్లా. వెల २ అ.

---

## శ్రీ లక్ష్మీనారాయణ సంవాదము

కర్త: గరిమెళ్ల సీతారామయ్య పంతులుగారు, బి. ఏ., బి. యల్., ఆడ్వొకేట్, బరంపురము. డిమ్మిసైజు: ०३ పుటలు. (సశేషము.) ३२ వృత్తములు.

---

## శ్మశానవాటిక

నవల. కర్త: శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. కలాభివర్ధనీ గ్రంథనిలయము, రాయవరము, తూ. గోదావరిజిల్లా. క్రౌనుసైజు: ౨౧౪.

## నిష్కామయోగము

శ్రీ గాంధిమహాత్ముని భగవద్గీతావ్యాఖ్య. దుగ్గిరాల బలరామ కృష్ణయ్యగారి అనువాదము. రెండవ కూర్పు. వెల సాదాబైండు ౬ అ. గట్టిబైండు ౮ అ. మానవాదర్శ గ్రంథమండలి, అంగలూరు, కృష్ణాజిల్లా.

## కథాబోధ

(ఆంధ్రపద్యాత్మకము.) రచయిత: కుందుర్తి నరసింహారావుగారు. క్రౌనుసైజు: ౨౪ పుటలు. వెల ౫ అ. వలయువారికి: తాడేపల్లి నిత్యానందముగారు, బాపట్ల, గుంటూరుజిల్లా.

## ప్రభాతము

గ్రంథకర్త: సాహిత్యసరస్వతి వావిలాల గోపాలకృష్ణయ్యగారు. భారతీగ్రంథమండలి, సత్తెనపల్లి. క్రౌను ౫౬ పుటలు. వెల ౪ అ.

## ఆంధ్రదేశ చరిత్రకథలు

గ్రంథకర్త: మామిడిపూడి వెంకటరంగయ్యగారు, యం. ఏ., వెంకటగిరిరాజావారి కళాశాల అధ్యక్షులు. లాంగ్‌మన్స్ గ్రీన్ అండ్ కంపెనీ, లిమిటెడ్, 36 ఏ మౌంటురోడ్డు మద్రాసు. క్రౌనుసైజు ౧౨3 పుటలు.

## భారతభక్తి

మొదటిభాగము. గ్రంథకర్త: కీ. శే. ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రులుగారు. డిమ్మీసైజు ౮౪ పుటలు, వెల ౮ అ.

## కాదంబరీ కథాసారము (పూర్వభాగము)

క్రౌనుసైజు 99 పుటలు. వెల రు 0-10-0. గ్రంథకర్త: భీమరాజు సత్యనారాయణరావుగారు, టీచరు గవర్నమెంటు ట్రైయినింగుస్కూలు, ఒంగోలు.

విలాసము: జె. కృష్ణస్వామిశర్మగారు, ఒంగోలు, గుంటూరుజిల్లా.

## పంచాంగస్వీకారము

பிரசோற்பத்தி வருஷ
வாக்கிய பஞ்சாங்கம்

ప్రజోత్పత్తివర్ష వాక్యపంచాంగము (అరవము). శివరామలింగయ్యర్ వంచాక్షరయ్యర్లచే గుణితము. పంచాంగమొకటికి వెల ౪ అ. తపాలుఖర్చు ౧ అ. ప్రత్యేకము. వలయువారీవిలాసమునకు వ్రాయవలయును: ఆర్. యస్. రఘునాథ అయ్యర్, జ్యోతిష పరిపాలన మఠము, కొక్కువిల్ (సిలోన్).

# పత్రికలు

## సురభి

మొదటిసంపుటము, మొదటిసంచిక. సంపాదకులు: బి. టి. నరసింహాచార్యులుగారు. 'సామాజిక సారస్వత సచిత్రమాసపత్రిక'. డిమ్మీ: ౪౦ పుటలు. సం. చందా: రు. ౧-౮-౦. విడిపత్రిక ౨ అ. 78, చైనా బజారురోడ్డు, జి. టి. మద్రాసు.

# సాభిప్రాయ విశేషములు

"యతో ధర్మ స్తతో జయః"

ధర్మము దేశకాలపాత్రాతీతమైనపరమ ధర్మము. రాజ్యములు మారుచున్నవి. యుగములు గతించుచున్నవి. పాత్రము లంత రించుచున్నవి. ధర్మముమాత్ర మవిచ్ఛిన్నము గను ప్రవర్తించుచున్నది. విశ్వప్రవృత్తియందు ధర్మవిజయము నిత్యము, సత్యము, శాంతము; అధర్మవిజయ మనిత్యము, అసత్యము, ఘోరము. వర్తమాన ప్రపంచ పరిస్థితులందు నిత్యమైన ధర్మము దురారాధ్యముగను, అనిత్యమైన అధర్మము సుఖారాధ్యముగను గన్పడుచున్నది. నిత్యమైన ఆత్మధర్మ మనిత్యముగను, అనిత్యమైన దేహధర్మము నిత్యముగను గనుపడుచున్నది. గాంధిమహాత్ము డుపక్రమించిన సత్యాగ్రహప్రస్థానము మహాప్రళయావస్థయందున్న ప్రపంచమునందు ధర్మమును శాంతిని స్థాపించుట కవతరించినను భౌతిక విభూతుల కభ్యస్తమైన ప్రపంచమునందు నిత్యమైన ధర్మ స్వరూపము దుర్గ్రాహ్యమై పరిహాసపాత్రముగ నున్నది. భౌతిక సంపత్సంస్కారులైన విన్స్టను చర్చిలుగారిని బోలిన బ్రిటీషు రాజ్యాధికారులకు ధర్మాత్ముడును, సత్య సంపన్నుడును, త్యాగమూర్తియునైన గాంధి మహాత్ముని అధ్యాత్మ సంస్కారము పరిహాసపాత్రమగుటయందు విచిత్రము గనుపడదు. ధర్మ నిరీక్షణమునందు గాంధిమహాత్మునకును బ్రిటీషు రాజ్యాధికారులకును సామ్యము గలుగుట దుస్తరము. ధర్మనిరీక్షణమునందు సామ్యము గలుగనపుడు సామాన్య విషయములందు సామ్యము సహజముగను గలుగ గలదు. గాంధిమహాత్ము లభిలషించెడి ధర్మ గౌరవమునకును, అధికారు లభిలషించెడి యధికార గౌరవమునకును సామ్యము దుర్లభమని అధికార హృదయము విశదముచేయుచున్నది. ఇటీవల ఢిల్లీలోను నడచిన గాంధి ఇర్వినుగారల సంప్రతింపులును నీవిషయమునకు మహావ్యాఖ్యానముగ నున్నవి.

## గాంధి ఇర్వినుగారల సంప్రతింపులు

హిందూదేశప్రభుత్వము కాంగ్రెసు పర్కింగుకమిటి సభ్యులను నియమ రహితముగను విడుదలచేసినపుడు ప్రజలు ప్రభుత్వహృదయమునందు పరివర్తనము గలిగినదని యానందించిరి. నిష్కల్మషహృదయము గల గాంధిమహాత్ముడును ఇర్వినుప్రభువు యొక్క రాజ్యధర్మమునే కాకను మానవధర్మమును నయితము గ్రహించుటకు బూనుకొనెను. ఇర్వినుప్రభువునకు సమావేశము నభిలషించుచు జాబును వ్రాసెను. ఇర్వినుప్రభువు సమావేశమును నంగీకరించెను. సప్రూ శాస్త్రి జయ

కరుగారలకును మహాత్మునకును, సప్రూశాస్త్రి జయకరు గారలకును ఇర్వినుప్రభువులకును సంప్రతింపులు జరిగినవి. గవర్నరులకును గవర్నరు జనరలునకును, గవర్నరు జనరలునకును కార్యనిర్వాహక సభ్యులకును, భారత ప్రభుత్వమునకును బ్రిటీషు ప్రభుత్వమునకును సంప్రతింపులు జరిగినవి. సంప్రతింపుల స్వరూప స్వభావములు గోప్యములైనను దేశలక్ష్యము గతించిన రెండువారములందును ఢిల్లీయందు లగ్నమైనది. ప్రజలలక్ష్యమును, ప్రభుత్వ లక్ష్యమును ఆశానిరాశల నడుమను ఊగులాడినవి. ఒకదినమునం దాశయును, రెండవదినమునందు నిరాశయును భారతీయ హృదయము నావహించినవి. సంప్రతింపుల వివరములు గోప్యములైనను ఊహలు బయలుదేరినవి. ఊహాపోహాలఫల మెటులున్నను ధర్మనిరీక్షణమే యోచనీయమైన విషయము. గాంధిమహాత్ముడు గోరునది నిరంకుశాధికార నిరాకరణముగాని ధర్మాధికార నిరాకరణము గాదు. దేశమునందు నిరభ్యంతరముగను నిరంకుశాధికారము రాజ్యముచేయుచు ప్రజల యాత్మగౌరవమును ప్రజల స్వాతంత్ర్యములను నిర్మూలముచేసినవిధమును గతించిన పదకొండు మాసములందును నిరాటంకముగను రాజ్యము చేయుచున్న పోలీసు రాజ్యము పరమ ప్రమాణముగ నున్నది.

* * *

## పోలీసు రాజ్యము

దేశమునం దనేకస్థలములందు పోలీసు బంట్రౌతులు, ఇన్‌స్పెక్టరులు, సూపరింటెండెంటులు, డిప్యూటి కలెక్టరులు, కలెక్టరులు రాజప్రతినిధులై సర్వాధికారము చెలాయించిరి. శ్రీమంతులు సామాన్యులు, వృద్ధులు బాలురు, స్త్రీలు పురుషులు, పండితులు పామరులు పోలీసువారి నిందాదౌర్జన్యదండనములకు లోనై దుఃఖవేదన ననుభవించిరి. పోలీసువారు ప్రజలనవమానపరచిరి; రాటములను విరుగగొట్టిరి; ఖద్దరుబట్టను టోపీలను తగులబెట్టిరి; బలవంతముగను ఇండ్లనుండి వెడలగొట్టిరి; ఇండ్లను పంటలను తగులబెట్టిరి; కర్రదెబ్బలును బెత్తపుదెబ్బలును నియతకర్మానుష్ఠానమై అంగవైకల్యము గలుగజేసిరి. ఈయన్యాయ మంతయును శాంతిక్షేమరక్షణవ్యాజమునను చేయబడినది. పోలీసుచర్యలు ధర్మనామమును పరిహాసపాత్రము చేసినవి. మూలధర్మ మంతరించునపుడు తజ్జన్యములైన ధర్మములు నిలువజాలవు. పేరునకు నిలిచినను నిర్జీవమైన ధర్మములవలన నెవరికిని ప్రయోజనము గలుగదు. నిరంకుశప్రభుత్వ హృదయమునందు గలిగిన ధర్మనిరీక్షణమును పరిశీలించుటకు పోలీసు చర్యలను ప్రమాణముగను గైకొనుట ధర్మాత్ముడైన గాంధిమహాత్ముని ధర్మశీలమున కనురూపముగ నున్నది. ధర్మాత్ములను స్వార్థప్రయోజనములవలెనే కపటతంత్రములును మోసగింపజాలవు. దుర్యోధనుడు స్నేహపూర్వకముగ నొకపల్లె నిచ్చినను ధర్మరాజు

సంధి సంకల్పించదలచిన విధముననే గాంధి మహాత్మునకును కాంగ్రెసు కార్యనిర్వాహక సంఘమును పోలీసుచర్యల విచారణను శాంతికి ప్రమాణముగను నిర్ణయించుట సముచితముగ నున్నది. పోలీసుదౌర్జన్యములనుగురించి దౌర్జన్యముల నాజ్ఞాపించిన పోలీసు శాఖాధికారులు విచారించుట కేవలము కపట నాటకము. గతకాలమునందలి వాగ్దానముల వలెను నిదియును మృతాంకురముగను నుండగలదు. ప్రభుత్వహృదయమునందు గలిగిన పశ్చాత్తాపమునకు పోలీసువారి దురంతములను విమర్శించుటయును నిర్ణయించుటయును నిదర్శనము గాగలదు. శాంతిధర్మములను గోరువారందరును దీనిని హర్షించుట సహజము. ఈ విచారణ జేయుటవలనను అధికార గౌరవము బలపడగలదు గాని కృశింపజాలదు. భగవద్భక్తిగల ఇర్విన్ప్రభు వధికారాభిమానమును విడిచి ధర్మనిర్వహణమునకు బూనుకొనుట ధర్మవిజయమునకు నిదర్శనము. గాంధి మహాత్ముడు కాంగ్రెసునకు గడించిన ధర్మవిజయము శాంతిధర్మసంస్థాపనములకు ప్రపంచమున కాదర్శముగ నుండగలదు. గాంధిమహాత్ముడును కాంగ్రెసుసభ్యులును కోరునటుల ప్రభుత్వవిధానమునందు సిద్ధాంత ప్రయోగములు సమానధర్మమును గలిగియుండవలయును. అది సాధ్యమైనపుడు సామాన్యవిషయములు శాంతికిని సహకారమునకును నాటంకములు గాజాలవు. ఈ ధర్మవిజయముననే ఇర్విను గాంధి మహాత్ములకును కుదిరిన యొడంబడిక విశదము చేయుచున్నది. సంధిప్రయత్నములందు ఇర్విన్ప్రభువు చూపిన సహనము ప్రశంసనీయము.

* * * *

వర్తమానకాలమునందు ప్రపంచావృతమైన దుర్భిక్షము భరతవర్షమునందు ప్రచండరూపమును దాల్చుచున్నది. గతవత్సరమునందు గలిగిన యతివృష్టి అనావృష్టిదోషములును ప్రపంచవైపరీత్యములును ప్రజల స్థితిగతులను దుర్భరము చేసినవి. పంటలు చెడిపోయినవి. ధరలు పడిపోయినవి. దేశాదాయము తగ్గిపోయినది. కేంద్రప్రభుత్వమునందు 15 కోట్లరూప్యములు లోటుగలిగినది. రాష్ట్రప్రభుత్వములందును లోటుగలిగినది. లోటును పూర్తిచేయుటకు క్రొత్తపన్నులు హెచ్చుగా విధింపబడుచున్నవి. పన్నులభారము క్రిందను క్రుంగిపోవుచున్న ప్రజలు హెచ్చుపన్నుల క్రిందను నిలువలేకను పడిపోవుట సహజము. పన్నులభారమును తగ్గించుటకు వ్యయమును తగ్గించుట సాధనముగాని పన్నులను హెచ్చుచేయుట సాధనముగాదు. కేంద్ర ప్రభుత్వమునందు సైన్యవ్యయమును కోటిన్నర రూప్యములు తగ్గింపబడినను వ్యయమింక నాదాయము కన్నను 14 కోట్లధికమైనది. పన్నులభారము క్రిందను క్రుంగుచును పరమదరిద్రము ననుభవించుచున్న ప్రజలు హెచ్చుపన్నులను భరింపజాలరనువిషయము సర్వత్ర తెలిసియున్నది. పరదేశసైన్యము పరదేశపండితులు పరదేశవ్యాపారులు దేశాధికారమును గలిగి

యున్నంతకాలమువ్యయభారము తగ్గుటయును పన్నులు తగ్గుటయును దుర్లభమని సర్వత్ర తెలిసిన విషయము. కృశించుచున్న దేశము రాజ్యసాధనముననె పోషణమును బడయ గలదుగాని పారతంత్ర్యమూలమునను పోషణ మును బడయజాలదు. ప్రజాపోషణమునకు విదేశీయులు తోడ్పడకపోయినను స్వదేశీయు లైనను తోడ్పడుట ధర్మమై యున్నది. గాంధి మహాత్ము డనుష్ఠించుచున్న నిర్మాణ కార్య విధానమును, సత్యాగ్రహనీతియును, శాసనో ల్లంఘనోద్యమమును ప్రజల కాత్మవిశ్వాస మును గలుగజేయుచున్న విధమును గాంధి మహాత్ముని ధర్మవిజయము రుజువు చేయు చున్నది. ఇర్విన్-మహాత్ముల రాయబారము సఫలమైనను, విఫలమైనను దేశమోక్షము నిర్మాణ కార్యవిధానమునం దాధారపడియున్న విధ మును ప్రజానాయకులు గ్రహించి కర్మయోగ పరాయణులై భగవదనుగ్రహమునకు పాత్రులై పురుషార్థమును బడయుదురు గాత!

* * * *

### ధర్మవిజయము

గాంధిమహాత్ముడు సాధించిన సత్యా గ్రహవిజయము ప్రపంచచరిత్రయందు ధర్మ విజయసాధనమైన నూతనాధ్యాయమున కుప క్రమణముగ నున్నది. కాంగ్రెసువిజయము ధర్మసంస్థాపనమునకు హింసాత్మక మైన ప్రారంభమున కభ్యస్తమైన ప్రపంచమునందు, సనాతనమైనను నవీనమైన అహింసా త్యాగ సాధనమును పునరుద్ధరణమును జేయుచున్నది. భారతీయులకు సంగ్రామసమర్థమునకు, శ్రీకృష్ణ పరమాత్ముడు కురుక్షేత్రమునందు విజయునకు జేసిన గీతోపదేశము, ప్రమాణ మైనది. పాశ్చాత్యసంపర్క మీ ప్రమాణమునకు విప రీతార్థమును గల్పించినది. ధర్మలక్ష్యము సాధ్యమునందు లగ్నమై సాధనమునం దంత రించినది.

ధర్మాధర్మములకు సంరంభము గలుగు నపుడు ధర్మావతరణ మాత్మరూపమునను సంభవ మగుచున్నది. అవ్యక్తమైన ధర్మము నామరూపములను పరిణామమును బొందుటకు, వ్యక్తమైన సాధనములు దేశకాలపాత్రబద్ధ ములై నిత్యధర్మము గాకను నిమిత్తధర్మ మగుచున్నది. నిమిత్తధర్మమునె నిత్యధర్మ ముగా నారాధించుచున్న యుగమునందు గాంధిమహాత్ముని సత్యాగ్రహము నిత్యనైమి త్తికధర్మ స్వరూప స్వభావములను పరిస్ఫుటము చేసినది. గీతోపదేశమునకు కీలకము స్వధర్మ నిర్వహణము. స్వధర్మనిర్వహణమునకు సాధన మాత్మధర్మనిర్వహణము. ఈ పరమార్థమును గీతోపదేశమువలెనే గాంధిమహాత్ముని యాత్మ కథయును విశదముచేయుచున్నది. ఆత్మధర్మ సాధనమునను స్వధర్మనిర్వహణమును జేయు టకు అహింసాత్మకమైన త్యాగము పరమ ప్రయోజనమని సత్యాగ్రహము విశదముచేసి నది. అఖండమైన ఆత్మధర్మారాధనమునకు ఆత్మపరమైన సత్యాగ్రహము పరమసాధనమై సకలమును సాధ్యమగుచున్నది. భారతీయులు

నవయుగనిర్మాణమున కాధారభూత మైన సత్యాగ్రహధర్మమునందు బడసిన విజయము ప్రపంచశాంతికి దోడ్పడగలదు. వేలకొలది స్త్రీ పురుషులు దేశక్షేమమునకును ప్రపంచ శాంతికిని ఆత్మార్పణముచేసిన యపూర్వోత్సాహము ప్రపంచమునకు విస్మయమును గలుగ జేసినది. సత్యయుగసంస్థాపనమున కాత్మార్పణముచేసిన శాంతివీరులు ధన్యులు. గాంధి మహాత్ముడు అమెరికాయందలి హోమ్సుగారికి బంపినసందేశ మీశాంతిసందేశము నె వ్యక్తము చేయుచున్నది.

ధర్మసంస్థాపనమునకు హింసాత్మకమైన యుద్ధసాధనమును విశ్వసించిన ప్రపంచమునందు గాంధిమహాత్ముని విజయము ప్రపంచ లక్ష్యమున నిశ్చయమైన అహింసాధర్మ ప్రభావమును స్థాపించుటకు వినియోగపడుచున్నది. భారతీయుల ధర్మవిజయము ప్రపంచమునందు అహింసాత్మకమైన సత్యాగ్రహ సంరంభము విజయమును బడయగల విధమును విశదము చేయుచున్నది. దుర్భరమైన ఆయుధభారము క్రిందను నాశనమును బొందుచున్న ప్రపంచమునకు సహాయనిరాకరణము శరణ్యమై ప్రపంచ శాంతి సాధ్యము గాగలదు. గాంధిమహాత్ము డుపక్రమించిన సత్యాగ్రహ సాధనము భారతీయ పూర్ణస్వరాజ్యానుభవమునకును ప్రపంచకల్యాణమునకును సాధనభూతము చేయగల యధికార సంస్కారములు భారతీయులకు గలవు. ఆభారమును యథోచితముగను భారతీయులు వినియోగించి గాంధిమహాత్ము డుపక్రమించిన సత్యాగ్రహమును స్వరాజ్యమునకును శాంతియుగ స్థాపనమునకును సాధనము చేయుటకు భగవంతు డనుగ్రహము జేయు గాక!

---

Printed and Published by G. Subbaramayya, at the Andhra PatrikaPress, No.7,Thambu Chetty St., Madras